చిలకమర్తి లక్ష్మీనృసింహకవి

# సంపూర్ణ గ్రంథావళి

షష్టిపూర్తి ముద్రణము



౧౦-వ సంపుటము — కథలు

రాజస్థానకథావళి - రఘుకులచరిత్రము - ప్రచ్ఛన్నపాండవము.



షష్టిపూర్తి సంఘకార్యదర్శి:

పాలకోడేటి గురుమూర్తిగారిచే

ప్రకటితము.

1927



 [ Price Rs. 3

# ఉపోద్ఘాతము

ఆర్యావర్తమని పూర్వులచేత వ్యవహరింపఁ బడుచువచ్చిన యుత్తరహిందూస్థానమున రాజస్థాన మను దేశమొకటి కలదు. దీనినే రాజపుత్రస్థాన మనివాడుదురు. ఇందు రాజపుత్రు లనఁగా క్షత్రియులు విస్తార ముండుటచే దీనికి రాజపుత్రస్థాన మనియు, రాజస్థాన మనియుఁ బేళ్ళు కలిగినవి. ఈదేశముయొక్క వైశాల్యము 1,30,000 చదరపుమైళ్ళు. దీని కుత్తరమున పంజాబుదేశమును, దూర్పునం దాగ్రాయును, దక్షిణమునబొంబాయిరాజధానియుఁ, బడమటసింధుదేశమునందలి యెడారులునుం గలవు. ఒకకోటి యిరువదిలక్షల జను లిందు వసించుచున్నారు. ఈదేశమునకు మధ్యగానున్న యజమీరనునదితప్ప తక్కినభాగము లన్నియు స్వదేశరాజులచేతఁ బాలింపఁబడుచున్నవి. ఆయజమీరొక్కటియు నింగ్లీషువారి స్వాధీనములో నున్నది. స్వదేశప్రభువులచేఁ బరిపాలింపఁబడు సంస్థానములు, అల్వారు, బికనీరు, కృష్ణనగరు, జయపురము, భరతపురము, ధోలాపురము, కెరాలి, టాంకు, బూంది, కోట, జాలావారు ప్రతాపఘురు, బన్సువారా, దంగపురము, మేవారు (అనగా నుదయపురము) సిరోహి, మార్వారు (అనఁగా జొద్పురము) జైసల్మీరనునవి యిరువది. ఇందు టాంకుసంస్థాన మొక్కటియు మహమ్మదీయ ప్రభువులచేతఁ బరిపాలింపఁ బడుచున్నది. తక్కినవానిలో భరతపురము, జాటువంశస్థుఁడైన రాజేలుచుండెను. తక్కిన పదునెనిమిది సంస్థానములును స్వదేశక్షత్రియప్రభువు లేలుచున్నారు. ప్రస్తుత మీరాజ్యము లన్నియు నాంగ్లేయులకు లోఁబడి వారిచేత సంరక్షింపఁ బడుచున్నవి. ఈదేశము వైశాల్యమున మిక్కిలి పెద్ద దయ్యుఁ



ప్రాముఖ్యతయందు మిగుల తక్కువగా నున్నది. కడుదూరము వ్యాపించు నిసుకతిన్నెలేగాని ఫలవంతము లైన భూములుగాని మంచి పరీవాహములు గలనదులు గాని యంతగా లేవు. అందుచేతనే జన సంఖ్య మిక్కిలి తక్కువగా నున్నది. ఆరావళీపర్వతము లీశాన్య దిగ్భాగమునుండి నైఋతిమూలవఱ కీదేశమున వ్యాపించి యున్నవి. ఈకొండలకుఁ బడమటి వైపున జాలభాగ మిసుకయెడారియై యున్న యది. కాని తూర్పునఁ జాలవఱకు భూమి సారవంతమై, ధాన్యము, దూది, చెఱకు, పొగాకు, నల్లమందు పండును. చంబల్‌నదియు దాని యుపనది యగు బేనాసును, లూనియను నొక చిన్న యేఱు నిందు ముఖ్యనదులు. నదులు తక్కువగా నుండుటచే జనులకు పానయోగ్య మగునీరు నూతులనుండి లభించుచున్నది. ఉప్పునీటి సరస్సులు విస్తారముగా నుండుటచే వానినుండి ప్రజలుప్పుచేసి వాడుదురు. ఇండ్లనిమిత్త మిచ్చటికొండలలో మంచిఱాళ్లు దొరకును. పూర్వము షాజహానుచక్రవర్తి తనభార్యపేర నాగ్రానగరములోఁ గట్టించిన తాజమహా లను దివ్యభవనమున కీదేశమునందలి మక్రానా ఱాతిగనులనుండియే ఱాయి పంపఁబడినది.

## పట్టణములు.

ఆరావళీపర్వతములలో నాబూ యను శిఖరముపైఁ గట్టఁబడిన యాబూనగర మీదేశమునందలి ముఖ్యనగరములలో నొకటియై యారోగ్యప్రదాయినిగా నున్నయది. ఈపర్వతశృంగము జైనుమతస్థులకు యాత్రాస్థలముగా నున్నది. ఈశిఖరముమీఁద స్ఫటికశిలానిర్మితములగు దేవాలయము లనేకములు దర్శనీయములై యుండును. వానిలోఁ బ్రధానదేవాలయముఁ గట్టుటకే పదునెనిమిది కోట్లరూపాయలు వ్యయము జేయఁబడిన వఁట. మీవారు సంస్థా

నమున కుదయపురము రాజధాని. ఇది మిక్కిలి సుందర మగుపట్ట ణము. జాదుపురము మారువారు దేశమునకు రాజధాని. ఇందును ప్రాతికట్టడము లనేకము లున్నయవి. జయపురము హిందూస్థానమునం గలనగరములో నెల్ల మిక్కిలి మనోహరముగ నుండును. తక్కిన ప్రతిసంస్థాన మానేరు గలపట్టణమే రాజధానిగాఁ గలిగి యుం డును. ఈదేశమున వసియించు జనులు రాజపుత్రు లనఁబడు దురు. వీ రాజానుబాహులు. శౌర్యనిధానులైన జాతివారు. సాము కసరతులు నేర్చి యెక్కుడు చాకచక్యము గలిగి వీరు యుద్ధము పేరు విన్నప్పుడు పండువుగాఁ దలంచుచుండువారు. ఈరాజపుత్రు లవంటి యభిమానధను లగు సాహసికశిఖామణులు, ప్రపంచమునం దుండుట యరిది. తమ దేశస్వాతంత్ర్యమును, కుటుంబగౌరవమును కాంతల పాతివ్రత్యమును నిలుపుకొనుటకై తమప్రాణంబులఁ దృణప్రాయముగ ధారవోసిన శూరాగ్రేసరులు. ఈరాజపుత్రస్త్రీ లన్ననో తమ మగవారికన్న నెక్కు డభిమానము, శాంతము గల వీరమాతలు, వీరపత్నులునయి మానసంరక్షణార్థము దేహముల నగ్నిహోత్రున కాహుతులు చేసిన వీరరసాధిదేవత లని చెప్ప వచ్చును. భర్తకాని కుమారుఁడు కాని కయ్యంబునఁ బరాజయము నొంది శత్రువులకు వెన్నిచ్చి పరుగెత్తుకొని కోటలోఁ దలఁ దాఁచుకొన వచ్చినప్పుడు రాజపుత్రస్త్రీ వానిని గోటలోనికి రాని య్యక ములుకులవంటి పలుకులచే వాని మనసు నొప్పించి శౌర్యము గలిగించి మరల యుద్ధమునకుఁ బంపుచు వచ్చె నని యిఁక ముందు వ్రాయఁబోవు కథలలో మీరు చదివియక్కజపడకపోరు. ఈజాతిలోఁ బుట్టినఁబాలుఁడయినను సమరమునకుఁ బోవుటకుఁ గాని కాంతా జనంబుల వధించి కులగౌరవమును నిలుపుటకుఁ గాని యవసరమ యినపు డగ్నిహోత్రమున దుమికి యాత్మహత్యఁ జేసికొనుటకుఁ

గాని మెన్నఁడు వెనుదీయఁడు. ఈరాజపుత్రులలోఁ గొందఱు సూర్యవంశజులు, కొందఱు చంద్రవంశజులు, కొంద ఱగ్నికులులు. పరశురామునిచేత క్షత్రియవంశము లిరువదియొక్కమాఱు నాశనము చేయఁబడినప్పుడు, లోక మరాజకమై ధర్మమార్గంబుల విడిచి వర్తించుచుండఁగా వేదవిదు లగు మును లగస్త్య నాశ్రయించి మరల క్షత్రియవంశముల సృజింపుమని ప్రార్థింప నాతఁడు వేదియందు వైదికాగ్నిఁ గల్పించి మంత్రబలముచే నగ్నిహోత్రమునుండి క్షత్రియులను మరల సృజించెననియు వారివంశస్థులే యిప్పు డున్న రాజులందఱనియు నొకకథగలదు. కొన్ని రాజకుటుంబము లీకథ నొప్పుకొనక తమవంశకర్త సూర్యుఁడో చంద్రుఁడో యని తక్కినరాజులను నిరసనచేయుచుందురు. వీరు పలు తెగలుగా విభజింపఁబడి యున్నారు. ఏ తెగలోవా రా తెగకు నాయకుఁ డగువానిని మిగుల మన్నింతురు. నేల దున్నుకొని జీవించు సేద్యగాఁడు సయితము కులగౌరవమునఁ దాను గొప్ప జమీందారుతో సమానుఁడనని గర్వించు చుండును. ఈరాజపుత్రసంఘములలో నొక్కొక్క కుటుంబము నొక్కొక్క భట్టువాఁ డాశ్రయించి యాకుటుంబములయశస్సు కైవారములు సేయుచు వారివిరోధులను హాస్యరసప్రధానములగు పాటలతోఁ బరిహసించును. ఈభట్టువారు గాక చారణులను పేర మఱికొందఱు స్తోత్రపాఠకులు గలరు. వీరు జనులకు గురువుగాను, దేశచరిత్రములఁ దెలుపువారుగనుండి జనులచే మిక్కిలిమన్నింపఁబడుచున్నారు. ఈరాజస్థానమున జైనమతస్థులుఁ గూడ విస్తారముగా నున్నారు. ఈ దేశస్థులందఱు మాటలాడునది హిందీభాష. వీరరసమునకుఁబుట్టిన యిల్లగు నీరాజస్థానమునందలి సంస్థానాధిపతు లందఱుఁ దమ దేశస్వాతంత్ర్యమును దమయార్యమతమును, గోబ్రాహ్మణులను, దేవాలయములను, సంరక్షించుటకయి పలుమారులు మహమ్మదీయ చక్రి

వర్తులతో యుద్ధములు చేసిచేసి ప్రసిద్ధిఁ గాంచిరి. ఈసంస్థానములన్నిఁటిలో మీవా రనునది సుప్రసిద్ధమై రాజపుత్రదేశమున కలంకారమై శూరశిఖామణులకు నిలయమైయలరుచుండును. దానిపూర్వరాజధాని చిత్తూరునగరము. ఢిల్లీచక్రవర్తు లానగరము నాక్రమించి నాశన మొనర్చినపిదప తత్ప్రభువు లుదయపుర మను పట్టణము వేఱొకచోటఁ గట్టుకొని దానిని రాజధానిగాఁ జేసికొనిరి. ఉదయపురసంస్థానాధిపతియే రాజపుత్రులకెల్ల నాయకుఁడు. ఆతనియాజ్ఞ నాజాతివారందఱు శిరసావహింతురు. ఉదయపురాధీశ్వరునకు రాణా యనుబిరుదము కలదు. ఈతనివంశము నిష్కళంక మని ప్రజలు చెప్పుకొందురు. శ్రీమద్రామాయణకథానాయకుఁడును ధనుర్ధరులలో నెల్ల నగ్రగణ్యుఁడును నగు శ్రీరాముని రెండవకుమారుఁడగు కుశుని సంతతివార మని యీరాజులు చెప్పుకొందురు. ప్రస్తుత మీయుదయపుర రాజవంశము శిశోదయవంశ మని పేరొందియున్నది. ఈవిధంబుగనే కొందఱు రాజులు పాండవమధ్యముఁ డగునర్జునుని ప్రియపుత్రుఁ డభిమన్యుఁడు తమకు మూలపురుషుఁడనియుఁ, దత్కారణమునఁ జంద్రుఁడు వంశకర్తయనియు సంతసింతురు. జగద్విశ్రాంతకీర్తులగు నీరాజకులభూషణుల యద్భుతచరిత్రము లాంధ్రభాషలో వ్రాయవలెనని నాకుఁ జిరకాలమునుండి కుతూహల మున్నందున నేనిప్పుడు తచ్చరిత్రములు సంగ్రహముగ వ్రాయఁ బూనుకొన్నాఁడను. ప్రప్రథమమున నుదయపురము రాజధానిగానున్న మీవారు దేశముయొక్కయు జూడుపురము రాజధానిగానున్న మారువారుయొక్కయుఁ జరిత్రములు దెలుపఁబడును.

---




(మొదటి భాగము.)



## బప్పరావుల కథ

అనేకసంవత్సరములక్రిందట హిందూదేశమున వల్లభీపురమను పట్టణమును శిలాదిత్యుఁ డనుమహారాజొకఁడు పాలించుచుండెను. అతఁడు చిరకాలము శత్రుదుర్నిరీక్ష్యముగఁ బ్రజారంజకముగ నేల నేలెను. శిలాదిత్యుఁడు సూర్యునికుమారుఁ డనియు, నాకారణంబున నతఁ డామహారాజును సంరక్షించు ననియు బ్రసిద్ధికలదు. అతని సేనలతో నెవరుపోరినను వారు తప్పక పరాజయము నొందెడువారు. వల్లభినగరపుగోటలో నొక దివ్యసరస్సుగల దఁట. శిలాదిత్యమహారాజు శత్రువులకు జంకినప్పు డాదివ్యసరస్సునకుఁ బోయి, యొడ్డుననిల్చి చిన్ననాఁడు తనతండ్రి కరపినమంత్రముచ్చరించునఁట. వెంటనేయా సరోవర మధ్యమునుండి సూర్యునిరథములాగు రంగులగుఱ్ఱ మొకటి బయలుదేఱ నారాజు దానినారోహించి, రణరంగమునకుంజన శత్రుసేనలు వానియెదుట నిలువలేక పటాపంచలై పాఱుచుండును. ఇట్లుండఁ గొంతకాలమున కుత్తరదిక్కునుండి యరులమూఁకలు వచ్చి వల్లభిపురమును ముట్టడించెను. ఎన్నినాళ్ళు మగంటిమిఁజూపి పోరొనర్చినను వారు శిలాదిత్యుని గెలువఁజాలక నిరాశులైరి. అంతలోఁ జిర

కాలమునుండి రాజుపై మనస్సులోఁ గ్రోధము నిల్పియున్న యాతని
మంత్రి యొకఁడర్ధరాత్రిమున, శత్రుశిబిరముం బ్రవేశించి వారితో
"నాకోరినబహుమాన మిత్తు రేని శిలాదిత్యుని గెల్చి వల్లభీపురమును
బట్టుకొనునుపాయము మీ కుపదేశించెద" నని పలికె. ఆపలుకులు
విని వారు సంతసించి వానికోరిక తీర్చునటుల వాగ్దానముచేయ, నా
తఁడును దన జేని జయరహస్యమును బగతున కిట్లు తెలిపెను. "శిలా
దిత్యమహారాజు సూర్యపుత్రుఁడు. అతని పరిభావమువలనఁ గోటలో
నియొక దివ్యసరస్సునుండి సూర్యాశ్వ మొకటి బయలువెడలును. రా
జుదానిపై నెక్కి కయ్యమునకుఁ బోవుటం జేసివిజయుఁడగుచున్నాఁడు.
ఆసరస్సు మైలపడినయెడల భానుఁడలుగును. అతని యలుకచే రా
జున కాగుఱ్ఱము లభింపదు. అప్పుడు మీరాతని సులభముగా జయిం
పవచ్చును." ఇట్లుపలికి వైరులను మహానంద నిమగ్నులనుజేసి దుష్ట
బుద్ధి యగునామంత్రి నగరమునకుఁబోయి యొకగోవును జంపించి దా
నినెత్తు రాకొలంకునీటిలోఁ గలిపించి కలుషంబు గావించె. కొండొక
వడికి వేగులవాఁ డొకఁడు వచ్చి దేవా! శత్రువులు కోటపైఁ గవియు
టకు మొనలుదీర్చియున్నవారని చెప్ప శాత్రవ సేనలతోఁ బోరుమని
తనబలంబుల కానతిచ్చి, యాధరణీశ్వరుఁ డెప్పటియట్ల దివ్యసరోవర
మునకుంబోయి తన ప్రియహయమును బిలిచెను. కాని తొంటియట్ల
నీ రొకించుకయుఁ గదలబాఱదయ్యెను. ఆరాజేంద్రుఁడు తత్కారణ
మరసి, తనమంత్రిపటిమంబు చెడినదనియుఁ దనజనకుఁడగు ప్రభాకరు
నకుఁ దనపై ననుగ్రహంబు తప్పెనదనియునిశ్చయించి సేనలంబురికొ
ల్పుకొని యాయుధపాణియై దుర్వారసంగ్రామంబొనర్చి దేశసంరక్ష
ణార్థమై ప్రాణంబులు విడిచి కీర్తిశేషుఁడయ్యెను. శత్రువులు వల్ల
భిపురమును బట్టుకొని కొల్లగొనిరి. అప్పుడు దైవవశమున నగరము
నందులేమి నొక్కరితె తక్కఁ దక్కినతేనికాంతలందఱుఁ జిచ్చులోకి

భర్తృసహగమనముఁ జేసిరి. ఆమె తనపుట్టినింటికిజని మరలభర్తృ సన్నిధికి వచ్చుచుండ దారిలో నొకసేవకుఁ డారాణిం గని శిలాది త్యుఁడు లోకాంతరగతుఁ డగుటయు వల్లభిపురముశత్రువులకుఁజిక్కు టయు నాదిగాఁగల వృత్తాంత మెఱిఁగించెను. ఆదేవియు గుండె లవి యు తద్వార్త-విని, పిడుగ్గడచిన తెఱంగున మూర్ఛిల్లి దరిలేని శోకా బ్ధిలో మునిఁగి వల్లభిపురంబునకుఁ బోవఁగాళ్ళాడక నిండుచూలాలగు టచే నెటుబోవఁ దోఁపక దాఁపుననున్న యొకకొండగుహకు మెల్లమె ల్లనఁజనియె. అందుండఁ గొన్నినాళ్ళకామె కొకనందనుండుదయించె. అనంతర మామెయలనాఁగ యొకబ్రాహ్మణునిఁ బిలిచి తనకుమారుని వాని కప్పగించి బ్రాహ్మణకుమారునట్ల వానిం బెంపవలయుననియు సంప్రాప్తయౌవనుఁడయినపిదప నొక రాచకన్యను వివాహము చేయ వలయుననియుఁ, నొక్కి-చెప్పి చిరభర్తృవియోగముచే నవసియున్నతనఁ శరీరము విడిచెను. బ్రాహ్మణుఁడును శిశువు నెత్తుకొని యింటికిఁజని యాబిడ్డకు గుహలోజన్మించినకారణమున గొహలుఁడను పేరుబెట్టి పె నుచుమని తనకూఁతున కప్పగింప నామెయుఁ దనబిడ్డలతోఁబాటు వానికి సంరక్షణఁజేయుచుండెను. పెంపుడు తలిదండ్రులు బిడ్డలపై నెంతయనురాగము జూపుదురో యంతయనురాగము బ్రాహ్మణుఁడు వానికూఁతురును వానిపైనిఁజూపి పెంప రాజకుమారుఁడును గ్రమక్ర మంబునం బెరిగి కడుంగడు నల్లరిబాలుఁ డయ్యె. అనుదినంబునుబకోసు లంజంపుచు వనమృగంబుల వేఁటాడుచు రాజకుమారులం గలసియా డుచు పోరాటంటు సల్పుచు నాతఁడు దుండగీ డగుటంజేసి వానిని బ్రాహ్మణకుమారునట్ల బెనుచుట వానికి నలవిగాదయ్యె. ఇట్లుండ ప దునొకండేండ్ల ప్రాయమున నొకనాఁ డానృపకుమారుఁడు పెంపుడు తల్లిదండ్రుల యిల్లువిడిచి, యడవులఁగొండల నసియించు భిల్లులమూఁ కలఁ గలిసి వారలతో నిచ్చవచ్చిన తెఱంగున మెలంగుచు వేఁటలా

డుచు బాటలఁబాడుచు విహరింపఁజొచ్చె. ఒకనాఁడు గొహుఁడు భిల్ల బాలకులం గలిసి వేఁటలాడుచుండ నక్కుమారులందఱుఁ దమచుట్టు పక్కలనున్న నాగరికులవలెఁ దాముఁగూడ నొకరాజునేర్పఱచుకొం దమని పరిహాసార్థ మనుకొని గొహుని దమప్రభువుగా నియమించు కొనిరి. వెంటనే యొకచిన్నవాఁడు కత్తితోఁ దనవ్రేలుం జీఱికొనిజొ టజోటఁగారు కొన్నెత్తురు గొహుని నెన్నొసట టీకావేసెను. రాచ రికము పూనువాని కట్లుచేయుట యాదేశములో నాదినములయం దాచారమైయుండెను. భిల్లులకులవృద్ధు తద్వృత్తాంతము విని సంత సించి తమ యీదూరుగ్రామ మశేషము గొహునకుఁ బుత్రపౌత్ర పారంపర్య మేలుమని యర్పించి యెల్లభిల్లులకు వాని దొరగా నొన ర్చెను. నాఁటనుండియు తద్వంశస్థులు గిహాలోటు లని చెప్పఁబడుచు న్నారు. ఇట్లు గిహాలోటు లీదూరిపురమును భిల్లులను నెనిమిదితరము లవఱకుఁ బాలించిరి. అనంతరము భిల్లులు క్రొత్తవంశపురాజు పరిపా లనకు విసువుజెంది వారినెట్లయిన దేశమునుండి పాఱదోలఁ దలంచు చుండిరి. ఒకనాఁ డప్పటిరాజు వేఁటతమకంబునఁ దిరుగుచుండ భిల్లు లు వాని నాకస్మికముగఁ దాఁకి వధించిరి. అప్పుడు రాజకుటుంబ మెం దేని తలఁదాచుకొనవలసివచ్చె. పూర్వముగొహుని కాపాడినబ్రాహ్మ ణునికూఁతురుసంతతివారు వంశపారంపర్యముగ గురువులుం బురోహి తు లగుటంజేసి తద్వంశజుఁ డగుబ్రాహ్మణుఁడొకఁడు మృతినొందిన రాజకుమారునిమూఁడేండ్లప్రాయమువానిఁ జేరఁదీసి చేరువ నట్టడవిలో నున్న యొక కొండకోటకుం దీసికొనిపోవ నొకభిల్లుఁడు వానితండ్రి మీఁది విశ్వాసముచేత రహస్యముగ వాని నందుసంరక్షింపఁజొచ్చె. అచ్చటఁగొన్నినాళ్ళుగడచినపిదప పురోహితుఁడు రాజపుత్రున కచట నపాయమువాటిల్లు నని తలఁచి యిప్పటి యుదయపురమున కైదు క్రోసులదూరముననున్న నాగేంద్ర మను పుణ్యక్షేత్రమున కాకుఱ్ఱని

జేర్చెను. ఆపట్టణమున మూఁడుశిఖరములుగలయొకకొండ మొదట యేకలింగస్వామియనుపేరఁబరఁగుమహాదేవునిశివుని, వానివాహనమగు నందినిబ్రాహ్మణులారాధించెడువారు. అడవుల నేరుల నిండిన యీ యేకాంతస్థలమున రాజపత్ని తనకుమారుని దాఁచిపెంచుచుండెను. అతనికి నామకరణమేదియుఁ జేయక తల్లిబప్పాయనిపిలుచుచు నూరిపిల్లలతో పాటుపెరుగనిచ్చెను. ఆభాషలో బప్పయనఁబిల్లవాఁడనియర్థము. ఆయూరిపిల్లలవలె నాకుఱ్ఱఁడు నుదయము మొదలస్తమయమువఱకు పశువుల మందలం గావ నూరిబైటికిఁ బోవుచు, వారివలెనే తానునాడుచుఁబాడుచు నారండఱకు యజమానుఁడయి తనయాజ్ఞ వారుశిరసావహించునట్లు ప్రవర్తించెను. బప్పఁడు నానాఁటికిఁ బెఱిగి నెఱజవ్వనంబుఁ బ్రాపించియుండ నొకనాఁడట్లుతద్దిపండుగకు నాగేంద్ర గ్రామనాయకుని కూఁతురు తోడిపడుచులం గూడి పండుగదినంబున హాయిగ నుయ్యాలలూఁగ నూరిబైట దేవళముచుట్టు నున్న మామిడితోఁపున కరిగి యచట నుయ్యాల వన్నుటకు త్రాళ్ళుదొరకమిఁ జిన్నబోయి యుండెను. దైవవశమున నాసమయంబున బప్పఁడామామిడితోఁటలో దిరుగుచుండ బాలిక లాతనిం గాంచి తమకొక యుయ్యెలత్రాడు తెచ్చిపెట్టుమని వేఁడఁ బప్పఁడును దాని కియ్యకొని "సరే మీరు నాతో నొకయాట యాడుటకు నొప్పుకొందురేని మీకు త్రాడిచ్చెదను. మీరు మనసారనూఁగవచ్చు" నని పలుక గ్రామనాయకునికూఁతు రది యేమియాట యని యడిగెను. మఱేమియు లేదు. మనము పెండ్లి యాట యాడుకొందమని బప్పఁడుత్తరమిచ్చెను. బాలురును బాలికలును బొమ్మలపెండ్లియాటలు తమపెండ్లియాటలు నాడుకొనుట లోకవిదితమేకదా! ఉయ్యలత్రాడెక్కడ దొరకకపోవునో యని బాలిక లట్లు చేయుట కియ్యకొనిరి. గ్రామనాయకునికూఁతురుచీర కొంగున రాజపుత్రుఁడు తనశాలువకొంగు ముడివేసి యామెయు

నా మెతో నున్న మఱి యాఱువందల పడుచులయు చేతులు పట్టు కొని యొకవృక్షమునకుఁ బ్రదక్షిణముఁ జేసి కొండొకతడవునకుఁ బాణి గ్రహణమహోత్సవము నిర్వర్తించెను.

నాగరికత లేనియాపల్లెటూరిపడుచులు తమచుట్టముల యిండ్ల జరుగువివాహములలోఁ బ్రధానాంగముగాఁ జరుగుపని యదియే గావున నాపని కప్పుడు సంతసించి తనివిదీర నుయ్యాలలూఁగి, సాయం కాల మిండ్లకుఁ జని యాపెండ్లియాటమాట మఱచి యుండిరి. బప్పఁడు తనతోడిబాలకుల నందఱఁ జేరఁబిలిచి తానాదినమునఁ గావించిన చిత్రకథ వారెవ్వరికిం దెలుపఁగూడ దనియు, గ్రామంబున నెవ్వ డేమాట వినినన వ్వాఁ డది తన కెఱుఁగఁ జేయవలయు ననియుఁ గట్టడిచేసి వాండ్ర నందు కొడంబఱచి, వారిచేఁ బ్రమాణములు చేయించుకొని యంతట నెల్లర వీడ్కొలిపె. బప్పఁడు పశువుమందల మేఁపుచున్న యాకాలమునఁ జింతపువ్వువన్నెయా వొకటి స్వభావమునఁ బరమ సాధు వయ్యు నింటికి వచ్చి పాలు చేఁపక మొగదన్నుచుండుటఁ జేసి కారణము దెలియక యెట్టకేలకు బప్పఁడే దానిపాలు పితికికొనుచుండ వలయు నని నిశ్చయించి వానిదొంగతనము పొంచి యుండి పట్టుకొ మ్మని యూరిపెద్దలు కొండఱిని నియోగించిరి. బప్పఁ డది యెఱిఁగి కడునలిగి యావు వట్టిపొదుగుతో నింటికి వచ్చుమాట నిజమేకాని తానేపాప మెఱుఁగ ననియుఁ బొదుగుపై నెన్నఁడుఁ జేయి నైన వేయలే దనియుఁ జెప్పి యాగోవుజాడలు బాగనిపెట్టిరహస్యము బట్ట బయలు చేయుటకయి, యత్నించి మందలోనుండి యాపసరము ప్రతి దినము తప్పిపోవుచుండె నని తెలిసికొని యొకనాఁడు సాయంకాలము పుంతలు పొదలు దాఁగి వెనువెంటం జని యొకకొండచరియం జేరెను. అచ్చటనల్లిబిల్లిగ నల్లుకొన్నపొదలనడుమ నొకవేదికపై నమరియున్న మహాశివలింగమునకుఁ దప్పిపోయినయావు తనపొదుగునుండి పాలు

చేసి యభిషేకముఁ జేయుచుండెను. చిరకాలమునుండి జపములు తపములు నుపవాసములు చేసి ముక్తినిఁ బడయు నిచ్ఛతో మనస్సు పరబ్రహ్మముతో నైక్యముఁ జేయఁ బ్రియత్నించుచు నాసమయమున సమాధిలో నున్నయొకానొకసిద్ధుఁ డావేదిసమీపమున నుండెను. బప్పఁ డామహాత్ముని సమాధినుండి మేలుకొలుప నాతండు తన దివ్యజ్ఞానమహిమమున నెదుటనున్న బాలుఁడుత్తమ రాజకులసంభూతుఁ డనియు, మహాకార్యములు చేయ నవతరించినాఁ డనియుఁ దెలిసికొనియె. బప్పఁ డాసిద్ధునకు సాష్టాంగనమస్కార మొనర్చి తాను నాగేంద్రిగ్రామవాసి యగుపశులకాపరియనియుఁ దప్పిపోయినయొక యావును వెదకికొనుచు వచ్చె ననియుఁ జెప్పెను. సిద్ధుఁ డాపలుకులు విని వాని నాదరించి యాగో వనుదినంబు నాకొండచరియకు వచ్చి పాలు తనకును దేవునకు నొసంగుచుండెనని చెప్పెను. అది మొదలాగోవు మందనుండి తప్పిపోయినపుడెల్ల దానివెదకుచు బప్పఁడుసిద్ధుని నెలవునకుంబోయి వాని దర్శించి కడుభక్తి వానిపాదములం గడిగి యెడనెడ పాలు, పండ్లు నాహారములుగ సమర్పించుచు వానికిం బ్రియశిష్యుఁ డయ్యెను. సిద్ధుఁడును బప్పనియెడఁ బ్రిసన్నుండై శైవరహస్యముల నుపదేశింప నాతఁడు పరమశివభక్తుఁ డయ్యెను. ఆ ముని బప్పనికు పనయనము జేసి మంత్రోపదేశము చేయ మంత్రిమహిమచే నాతనికొకనాఁడు శివుని భార్య యగు మహిషాసురమర్దని వ్యాఘ్రివాహన మెక్కిరక్తాంబరముల ధరియించి ప్రత్యక్షమై శత్రునిర్మూలనసాధనంబగు నీటెయు విల్లును నమ్ములపొదియు నొసంగుటయే గాక మనుష్యకృతముగాక కేవల విశ్వకర్మ నిర్మితమై యిరుపక్కల వాఁడిగల యొకమహాఖడ్గమును గూడఁ బ్రసాదించెను. ఆఖడ్గ మతిభార మగుటచే దివ్యపురుషులు మహాశూరులుఁ దక్క సామాన్యులు దానిం దాల్ప నోపరు. దేవి

యిట్లాతని నను(గ్రహించుటయు సిద్ధు(డు బప్పనింజూచి "వత్సా! రేపు నే నీశరీరము విడిచి దివికిం బోవుదును. కావున నీ వరుణోదయము గాకమున్న వచ్చి నా కట్టకడపటి దీవెనలం బడయు" మని యానతిచ్చె. రాజకుమారు(డును తెలువాత తప్పక వచ్చునట్లు నచ్చ(బలికి మునిని వీడ్కొనిపోయెను. కాని పెందలకడ నిదర మేల్కొనంజాలక కొంత పొద్దెక్కిన వెనుక( నత( డాకొండచరియకు వచ్చి చూచునప్పటికి సిద్ధు(డందు లే( డయ్యె. ఆమహాపురుషుని కొఱకు బప్పు(డు పొదలు పుంతలు పొలములు వెదకి వేసారి యెందునుం గానక యెట్టకేలకు నాకసమువంక( జూచెను. అప్పుడు మహేంద్ర లోకమునుండి వచ్చి కన్నులు మిఱుమిట్లు గొలుపు దేదీప్యమాన ప్రభలుగల దివ్యపురుషులు మణిమయం బగు స్వర్ణ విమానంబున( గూర్చుండ( బెట్టికొని పోవ నంతరాళంబున మహావాయుపథంబునం దిరుగుచు సిద్ధు(డు పుడమిపై కడుదవ్వులనున్న బప్పనిం జూచి పైకి వచ్చి నాయాశీర్వచనముల నందుకొమ్మని కేకవేసెను. ఆపరమ మునీంద్రుని వాక్శుద్ధివలన బప్పు(డుచూచుచుండ(గనే యిరువదిమూళ్ళ పొడు గెదిగె న(ట. అప్పుడు ముని వానిం బిలిచి నోరు తెరువుమని యానతిచ్చి బప్పు( డట్లు చేయ తుబుక్కున మొగముపై నుమిసెను. రాజకుమారున కది కడు నసహ్యముగ( దో(చుటం జేసి యత(డు సిద్ధు నియుమ్మి తననోట( బడకుండ నించుక యావలకుం దప్పుకొన నది వానికాలిపై( బడియె. సిద్ధు( డది గను(గొని నీవు నే(జెప్పిన చొప్పున( జేసితివేని చిరంజీవివై యుందువుగదా? కానిమ్మిప్పుడైన నీ కేయాయుధమువలనను భయము కలుగ దని పలికి యంతర్ధానమయ్యెను. అనంతర మాబప్పు( డింటికరిగి జరిగిన వృత్తాంత మంత యు( దల్లి కెఱింగింప నామెయు నతిలోకంబగు నయ్యద్భుతంబున కానంద పరవశయై "నాయనా! నీ వం(డఱనుకొన్నట్టు పశులకాపరివి

కావు. సకలమహీంభరణదక్షుండ వగు రాజపుత్రుఁడవు. నేను రాజ కన్య” నని గుట్టు వెల్లడిచేసి పూర్వవృత్తాంత మెఱింగించెను. బప్పఁడది విని నాఁడుమొదలు లావులమందలఁ గాఁచుట మాని రాచరికము సంపాదింప దేశములు వెంటఁ దిరుగ నారంభించెను. ఆసమయమున బప్పఁడు నాగేంద్రగ్రామమును విడుచుటయు నాతనికి మిక్కిలి క్షేమకరము. ఏలయన నాతని విషయమై దుర్భరమగు నొక చెడువాడుక వ్యాపించుటంజేసి యూరెల్ల నట్టుడికిన ట్టుడుక సాగెను. గ్రామనాయకుని కూఁతురు సంప్రాప్తయౌవనయై వివాహయోగ్య యగుటంజేసి దానికిందగు వరుఁ డొకఁడు లభించెను. వివాహప్రయత్నములన్నియు జరిగి సిద్ధముగనుండ ముహూర్తము నిశ్చయించుటకు వచ్చిన బ్రాహ్మణుఁడు బాలికజాతకమును జూచి గ్రహసంచారమును బట్టి యామెకు నదివఱకె వివాహ మయినదని చెప్పెను. ఊరి పెద్ద లీమాట విని మితిమీరిన యలుకచే మండిపడి బాలికనునొక్కి యడుగ నామెయు భయపడుచు వెనుక నెఱపబడిన యాటపెండ్లి నెఱింగించెను. ఆ తెగవారి శాస్త్రమునుబట్టియు నాచారమునుబట్టియుఁ గొంగులు ముడివేయుటయుఁ జేతులు పట్టుకొనుటయుఁ జెట్టుచుట్టు దిరుగుటయు, నిజమయిన వివాహమును సూచించుటంజేసి బప్పఁడు గ్రామమునందలి యాఱువందలకన్యలకు విధిగా మగఁడయ్యె నని పెద్దలలుక జెందుటకుఁ దగినంత కారణము లేకపోలేదు. తనతోడి పసులకాపరులలో నొకనివలన నీసంగతి బప్పఁడు విని క్రోధపరవశులగు మామగార్ల బారినుండి తప్పించుకొని తత్క్షణ మాగ్రామమును విడిచి కొంతదవ్వరిఁగి గొప్ప బయలునేల నొకకొండపైఁ గట్టఁబడిన చిత్తూరినగరముం బ్రవేశించెను. ఆకాలమున చిత్తూరునగరము మౌళవరాజవంశస్థుఁ డగు బప్పని మేనమామ పాలించుచుఁ చిరకాలముకిందటఁ జూచినతనతోఁబుట్టువును మేనయల్లుని గారవించెను,

ఎవరో యెచ్చటనుండివచ్చెనో యెవ్వరికిందెలియని యాకొత్త చుట్టాలపై రాజునకుం గలయాదరంబును గారవంబునుజూచి రాజాశ్రితులందఱుఁ గడుసల్గి తమపట్టణముపై నొకశత్రువుదండెత్తి రా వారందఱు నతనికి సహాయముగాఁ బోరరయిరి. రాజు వారినిసాయమడుగ మేనమామ చేసినయాదరంబునకెల్ల బప్పఁడు తగినవాఁడైన పక్షమున నతఁ డొక్కఁడే పగతురం దాఁకి జయింపఁగలఁడు. ఇంక మాసాహాయ్య మెందుకు? కావలసినయెడలమామడిమాన్యములనైన వదలుకొని మే మెందయినఁబోవుదుము. కాని, నీపక్షమునఁ బోరమని రాజునకు వారు ప్రత్యుత్తర మిచ్చిరి. బప్పఁడు జంకును గొంకును లేక యొక్కఁడే యుద్ధమునకు సిద్ధ మయ్యెను. ఆతనిసాహసమును జూచి సరదారు లందఱుఁ దమతమమనస్పర్ధలను విడిచి సిగ్గుపడియెట్ట కేలకుఁ బప్పనివెంట రణంబునకుం బోయిరి. నాటికలహంబున శత్రురాజు బప్పనిచే బరాజయము నొంది యాశూరశిఖామణికి దనకూఁతు నిచ్చి వివాహము చేసెను. సరదారు లందఱు బప్పనిం జేరఁబిలిచి యారాజు దుష్పరిపాలనముచే దమకు విసువుఁ గలిగెననియు,నందుచే మామను సింహాసనభ్రష్టుని జేసి యల్లుండు గద్దెయెక్కి పాలించిన నుచితముగ నుండుననియు నుపదేశించి యట్లుచేయఁ బ్రోత్సాహపఱచిరి. బప్పఁడు నిశ్శంకబిరుదుం డగుటచే సరదారుల సాయమున మేనమామ యని సంశయింపక తేనిం బాఱఁదోలి రాజ్య మాక్రమించెను. తొల్లి సిద్ధుండు బప్పని నేకలింగస్వామికి ధర్మకర్తగా నేర్పఱచెను. అదిగాక బప్పఁడు హిందూమతపరిభాకరుఁ డనియును సర్వభూమండలాధీశ్వరుఁ డనియు బిరుదులు గ్రహించెను. అతఁడు చిత్తూరు దేశము చండశాసనుఁడై చిరకాలము పాలించి రాజ్యముఁ గడువృద్ధి చేసెను. అతఁ డనేకకన్యలను వివాహ మాడెను. అందు ద్వీపాంతరములనుండి వచ్చిన యొకానొక రాజకన్య తనసారెతో నొక

దేవీవిగ్రహము దెచ్చి కోటలో నుంచెను. లోకమాతయగునాదేవి బహుసంవత్సరములాకోటను సంరక్షించెనఁట. కాని యొక పిఁడికి రాజు మంచిసమయమున కోటను విడిచి పోయెను. ఆద్వీపాంతరరాజ కన్యకవలన బప్పని కుదయించిననందనుఁడు పితురనంతరముస సింహాసన మెక్కెను. బప్పనిజీవిత మంతయు నెట్టియద్భుతకథలతో నిండి యుండెనో వానిమరణము నట్టికథలతో నిండి యున్నది. అతఁడతి వృద్ధుఁడై నవెనుక రాజ్యమును భార్యలను బిడ్డలను విడిచి సేనలం గూర్చుకొని పశ్చిమదేశములపయి దండు విడిసి చూచినతావెల్లఁ జయించుచు, తుట్టతుదకు ఖొరాసానను మ్లేచ్ఛదేశముఁ జేరి యచ్చట నొకరాజ్యము స్థాపించెను. కాశ్మీర, గాంధార, పారసీకప్రభువులును, కాఫరస్తాను ఇస్పహాను దొరలును, తక్కుంగల పశ్చిమదేశాధీశ్వరులును వానికి లోఁబడి కప్పము గట్టిరఁట. బాల్యమునందుఁబోలె వార్ధకమునందును నతనికి వివాహేచ్ఛ మిక్కుటమగుటఁ జేసి మ్లేచ్ఛసామంతరాజపుత్రికలఁబలువుర పాణిగ్రహణము జేసికొని యాకన్నెల వలన నూటముప్పదుగురు కుమారులం గనె నని చెప్పుదురు. ఈకొడుకులే నూటముప్పది పటానుతురుకతెగలకు వంశకర్తలై యుండె నని ప్రసిద్ధిగలదు. మున్ను చిత్తూరిపై వినుకు పుట్టినయట్లు ఖొరాసానుపై నయిత మాతనికి వినుగు జనింప నతఁడాదేశమును వైభవమును విడిచి తిరిగి పరమపావనమగు మహామేరుశైలము నెక్కి జితేంద్రియుఁడయి సన్యసించి జపతపంబుల కాలముపుచ్చి యెట్టకేలకుశతవృద్ధయి శరీరము విడిచెనఁట. ఈతఁడు చచ్చి లోకము విడిచినను, నద్భుతములు మహిమలు వీనిని విడువవయ్యె. అతని మొదటి ప్రజలగు హిందువులును, తరువాతప్రజ లగుమ్లేచ్ఛులును వానికళేబరవిషయమై వివాదపడిరి. హిందువులు తద్దేహము నగ్నిసంస్కారముఁ జేయవలయుననిరి. మ్లేచ్ఛులు నేలం బూడ్చిపెట్టవలయుననిరి. ఇట్లు కొంత

తడవు మ్లేచ్ఛ హిందువులు కార్యనిశ్చయముఁ జేయలేక వివాదపడు చుండ నప్పుడందులో నొకఁడు శవముమీఁదఁ గప్పినబట్ట నించుక యెత్తెను. అప్పటియద్భుత మే మని వర్ణింపను. ఆస్థానమందు బప్ప రావుల శరీరముఁగాని దానిజాడఁగాని యొక్కింతయు గానఁబడక పోవుటయేగాక శవమును పండుకొనఁ బెట్టినచోట భూమిలోనుండి లెక్కలేని తామరపువ్వులు మొలకలెత్తెను. ఈవిధమున బప్ప డద్భుతముగా నస్తమించెను. ఈబప్పరావులే మీవారుసంస్థానము నేలుశిశోదయ వంశజులగు రాజులకు మూలపురుషుఁడు. అతనియనం తరమున సింహాసనమునకు వచ్చిన ప్రభువులు గొందఱు బప్పనివలెనే రావులని బిరుదము వహించిరిగాని యిటీవల వారు రాణాయను నామము ధరించిరి. బప్పరావులకాలము మొదలు చిత్తూరురాజు లచ్చటి శివాలయమునకు ధర్మకర్తలై వారు స్వయముగా నాలయ మునకుఁ బోవునపుడు దేవునకు నర్చకులై యుండెడు నాచారము గలదు.

---

## పద్మిని.

---

పూర్వకాలమున మీవారుదేశమునకు వైభవమున సాటిలేని చిత్తూరు నగరము రాజధానియై యుండెను. ఆనగరము చుట్టుపట్ల నలుదెసల బయలగు నేల నొకచదరపు గొండపైఁ గట్టబడి దుర్గము లగు కోటగోడలు నున్నతములగు దేవాలయములు రమ్యములగు

మేడలు మనోహరములగుపూఁదోఁటలు శూరులగు రాజకుమారులు గలిగి రాజసంస్థానమున కలంకారమై యుండెను. ఆకొండమీఁదనే వెలసిన యొక దేవత యానగరమును గాఁపాడుచుండెనని యానాఁటి వారు నమ్మియుండిరి. పదమూఁడవశతాబ్దాంతమున మీవారు దేశమునకు లక్ష్మణసింగను నొకబాలుఁడు రాజయ్యెను. అతఁడు రాజ్యభారమును వహించుటకుఁ దగని బాలుఁడగుటచే నాతని పినతండ్రి యగు శూరశిఖామణి భీమసింగు సంరక్షకుఁడై రాజ్యతంత్రమునునిర్వహించుచుండెను. భీమసింగు సింహళద్వీపరాజపుత్రియు నసమానలావణ్యవతియు నగు పద్మినిం బెండ్లియాడెను. ఆదేవి చక్కఁదనమును సౌకుమార్యమును నెఱజవ్వనమునుఁ బట్టి భూలోకమున నిట్టి సౌందర్యవతి లేదని యాకాలపుజనులు చెప్పుకొన దేశమంతటనామెకీర్తి వ్యాపించి యప్పటిఢిల్లీచక్రవర్తియు నధమాధముఁడునగు నల్లాయుద్దీను చెవినిఁ బడెను. ఈచక్రవర్తి పరమదుర్మార్గుఁడు: చిన్నటనుండియుఁ దన్నుఁ బెంచిన పినతండ్రిని జలాయుద్దీను చక్రవర్తిని విశ్వాసఘాతకుఁడై చంపి సింహాసన మెక్కెను. గద్దెయెక్కినది మొదలతఁడు ప్రజలను మంగలములోఁబెట్టి వేచినట్లు పలువెతలఁ గుడిపెను. ఆచక్రవర్తి తనయాగ్రహమునకుఁ బాత్రులగు మందభాగ్యులనుఁ గన్నులు బొడిపించియు ధనము హరించియుఁ జెఱఁబెట్టించియుఁ జంపించియు నాలుబిడ్డల బిచ్చగాండ్రఁ జేసియు ననేక చిత్రవధల పాలుఁ జేసి కలియుగ రావణుఁడయ్యెను. అతఁడు తనపై దండెత్తివచ్చిన పగఱఁ బాఱఁదోలుటలోను పరరాజుల దేశముల నాక్రమించుటలోను పితూరీల పేరైన లేకుండ నడచుటలోను సాటిలేని చండశాసనుఁ డగుటచే వానిరాజ్యము సకలైశ్వర్యములకునికిపట్టయి విలసిల్లెను. ఆతని క్రౌర్యము నిరంకుశమై నేరములు చేసిన వారియెడలనే గాక నిరపరాధులగు వారి యాలుబిడ్డలపై సైతము జూపఁబడుచువచ్చె. ద్రోహు

లగు పురుషుల దండించిన రాజు లనేకు లుండిరి కాని యేపాప మెఱుఁగని పసిబిడ్డలను బడఁతులను గ్రూరశిక్షుల పాల్గావించు నీచు నితనిఁ దక్క మఱొకని నెఱుఁగము. ప్రజల హింసించుటలో నతనికి హిందువులు మహమ్మదీయు లను భేదము లేదు. స్వమతస్థు లగు తురకలు సయితము వానిసెలవు లేక యొకరిదర్శన మొకరు చేయ రాదు. విందులకుఁ బోరాదు. పదిమందిచేరి మాటాడరాదు. వేయేల! తనపాలనకు లోఁబడిన యానాఁటిహిందువుల నితఁడు కడుపునిండఁ దిననీయక కంటినిండ నిదురఁ బోనీయక పన్నుల వేసి బందెలఁద్రోసి పీడించుటచేఁ దల గోకికొనుటకైనను వారికి స్థిమితము లేకపోయెనని యొకచరిత్రకారుఁడు వ్రాసియున్నాఁడు.

అట్టి యీమహాపాతకుఁడు పద్మినీదేవి సౌందర్యాతిశయము లను వీనుల విందుగా విని యామెను జేకొనఁగోరి మహాసేనం గూర్చుకొని యడవులు గొండలు నేఱులు దాఁటి మీవారుదేశము జొరఁబడి చిత్తూరునగరపుఁ గోటయెదుట నిలిచి పద్మినీదేవిని తనకుం గానుకగ నడిగెను. రాజపుత్రులు నింద్యమగు తన కోరికను నిరాకరించుటచే తను నగరపుఱాతికోట తనకు దుర్భేద్య మగుటచేతను జక్రవర్తి తన యాట లచ్చట సాగిరావని తెలిసికొని బింకము వదలి సామవాక్యములకుం జొచ్చి పద్మినీదేవి తన కక్కఱలేదనియు నామె చక్కదనము తాను వినినంత జగన్మోహనముగ నుండునో లేదో యెఱుంగఁ గోరివచ్చితిననియుఁ బద్మినీదేవి రూపప్రతిబింబము నొకయద్దములోఁ దనకుఁజూపిన తాను రాజపుత్రుల బాధింపక సంతసించి పోవుదు ననియు భీమసింగునకు వర్తమాన మంపెను. తనపగతుఁడు తనవలె మాటదప్పని మనుష్యుఁడనుకొని భీమసింగు వానికోరికఁ దీర్చుట కియ్యకొనెను. అలాయుద్దీను పరమానంద భరితుఁడై స్వల్పపరివారముతోఁ జిత్తూరుకోటకుం జని రాచనగరుఁ బ్రవేశించి యచ్చట

నొక నిలువుటద్దములోఁ బద్మినీరూప ప్రతిబింబమును జూచి కృతార్థుడై భీమసింగునకెన్నియో సలాములు చేసి కోట విడిచిపోయెను. అంతట చక్రవర్తి తనయింటికి వచ్చినప్పుడు కొంతదూరము వానిని సాగనంపకపోవుట సదాచారము కాదని యెంచి రాజపుత్రశూరుఁడు కోట విడిచి కొండ దిగి చక్రవర్తి వెంట శిబిరమునకుఁ బోయెను. పద్మినీదేవి సొగసులుగులుకు తమ్మికొలను కెలఁకున నొక మేడలో నుండి ప్రాణేశ్వరుని రాక కెదురుచూచుచు నెంతసేపటికి నతఁడు రామి కలవలపడఁ జొచ్చెను. మానధనుఁడగు భీమసింగు తన్ను సాగనంపుటకుఁ దప్పక వచ్చునని యెఱింగి కఱకుతురక తనశిబిరము చెంత నొక గుట్టచాటున నాయుధహస్తులగు భటులను దాఁచినందున రాజపుత్రుఁడు చక్రవర్తియొద్ద సెలవుంగైకొని కోటకుం బోవ మఱలిన తోడనే తురకజోదులు వానిపైఁబడి పట్టుకొని శిబిరమునకుం గొనిపోయి యజమానుని యానతిం జెఱఁబెట్టిరి. చక్రవర్తియుఁ దనకావించిన గొప్ప పనికి సంతసించుచుఁ "బద్మినీదేవిని నాకుం గానుకగా సమర్పింపకపోయినపక్షమున భీమసింగు నింక విడుచువాఁడగాను" నని ప్రతినఁ జేసెను.

ఇంతలో సేవకులు పరుగుపరుగున వచ్చి యీయశుభవార్త దెలిపి దేవిని రాజబంధువులను దుఃఖమగ్నులం జేసిరి. తక్షణమ రాజపుత్రనాయకు లందఱును గర్తవ్యమును నిర్ణయించుటకుం గొలువుఁ దీర్చి భీమసింగువంటి శూరశిఖామణిని గోల్పోయి చిత్తూరు రాజ్యలక్ష్మిని దిక్కుమాలిన దానిగాఁ జేసి రాజకుమారు నసహాయుఁ జేయుటకంటెఁ బద్మినీదేవి నాదురాత్మునికడకుఁ బనుచుటయె గాలోచిత మని సిద్ధాంతీకరించిరి. పద్మిని ప్రాణరక్షణమునకన్న మానరక్షణమే యధికముగా నెంచుకొని రాజపుత్రస్త్రీ యయ్యు రాజబంధువులు చేసినతీర్పు నీచమని నిరాకరింపక యాపత్సమయమున మాన

భంగము రాకుండఁగాపాడు నాయుధమును జెంతనుంచుకొని పోవుట కు సిద్ధమయ్యెను. అంతటఁ జిత్తూరుకోటలోనుంచి యేడువందల పల్లకులు స్కంధావారమునకు బయలుదేరెను. పల్లకి గాఱుగురు బోయలు చొప్పున రమారమి నాలుగువేలమంది బోయ లోంకార ధ్వనులచే దిక్కులు పిక్కటిల్లునట్లు వానిని మోసికొనిపోయి చక్రవర్తి శిబిరమున డింపిరి. పద్మిని మేనమామయగు గోరాసింగును వాని యన్నకొడుకు పండ్రెండేండ్ల ప్రాయమువాఁడు బాదాలుసింగును పల్లకులవెంట వచ్చిరి. పద్మిని వెంటఁ బల్లకులలోఁ గూర్చుండి వచ్చిన తక్కినవారెవరని చక్రవర్తి యడుగఁ బద్మినీదేవిని సాగనంపుటకై చెలికత్తెలు చుట్టములు పరిచారికలు లోనగువారంద్రుపేమాతిశయమున వచ్చిరని గోరాసిం గుత్తరముఁజెప్పెను. రాజపుత్రస్త్రీల ఘోషాచెడకుండఁ జక్రవర్తి గుడారములు వేయించి జాగ్రత్త పెట్టించుటచే బోయలు పల్లకుల నచ్చట డింపిరి. గోరాసింగు చక్రవర్తియొద్దకుఁ బోయి తనమేనకోడలు కడసారి భర్తతో మాటలాడఁ గోరుచున్నది. కావున నట్లుచేయుట కనుమతింప మని ప్రార్థింప నల్లాయుద్దీను సంతోషపరవశుఁడై యందుకు సమ్మతించెను. భీమసింగు గుడారములోపలి కరిగి లోనివారితో నించుక మాటలాడి పద్మిని యెక్కివచ్చినదన్న పల్లకి నెక్కి మెల్లమెల్లఁగా నావలికిం దాటెను. కుటిలుఁ డగుచక్రవర్తి పద్మినిని స్వీకరించియు భీమసింగును విడువ నిచ్ఛగింపక భీమసింగు తప్పించుకొనిపోవుట గ్రహించి వానిం బట్టుకొమ్మని విచ్చుకత్తుల జోదులఁ బంపెను. ఆసమయమున మహామ్మదీయుల కద్భుతముగ సింహళరాజకన్య యగు పద్మినీదేవియు నామెపరిచారికలు వచ్చుటకుమారుగ నేడువందలపల్లకులనుండి యేడువందలమంది మహావీరు లగురాజపుత్రులు వెలువడి యాయుధపాణులై నిలిచిరి. పల్లకులు మోసిన బోయలందఱు సైనికులై కత్తులు

దూసి యుద్ధసన్నద్ధులైరి. చక్రవర్తిసేన యింతపాటు వచ్చునని యెఱుఁగక నిర్లక్ష్యముగ నుండుటంజేసి రాజపుత్రసైనికులు కలరు తురకలపైఁబడి సంహరించి సైన్యంబును బటాపంచలుచేసి తురకలు తమరాజునకుఁ గావించినద్రోహమునకుఁ బరాభవమునకుం దగినట్లు కసిఁదీర్చుకొనిరి. రాజపుత్రులసహాయశూరులై బగతురం బొడిచి నురుమాడిరిగాని చక్రవర్తియొద్దకుఁబోయి వానిం గడతేర్చనేరక నలుదెసలం గ్రమ్మిన మ్లేచ్ఛసైన్యంబుచేఁ గ్రమక్రమంబునం గూల నారంభించిరి. భీమసింగును పట్టుకొనుటకు వెంటనంటి చన్న తురక బంటుల కతఁడు దొరకక పల్లకిదిగి వేగవంత మగునొకగుఱ్ఱము నెక్కి ప్రాణము దక్కించుకొని మీవారు రాజ్యమును సంరక్షించుటకు బ్రతికి కోటలోఁబడెను.

అల్లాయుద్దీను నీవిధముగ వంచించి భీమసింగుప్రాణముఁబద్మిని మానముఁ గాపాడినగోరాసింగునుదక్కినరాజపుత్రశూరులును స్వదేశమున కయి ప్రాణముల విడిచి యుద్ధభూమిని బడియుండిరి. రణహతులగుశూరులపత్నులు చిచ్చురుకుటకు సిద్ధముగనుండ నంతలో యుద్ధమునుండి తప్పించుకొని బాలుండగు బాదూలూసిం గచ్చుటికి వచ్చెను గోరాసింగుభార్య వానింజూచి "నాయనా! కయ్యమున నాప్రాణేశ్వరుండెట్లు వర్తించెనో వినఁగోరుచుంటిగాన, నేనాయనను గలిసికొనుటకుఁ బోవకమునుపే నాకెఱిఁగింపు" మని యడిగెను. ఆపలుకులు విని బాదూలుసింగు "తల్లీ! అతఁడిట్లు వర్తించినాఁడని నేను వర్ణింపఁగలనా? నీహృదయేశ్వరుండు స్వదేశసంరక్షణమునకై శౌర్యము మెఱయఁ బోరాడి తననెత్తుటిచే భూదేవి నలంకరించి ప్రాణములఁ బరిత్యజించి వీరస్వర్గముఁ జూరఁగొని యున్నవాఁడు. పగతురకళేబరంబుల మెత్తనిపాన్పుగఁ గావించుకొని యొకకఱకుతురకమేను తలఁగడ నమర్చుకొని వీరశయనముననుండి చచ్చియుఁ బగతురకు వె

ఙప్పుఁ గొలుపుచున్న వాఁడనుసుమీ! యని విన్నవించెను. ఆమాటలు విని యావీరపత్ని నేనికఁ జడయరాదు. ఆలస్యమైన నాజీవితేశ్వరుఁ జాగ్రహింపఁగలఁ డని నిర్భయముగ నిర్విచారముగ నిశ్శంకముగఁ జిచ్చుతికి మృతినొందెను. అప్పుడు మీవారురాజ్యమంతయు దుఃఖసముద్రనిమగ్నమయ్యెను. రాజపుత్రవీరులలో ననేకులు మృతినొందినను జక్రవర్తి చిత్తూరుకోటం బట్టుకొనువిషయమున నాసవదలుకొని చిన్నబుచ్చుకొని డిల్లీనగరమునకుం బయనమై పోయెను.

చక్రవర్తి కంతటితో బుద్ధివచ్చియుండునని రాజపుత్రులు తలఁచిరిగాని యాపంతకొండి చిత్తూరునందు జరిగినపరాభవమునిప్పువలె వానిహృదయమును దహించుటంజేసి పగఁదీర్చుకొనుటకుఁ దగినసమయమును నిరీక్షించుచుండెను. వెనుకటికయ్యమునాఁటికి బాలుఁడైన లక్ష్మణసింగుయుక్తవయస్కుఁడై రాజ్యభారముపూని క్రమక్రమంబునఁ బండ్రెండుగురుకొడుకుల తండ్రియయ్యెను. భీమసింగు పద్మినీదేవినిఁ గూడి యెప్పటికిని రాజగౌరవమునందుచు దేహదార్ఢ్యముఁగలిగి తమ్మికొలనిచెంత మేడలో సుఖించుచుండెను. అల్లాయుద్దీను చక్రవర్తియు నేపనిచేయుచున్న నేవిషయమైయాలోచించుచున్న నెవరితోమాట్లాడుచున్న పద్మినీముఖపద్మమును మరువక యుత్కంఠముతో నుండెను.

ఇట్లుండియుండి ప్రజలకుదుర్భరముగఁ బన్నులుగట్టి ధనము చేర్చి మహాసైన్యమును గూర్చుకొని మీవారుపై దండెత్తి చిత్తూరుకోటను మరలముట్టడింపసాగెను. చక్రవర్తి సాహసమునుఁ జూచి రాజపుత్రులు తొలుదొల్త నెగతాళి చేసిరి. రాతిగద్దియపైఁ గూరుచున్న యంగనలవలెఁ బురలక్ష్మి చక్రవర్తికి దుర్భేద్యమైనట్లు కనఁబడెను. కాని తూర్పుద్వారమునొద్ద నేల కొంచెమెత్తుగ నుండినందునఁ జక్రవర్తి యదిగనిపెట్టి యాచో నెత్తుచేయింపఁ దలంచి తట్టకొక డబ్బు

చొప్పున నిశ్చిద నని చెప్పి సైనికులచేత మట్టిమోయించి కోటయెత్తు న నొక దిబ్బగావించి దానిమీఁద గోడలను బగులఁగొట్టుటకు కోట సంరక్షించువారిఁ జంపుటకు లోపలివారిఁ గడ తేర్పుటకుఁ దగిన యుద్ధసాధనములను యంత్రసాధనములను బెట్టించి పనిచేయించెను. కోటలోపలనున్న రాజపుత్రుల కలోకసామాన్య మగుపరితాపపౌరుషములు కలవుగాని మహమ్మదీయులయొద్ద నుండుయంత్రసాధనాదులు లేకపోవుటచేఁ గోట నిలుచుటయుఁ దమప్రాణములు దక్కుటయు నసాధ్య మనితలంచిరి. అంతలో వర్షకాలము ప్రారంభమై రాజపుత్రులబాధలనధికముచేసెను. రాణా యగులక్ష్మసింగొకనాఁడు రాత్రిమేల్కని యొకచోట నొక్కఁడు గూర్చుండి మీవారురాజ్యమునకు రాఁదలంచిన మహోపద్రవమును గూర్చి యోజించుచుండఁగ నొకమూలనుండి "నా కాఁకలియగుచున్నది నాకాఁకలి యగుచున్న" దని యొకధ్వని వినఁబడెను. ఆశబ్దమువిని యతఁ డదిరిపడి దిగ్గునలేచి నలుకెలంకులఁ జూచునప్పటికి వానియెదుట దీపమువెలుఁగున భయంకరాకారము గలయొకపెనుభూతము గనఁబడెను. లక్ష్మణసింగుదానిం గని యామె చిత్తూరునగరమునుగాఁపాడు పురదేవత యనినిశ్చయించి దానితో "రాజపుత్రులనెత్తురు కావలసినంత ద్రావితివి గదా నీ కింకేమిగావలయు" నని భయభక్తులతో నడిగెను. అప్పు డాపాడుదయ్యము వానితో "నాకు రాజులనెత్తురుద్రావినంగాని తనివిదీరదు. ఈనగరమునకు నాసహాయము గావలయునేని మూర్ధాభిషిక్తు లగు రాజులు పండ్రెండుగురు నాకు బలికావలయు" నని యుత్తరమిచ్చి యంతర్ధానమయ్యెను. రాణాయు మిగిలినరాత్రియంతయు నిశ్శబ్దముగాఁ గడపి ప్రాతఃకాలమున సేనాధిపతులను బంధువులను రావించి కొలువుదీర్చి రేయిజరిగినచిత్రకథ వారి కెఱింగించెను. కాని వారెవ్వ రాకథ నమ్మరైరి. "నామాటలు నమ్మరేని మీరీ రాత్రి నా

మందిరమునకువచ్చి యేమిజరుగునోచూడుఁడు. ఆదేవత మరల రావచ్చునని నేఁడలంచెద." అనిరాణాపలుకుటయు రాజబంధువులారాత్రి వానిమందిరమున కరిగి కనుమూయక చూచుచుండ నడిరేయి వెనుకటియట్లు భూతము కనఁబడలేదుగాని వినువారిగుండెలు ఝల్లుమనునట్లు లీక్రిందిపలుకులు వినఁబడెను. "నాకాఁకలియగుచున్నది. నాకాఁకలియగుచున్నది. దురాత్ములగు మ్లేచ్ఛులనెత్తు రెంతద్రావినను నాకుఁ దృప్తి లేదు. నాకు రాజులరక్తము గుటగుట త్రాగవలెననియున్నది. రాణాకుటుంబమునుండి పండ్రెండుగురు రాజకుమారులనేరి యందొక్కొక్కనికిఁ బట్టాభిషేకముఁజేసి ఛత్రచామరాది రాజచిహ్నములిచ్చి మూఁడు దినములు మీవారు రాజ్యము వానిచేత నేలించి నాలుగవదినమున మ్లేచ్ఛులమీఁదికి యుద్ధమునకుఁ బంపుఁడు. ఒకనితరువాత నొకని నీవిధముగ బలియిచ్చిన నేను జిత్తూరునగరమునుండి దేశమున కొకభంగము రాకుండఁ గాపాడెదను."

పురదేవత పలికిన యీదారుణవచనమునకు నాఁడచ్చటఁ జేరినరాజపుత్రులలో శంకించినవాఁడు వెఱచినవాఁడు నొకఁడయినను లేఁడయ్యె. రాణాకొడుకులు పండ్రెండుగురు దేశక్షేమకరమగునీపనికిం దమప్రాణముల నిచ్చెదమని నిశ్చయముగఁజెప్పి నేను ముందు బోవుదు నేనుముందుబోవుదు నని తమలోఁదారు వంతులు వోవఁ జొచ్చిరి. తుట్టతుదకుఁ జ్యేష్ఠకుమారుఁడు తండ్రికడుపునఁదాను దొలుదొల్త నుదయించుటచే ముందుగఁబోవుటకుఁదనకు స్వాతంత్ర్యము గలదని వాదింప వానియనుజు లందఱు నందుకు సమ్మతించిరి. గ్రామదేవత చెప్పినట్లతఁ డభిషిక్తుఁడై మూఁడుప్రొద్దులు రాజ్యమేలి నాలవనాఁడు పగతురఁదాకి వీరస్వర్గము నొందెను. అనంతరము రెండవ కుమారుఁ డగునజేయసింగునకు వంతువచ్చె. ఇతఁడు తండ్రికిఁదక్కినకొడుకులకన్న నధికప్రియుఁ డగుటచేఁ దండ్రి "నాయనా! అందఱు

నన్నుఁ బాసిపోవఁదలఁచుకొన్నను నీవైననాకడఁ గొంతతడవుండి నాకూరట గలుగఁజేయుమని దీనముగ వేఁడుకొనఁ గుమారుఁ డట్లుచేయుట కిష్టములేకయుఁ దండ్రిమాట దీసివేయలేక క్రిమక్రమంబునఁ దక్కిన సోదరులందఱు రణమునఁ దెగువఱకు జనకుని సమీపమున నుండెను. రణమునకుఁ బోవుటకుఁ గుమారునివంతు వచ్చినదని తెలిసికొని రాణా మంత్రిల సామంతుల సేనాధిపతుల రాజబంధువులఁ బిలిపించికొలువు దీర్చి “శూరులారా! హతశేషుఁడయిన నాప్రియనందనుఁడ జేయసింగు పోవలసినకాలము వచ్చినది. ఈనగరరక్షణమునకయి యీ బాలుని బదులు పెద్దవాఁడను నేనే ప్రాణము, లర్పించెదను. దైవానుగ్రిహ మున్నయెడల మనమిప్పుడు చేయఁజాలని యీవీరకర్మ మీబాలుఁడు చేయఁగూడదా!” అని సభ్యులమనస్సులు నీరగునట్లు జాలిగదురఁబలికెను. ఆపలుకులు విని సభాసదులందఱు నైకకంఠ్యముగ “వలదు. వలదు. మీరొక్కరు పోవలదు. మనమందఱము గలసియేపోవుదము. ఇప్పుడే యుద్ధసన్నద్ధులమై వీరకంకణములఁ గట్టుకొని పసపుబట్టలుధరించి ఖడ్గపాణులమై మీవెంటవచ్చి చిత్తూరుపురరక్షణమునకు మాయసువులవిడిచెద” మని శౌర్యముట్టిపడ నుత్సాహవచనములఁ బలికిరి.

అంతట రాణా వారి కిట్లనియె. “సరే! మీరట్లేచేయవచ్చునుగాని మన యంతఃపురస్త్రీలు పాపమునకు వెనుదీయని పచ్చి తురకలపాలుగాకుండునట్టి యేర్పాటులు మనము సేయవలయును. పిమ్మట నిశ్చలమనస్కులమై పగతురఁ దాఁకవచ్చును.” అనుటయు నందఱు నది యవశ్యకర్తవ్య మని తత్ప్రియత్నములఁ జేయఁదొడఁగిరి. ఆకోటలో నాపత్కాలమున దాఁగొనుటకు నిడివియు సన్నదనమును గలనేలగదులు సొరంగములు గుహలుగొన్నికలవు. సేవకులా స్థలములలో గట్టెలతోఁ జితులం బేర్చి చమురుబిందెలనచట సిద్ధపఱిచిరి. అంతయు నాయత్త మగుటయు నంతఃపురకాంతాజనంబులు రాణి

మొదలు దాసివఱ కంఠఱుఁ బసపుబట్టలు గట్టి సమస్తభూషణము లు ధరించి పెండ్లికిఁ బోవు తెఱంగున సంతోషముతో నొకయుత్సవము జరిగినట్లు గుహలలోనికిం బోయి మల్లెపూ బాన్పుల నెక్కినట్లు చితులపై దుమికి శరీరము లగ్నిహోత్రున కాహుతులుచేసిరి. తనకారణమున మీవారు రాజ్యమున కంత దురవస్థసంభవించెనుగదా యనిచింతిలుచుఁ బద్మినీదేవియుఁ జక్కనకాంతలతోడ నిప్పులగుండమునొద్దకుఁ బోయి సాటిలేని తనచక్కనిమే నగ్నిహోత్రున కాహుతిఁ జేసెను. పిమ్మట మగవాండ్ర వంతు వచ్చినందున వారందఱు పసపుబట్టలను గట్టుకొని మృత్యుకన్యను వరించు పెండ్లికుమారునివలె సమరరంగమునకుఁ బయన మైరి. ఆజోదులను మొనగాఁడై నడిపింప నజేయసింగు సిద్ధ మయ్యె. కాని రాణా వాని నట్టిప్రయత్నమునుండి మరల్చి "నాతండ్రీ! నాకంఠమునఁ బ్రాణము లుండ నావంశ మంతమయ్యె ననుమాట నాచెవిని బడనీయక నీ వెందైనం జని నీప్రాణములం దక్కించుకొ"మ్మని శూరులగు రాజపుత్రులం గొందఱ సాయమిచ్చి కొడుకు నావలకుం బంపెను. అజేయసింగు జనకుని యదృష్టవశముననో రాజకుమారుల నందఱఁ దనపొట్టం బెట్టుకొన్న పురదేవతా ప్రసాదంబుననో శత్రువులకంటఁ బడకుండ నవ్వలకుం బోయి సురక్షితమగుపరిదేశమును జేరెను. కొందఱు నిరపాయముగ దాఁటె నను మాట వినినతోడనే రాణా కోటతలుపులం దీయించి సైన్యంబును బగతురపైఁ బుడికొల్పుటయు నాసేన దిగబారు సెలయేటిచందంబున వడివడి వచ్చి మ్లేచ్ఛసైన్యంబు దాఁకె. రాజపుత్రయోధులు నెత్తురుల్ద్రావ వచ్చుబెబ్బులులట్లు కదనరంగముఁ బ్రవేశించి వీరావేశముచే నొడలెఱుంగక నడచినచోటెల్ల పీనుఁగపెంటలు గావించుచు వేటాఱుతునియలుగఁ దురకల నఱకుచు వీరవిహారంబు సల్పిరి. రసపుత్రులకు శౌర్య మెంత యున్నను వారిసంఖ్య యనధిక మగుటచే

తను శౌర్యహీనులగు తురకలసంఖ్య మితి మీఱి యుండుటచేతను గొట్టకొనకు విజయము మ్లేచ్ఛులకే లభించెను. రాజపుత్రసేనలు పేరైన లేకుండ నశించినపిదపఁ జక్రవర్తి జయజయధ్వనులతోఁ గోటఁ బ్రవేశించెను.

అతఁడు ప్రవేశించి చూచునప్పటికి మహాలక్ష్మి విహరించు మందిరంబులు నిర్మానుష్యములై మృత్యుదేవత కొలువుఁ జేయు హజారములై యుండెను. పరిజనంబుల కోలాహలంబులఁ బ్రతిధ్వను లిచ్చు చదుకములు నిశ్శబ్దములై భయంకరములై యుండెను. వీధులు విపణితలంబులు గుళ్ళుగోపురములు మఠములు మందిరములు వెలవెలబారుచుఁ గఠినచిత్తులైనతురకలకుసైతము వెఱపు గొలుపఁ జొచ్చెను. చక్రివర్తి యిట్లు పాడుపడియున్న తావులు జూచుచు నంతఃపురమునకుఁ బోయి హృదయేశ్వరి యైనపద్మినికొఱకు వెదకు లాడి యామె నెందుం గానక తనలో "పురుషులందఱు యుద్ధమునం జచ్చిరి. సరే!ఇదియేమిచిత్రి మాఁడుది యొక్కతెయైనం గానఁబడదు. ఆడువాండ్రిందఱు నేమైరి చెప్పుమా?" యని విచారించుకొనుచు నలు దెసలు పరికించి చూడ నొకవైపుననుండి కమురుకంపుతోఁ గూడిన నల్లనిపొగ బయలుదేఱి వచ్చుచుండెను. దానింబట్టి శుద్ధాంతకాంతా జనంబులు చిచ్చుఱికి చచ్చియుందు రనియు వారితోఁ బద్మినియు నశించి యుండు ననియు నిశ్చయించుకొని యందఱిప్రాణములఁ దీసి నను తనమనోరథసిద్ధి గాకపోయెఁగదాయనిబిట్టువగచినిప్పులగుండము లున్నయానేలగదులం జూడఁగోరెను. అల్లాయుద్దీను సేవకులగుండెలు తీసినబంటులేయైనను వారిలో నతిధైర్యవంతులుసైత మానేలగదుల తలుపులం దెఱువ సాహసింపరైరి.

నాఁటికి నేఁటికి నాస్థలంబుల కెవ్వరుఁ బోవఁజాలరు. ఒకమా రొకమనుష్యుఁడుమాత్రి మాచీఁకటిసొరంగముల ద్వారముల దాఁటి

యావలకుం జని మరల నేదో భగవత్కటాక్షమునఁ బ్రాణములతో బయటికి రాఁగలిగెనని చెప్పుదురు. అచ్చటియగ్నిహోత్రము ఇారనివై యెడతెగక మండుచుండుననియు నాద్వారముముందర నొక పెనుత్రాఁచుబాము చుట్టలు చుట్టుకొని పండుకొని యెవరయిన నచ్చటికి వచ్చినప్పుడు నిప్పులు విసముం గ్రక్కుచు వచ్చెననియు జనులు కొంతకాలము చెప్పుకొనిరి.

రాజపుత్రులదిమొదలు రణరంగమున నెంతెంత శూరులనైన శత్రులనైన నెదుర్కొన సాహసించిరిగాని యీనేలఁగదులఁజూచుటకు జనవొల్లరైరి. మీవారు దేశస్థు లగు రాజపుత్రులీనాఁడును గొప్ప యొట్టు పెట్టుకొనవలసినప్పుడు "చిత్తూరు నాశనము చేసినట్లే" యను చుందురు. ఆనగరము మువ్మారు మహమ్మదీయులచేత ధ్వంసము చేయఁబడి యిష్టదేవతలవల్లఁ బరిత్యజింపఁబడి మీవారు రాజకుటుంబముచేత విడువఁబడి యున్నందున నిప్పుడు పూర్వవైభవము దొలంగి నామావశేషమై కథావశేషమై చూచువారలకు వినువారలకు దాని చరితము దుఃఖకారణ మగును.

---

## రాణాహమీరు.

అల్లాయుద్దీను చిత్తూరుపై దండెత్తకమునుపు రాణా లక్ష్మణ సింగుయొక్క పెద్దకుమారుఁడు హారసింగొకనాఁడండ్వాయడవికి సపరివారముగా వేటకుఁ జని గుహాలో నున్న యొక యడవిపందిని లేపి తఱుమఁగా నది దొరకక పఱచిపఱచి చివరకొకజొన్నచేనిలోఁ దూరి

దాఁగెను. రాజకుమారుఁడును వానిబంట్లును చేనిచుట్టుఁ గాఁచుకొని యుండి పంది నెవరయిన చేనిలోనుండి బయటకుఁ దఱిమిన బాగుం డునని తలంచిరి. ఆచేనిలోఁబిట్టలఁదోలుటకయి కట్టఁబడిన మంచెపై. మాసిన గుడ్డలు కట్టుకొని దృఢశరీరముతో నున్న యొక పడుచుకన్య తప్ప చూపుమేరదూరములో వారి కెవ్వరుఁ గనఁబడరైరి. వేఁట కాండ్రప్రయత్నముం జూచి యాబాలిక యీామృగమును మీావయి పునకుఁ దఱుముదునా యని రాజకుమారు నడిగెను. ఆమె యేమిచే యునో యాచమత్కారమును జూడవలె నని యతఁడు సరే యట్లు చేయుమనెను. వెంటనే యాయువిద జొన్నకఱ్ఱ నొకదానిని బెఱికి చివర పదునుగాఁ జెక్కి మంచెవైపునకుఁ బోయి యొక్కనిమిస ములో నాపందినిం బొడిచి చంపి రాజకుమారుఁడుఁ బరివారము నద్భుతపడునట్లు దాని కళేబరమును బర బర యీాడ్చి తెచ్చి వారి ముందుఁ బడవైచెను. రాజకుమారుఁడు వేఁటాడఁదలఁచిన జంతువును మఱియొకరు చంపినచో వారిప్రాణములు నిలుచుట యరిది. అయి నను హరసింగు మాత్రి మాపడుచుపై గోపపడక సాహసమునకు మెచ్చుకొనెను. ఆబాలిక మరలఁ బొలమునకుఁ బోగా వేఁటకాండ్రు దాఁపుననున్న చిన్న యేటియొడ్డునకుఁ బోయి యన్నముఁ దిని సల్లా పములాడుచుఁ గూర్చుండిరి. అంతలో నొక మట్టియుండ విసవిసవచ్చి రాజపుత్రునిగుఱ్ఱపుకాలికిఁ దగిలెను. గుఱ్ఱముకాలు కుంటుబడెను. అందఱును కోపవిస్మయములతో నలుదెసలఁ జూడ వెనుకటి బాలిక మంచెపై నిలుచుండి వడిసేలతో ఱివ్వున రాళ్ళు రువ్వుచు చేనిపై వ్రాలు పిట్టలం దోలుచు వారికన్నులకగపడెను. ఆమె తన కావిం చిన తప్పెఱింగి వడివడి రాజనందనునియొద్దకుఁ బఱతెంచి తన్ను క్షమింపు మని ప్రార్థించెను. అతఁడును బాలికపైఁ గోపింపక మంచి మాటలం బలికి యామెం బనిచెను.

 

ఆదినమున వేఁట ముగించి రాజపుత్రుఁడు పరివారసమేతుఁడై మందిరమున కరుగుచుండ నాబాలిక నెత్తిమీఁద పాలకుండతోను నిరుప్రక్కల మెడకు త్రాడుగట్టిన యొక్కొక్క మేఁకపిల్లతోను నడుచుచు వారివైపునకు వచ్చుచుండెను. ఆమెను జూచిన తోడనే యాపరివారములో నొకఁడు కొంటెతనమునకు నామె పాలకుండను జాఱవిడుచునో మేఁకపిల్లను వదలునో చూడ నభిలషించి యామెను బెదరఁగొట్టుటకై తనగుఱ్ఱమును నామె వైపునకు దుమికించెను. ఆబాలిక వాని టక్కరితనమును ముందే గ్రహించి జాగ్రతపడి యించుకయు జడియక చల్లగ నొక మేఁకపిల్లను గుఱ్ఱపుకాళ్ళ కడ్డముగ వదలెను. గుఱ్ఱము బెదరి త్తఱపడి యాశూరశిఖామణిని నేలఁ బడవైచెను. ఆపడుచు చెక్కుచెదరక పాలొకచుక్కయైనఁ గ్రొనగకుండ చేతిలోని త్రాళ్ళు వదలకుండ నేమియు నెఱుఁగనట్లుతన దారింబోయెను. రాజకుమారుఁ డీవినోదమును గనిపెట్టి చూచి బాలికను బిలిచి నీ వెవ్వరిదాన వని యడిగెను. “నేను చందన వంశజుఁ డగు నొకరాజపుత్రుని కుమార్తెను. మాయిల్లిక్కడకు సమీపమే” యని బదులుచెప్ప “రేపు మీతండ్రిని నాయొద్ద కొకసారి రమ్మని చెప్పు” మని పలికి యతఁడు త్వరితముగా నింటికిఁ బోయెను.

మఱునాఁడుదయమున నాబాలికతండ్రి రాజపుత్రునియొద్దకు వచ్చి తాను నిరుపేద యయ్యు నందఱు నాశ్చర్యపడునట్లు వానితో సమానముగఁ గూర్చుండి సమానునితో మాటాలాడునట్లుసంభాషించెను. అప్పుడు హారసింగు నీకూఁతును నా కిచ్చి పెండ్లిసేయు మని యడుగ నావృద్ధుఁడు తనకూఁతును రాజులకిచ్చు నుద్దేశము లే దని ఖండితముగఁ జెప్పెను. హారసింగు సజ్జనుఁ డగుటచే వానిఁ జెఱబెట్టించి యామెను బలవంతముగా గ్రహించుటకుఁ జెల్లుబడియుండియు

నట్టిపని చేయుట కిష్టపడఁ డయ్యె. కాని యాముసలివాఁడుగృహంబు నకుఁ బోయి తన్నామె మెచ్చుకొను నని తలఁచి జరిగినవృత్తాంత మంతయు భార్యకుఁ దెలుప నామె కోపించి యెంత తెలివిమాలిన పనిఁ జేసితిరి? సిరి రా మోఁకాలొడ్డుదురా? ఇప్పుడైనను రాజపుత్రునియొద్దకుఁ బోయి చేసిన తప్పుల క్షమింపు మని ప్రార్థించి కూఁతును వానికాళ్ళపైఁ బడవేయు మని మందలింప మఱునాఁ డతఁడు మరల చిత్తూరునకుఁ బోయి రాజనందనుని గాంచి తప్పు క్షమింపు మని ప్రార్థించి కూఁతును వానికిచ్చి వివాహము జేసెను. వారిరువురకుఁ గలిగినకొడుకే హమీరుసింగు.

చిత్తూరుపురరక్షణమునకు హరసింగు ప్రాణత్యాగము చేసిన నాఁటికి హమీరు మిక్కిలి బాలుఁడు. అజేయసింగును చిత్తూరుకోట నుండి దాటించి యావలకుఁ బంపునపుడు మీవారురాజ్యమునకుఁదన ముద్దులమనుమఁడైన హమీరును యువరాజుగఁ జేసి సింహాసన మెక్కింపు మని లక్ష్మణసింగు కడసారపు కోరికగ నజేయసింగును గోరెను. హమీరు తగి యున్నయెడల నట్లు చేయుదు నని యజేయసింగు వాగ్దానముఁ జేసెను. అల్లాయుద్దీనునకు వెఱచి చిత్తూరు నందలి స్త్రీలందఱుఁ జిచ్చుఱికి పురుషులందఱు శౌర్యము మెఱయ యుద్ధముచేసి మృతినొందిన యాదుర్దినమున హతశేషులై కొందఱు జను లజేయసింగుతోఁ గలిసి పా పోయి కొండలలో కెయిల్వారలో దాఁగి యుండిరి. అల్లాయుద్దీను దేశమంతయు దోచుకొని నాశనము చేయుచున్నను వీరుమాత్రము వానికిదొరకక సురక్షితులైయుండిరి. పద్మినీదేవి వసియించు మందిరము తప్ప చిత్తూరులో తక్కిన మేడల మిద్దెలన్నిఁటి నల్లాయుద్దీను పాడుచేసి తానుపోవునపు డానగరమునకు మాల్దేవను హిందువును పాలకుఁడుగా నేర్పఱచి మీవారుదేశము

నందలి యనేకపట్టణములనుగూడ నాశనముఁ జేసి మరల ఢిల్లీకిఁ జనియెను.

కెయిల్వారాలో హమీరు తనపినతండ్రికుమారులతోఁ గలిసి విలువిద్య నేర్చుకొను చుండెను. విలువిద్యనేర్చుటకచట కట్టి యడవులే కదా తగినచోటులు. ఆకుమారులు ముప్పదిరకాలములోనే పగతు దాఁకుటకు నెట్లో పొంచి వైరిం బడఁగొట్టుట యెట్లో పఱచుచున్న పగవానిని సిలుగులు బెట్టుటయెట్లో నేర్చిరి. అల్లాయుద్దీను దేశము నం దుంచి పోయిన సైనికులతోడను రాజ్యవిహీనుఁడై యడవుల జరియించు రాణాకు లొంగుట కిష్టములేక స్వేచ్ఛగా దిరుగు కొండ దొరలతోడను దోపుడుగాండ్రతోడను దుర్మార్గులతోడను పలు మారు వారు పోరాడుచు వచ్చిరి. అట్టివారిలో బరిభానుఁడు మూంజి జాతీయుఁ డగు నొకశూరుఁడు. ఆమూంజుఁడొకనాఁడు కెయిల్వారా మీఁదికి దండెత్తివచ్చి రాణా నెదిరించి వానిని తలపై బల్లెముతోఁ బొడిచెను.

అజేయసింగు గాయమున కంత లక్ష్యముఁ జేయలేదుగాని తీవ్రమైన యాపరాభవ కళంకమును మూఁజుని నెత్తుటితోఁ గడిగి వేయవలయునని నిశ్చయించి తనకొడుకులం బిలిచి మీరు నా కపకారము చేసిన మూంజునిపై జని పగఁ దీర్చుకొనఁగలరా యని యడుగ వారు వీరపురుషోచిత మైనయుత్తర మొసంగ లేకపోయిరి. అప్పు డతఁడు హమీరునకుఁ దనకోర్కె నెఱిఁగింప నాకు మారసిం హుఁడు పినతండ్రితో "నే నిదె పోవుచున్నాను నేను పగతుని జయిం తునేని నన్ను మీరు వేగమే చూడఁగలరు. అపజయ మొందుదునేని మీరు నన్నిఁక నెన్నఁడుఁ జూడ" రని ప్రతిజ్ఞఁజేసి వెడలెను.

అనంతరము కొన్ని దినములకు కెయిల్వారాజనులందఱు సంత సించునట్లు హమీరు విజయుఁడై వచ్చి పినతండ్రికి నమస్కరించి

‘దేవరవారి శతృనిశిరస్సిదిగో’ యని మూంజునితల వానిపాదముల పైఁ బడ వైచెను. అజేయసింగు సంతోషముననబాలుని గౌఁగిలించుకొని ‘నాయనా! నీవే మీవారు దేశమునకు రాజు వగుదు వని నీనొసటను వ్రాసియున్నది.’ అని మూంజుని నెత్తుటిలోఁ దనవ్రేలు ముంచి కుమారునిఫాలమున నెత్తుటిబొట్టు పెట్టి తత్క్షణమే వాని యువరాజుగఁ జేసెను.

అజేయుని కొడుకులవలన నించుకయు బాధ కలుగదయ్యె. పెద్ద యన నొకఁడు స్వల్పకాలముననే మృతినొందెను. రెండవవాఁడు రాజ్య సంపాదనమున కై దేశాంతరముల కరిగి మరల రాఁడయ్యె. కొండలు నడవులుఁ దప్ప మీవారు దేశమున మంచిభాగము లన్నియు నప్పుడు ఢిల్లీచక్రవర్తిస్వాధీనమున నున్నందున మీవారు రాణాగా నెవరున్న నొకటియే యనియెంచి రెండవయతఁ డట్లుచేసెను. తరువాత మూఁడువందల యేండ్లకు భాంస్లేకుటుంబమునఁ బుట్టి తురకరాజుల యేలుబడిచే సిలుగులఁ బడుచుండిన మహారాష్ట్రదేశంబునకు స్వాతంత్ర్యము కలుఁగ జేసి తురకరాజులకుఁ బక్కలో బల్లెమై ఢిల్లీపాదుషా యగు నౌరంగజేబునకు లోఁబడక వానిని బలుబాములఁ బెట్టిన దేశోపకారి యగుశివాజీ యీతనివంశస్థుఁడే.

అజేయునియనంతరమున హమీరు రాణాయయి ఢిల్లీచక్రవర్తి సైనికులతో క్రమక్రమమైన యుద్ధమును జేయుటకయి పూని తన్ను రాజుగా నంగీకరించి తనరక్షణ మపేక్షించినవారందఱు కుటుంబములతో వచ్చి కెయిల్వారాలో కాపుర ముండవలసిన దని యాన తిచ్చెను. అట్లు వారువచ్చి చేరినపిదప నారాజకుమారుఁడు వారిసాయమునఁ జక్రవర్తికిలోఁబడియున్నభూములలో దండువిడిసిదారులనరికట్టి మ్లేచ్ఛసైనికులకు గర్భనిర్భేదకముగ విహరించెను. అప్పుడు రాణా హమీరుపేరు సింహస్వప్నమువలె నుండుటచే తురకసైనికులు వాని

యెదుటఁబడలేక కోటలోడాఁగిరి. అతని నొకవేళ తలుముకొని పోఁదలంచిసను కొండదారుల నతఁడెఱిఁగినట్లు శత్రువు లెఱుఁగక పోవుటచేతను చుట్టుపట్ల ప్రజలందఱు వానియం దిష్టముగ నుండు టచేతను వైరులప్రయత్నములు నిష్ఫలములయ్యె.

అట్లతఁడు వీరవిహారంబు సలుపుచుండ చక్రవర్తిచేఁ జిత్తూరు పాలించుటకు నియమింపఁబడినమాలదేవు తనకుమార్తెను హమీరున కిచ్చి వివాహము చేయుటకయి వానిని రమ్మని వర్తమానమంపెను. అతనియనుచరు లేదో ద్రోహము జరుగునని పోవలదని ప్రార్థించిరి. కాని హమీరు వారిపలుకులు విని నవ్వి 'సాహసే లక్ష్మి' యనుమాట నెఱుఁగరా? ఎట్లయినఁ జిత్తూరు మరలఁ బట్టుకొనవలయు. నగరమేస్థితిలో నున్నదో తెలిసికొనుట కిదియే మంచిసమయము. కాన పోవక మాననని కొండఱుమిత్రులం గలిసి యశ్వారూఢుఁడయి యాకన్నియను జేపట్ట తనతాతతండ్రులు పాలించునగరమునకుఁజనియె.

మాలదేవుని మందిరసమీపమున కతఁడు పోయినతోడనే వాని మనస్సు శంకింప నారంభించెను. పట్టణమందుఁగాని రాచనగరు నందుఁగాని వివాహసంబంధమయినశోభయించుకయుగాన రాదయ్యె. వేయేల! పెండ్లిప్రయత్న మున్నట్లే తోఁచదయ్యె. ఆస్థితిని జూచి వానియనుచరులు తప్పక ద్రోహము జరుగు నని నిశ్చయించిరి. కాని హమీరు వారిని వారించి నిర్భయముగ నిశ్శంకముగ గుఱ్ఱము డిగి లోపలి హజారమునకుఁ జనియె. అక్కడ మాలదేవు బంధుగణ సమేతుఁడయి యెదురుగా వచ్చి పెండ్లికొడుకును గారవించెను. పెండ్లి కొడుకువా రనుకొన్నట్లు ద్రోహ మేదియుఁ గనఁబడదు. కాని యది పెండ్లివారియిల్లువలె నుండదయ్యె. అంతట మాలదేవు వధువునుం బిలిపించి యామె నప్పుడే యక్కడనే యొకబ్రాహ్మణునిచేత హమీరునకు వివాహము జేయించెను. పెండ్లికుమార్తె మేలిముసుంగు కొంగు

నకు పెండ్లికుమారునిశాలువ చెఱఁగు ముడివేసెడి తంత్రి మొకటి తప్ప మఱి యేతంత్రిముగాని మంత్రిముగాని కన్యాప్రదానముగాని ఫలప్రదానముకాని జరుగదయ్యె.

దంపతు లిరువురు రాత్రి గలిసికొన్నప్పుడు ప్రపంచమునందే పురుషునకును భార్యగ నుండఁదగని యేవికృతవిగ్రహముగల కురూపినో తనకుం గట్టిపెట్టి యుండరుగదా యని యనుమానించి హమీరు మునుముం దామె మేలిముసుఁగెత్తి మొగముంజూచెను. ఆముసుంగు మఱుంగున హమీరు నిరుపమానలావణ్యముఁగలిగి శాంతరసమొలుకు వదనారవిందమును గనుంగొనెను. కాని యామె యతిదుఃఖితయై చిన్నఁబోయి మగనిమొగముఁ జూచుటకె సిగ్గుపడుచున్న దానివలెఁ గనంబడియె. ఆ తెఱంగున నున్న భార్యను జూచి హమీరు "ఏమిది! మన కీవిధముగ నిర్మంత్రవిధిగా నిరుల్లాసముగా వివాహము జరుగఁ గారణ మేమి? నీవిట్లు బిట్టువగవనేల?" యని యడిగెను. అనవుడు నాపడఁతి మెల్లగ నాతని కిట్లనియె. "స్వామీ!దీనికారణమిది.మిమ్ము మావాండ్రు నిష్కారణముగా వంచించినారు. మీచెట్టబట్టినయీసేవకురాలు వితంతువుకాని కన్యగాదు. నేను పసిపాపనై యున్ననాఁడు మాతండ్రి నాకు వివాహముచేసె. పిదప కొన్నిదినములకే నాభర్త యుద్ధమున మృతుఁ డయ్యె. ఆయన మొగమైన నాకుజ్ఞాపకము లేదు." ఆపలుకులు విని హమీరు తాను నిశ్చయముగ వంచింపఁబడితినని యెఱింగి గాఢవిచారసంతప్తుఁడయ్యె. హిందూదేశమున వితంతువును వివాహ మాడునతఁడు మిక్కిలి నీచుఁడుగ నెంచఁబడుటచే నతఁడు శోకాకులచిత్తుఁడయ్యె. శుభకార్యములు జరుగునప్పు డెదుట నైనఁ బడఁగూడని వితంతువును పరువుగల సుక్షత్రియుఁడు పెండ్లియాడుటకన్న హైన్యమింక లోకంబున లేదని తలఁచి యతఁడునాఁటితో తనయభిమానము కులగౌరవము పెంపు నశించెనని బెంగపెట్టుకొని

యేదియుఁ దోఁచక పాన్పుపైఁ బవ్వళించి విచారింపఁజొచ్చె. ఆసమయమున నతఁడాబాలికను కోపావేశమున వధించిన నామె నోరెత్తక యుండియుండును. ఏలయన దుర్భరపరాభవముఁ దెచ్చునావివాహము నకు వరుఁ డెంత సిగ్గుపడుచుండెనో వధువు నంతియ సిగ్గుపడుచుండును. తనజోలికిరాక తన నేమియు నిందింపక తనలోఁ దాను దుస్సహముగు పరివేదన మందుచున్న రాజనందను జూచి యాబాలికయిట్లనియె. "స్వామీ! సేవకురాలను క్షమింపుఁడు. ఇందునా నేరమేడియు లేదు. మీకింత యవమానముగలిగించిన మీపగతుర పగదీర్చుకొను నుపాయము నేను జెప్పెదను. మీపితృపితామహార్జితమగు చిత్తూరు నగరమును మీరు మరల స్వాధీనముఁ జేసికొనవచ్చును." అప్పుడు రాణా శాంతము వహించి యామె చెప్పెడు నుపాయమేదియో వినఁ గోర నామె మరల నిట్లనియె. "మాతండ్రినిమీరు కట్నములుకాను కలు నగలు భూములు నడుగక తనమంత్రియైన జాలుఁడనువాని నర ణముగ నిమ్మని యడుగుఁడు. అతఁడు మీకోరికఁ దీర్చిపుచ్చుఁడు. జాలుఁడు మన కార్యము నవలీలగా సాధించును". అనవుడు హమీరామెయుపాయమునకు సంతసించి విచారమునువిడిచి వితంతువైనను దనభార్య జాణతనమును శౌర్యమును గలిగి రాణిగా నుండఁదగినదని నిశ్చయించి మరునాఁ డుదయమున మామయగు మాలదేవునొద్దకు బోయి కోపమును విషాదమును లేకయే మంత్రియగు జాలుని దమకు నరణముగ నిమ్మని యడిగి సెలవు పుచ్చుకొని భార్యతోడను క్రొత్త మంత్రితోడను కైలువారాపట్టణముం జేరెను.

అనంతర మొకసంవత్సరమునకు రాణాకీభార్యవలననొకకుమారుఁ డుదయించెను. రాణాయు రాణియు జాలుఁడును గలిసి యెవ్వియో పన్నుగడలం బన్నుచు దినములు గడపుచుండిరి. ఇట్లుండ పెండ్లియయిన రెండేండ్లతరువాత చిత్తూరున క్షొకయాచారి వచ్చి హమీరు

సింగుభార్య తనచిన్నకుమారుని నెత్తుకొని వచ్చి కులదేవతలకు మ్రొ క్కించి పోవలయునని కోరుచున్నదని చెప్పెను. అప్పుడు మాలదేవు యుద్ధయాత్ర వెడలి పరదేశమున నుండెను. అతని జ్యేష్ఠకుమారుఁడు తన తోఁబుట్టువు రాక కనుమతించి యామె వచ్చినప్పుడు సగౌరవ ముగా నామె నంతఃపురమునఁ బ్రవేశపెట్టెను. ఆరాణయు మెఱియుఁ వంటి సైనికులతోడను మంత్రియగు జాలునితోడను కోటలోఁ బ్రవే శించి మాయోపాయము లెన్నియో కడు నేర్పునంబన్ని ప్రార్థింపఁ దగినవారిఁ బ్రార్థించి, లంచములు కావలసినవారికి లంచము లిచ్చి బెదరింపఁ దగినవారిని బెదరించి, పొగడ్తలకుబ్బువారిని పొగడి తండ్రి సైనికులనెల్ల వశముచేసికొని తనభర్తను రావించి వాని ననాయా సముగ లోపలఁ బ్రవేశపెట్టించి బంగారపు సూర్యబింబముగల రాణా హమీారుయొక్క ధ్వజము కోటబురుజుపై నెత్తించెను. పిమ్మటఁ గొన్నిదినములకు మాల్దేవు యుద్ధమునుండి రాఁగా కూఁతురు నల్లుఁ డును వానిఁగోటఁ జేరనియ్యక తమ రది యాక్రమించినట్లు తెలియఁ జేయుట కయి ఫిరంగిగుండ్లఁ బ్రయోగించిరి. రాణా తన రాజధానిని మరల నాక్రమించెనన మీావారు దేశమునం దంతట జనులు చెప్పు కొనసాగిరి.

అందుచేఁ బ్రజానురాగముగల వానిసేనలో వేనవేలు చేర సైన్యము ప్రబలమయ్యెను. ఆసేనం గూర్చుకొనియతఁడుశత్రుసంహా రముర కయి సమకట్ట నొకనివెనుక నొకరుగ రాజులెల్లరు లోఁబడిరి. మాలదేవునితనయులలో నొకఁడు హమీారు పేర్రణమున వధియింపఁ బడియె. రెండవవాఁడు వానికి లోఁబడి సేనాపతియై కొంత దేశమును జయించి యతని కప్పగించెను. చిత్తూరునందున్న చక్రవర్తి సైని కులు రాణాయెదుట నిలువఁ జాలరైరి. స్వదేశపురాజు లదివఱకే వానికి లోఁబడి యుండిరి. చిత్తూరునగరమునకు మీావారు దేశమునకు

మరల యెప్పటి మహోన్నతదశ వచ్చెను. ఈనడుమ నల్లాయుద్దీను చక్రవర్తి మృతినొందుటచే ఢిల్లీ రాజ్య మనేకసంక్షోభములకు లోనయి తనయవస్థలలోఁ దా నుండుటచే స్వతంత్రించిన విదేశములవంక జూడలేకపోయెను. అందుచే మీవారు రాజ్యము హమీరు పాలనము క్రింద వృద్ధిఁ జెంది కడు బలపడియెను.

హమీరు చిత్తూరుసింహాసనమున సుప్రతిష్ఠితుఁ డయిన పిదప తురకలు తొల్లి చేసినచెఱుపంతయుఁ జూచి దుఃఖించి మరల బాగు చేయఁబూనెను. అలాయుద్దీను తాను గొనిపోయినంత గొనిపోయి తీసికొనిపోలేని దానిని బాడుచేసి రాణాలధనాగారమునందలి ధనమంతయుఁ గొల్లఁగొనెను. హమీరు చేయిదాఁటిపోయినయమూల్యాభరణములకు ధనమునకు నంతగా విచారింపలేదుగాని కోటలోనడుగు పెట్టినది మొదలు పూర్వార్జితమగు నొకవస్తువునకై చింతిల్లఁ జొచ్చెను. అదియేదియన మున్ను జగన్మాతయగు భవాని వంశకర్త యగుబప్పరావునకుఁ బ్రసాదించినదియు విశ్వకర్మ నిర్మితమైనదియు రెండంచుల వాఁడిగలదియు నగు మహాఖడ్గము. అదియెచ్చటనున్నదో యెవ్వరెఱుఁగకున్నను లోకమాత యాఖడ్గము మాత్రము గోహింసకులపాలు సేయ దని యతఁడు నమ్మెను. అది చిత్తూరిముట్టడిలో నెట్లో యదృశ్యమయ్యె ననియుఁ బద్మినివలెనే నదియు శాశ్వతముగా నశించెననియు జనులు చెప్పుకొనిరి. అయినను తనయం దనుగ్రహించి తనకు మరల రాజ్యమునొసంగిన దేవత లాఖడ్గముమరలనియ్యకపో రనినమ్మి సకలదేవతలను ముఖ్యముగా నగరసమీపమున వ్యాఘ్రగిరి మీఁద వెలసిన చారుణీదేవిని నతఁడు మిక్కిలి ప్రార్థించెను. అంతట చారుణీదేవి వానికిఁ బ్రత్యక్షమై యాఖడ్గ మంతఃపురమున కడుగున నున్న నేలకొట్లలో నున్నది. తీసుకొమ్మని చెప్పెను.

చిత్తూరు రాజపత్నులు రాజపుత్రికలు చిచ్చుటికి వచ్చిననాఁ

డు మొద లింతవఱకు మనుష్యమాత్రుఁ డెవ్వఁడు సాహసించి యాసా రంగములఁ బ్రవేశింపలేదు. చచ్చినవారియాత్మ లచ్చటఁ గుమ్మరు ననియు ద్వారమున నొకమహాసర్పము బుసకొట్టుచు నిలిచి యెవ్వని దరిజేరనీయదనియు ప్రజలు భయంకరము లగుకథలు జెప్పుకొనుచు వచ్చిరి. కాని నూనూగుమీసములయిన రాకమనుపేహమీరు మహా సాహసములుచేసినశూరుఁ డగుటచే నీమాటలకువెఱువక దయ్య ములుండనీ దేవతలుండనీ పాములుండనీ యేముండనీ లోపలకుఁబో యి ఖడ్గమును దెచ్చుకొనుట కతఁడు నిశ్చయించెను.

అట్లు కృతనిశ్చయుఁడై యాశూరశిఖామణి సూర్యరశ్మి యె న్నఁడెఱుఁగని యామహాంధకార గుహలలోఁ బ్రవేశించి మెఱక పల్లము లెఱుఁగక చేతితో గోడలఁ దడుముకొనుచు తనమీఁద మం దలుమందలుగావ్రాలుచున్నవి గబ్బిలములో దయ్యములో యెఱుఁగ జాలక తానుత్రొక్కిపోవుచున్నవి తనతల్లియెముకలో తక్కిన రా జాంగనల యెముకలో యని తలంచుకొని జాలినొందుచుపోయిపోయి తుదకు విశాల మగునొకమహాభాగము ప్రవేశించి యచ్చట నొక వెల్తురు జిమ్ము మంటయు పొగయుఁజూచి దాని సమీపించెను. సమీ పించి చూచునప్పటి కామంటచుట్టు సగము సర్ప దేహము సగము మనుష్య దేహము గలిగి వికృత వేషములతో నున్నకొన్ని స్త్రీవిగ్ర హములఁ జూచెను. అందొకటి పండ్లికిలించుచు నీవెవ్వఁడవు? ఇక్క డ, నీకేమిపనియున్నది. మాయుత్సవమున కేల భంగముకావించెదవని వాని నడిగెను. అతఁడును నిప్పుపైనున్న యొక డేగిసాచుట్టు గూర్చు న్న యాదయ్యములయొద్దకుఁబోయి మీపండుగ నేఁ జెఱుపరాలేదు. విశ్వకర్మనిర్మిత మగునాఖడ్గము నాకిచ్చిన నాదారిని నేఁబోయెద నని చెప్పెను. ఆపొగనడుమనుండి చూడచూడ తలలు విరియబోసి కొనియున్నయాదయ్యముల కొకిబికిమొగములు మఱింతభయంకర

ములై వికృతములై కానంబడియె. అప్పుడవి యతనితో మాటలాడక డేగిసామూతి తీయుమనిసన్నచేయ సతఁడు వెఱువక యట్లుచేసి లో నున్నదానిం జూచెను. అతఁ డేమిచూచెనో యెవ్వ రెఱుఁగరు. అం దొక చింపిరిదయ్యము వికవికనవ్వి డేగిసాలో నునుకుచున్నపదార్థ ము కొంతతీసి యొకమూఁకుడులోఁబెట్టి తిను మనివాని కిచ్చెను. అతఁ డును సందేహింపక మాఱుమాటాడక యిచ్చినదానిని భక్షించెను

అప్పు డవి వానిని మెచ్చి యొకమూలనుండి రెండంచులఖడ్గ ము దెచ్చి వాని కిచ్చిపంపెను. హమీరుఁను కృతకృత్యుఁడై యెప్ప టియట్లంధకారబంధుర మగు గుహను జాగరూకతతో దాఁటి బయట బడి విశ్వకర్మనిర్మిత మగుఖడ్గమును చేతధరించి తనవారి కన్నులకు విందుచేసి యాఖడ్గముతో శత్రువులఁ దెగటార్చి మీవారు రాజ్యము. చిరకాలము పాలించెను.

---

## చండుని కథ

పదునాల్గవ శతాబ్దముయొక్క యంతమునందు మీవారుదేశ మునకు లఘుఁడనునతఁడు రాజయ్యెను. అతఁడు తనకుఁ బూర్వులైన హమీరు హమీరునికుమారుఁడు నడచినదారిని నడచి తొల్లిమీవా రురాజులు దుర్బలురయినకాలమున వారియొద్దనుండి ఢిల్లీచక్రవర్తి యుఁ దక్కినరాజపుత్రులు నన్యాయముగఁ దీసికొనిన దేశములను మరల గ్రహించి దిట్టరియయ్యెను. అంతియగాక యతఁడు పెదనా

రనుపట్టణము గట్టించెను.పూర్వ లెఖ్ఖఁగని తగరపుగనులను వెండిగను లను గనుఁగొని త్రివ్వించెను. అతని కిద్దఱుకుమారు లుండిరి.

అందు జ్యేష్ఠుఁడగుచండుఁడు శూరుఁడు. గౌరవనీయుఁడునై ప్రతిజ్ఞలు నిలుపుకొనుటలో నతి నిష్ఠురుఁడై విద్యావంతుఁడై బుద్ధి శాలియై యుండెను. కనిష్ఠుఁడగురఘు దేవుఁడు చక్కదనమునకు శాంతస్వభావమునకును బేరుపొంది ప్రజానురాగమును బడసియుండెను. ఒకనాఁడు రాణాయగు లఘుమహారాజు కొలువై యుండఁగా నొక రాయబారి వచ్చి వానిపాదములపై నొకకొబ్బరికాయను బడవైచెను. రాజస్థానమునందుఁ దమకూఁతు నెవరికైన వివాహార్థమయి య ర్పింపఁ దలంచినవారు పెండ్లికొడుకు వారియొద్దకొక టెంకాయను బంపు టాకాలమునం దాచారము. మార్వారుదేశపు రాజగు రణమల్లు తనకూఁతు రగుహంస యనునామెను చండునకు వివాహముసేయ దలఁచినాఁ డని చెప్పవచ్చి యారాయబారి ముందుగ దేశాచారము నడపెను. కాయ తనకాళ్ళపైఁ బడవేయుటచే నారాజు తనకే కూఁతురు నీయఁదలంచుకొన్నాఁ డనుకొని యారాణా పక్కునన్వి మీసము వడివేయుచు రాయబారితో నిట్లనియె.

“ఆకాయతీసికొని నాకుమారుఁడగు చండునకిమ్ము. తలయంత యు నెఱసిన నేనేమి! పడుచుకన్యను వివాహమాడుట యేమి? ఎవ్వరైన నవ్వరా?”

అనంతర మారాయబారి చండున కావార్త విన్నవించినప్పుడు తండ్రి మోటుతనంబు చేసినాఁడనుకొని కోపలజ్జాభరితుఁడై “ఏమీ తండ్రికి ధర్మపత్నిగా నుద్దేశింపఁబడినకన్యను నేను వివాహమాడుదునా? వారు నానిమిత్తమే కన్యనుద్దేశించి రేని టెంకాయ మొదట నామీఁదనే బడవేయరా! కావుత తత్ప్రశంశ నాయొద్దతలపెట్టక కాయ మఱల మార్వారు దేశమునకుఁ బంపఁదగు”నని స్వభావసిద్ధ మగు ధై

ర్యముతోఁబలికెను. అప్పుడు రాణా కొడుకునుం బిలిపించి "నాయనా! నామాటవినుము. మనము మిత్రుఁడైన మార్వారురాజును మన మవమానింపవచ్చునా? రాజపుత్రులు పరాభవమును సహింతురా ఈ యక్కసు మనసునం బెట్టుకొని వారు మనపైఁబగదీర్చుకొనఁజూడరా? బాహుబలసంపన్నులగు నతనికొడుకు లూరకుందురా!" యని మందలింప చండు డామాటలు విని "నాకంతయుఁ దెలియదు. జగము తలక్రిందైనను సరే! ఆమెనాకు తల్లిగాని వేఱుగాదు. ఆమాటలు తలఁచుకొనుట మహాపాపము.నన్నుకదపవ" ద్దని తండ్రికి చెప్పెను. అప్పుడు రాణా మండిపడి తనయునితోఁ నిట్లనియెను. నీవింతమూర్ఖుఁడవేని నేనేయాకన్యను వివాహమాడెదనులే. కాని యీసంగతి జ్ఞాపకముంచుకొనుము. ఆమెవలననాకుఁగలిగినకుమారుఁడే రాజ్యప్రతిష్ఠుఁడగును.

తండ్రికోపోద్దీపితుఁడయినను జంకక చండుఁడు సరే! మీయిష్టమువచ్చిన తెఱఁగునఁ జేసికొనవచ్చును. హంసాదేవికుదయించిననందనులలో నెవనికి రాజ్యమిచ్చినను నాకు సమ్మతమే. ఆమెను వివాహమాడి యధర్మకార్యముచేయుటకంటె రాజ్యమువదలుకొనుటయే యుచిత" మని ప్రత్యుత్తర మిచ్చెను.

అనంతరము రాణా హంసాదేవిని వివాహమాడుట కంగీకరించి మార్వారునుండి యామెను చిత్తూరునకు రప్పించి యచ్చటనే యథావిధిగఁ బెండ్లియాడెను. కొన్ని దినముల కాదంపతులకు ముకుళుఁడను కుమారుఁడు కలిగెను. ముకుళుఁడు పసితనమున నున్నపుడే లఘు మహారాజు వానిని విడిచిపోవలసి వచ్చెను. హిందువుల పుణ్యక్షేత్ర మగు గయను మహమ్మదీయులు పట్టుకొని నాశనము చేయఁబోవుదురని యారాణా విని తాను కత్తిగట్టి వారితోఁ బోరవలయు నని నిశ్చయించుకొని తురకలబారికిం దప్పి మరల తాను యాలుబిడ్డలను బ్రజలను దేశమును జూడ వీలగునోలేదో యని సందేహించి చండు

నిం బిలిపించి తన పయన మెఱిగించి బాలుఁడగు ముకుళునకు రాజ్యములో నెంతభాగ మిచ్చిన బాగుండు నని యడిగెను. చేసిన ప్రతిజ్ఞల నసిధారావ్రతముగ నడపునట్టి చంద్రుఁడు తండ్రి కిట్లనియె. "ముకుళుఁడు మీవారు దేశమునకు రాజగుఁగాక! అతఁడు గద్దె యెక్కినతోడనే నేను వానికి విధేయుఁడనై ప్రియభృత్యులలో మొదటివాఁడనై యుందును" తండ్రిచేసిన ప్రశ్నల నిలిపి తానాడినమాటఁ దప్పక నడుచు కుమారుని జూచి రాణా మహానంద భరితుఁడై నిర్విచారముగ గయకుఁ బోయి రణరంగమున నిలిచి మహమ్మదీయులతోఁ బోరి లెక్కకు మీఱినవారి సేనలం గెలువలేక తుదకు మతము నిమిత్తమై ప్రాణములు విసర్జించి వీరస్వర్గ మలంకరించెను.

రాణా పరలోకగతుఁ డైనవార్త మీవారిలోఁ దెలిసిన తోడనే చంద్రుఁడు ముకుళుని రాజుగా నభిషేకించివానికిం బదులుగఁ దాను రాజ్యము సేయఁబూని తమ్మునిసింహాసనమున కీవల తనపీఠము వేయించుకొని సకలవ్యవహారములయందు రాజునకుం దోడ్పడుచు విధేయుఁడై యుండి జనానురాగము గలుగునట్లు చక్కఁగఁ బ్రజాపాలనము చేయుచుండెను. చంద్రునియం దందఱ కిష్టము నుండెను. కాని యేకారణముచేతనో హంసాదేవికిమాత్రమిష్టము లేకపోయెను. అతనియెడఁ గ్రమక్రమముగఁ బ్రజానురాగ మతిశయించుటచే హంస యోర్వలేనిదై భయమంది తనలో "నీవేళ చంద్రుఁ డల్పుఁడై నా కుమారునకు భృత్యుఁడై నను ముందుముందు నాకుమారునే యితఁడు భృత్యునిఁ జేయఁ గలఁడు. ఈ యొదిగియుండుట యెల్ల రాజ్యసంపాదనమునకై చేసెడు నటనగాని నిజము కాదు. ఇప్పుడు పేరునకు రాజైన యితఁడు ముందుముందునిజముగా రాజే యగు" నని తల పోయఁ జొచ్చెను. ఈతలంపు లామె లో నడిగియుండక క్రమక్రమంబున వెలికి వచ్చుటం జేసి చంద్రునకుఁ దెలిసెను, దైన్యముఖముఁజూచి

తాను సత్యముగా నడచుకొనుచున్నను దనయం దామెకట్టి యను మానము గలిగినందుకు విచారించి యిఁక నెన్ని చెప్పిన నామె తన్ను నమ్మదని నిశ్చయించి తన యధికార మంతయు వదలుకొని సవతి తల్లియొద్ద సెలవు పుచ్చుకొని చండుఁడు చిత్తూరునగరముఁ బాసి తనకు నమ్మిన బంటులై తన్నెడబాయఁజాలని రెండునందలమందిని వేఁటగాండ్రను వెంటబెట్టుకొని దూర దేశములకుం బోయెను.

చండుఁడు పోయినతోడనే హంసాదేవి హృదయశల్యమును బాసినట్లు సంతసించి మారువారినుండి తన చుట్టములం బక్కములం బిలిపించె. వాండ్రును గొడ్డునేలలుగల మారువారును విడిచి రత్నగర్భయగు చిత్తూరునకుఁ బోవుటకు మహానందభరితు లయిరి. ఆమె తండ్రియగు రణమల్లు చిత్తూరునకు వచ్చి యాపట్టణము సర్వసంపన్న ముగా నుండుటచే దానిం బాయఁదలఁపడయ్యె. రాణీసోదరులు దమతమ కుటుంబములతో వచ్చి చిత్తూరున గాఁపుర ముండి కాల క్రమమున నధికారమంతయు వహించిరి. వారిమాటయే యాదేశ మున శాసన మయ్యెను. వారియాజ్ఞ నిరంకుశ మయ్యెను. వేయేల? వారే రాజులైరి. తరములనుండి మావారు సంస్థానము గనిపెట్టుకొని యున్న యుద్యోగస్థు లందఱు మెల్లమెల్లఁ దప్పుకొనవలసివచ్చె. ప్రజలు సేవకులు జరుగుచున్న దుర్ణయములఁజూచి తమలో తాము సణుగుకొనుచుఁ గోఁటిచూపులఁ జూచుటయె కాని నోరెత్తి పలుకరైరి. ముక్కుపచ్చలారని యొక రాచకుఱ్ఱని నిమిత్తము చండశాసనులగు రాణిబంధుగుల నెదిర్చి యెప్పుఁడు ధనమును బ్రాణమును బోఁగొట్టుకొనఁ గలఁడు? పౌరుషశాలులగు ప్రజ లీతెఱంగున నసహాయులై యుండఁగా నంతిపురమందలి యొకయాఁడుది యీ దౌర్జన్యము సహింపక తెగువఁ జేసెను. అది ముకుళునకుఁ బాలిచ్చి పెంచిన దాది రాజస్థానమునందు దాదులు తమప్రాణములనేని ధారవోసి 'రాజ

కుమారుల రక్షించినకథ లనేకములు గలవు ముకుళుని దాదియు నట్టిదియె.

ఒకనాఁడు రణమల్లుఁడు కొలువుకూటములో రాణాకూరుచుం డెడి సింహాసనముపైఁగూర్చుండితనమనుమనిఁ దనకాళ్ళవద్దఁగూర్చుం డఁబెట్టుకొని యాడించుచుండె. అంతలో బాలుఁడు మెల్లమెల్లగ దిగ జారి నేల గంతులు వేయసాగెను. అప్పుడేనియు రణమల్లు గద్దె దిగక తీవితో గూర్చునియుండుటంజేసి సభవారికిని సభవారికంటె నెక్కు డుదాదికిని మనసు మండెను. తోడనే దాది పట్టరాని బిట్టలుకతో నంతిపురిఁ బ్రవేశించి రాణియొద్దకుఁబోయి నిలిచి జరుగుచున్న దౌ ర్జన్యమును విన్నవించి యెక్కడనుండియో పొట్టకూటికిఁ జేరిన లాతి వారు రాజకుమారునిఁ దృణీకరించి గద్దెయెక్కి కూర్చుండియుండఁగా సహించియూరకొనుట యుచితముగాదని నొక్కిచెప్పెను. రాణి తన తప్పుఁ దెలిసికొని యారాత్రియే తనతండ్రిని జీవాట్లుపెట్టెను. వృద్ధుఁ డగురణమల్లుఁడు పనికిమాలిన యాఁడుదానిపలుకులకు జంకగూడద నినిశ్చయించుకొనియెదు రామెపైఁగోపపడి “నేనునాకొడుకులుచేసెడు పనులకొప్పుకొని నీవు నోరుమూసికొని పడియుండుము. లేనిచో నీ కుమారుని సింహాసనమునకేగాక ప్రాణములకుఁ గూడ నపాయము రాఁగల”దని ప్రత్యుత్తర మిచ్చెను. ఆపలుకు విని రాణి తనకును దన కుమారునకును నేమి కీడుమూడునో యని భయపడఁ జొచ్చెను.

ఆమె భయము మఱింత యధికమగునట్టులు రాణాయొక్క రెండవకుమారుఁ డగురఘుదేవుఁడు తనతండ్రిసేవకులచేతనే వధింపఁ బడెనని యొక్కఘోరవార్త యామెకుం దెలిసెను. అతఁడు మిక్కిలి యోగ్యుఁడగుటచే రాణియె గాక రాజస్థానమందలి జను లంద ఱాబాలగోపాలము వాని యకాలదుర్మరణమునకు విచారించిరి. అతని యందలి భక్తిశ్రద్ధలను సూచించుటకె మావారు దేశస్త్రీలు వాని

ప్రతిమను దమయిండ్లనిలుపుకొని దానికి మొక్కి పూజించుచు నే
టేట నుత్సవములఁ జేయుచువచ్చిరి. సజ్జనుఁడగు రఘుదేవుని గడ తే
ర్చిన రణమల్లుని బంటులే తన కుమారునిఁగూడ దెగటార్తురని రాణి
మిక్కిలి భయమునందుచు వచ్చెను. అట్టులుండ మీవారు రాజకుటుం
బములోఁ బుట్టి రాణికిం జెలికత్తెయగునొక జవరాలును జూచి రణ
మల్లుఁడు తన కామెనిచ్చి పెండ్లిచేయు మని కూఁతురును బలంతపెట్టి
దాసినో వెలయాలినో తీసికొనిపోయినట్లు దానిం జేకొనెను. దినదిన
ము నధికమగుచున్న తండ్రిదుండగముల సహింపలేక రాణి యెట్టకే
లకు దిటము తెచ్చుకొని యాసమయమునఁ దనయక్కఱ గడపఁగల
శూరుఁడు చండుఁడేయనినిశ్చయించి సత్వరము వచ్చితనను,దనకుమా
రుని రాజ్యమును రక్షింపుమని వానికి వర్తమాన మంపెను.

ఇది జరిగిన కొన్నిదినములకు వెనుక చండునివెంటఁ బోయిన
వేఁటకాండ్రు కొందఱు మఱలఁ జిత్తూరునకు వచ్చిరి. ఏల వచ్చిరని
వారిని కొందఱడుగఁగాఁ దాము చండునితో నొంటరిగఁ జిరకాల
ముండలేక విసిఁగి యాలుబిడ్డలఁ జూడవచ్చితిమని వారుచెప్పిరి. వారి
నెవ్వరు ననుమానింపక కోటఁ జొరనిచ్చి యెప్పటియట్ల పనులఁ జే
యనిచ్చిరి. ఆసేవకులు వచ్చినదిమొదలు రాణి మిక్కిలి దైవభక్తిగల
దై దేవతలకు నుత్సవములు జాతరలు చేయించుచు చుట్టుపక్కల
నున్న పల్లెలజనంబులకు నిరతాన్నదానపరిదానముఁ జేయింపసాగెను.
ఆయుత్సవములుజూచుటకు బాలుఁడగు రాణా తనదాదియుఁ బురోహి
తుఁడును వెంటఁరాఁగుఱ్ఱమునెక్కి తఱుచుగఁబోవసాగెను. ఈకార్యము
గర్వితులగు వానిమేనమామల కనుమానము గలిగింపదయ్యె. నల్ల
మందుముద్దలు మింగుటచే మతిలేకయో పడుచుపెండ్లాము వలపులఁ
దగులుటచే నొడలెఱుగకయో వానితాత యావిషయము దలపెట్ట
డయ్యె. ఇట్లు దినములు జరుగుచుండఁ జిత్తూరున కేడుమైళ్ళదూర

మున దక్షిణముగానున్న గోసుంద యనుగ్రామమున దీపావళిపండుగ నాఁడు రాణి హంసాదేవి లక్ష్మిపూజ చేయించి గొప్పయుత్సవము గావించి దానింజూచుట కెప్పటియట్ల తనకుమారుని బంపెను. రాచ నగరును నిరుపేదవాని గుడిసెయు దీపములతో వెలుఁగుచున్న యా మహానందసమయమునచిన్నరాణాయొక్క సేవకులుకొందఱుమిక్కిలి హృదయసంతాప మొంది యేమియుం దోఁచక చిత్తాకుప్రరపాంత మున మొగములు వ్రేలవైచి నిట్టట్టు దిరుగుచుండిరి.

"ఏమి చెప్పుమా యతఁడు రాకపోవుటకుఁగారణము ! అతఁడు చెప్పినట్లు రాణాను గ్రామములవెంటఁ ద్రిప్పితిమి. దీపావళిపండుగ నాఁడు గోసుంద్రిగ్రామమున నతఁడు సెలవిచ్చినట్లుత్సవముఁజేసితిమి ఈరాత్రి వత్తునని యతఁడు ప్రమాణము చేసెనే! ఏలరాకపోవలెను? ఆమాట మఱచియుండెనా? లేక శత్రువులచే నిరోధింపఁబడెనా? చంద్రుఁడు రానిపక్షమున మావారుగతి యింతే".

అని తలపోయుచు నాబంటులు చిన్నరాణాను వెంటఁబెట్టుకొని తూర్పుద్వారమునొద్ద పూర్వమాలాయుద్దీను వేయించిన దిబ్బఁ జేరు నప్పటికి వారిచెవులకు గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినఁబడెను. అది యే మగునని నిలిచిచూడ నలువదిమంది యాయుధపాణు లగుజోదులు వచ్చుచుండిరి. అందు మొదగాఁడు మాసినగుడ్డలు నసమానమైన యాయుధములు ధరించివచ్చి యొకసంజ్ఞఁజేసి తనరాక రాణా కెఱిఁ గించెను. ఎవ రావచ్చుచున్నదని కోటకావలివాండ్రు వానిం బలుకఁ రించిరి. మేముత్సవముఁ జూచుటకు గోసుందకు రాఁగా రాణావారిం గొలిచి వెంటఁబోవలసినదని రాణిసెలవగుటచే వచ్చితిమనివారుత్తర మిచ్చిరి. ఆకావలివాండ్రకు దృష్టిపఱచి యతఁ డనేకద్వారములు గడచి తుట్టతుదకు రామద్వారము పేరుగల లోపలిగుమ్మమునొద్దకు బోఁగా నక్కడివాండ్రు వాని నడఁగించి వానివెనుక నింక నొకపెద్ద

సేన వచ్చుటం జేసియు లోపలకుఁ జొరనీయరైరి. అప్పు డుపాయము లతో బనులుసాగవని యొరలోనుండికత్తినూడఁబెఱికి ద్వారరక్షకుల శిరంబుల కొబ్బరిపుచ్చెల ట్లెగర నఱకె. వెంటనే తొల్లిఁటి వేఁటకాండ్రిందఱు వానికి సాయమై నిలిచిరి. చండుఁడు వచ్చెవచ్చెనని కోట యంతయుఁ బ్రతిధ్వను లెగయునట్లు కేకలువెడలెను. రాణిసోదరులు నిశ్చేష్టులై యూరకుండిరి. చండుఁడు నిరపాయముగ సైన్యసమేతుఁడై కోటలోఁ బ్రవేశించె.

చండున కందఱుఁ గనఁబడిరి; కాని ముసలిరాజు గనఁబడ డయ్యె. అతఁడు నల్లమందు మ్రింగి యామత్తుచే స్పృహదప్ప నొక మూలగదిలో గడ్డిపఱుపు వేసిన మంచముపైఁ బండుకొనెను ఆభర్త చెంత రాణి చెలికత్తెయగు రాజపుత్రాంగననిలువంబడియుండె. ఆమె కెవ్వరైన సన్నచేసిరో లేక యానలజడుగు కోలాహలము చేతనో యామె వాని తలపాగ నూడఁదీసి వానిమేనిచుట్టుం ద్రిప్పి గట్టిగా మంచమునకు బిగించికట్టి తా నవ్వలకు దాఁటెను. చండునిబంట్ల సింహనాదములు చచ్చెడువారి యార్తధ్వనులు కత్తులరాపిడి చప్పుడులు నగరమంతయు వినఁబడుచున్నను నల్లమందు తాతకు మెలకువ గలిగింపఁ జాలవయ్యె. ఎట్టకేల కతఁడు మెలకువఁ దెచ్చుకొని యము కింకరులవలె నెదుట నిలిచిన శత్రువుల మొగములఁ జూచె. అప్పుడు వచ్చియు రాని తెలివితో నాతఁడు కట్టువడిన సంగతి యెఱుఁగక లేవ నుంకించి లేవఁజాలక క్రొత్తపెండ్లాము చేసినమోస మెఱిఁగి చింతించి హుమ్మని మంచము పాళమున లేచి యాయుధముకొఱకు వెదకుకొనుచుండఁగా చండుని సేవకులు వానిం దుదముట్టించిరి.

ఇట్లు చిత్తూరు క్రొత్తప్రభువుల బారినుండి విముక్తిఁజెందెను. రణమల్లుయొక్క పెద్దకుమారుఁడు జోదాయను నతఁడుతక్క తక్కిన మార్వారుదేశస్థు లందఱు హతులైరి. జోడా 120 మంది బంట్లతో

చండునిబారిం బడక తప్పించుకొని ప్రాణములు దక్కించుకొని తన స్వస్థానమును మార్వారుదేశమునకు రాజధానియునగుమండూరుపట్టణమునకు బయలుదేరి పోయెను. చండశాసనుఁ డగు చండుఁడు వెన్నంటి తఱుముటచే నచ్చట నిలువలేక యతఁడు హర్బశంకరుఁ డను నొకమిత్రునియింటికి పాఱిపోయెను. విజయుఁ డగు చండుఁడు మీవారు దేశమును, గ్రొత్తగా నాక్రమించి మార్వారుదేశమును తమ్మునిపేరఁ బాలించుచుండెను.

ఈహర్బశంకరుఁడు మీవారు మార్వారు సరిహద్దులో నున్న యొక యడవిలోఁ గాపురమున్న క్షత్రియుఁడు. అతఁడు పరమభక్తుఁడు. మహాశూరుఁడు, ఆపద్బాంధవుఁడు, శరణాగతరక్షకుఁడు. అడిగిన వారికి లేదనకుండ నిచ్చునటుల దానకంకణము కట్టుకొన్నవాఁడు. కాకులనుగొట్టి గద్దలకు వేయున ట్లతఁ డప్పుడప్పుడు చుట్టుపక్కల గ్రామములు దోఁచుకొనివచ్చి బీదలకు బ్రాహ్మణులకు సంతర్పణలు చేయుచుండును. తన చిన్నసేనతో జోడా హర్బశంకరుని యింటికిఁ బోయిన దినము పండుగ యగుటచే నచ్చట విశేషముగా నన్నప్రదానము జరుగుచుండెను గనుక తను కేవెల్తియుఁ గలుగదని యతఁడనుకొనెను. కాని శంకరుఁడు వారు వచ్చునప్పటికొక్క మెతుకైన మిగులకుండున ట్లన్నప్రదానము చేసెను. ఆఁకలి దప్పికలచేతను మార్గాయాసముచేతను బడలి యాత్రొత్తగా వచ్చిన నూట యిరువది మంది యతిథులకు నేమిపెట్టుదును. నాకీదిన మెట్లు పరువు తక్కునని శంకరుఁడు విచారించి యొకయుపాయము గనిపెట్టెను. అప్పుడప్పుడు రంగులువేయుటకును గఱువుకాలమున బీదలుతినుటకు నుపయోగించు నొక మొక్క యతని కప్పుడు జ్ఞప్తికివచ్చెను. ఆచెట్లు తెప్పించి మెత్తగా నలగదంపించి పిండియుబెల్లమును గలిపించి వండించి వారికిఁ బెట్టించెను. వారందఱు మిక్కిలి యాఁకలిగొనియుండుటచేనదియేదో

కొరిత్తపిండినంట యనుకొని తమకముతో భక్షించిరి. ఆ మొక్కలు రంగువేయుటకుఁ దఱచుగ నుపయోగింపఁబడుటచే భోజనాంతరమున నతిథుల గడ్డములు మీసములు కొంచె మెఱ్ఱబడియుండుటచే వారొం డొరులు మొగంబులు జూచుకొన నారంభించిరి. అప్పుడు శంకరుఁడు వారియొద్దకుఁ బోయి తనపై వారికనుమానము కలుగకుండు నట్లు వారితో నిట్లనియె. "చూచితిరా! యీశ్వరమాయ? మీకష్టకాల మిప్లే మాఱిపోయి సుఖకాల మగునని తెలియఁజేయుటకు భగవంతుఁడు మీమీసముల కీమార్పు కలుగఁ జేసెను" అని యతండు చెప్పవాని యందలి భక్తిచే వారామాటలు నమ్మి యటనుండిపోయి సమయము వచ్చువఱకు మండూరు చుట్టుపట్ల నడవులలోఁ దిరుగు చుండిరి. అంతట ముకుళుఁడు యుక్తవయస్కుఁడై రాజ్యభారము వహించెను. చండుఁడును వానికొడుకులును మండూరు రాణాకు బదులుగ నేలు చుండిరి. రాణీ హంసాదేవి తనకుమారుఁడు రాజ్యభారముఁ బూని నిరపాయస్థితి నున్నందున దిక్కుమాలిన యడవులందిరుగుచున్న తన సోదరున కేదేని యుపకారముఁ జేయ నిశ్చయించుకొని వానిరాజ్యము వానికిమ్మని కొడుకును బ్రతిమాలుకొనెను. ముకుళుఁడు సరే యని చండునితో నాలోచించుటకు వానిం దనయొద్దకురమ్మని వర్తమాన మంపె. ఇరువురుకొడుకులను సపరివారముగ మండూరినం దుంచి చండుఁడు పెద్దకుమారుఁడగుముంజునితోఁగలిసి రాణాయొద్దకుఁ బయనమై పోయెను.

వాని పయనముమాట చారులవల్ల నెఱిఁగి జోడా హర్బశంకరుఁడు మొదలగుకొందఱుజోదులంగూర్చుకొనిమండూరునకుఁబోయి చండునికొడుకుల వధించి పట్టణ మాక్రమించెను. చండుఁడు మార్గమధ్యమున నామాట వినికోటఁ గాఁపాడుమనిముంజునివెనుకకు పంపె కాని సపరివారముగ సోదరు లదివఱకె మృతినొందుటంజేసి తా

నొంటిగ నేమియుఁ జేయలేక ముంజుఁడు మరలివచ్చుచుండ జోడా వానిని వెన్నంటి తఱిమి త్రోవలోఁ దెగటార్చి ప్రాతపగఁ దీర్చుకొనియె. చండుఁడు తనకుమారుల మరణవార్తవిని తాను మండూరు పట్టుకొని జోడాను సంహరించుటకు సమర్థుఁ డయ్యుఁ గయ్యమునకుఁ గాలుదువ్వక తనకొడుకులు రణరంగమున వీరపురుషోచితమైన మరణము నందినా రని సంతసించి జోడా తండ్రిని సోదరులను తాను మున్ను జంపినందుకుఁ దనకుమారుల నిప్పుడతఁడువధించి యుండునని సరిపెట్టుకొని రాజపుత్రు లొకరితో నొకరు పోరాడుటతగనిపనియని హితోపదేశముచేసి ముకుళునితోఁ జెప్పి వానిరాజ్యము వానికిప్పించి మారువారు రాజ్యములోని యొక్కతాలూకామాత్రము చిత్తూరు రాజ్యమునఁ గలిపించి యెల్లల నేర్పఱచి తానెప్పటియట్ల తమ్ముని గొలిచి బ్రతుకుచుండెను.

నాఁడు మొదలు మీవారు రాజకుటుంబమును మారువారు రాజకుటుంబమును తమతమ ప్రాతపగలు మఱచిపోయి వియ్యము నెయ్యము హెచ్చ సుఖమున జీవించుచుండిరి. తరువాతఁ జిత్తూరు నగరముపై నొకసారి శత్రువు లెవరో దండెత్తిరా జోడా తన సేనలం గూర్చుకొని మేనల్లునకు సాయమయ్యెను. చండునివంటి నీతిమంతులు దేశాభిమానులు ననేకులు మన దేశమునఁ బుట్టి మార్గప్రదర్శకు లయ్యెదరుగాక!



# రాణాకుంభుఁడు

రాణాముకుళుని దర్బారులో నున్నదొరలలోఁ గాచుఁడు మేరుఁడు నను నిరువురు సోదరు లుండిరి. వారు ముకుళుని తాతయగు ఖేటసింగునకుఁ గుమారు లగుటచే నతనికి సపత్నిపినతండ్రులైరి. కాచ

మేరులతల్లి ఖేటసింగునకు నగ్నిసాక్షిగా వివాహమైన ధర్మపత్నిగాక యుంపుడుకత్తెయై పేద యగు వడ్లబత్తునికూఁతు రగుటచే వారు సంస్థానమందుఁ జండుని తరువాత గౌరవనీయు లయ్యుఁ గొంచెము తక్కువగఁ జూడఁబడుచుండిరి. ఆయన్నదమ్ము లిరువురు తమ వడ్లబత్తుల చుట్టరికపుమాట యెవరుఁ దలపెట్టినను మహాకోపోద్దీప్తు లగుచు వచ్చిరి. ఈసంగతి రాజుకొలువున నున్నవారి కందఱకు విశదము.

మహారాణాయగు ముకుళుఁ డొకనాఁడు కొందఱు బందిపోటు దొంగల దఱిమికొట్టుచు విశ్రాంతికై యొకమామిడితోఁపులో దొర లందఱుఁ గొలువఁ గూరుచుండెను. అదివఱకెన్నఁ డతఁడు చూచి యెఱుఁగని యొకచెట్టక్కడ కనంబడుటచే ముకుళుఁడు దానిపే రేమని దగ్గరనున్న యొకదొర నడిగెను. ఆదొర తనకును గాచమేరుల కును మనస్పర్ధ లుండుటచే వారి నవమానము చేయుటకై యావృక్ష నిపేరుఁ దానెఱుఁగనట్లు నటించి వారి నడుగుమని రాజుతో మెల్లఁగ జెప్పెను. రాణా యందలికిటుకు నెఱుఁగక పినతండ్రులఁ బిలిచి యా వృక్షముపే రడిగెను. ఆయన్నదమ్ము లిద్దరు వెంటనే తాము వడ్లబత్తుని సంతతియగుటచేఁ జెట్లయొక్క పేళ్లునామములుఁ దమకుఁజక్కగఁ దెలియునను నర్థముతో రాజాపరిశ్న తమ్మవమానించుటకయి యడిగెనని మహాకోపోద్దీపితులై యప్పటి కూరకుండి సాయంకాలము రాణా జపము చేసికొనునప్పుడు కత్తులదూసి వానిపైఁబడి తుత్తునియలుగా నఱికి చిత్తూరుకోటం బట్టుకొనుటకు నప్పుడ గుఱ్ఱములనెక్కి పోయిరి. కోట కావలివాండ్రు జాగరూకతగలవా' రగుటచే వారి ననుమానించి తలుపులం దెరువరైరి.

ముకుళుని దుర్మరణవార్త తెలిసినతోడనే ప్రజలు హాహాకారములు చేసిరి. ముకుళుఁడు చిరకాలము రాజ్య మేలకున్న నేలినన్ని

నాళ్ళు న్యాయముగాఁ బ్రిజాపాలనము చేయుచుఁ బగతురఁ బారఁ దోలుటలోను స్వరాష్ట్రిమును బలపఱచుకొనుటలోను మిక్కిలి సమర్థుఁ డయ్యెను. అతనికొడుకు కుంభుఁడు తండ్రి మరణమునాఁటికి బాలుఁడయ్యు బుద్ధిమంతుఁ డగుటచే దూరపుటాలోచన చేసి తన తండ్రికిఁ బ్రిఁతపగతుఁడగు మేనమామయగు జోడాను తనసహాయార్థము రమ్మని వర్తమాన మంపెను. జోడాయు వెనుకవైరము మఱచి దయాళుఁడై కుంభునికి సహాయమునిమిత్తము కొంత సేననిచ్చి తనకుమారుని బంపెను. అతఁడును చిత్తూరుశాణాయుఁ గలిసి రాజద్రోహులగు నస్నదమ్ముల నిమువురను స్థిమితముగ నొక్క చోట నిలువనీయక యొకతావునుండి యొకతావునకుఁ దఱిమి కొట్ట నెట్టకేలకు కాచమేరులు వారిబారి కోడి ప్రాణభీతిచే రాటకోట యను నొక కొండకోటం బ్రివేశించిరి. ఈదుర్గము నట్టడవులలోఁ గొండలపై నుండుటచే దుర్గమమనియు మీవారుప్రభువును మార్వారుప్రభువును దానిం బట్టుకొనఁజాలరనియు నిశ్చయించి కాచమేరులు దానం బ్రవేశించి మరమ్మతుచేసి బలపఱచిరి.

కాచమేరులు జాడలు దెలియుటకై మీవారు, మార్వారు ప్రభువు లొకనాఁ డడవులలోఁ దిరుగుచుండ నొకమనుష్యుఁడు వచ్చి వారిపాదములపైఁబడి న్యాయము దయచేయుఁడు మహాప్రభూ యని ప్రార్థించెను. నీవృత్తాంత మేమి యని వారడుగ నతఁ డిట్లనియె. "స్వామీ! నేను రాజపుత్రుఁడను చోహాణవంశస్థుఁడను. నాపేరు సుజా. నాకు చక్కనిచుక్కయగు నొకకూఁతురు గలదు. ఈకొండలం దిరుగుచు నొకమారు కాచమేరులు నాముద్దుకూఁతును జూచి దాని గొని రాటకోటకుం బారిపోయిరి. నాదుర్గతినిఁగూర్చి నేను రాణావారితో మొఱవెట్టుకొనుట కిప్పుడే పోవుచుండఁగా నాయదృష్టవశమున మార్గమధ్యమున మీరే యగపడిరి. రాటకోట లోకు లను

కొనునంత దుర్భేద్యముగాదు. దాని యాయువుపట్లు నే నెఱుఁగుదును. ఈనడుమ కోటమరమ్మతులుజరిగినప్పుడు నే నొకకూలివాని వేషము వేసికొని పనిచేసినట్లు చేసి దానిగుట్టెఱిఁగితిని. తక్కినచోట్ల కోట దుర్భేద్యమేకాని యొక్కమూల వీలుగ నున్నది. సకష్టముపడి యైన నొక్కసారి మనము కోటమీఁది కెక్కఁగలిగితిమా యింక కోట మనస్వాధీనమె. ఏలయందు లేని కావలివాండ్రు కోట దుర్భేద్యమను తలంపున నశ్రద్ధతో నున్నారు."

ఈకథ చెప్పునప్పు డతఁడు ప్రజలమొగముఁ జూడలేక తలపై ముసుఁగు వేసికొనెను. మీఁవారు మార్వాడుప్రభువులుగుఱ్ఱములపైఁ గూరుచుండియే వానిపలుకులు విని "సరే! యాకొండమీఁదికి దారి జూపగలవా!" యని యడిగిరి. చిత్తము స్వామీ యని యతఁ డను మతించుటయు మెఱియలవంటిబంట్లను కొందఱఁ గూర్చుకొనిమార్వారురాజకుమారుఁడు వానివెంటఁ జనియెను. మొదట సుజాయుఁ బిదప మార్వారుప్రభువును జీఁకటిచాటునఁ బర్వతశిఖరమున కెగఁబ్రాకిరి. ఆరాత్రి యాకాశమంతయుఁ గారుగ్రమ్మినమబ్బులతో నిండియుండుటచేఁ జిమ్మచీఁకటి యెల్లెడలవ్యాపించె. ఆకసము చిల్లివడినట్లు వాన దిరిమ్మరింపఁ జొచ్చె. బ్రహ్మాండములు పటపట పగులున ట్లుఱుములు మొఱయసాగె. కన్నులు మిఱుమిట్లు గొలుపునట్లు తళుకుతళుకు మని మెఱపులు మెఱయఁ జొచ్చె. సకలఘాతుకజంతువులకు శరణ్యామైన యాకొండపై నారాత్రియం దాశూరశిఖామణులు కన్నుకన్ను గనఁబడనిచీఁకటిలో ముం దేమియున్నదో యెఱుఁగక వ్రేలు మోపుటకు తావు దొరకిన నందు నిలుచుచుఁ జేతి కేది దొరకిన దాని నూఁతగా బట్టుకొనుచు మెఱపు కనఁబడినపుడెల్ల దారిఁ జూచుకొనుచు నిఱుకు సందుల గొందులఁబడి నడువసాగిరి. చీమ చిటుక్కుమన్న నొకబొమ్మరాయి గదలిన యట్టిచిన్నయలుకు డైనఁ బగతురు దమజాడఁదెలిసి

కొని కార్యవిఘ్నముచేయుదు రన్న భయమున నొండొరులతో మాట లాడుకొనక ధైర్యమునిమిత్త మొండొరులఁ బ్రోత్సాహముఁ జేసికొనక జాతిపడినం బరస్పరసహాయ మడుగక యావీరు లాపర్వతశిఖరముల మీఁద నడచు చుండిరి. కొంతదివ్వరిగి సుజాయెత్తగు నొకరాతిపై నడుగు పెట్టఁబోవుచుండఁ జంతనిప్పులవంటి గుడ్లుగలిగి యెఱకొఱకై చూచుచున్న యొకయాఁడుపులి గానఁబడియె. అచ్చమగు తనకులంబు నకు మచ్చగలిగెనని మనంబున మిక్కిలి పరితపించుటచే యాసుజా పులియైనను సరే భూతమైనను సరే బ్రతికినను సరే చచ్చినను సరే భయముపడక వెనుకంజ యిడక యచ్చటనే నిలువఁబడి మాటలాడ వలనుపడమి యపాయమును సూచించుటకై రాజకుమారుని హస్తము స్పృశించెను. రాజనందనుఁ డాసన్న మెఱిఁగి యపాయ మాసన్నమయ్యెనని నలుదెసలు పరికించి నెత్తురుముద్దలవంటి కన్నులుగలిగి తమపైనుంకించి దుముకఁబోవుచున్న బెబ్బులిం గాంచి కత్తిదూసి పొడిచి యొక్కయేటున దాని నంతమొందించెను. ఆదెబ్బతోనది కొండలపైనుండి దొర్లి క్రిందఁబడియె. కాచునికూఁతు రప్పుడే మేలుఁకువ నొంది యేదో చప్పుడగుచున్న దని తండ్రిని లేపి శత్రువులేమొ చూడు నాయనాయని పలికెను. ఆపలుకులు విని కాచుఁడు భయము లేదు. పండుకొనుము. మనశత్రువులు చాలదూరమున నున్నారు. అది యుఱుములచప్పుడుగాని మఱియొకటికాదు. దైవమును దలచుకొనుచు నిర్భయముగా నిద్రింపుమని తానును గుఱ్ఱుపట్టి నిద్రించె.

అంతటఁ గొంత సేపటికి శత్రువులు కోటలోఁ బ్రవేశించినారని యందఱకు స్పష్టముగాఁ దెలిసెను. కోటలోని సైనికు లందఱు చప్పుచప్పున నాయుధములకొఱకై పరుగులెత్తిరి. కాని వారిశ్రమయంతయు వృధయయ్యె మార్వారురాజకుమారుఁడు మేరుని గడ తేర్చె. సుజా కాచుని దెగటార్చి తనయక్కసు దీర్చుకొనియె. ఇవ్విధంబున

నొక్కముహూర్తమందే రాజద్రోహంబును స్త్రీమానద్రోహంబును చేసిన దురాత్ములు తమదోసంబులకుఁదగినశిక్షలం బొందిరి. ఇట్లు తండ్రిం జంపిన దురాత్ముల నంతమొందించి కుంభుండు సింహాసనమున సుప్రతిష్ఠుఁడై నేలం బాలింప నారంభించెను.

ఆకాలమున ఢిల్లీరాజ్యము పూర్వవైభవము నంతను బాసి నామావశిష్టమై యుండెను. తొల్లి చక్రవర్తులకు లోఁబడిన రాజ్యములన్నియుఁ గ్రమక్రమంబున ఢిల్లీకి గప్పముజెల్లించుట మాని స్వతంత్రములయ్యె. ఈవిధముగా స్వాతంత్ర్యముఁ బడసిన రాజ్యములలో మాళవదేశ మొకటి. అది పూర్వము హిందూరాజులపాలనము నుండియు నాసమయంబున మహమ్మదను పేరు గలయొక మహావీరుని పాలనంబున నుండెను. అతఁడు మహాబలదర్పితుఁడై ఢిల్లీపైఁ దిరస్కారభావముఁ జూపుటయేగాక యనేకదేశముల జయించి చిట్టచివరకు రాజస్థానముమీఁద దండెత్తుటకు యత్నించెను. కుంభుఁ డాసమాచారము ముందుగానే విని లక్షగుఱ్ఱముల దళమును పదునాలుగువందల యేనుఁగులను గూర్చుకొని మహాసేనతో మాళవదేశముపై దండు విడిసె. అప్పుడు కుంభునకును మహమ్మదునకును దారుణయుద్ధము జరిగెను. దైవానుగ్రహముచే నాకయ్యమునందు మహమ్మదీయులకు సంపూర్ణపరాజయమును హిందువులకు పరిపూర్ణజయంబును గలుగుటయేగాక మాళవదేశాధిపతి యగుమహమ్మదు కుంభునిచేఁ జిక్కి చిత్తూరునకు ఖయిదీగాఁ దీసికొనిపోఁబడెను. అచ్చటనతఁడాఱు మాసములు చెఱలోనున్నపిదప కుంభుఁడు వానిం గరుణించి వానియొద్దనుంచి ధనమునుగాని కానుకలఁగాని రాజ్యమునుగాని గ్రహింపకయే తానేవాని కనేక బహుమానములిచ్చి వానినివిడిచి పుచ్చెను. మహమ్మదు తనకిరీటమును మాత్రము చిత్తూరుకోటలో విడిచిపోయెను. మహారాణాకుంభుఁడు తనయెడలఁ జూపిన నిర్హేతుక కృపారసమును

దలఁచి మహమ్మదు వానియెడలఁజాల కృతజ్ఞుఁడై వానితోఁగలసి సా టితుఱకయగు ఢిల్లీచక్రవర్తిమీఁదికిఁ యుద్ధమునకుఁబోయి యిరువు రుంగలసి మరల దలయెత్తకుండ వానిని నోడించిరి.

మాళవదేశాధిపతి గర్వమడంచిన పిదప కుంభుఁడు తనవిజయ మాచంద్రతారార్కముగ భూమిలో నిలుచునట్లు చిత్తూరునం దొక జయస్తంభమును గట్టించెను. అది చిత్తూరు రాజ్యలక్ష్మియొక్క తొంటివైభవమును తెలియఁజేయుచు నిప్పటికినిలిచియున్నది. దానిం జూడనివారు దాని గొప్పతన మూహింపఁ జాలరు. చూచినవారు వర్ణింపఁజాలరు. అది కట్టుటకే పదిసంవత్సరములు పట్టెను. దాని పొడవు నూటయిరివది రెండడుగులు. అది నలుదెసలకు నాలుగుపల కలు గలిగియున్నది. దానికి తొమ్మిది యంతస్థులు గలవు. ప్రతి యంతస్థునం దొక్కొక్కనల్లరాతిపలకమీఁదఁ జిత్తూరురాజవంశచరి త్రము వ్రాయఁబడియున్నది. అంతియగాక దేవతలయు రాక్షసులయు నప్సరసస్త్రీలయు వీరపురుషులయు విగ్రహములు చిత్రచిత్రములుగ విన్నాణమేర్పడ చెక్కఁబడియున్నవి. దాని సొగ సంతయు నిచట వర్ణించుటకు వీలుగాదు.

ఈజయస్తంభమునే గాక యమ్మహావీరుఁడు చిత్తూరునగరము నందు శ్రీకృష్ణునకును బ్రహ్మకును వేరువేరుగ నాలయములును ఆరా వళీపర్వతములయందలి యాబూశిఖరముమీఁద మఱియొక కోవెలను గట్టించెను.

అతఁడు మిక్కిలి దేవతాభక్తుఁడేగాని తనరాజ్యసంరక్షణము నకుఁ గేవలము దేవతలనే నమ్మియుండక మనుష్యప్రయత్నముగూడ నమ్మి ప్రాతకోటలను బాగుచేయించి క్రొత్తకోటలఁ గొన్ని కట్టించి దేశము శత్రుదుర్నిరీక్ష్యముగ జేసెను. ఈకోటలలోఁ గుంభర్ మియ ర్' అనునది ముఖ్యమైనది. కుంభర్ మియర్ అనగా గుంభుని కొండ

యని యర్థము. ఈకొండకోటలోఁ గూరుచుండియే కుంభమహారాజు దనయిష్టదైవమగు శ్రీకృష్ణునిమీఁద బద్యములు కృతులు చెప్పుచు వచ్చెను. మహారాణా కుంభుఁడును వాని పట్టపుదేవియగుమీరాభాయియు హిందీభాషలో మిగులలలితమగు కవిత్వముజెప్పఁగల ప్రోఢలు. సత్కులప్రసూనత చక్కఁదనము సత్ప్రవర్తనముగల రాజపత్నులనేకులుందురు; కాని సాహిత్యము సంగీతము దైవభక్తిగలవారుండుట యరిది.

మీరాభాయి హిందీభాషలో ననేకపద్యములు కృతులుభగవత్పరముగాఁ జెప్పెను. చెప్పుటలోఁ దనివిసనక చిత్తూరునం దొకకృష్ణాలయమును గట్టించి యచ్చటి కనుదినమును బోయి తానుజెప్పినకృతులు పద్యములు చదివి స్వామినిస్తుతియించి తాను మహారాజుపట్టపుదేవిననుమాట మఱచి సామాన్యస్త్రీలవలె భగవంతునియెదుట నాడిపాడి వచ్చినవా రందఱ కన్నులకు వీనులకు విందుసేయుచుండును. సహజముగఁ గంఠమాధుర్యముగల స్త్రీసంగీతశాస్త్రమునందసమానప్రజ్ఞగలదై భక్తిరస ముట్టిపడునట్లు పాడునపుడు వినువారి మనస్సులు కఱగి నీరై పోవా? అందుచేతమీరాభాయిపాట విన్నవారందఱుకృష్ణునియందుఁ బరమభక్తులైరి. ఆమెజగమంతయు శ్రీకృష్ణపరబ్రహ్మస్వరూపమేయని సంసారపుగొడవలు వదలుకొని స్వామిగుణముల వర్ణించి కవనముచెప్పుటయు పాడుటయు నాడుటయుఁ దక్క తక్కిన పనులజోలికిఁ బోదయ్యె. పురజను లామె గానమును వినుటకుఁ బ్రతిదినము వేనవేలు కృష్ణాలయమునకుఁ బోవుచువచ్చిరి. ఆమెకీర్తి క్రమక్రమంబున నుత్తరహిందూస్థానమంతయువ్యాపించుటంజేసి దూరదేశమునుండియు ననేకజనులు వచ్చి యామె గానమును విని భక్తికి సంతోషించి పోవుచువచ్చిరి. ఆనాఁటి ఢిల్లీచక్రవర్తి యామె యసమానప్రజ్ఞలను విని తనచెవులు ధన్యములుగఁ జేసికొనవలయునని నిశ్చయిం

చుకొని మహారాజు పట్టపుదేవికరకుతురకయెదుటనిలిచి పాడదనుకొని గోసాయివేషము వేసికొని యొక్క సేవకునితో బయలుదేరి చిత్తూరు నకువచ్చి సాయంకాలమున హిందువులతోఁ గలిసి కృష్ణాలయముఁ బ్రవేశించెను.

ప్రవేశించి జగన్మోహనమగు నామెరూపమును మనసుకరగించు పాటయుఁ గని విని ఢిల్లీశ్వరుఁడు పరవశుఁడయి యామె యడుగులకు మ్రొక్కి తన జేబులోనున్న యమూల్యమగు రత్నహారముదీసి యామె కిచ్చెను. ఇది యెక్కడిదని యామెయడుగ నతఁడు స్నానము చేయుచుండ నాకిది యమునానదిలో దొరకినదని చెప్పి యవ్వలకుం బోయెను. ఆదేవియు నతఁడు చక్రవర్తియని యెఱుగక నిజముగ గోసాయి యనుకొని యా హారము స్వామి కర్పించెను.

రాణాకుంభుఁ డా హారమును జూచి యది చక్రవర్తివద్దనేగాని గోసాయీలవద్ద నుండునది గాదని నమ్మి రత్నాలవర్తకులకు జూప వారు దానిం బరీక్షించి యది ఢిల్లీచక్రవర్తిదని యానవాలుపట్టి చెప్పిరి. కుంభుఁడు భార్యపై ననుమానపడి భార్యం జంపుమని మంత్రుల కానతిచ్చె. ఆమె మహాపతివ్రత యని యెఱుగుటచే నామె నెవ్వరు జంపరైరి. అనంతరము భర్త కిష్టములేనప్పుడు తాను బ్రతుక గూడదని నిశ్చయించుకొని యాదేవి యర్ధరాత్రిమున నెవ్వరికి దెలియకుండ కోట వదలి యావలకుంబోయి యొకనదిలోబడెను. అప్పుడు భగవంతుడు కృష్ణుడే వచ్చి యామెను జావకుండ గాపాడెనట! పిదప నామె బృందావనమున కరిగి భక్తురాలై తన జీవితశేషము నచ్చటనే గడపెను. ఉత్తరహిందూస్థానమున మీరాభాయిచేసిన కృతులు నాబాలగోపాలముగ నిప్పటికిని బాడుచు నామె పేరు శివసా వహింతురు.

అనంతరము కుంభుని చుట్టములగు మార్వారు రాజకుమారు

లలో నొకనికి జాల్వారుదేశపు రాజకూతునిచ్చి వివాహముచేయుట కు బెద్దలు నిశ్చయించిరి. కుంభు డావార్త-విని యాకన్యను తానే పెండ్లిచేసి కొనగోరి పాత్రిచట్టరిక మయినను తలంపక యపకీర్తి-కి జంకక యాకన్యను బలాత్కారముగా నెత్తుకొనివచ్చి యామెకిష్టము లేకున్నను వివాహము చేసికొనెను. ఈయవివేకకార్య మతని ననేక కష్టములపాలుచేసెను. అదివఱకు గొంతకాలమునుండి గలిసియున్న మీవారు మార్వారు రాజకుటుంబములకు మరల బ్రిబలవైరము గలిగెను. కొత్తపెండ్లాము మనసున మగనిపై నిష్టములేదు.

ఆమె మొదట మార్వారురాజకుమారుని వలచుటచే నెల్ల ప్పుడు నతనినే ధ్యానించుచు చిత్తూరునకు వచ్చి తనను దీసికొని పొమ్మని వానికి సందేశముల నంపుచు తనహృదయమున మదనానల మిట్లే మండుచున్నదని తెలియజేయుటకు దనమేడపై నొకపెద్ద దీప మును రాత్రిలు పెట్టించుచు వచ్చెను. మీవారు రాజకుమారుఁడు నామెయందే వలపు నిలుపుటచే నామెకొఱకే పరితపించుచు నొక మారు చిత్తూరునకు బోయి కోటలో ప్రవేశించి యామెను దీసికొని పోవుటకు యత్నించెనుగాని యాతనియత్నము కొనసాగదయ్యె.

కుంభుడు కొలువునకు వచ్చినప్పుడెల్ల ముందుగా దనచేతికత్తి ముమ్మారు తనచుట్టు ద్రిప్పుకొని యేరికివినబడకుండ కొన్నిమాటలు తనలో దాను గొణుగుకొని పిమ్మట గూర్చుండును. ఇదియంతకుమున్న చాలకాలమునుండి వానికి యభ్యాసము. కుంభుని జ్యేష్టపుత్రుఁడును యువరాజు నగు రాయమల్లుడు తనతండ్రిచేయునట్టి యాపని కేమియ ర్థమో తెలియక తన సందియము తనలోనణచుకొనజాలక సందేహ నివృత్తి జేసికొనదలచి దాని యర్థమేమని తండ్రినడిగెను. తండ్రి దా నికి యర్థమును జెప్పలేదు సరిగదా మీదుమిక్కిలి తన దేశమునుండి తత్క్షణమె వెడలిపొమ్మని కొడుకున కాజ్ఞాపించెను. రాయమల్లుడు విదే

శములం దిరుగుచుండ రాణా చిన్నకొడుకులలో నొకఁడొక చారునకు లంచమిచ్చి వానిచేదండ్రిని జంపించి తనయన్నగారికావార్తదెలియక మునుపే తానేగద్దెయెక్కెను. ఆపితృద్రోహి తనపదవి స్థిరముగా జేసికొనుటకు జుట్టుపక్కల రాజులకులంచములిచ్చి వారిమైత్రిగావించియెట్టెటో దేశము నైదేండ్లుపాలించె. అంతలో రాయమల్లుఁడు మహాసేన గూర్చుకొని తమ్మునిపై నెత్తివచ్చి వాని నోడిసిపుచ్చిపారదోలి తానుసింహాసన మెక్కెను. తండ్రిం గడ తేర్చిన శూరశిఖామణి స్వరాష్ట్రమున నిలువ నీడగానక యప్పటి ఢిల్లీచక్రవర్తి యగుబహావాల్లోడి వద్దకు బోయి వానినాశ్రయించి తనయన్న బారినుండి తన్నురక్షించి రాజ్యప్రతిష్టితుని సేయు మనిబ్రతిమాలి యట్లు చేసినచో మీవారుదేశము ఢిల్లికి లోబడునట్లు చేయునట్లును విశేషించి సూర్యవంశప్రదీపకుఁ డగుతాను తనకూఁతును జక్రవర్తి కిచ్చి నిశ్శంకముగా వివాహము చేయునట్లును వాగ్దానము చేసెను. చక్రవర్తి వాని చెలిమికిచ్చగించి సాయముసేయుదు నని యభయహస్తమిచ్చి వానిని సబహుమానముగ నావలకుఁ బంపె. ఆనాఁడు గొప్పవాన కురియుచుండెను. పితృద్రోహి యగుటయేగాక కులద్రోహియు దేశద్రోహియునై గౌరవంబునకు బుట్టిని ల్లయినచిత్తూరురాజవంశమున జన్మించిన కన్యను గోవునుగోసికొని తినుపచ్చితురుక కిచ్చి వివాహము సేయఁదలంచిన యాదురాత్ముఁడు బ్రతుకఁగూడ దనితలంచి భగవంతుఁడు వానిం జంపబంపినయాయుధమోయనునట్లొక పెద్దపిడుగు వచ్చి గుమ్మముదిగఁగానే వాని నణచె. పడియున్నయజమానునికడకు సేవకులువచ్చి చూచునప్పటికి నంతయు మాడినమేనుతో బీనుగయై యుండె. మహారాణాకుంభునియనంతరమునరాజ్యమునకువచ్చినయాదుష్టునకుప్రజలు హంత్! యనుపేరుపెట్టిరి. హంత యనఁగా జంపినవాఁ డనియర్థము. అంతియకాని వాని నిజమయిననామ మెవ్వరికిఁ దెలియదు. ఈనృశం

సుఁడు విరుగ డయిపోయినదే మంచి దనిసంతోషించి ప్రజలందఱు రాయమల్లుని తమకు రాణాగా నంగీకరించి వానిని గొలుచుచు సుఖించిరి.

---

# పృథివిరాజు సాహసములు

మీవారు దేశపు రాణా యగు రాయమల్లునకు సంగుఁడు పృథివిరాజు, జయమల్లుఁడు నను ముగ్వురు కొడుకు లుండిరి. అందుపృథ్వీరాజు నిరుపమానసాహసుఁడు. మహాతేజశ్శాలి. అతఁడు పదునాలుగేండ్లు వయసుగలిగినది మొదలు ప్రతికక్షు లెదుఱువచ్చినను లెక్కసేయక యాయుధసహాయుఁడై యనేకవీరకర్మముల నొనర్చుచుండెను. మీవారు నందె గాక చుట్టుపక్కలదేశములందుగూడ పృథ్వీరాజు ధైర్యసాహసములకు పెట్టినదిపేరు. అందుచేత నతనియకాలమరణమునకు దరువాత కొన్నివందల యేండ్లవఱకు జను లాతనివీరవిహారముల నెంతోచిత్రముగఁ జెప్పుకొనుచు వచ్చిరి.

పృథ్వీరాజు తనబలము తా నెఱిఁగినవాఁ డగుటచే దనకు తరతరములనుండి శత్రువు లయిన మహమ్మదీయులతో జిత్తూరులోని సూరులం గూర్చుకొని యుద్ధసేయుట పండువుగా దలంచుకొనెను. తనయన్న సంగుఁడు తనకన్న శాంతుఁడును వివేకియునైనను అతఁడు సింహాసన మెక్కఁడనియు దానె సింహాసనమెక్కి చిత్తూరు నేలునట్లు బ్రహ్మవ్రాసినాఁడనియు నతండు బలుమాఱు చెప్పుచుండును. ఒక

నాఁడు పృథ్వీరాజు పినతండ్రి యగు సురేశమల్లుఁడును సోదరులు నం డగ పైనఁజెప్పినట్లు బలికెను. ఆమాటలు విని సంగుఁడు తమ్మునితో నిట్లనియె.

"తమ్ముఁడా! దేవతల యభీష్టమె చెల్లనిమ్ము. విధినిర్మాణ మట్లున్నయెడల నేను జ్యేష్ఠుఁడ నయినను రాజ్యమును నీనిమిత్తమై విడిచిపెట్టెదను. అయినను మనయూరుబైట వ్యాఘ్రగిరిమీఁదనున్న చారుణిదేవియొక్క యర్చకురాలియొద్దకు బోయి తండ్రియనంతర మున మాలో నెవ్వఁడు రా జగునని మన మడుగుదము. అందుకు సోదరు లంగీకరించి సురేశమల్లునితో వ్యాఘ్రగిరికిం బోయిరి. అ త్తరి నమ్మవారి యర్చకురాలచ్చట లేనందున నామె వచ్చువఱకువా రందు నిలువనిశ్చయించిరి. పృథివిరాజును జయమల్లుఁడు నాయర్చకు రాలి మంచముమీఁదఁ గూర్చుండిరి. సంగుఁడు నేలఁ బఱచిన యొక సివంగిచర్మముపైఁ గూర్చుండెను. శురేశమల్లుఁడు వాని ప్రక్కనే మోకాలు సివంగిచర్మమునకుఁ దగులునట్లు నేలఁగూర్చుండెను. అంత గొంతసేపటి కర్చకురాలు వచ్చుటయు ముందుగా పృథివిరాజు లేచి తమవచ్చినపని నామె కెఱింగించెను. ఎఱిఁగించుటయు నామె సంగుని వంకఁదిరిగి యిట్లనియె.

"సివంగిచర్మమే పూర్వము రాజులకు సింహాసనము. దానిని నీవిప్పు డధిష్ఠించితివి గనుక ముందు మీవారు సింహాసనమును నీవ యధిష్ఠింపఁగలవు." అని పిదప సురేశమల్లునివంకఁ దిరిగి యనేకసం వత్సరములు బహుశ్రమల ననుభవించినవెనుక నీకు దేశమును ప్రభు త్వమును లభింపఁగలవు. అవియెట్లనిన నింకఁ గొంతకాలమునకుఁబితృ విహీనుఁ డగునొకరాజకుమారుని పగతుర బారింబడకుండఁ దల్లి సంరక్షించుచుండును. ఆమె కతంబున నీకు రాజరికము లభించు నని మొగమోటము విడిచి పలికెను.

ఆపలుకులు విని పృథివిరాజు మండిపడి పట్టరాని బిట్టలుకయు నీర్ష్యయుఁ దన్నుం బురికొల్పఁ గత్తిఁదూసి సంగునిఁ జంపుటకై వాని మీఁద దుమికెను. అంతలో సురేశమల్లుఁ డడ్డుపడి సంగుని రక్షింప వారలకు మహాకలహము సంభవించె. అయ్యర్చకురాలును మిక్కిలి భయపడి తన్నెక్కడ చంపుదురోయని గుహ విడిచి పారిపోయెను. ఆమెచిన్నగుహ రాజపుత్రుల దూషణభూషణములతో ఖడ్గసంఘట్టనములతోను ప్రతిధ్వనుల నిచ్చెను.

ఆదినమున వ్యాఘ్రగిరికి సమీపమున నొకమఠముయొద్ద రహతూరు వంశస్థుఁ డగునొక రాజపుత్రుఁడు గుఱ్ఱముపైఁ జీనువేసుకొని యెక్కడకో పయనమగుటకు సిద్ధముగ నుండెను. అప్పుడు వానియొద్దకు నొకపురుషుఁడు తనగుఱ్ఱమును మిక్కిలి వేగముగాఁబరుగెత్తించుచు వచ్చెను. అతనిశరీరమున నైదు కత్తిపోటులుండెను. వానిగుఱ్ఱము మిక్కిలి యలసటపడి నోట నురగలు గ్రక్కుచుండెను. రక్తమున స్నానముచేసినట్లు వాని దేహమంతయు నెఱ్ఱబడియుండెను. బాణము తగులుటచే నొకకన్నుపోయియుండెను. రహతూరువంశస్థుఁడు నీవెవ్వఁడ వని వాని నడుగ నాతఁడు "నేను రాయమల్లుకుమారుఁడగు సంగుఁడను. నన్ను నాసోదరులు చంపనెంచి" రని చెప్ప రహతూరుఁడు వాని కభయమిచ్చి చేయూతయిచ్చి గుఱ్ఱముపైనుండి దింపి సేదదేర్చు నప్పటికి వారియెదుట గుఱ్ఱపుదళము వచ్చుచున్న జాడలు దెపు దుమ్మగుపడియెను. అది చూచి సంగుఁడు "అదె నాతమ్ముఁడు జయిమల్లుఁడు నన్నుఁ దెగటార్చుటకు వచ్చుచున్నాఁడు. పృథివిరాజు సురేశమల్లుఁడు నొండొరులందాఁకి పోరి యలసటఁ జెంది కదలలేక యచ్చటనేయుండిరి" రని పలికెను. రహతూరు వంశస్థుఁ డామాట విని "భయములేదు. ఈమఠములోనికి వారురాకుండ నేను నిలిపెదను. ఇంతలో నీవు నిరపాయముగఁ బాఱిపొమ్మని ధైర్యముఁజెప్పి వాని

నావలకుఁ బంచె. అంత గొంతసేపటికి జయమల్లుఁడు వచ్చి రహతూ గువంశజునిఁ జూచి "సంగుని మాకప్పగింపవలసిన" దని యడుగ న తఁడు సంగుఁడు నన్ను శరణుజొచ్చెగావున నతని నప్పగింపనని నిర్భ యముగా బలికెను. అప్పుడు జయమల్లుఁడు "అట్లయిన మేమేవానిని బట్టుకొనెద" మని మఠముం బ్రవేశింపఁబోవ రహతూరుఁడు కోపా యత్తుఁడై కత్తిఁదూసి జయమల్లుని వానిసేనను లోనంజొరనీయక నిరోధించె. అంతట కొండొకసేపువఱకు సందడికయ్యెంబు జరుగ శ రణాగత బిరుదమును బూనిన రహతూరుఁడు ప్రాణములు విడిచెను. అతఁడు గూలిన వెనుక జయమల్లుఁడు మొదలగువారు మఠముం జొ చ్చి యందు సంగునిఁగానక యతఁడు మఱల తప్పించుకొనిపారిపోయె నని విషాదము నొంది చనిరి.

ఈవార్త రాయమల్లునకుఁ దెలిసినతోడనే యతఁడు పృథివి రాజును మందలించి జీవాట్లుపెట్టి యిట్లనియె. "నా గారవపు కొడు కగు సంగుని నాకు దక్కనీయక దుండగీడ వైతివి. పాపము వాఁడు నీకు వెఱచియేగదా నిలువనీడలేక యడవులఁ గొండలఁ గుమ్మరు చున్నవాఁడు, నీమొగముఁ జూడరాదు. నావద్దనుండి లేచిపొమ్ము పోయి నీవెప్పుడు పోరాటములే కోరుచుందువు గావున యెందేని పోరులు సలుపుచు బ్రతుకుము."

అభిమాన ధనుఁడగు పృథివిరాజు తండ్రిపలుకులు విని రోషముఁ బెంది తనగాయములు కుదిరిన వెనుక తండ్రివద్ద సెలవు గైకొని యొక గుఱ్ఱము నెక్కి యైదుగురు సేవకులను వెంటఁ గొని తన్నయాయుధముల సంగ్రహించుకొని తాను గొప్పగార్యములఁ జేసి ప్రసిద్ధుఁడైనప్పుడు కాని మరలఁ దండ్రియింటికి రాఁగూడదనినిశ్చ యించుకొని యిల్లు విడిచి విదేశములపాలై పోయెను.

రాజస్థానమున గద్వారను చిన్నదేశము కలదు. దానినిఁ

బూర్వము మీానవంశజు లగు రాజు లేలుచుండిరి. చిత్తూరు రాజు లా దేశమును మీానకులజులవద్దనుండిజయించి పుచ్చుకొని తమపాలనలో నుంచిరి. రాయమల్లుని సోదరుఁడు మీావారుపాలించిన కాలమున గద్వారుసంస్థానము మీావారునకు లోఁబడక స్వాతంత్ర్యము నొం దెను. శాయమల్లు మఱల దానిని లోబఱచుకొనలేకపోయెను. పృథి విరా జల్లువిడిచి క్రిమక్రిమముగా నా దేశమును జేరెను. అతఁడు పోవునప్పటి కా దేశమునం దంతట బందిపోటుదొంగలునిరంకుశవర్త నులయి పట్టపగలు దోఁపుడులు చేయుచు చెలరేఁగియుండిరి. మీాన వంశజుఁ డొకఁ డా దేశమునకుఁ దానుఁ బ్రభువునని చెప్పుకొనుచుం డును; కాని యతని యధికారము పేరునకు మాత్రిమే. రాయమల్లుఁ డా దేశమున నతని యధికారము స్థాపింపలేకపోవుటయేగాక దొంగల దౌర్జన్యమయిన నడపలేక పోయెను. పృథివిరాజా దేశమును జయించి మఱలఁ దనతండ్రికి కప్పింపవలయు నని నిశ్చయించుకొని యేదేని యుపాయము దొరకకపోవునా యని ముఖ్యపట్టణమునకుఁ బోయెను. ఇంతలో నతనివద్దనున్న ద్రివ్యమంతయు వ్యయ మయ్యెను. అతని యనుచరు లతనికన్న నిరుపేదలై యుండిరి. తన యనుచరులకుం దనకు నొకపూట బసయు నన్నమును సమకూర్చుకొనుటకుఁదనవ్రేల నున్న వజ్రపు టుంగరము గొదువపెట్టుటఁ దప్ప గత్యంతరము కానఁ బడదయ్యె. అతఁ డాయుంగరమును దీసికొనిపోయి ఓజుఁ డనునొక వర్తకునికిఁ జూపి దానిమీాఁద కొంతసొమ్మడిగెను. దైవవశమున నావర్తకుఁడు మును పాయుంగనమును పృథివిరాజున కమ్మిన యతఁడే యయ్యెను. ఆవణిజుఁ డాయుంగరమును, రాజకుమారుని గుర్తుపట్టి తద్వృత్తాంతము వినఁగోర పృథివిరాజు తనసంకల్పమును మర్మము విడిచి యతనితోఁ జెప్పెను. అది విని వర్తకుఁడు సంత సించి యుపాయముచే గద్వారుదేశము ననాయాసముగ గెలువవచ్చు

నని యతనికి ధైర్యము చెప్పి వానికిం దోడ్పడ నెంచెను.

అనంతరము పృథివిరాజు నేర్పరియగు నోజును యాలోచనము విని మారువేసము వేసికొని యూరుపేరు దెలియనీయక తన యను చరులతోఁ గూడి యచ్చట మీనవంశపు రాజునొద్ద కొలువునకుఁ గుదిరి వానికి మిక్కిలి విధేయుఁడై భక్తిశ్రద్ధలతోఁ బరిచర్య సేయు చుండె. ఇట్లుండ నొకనాఁడు పండుగ రాఁగా మీనరాజు నమ్మికగల తనబంట్లకందఱకు సెలవిచ్చెను. పృథివిరాజును వానికడ సెలవుఁ గైకొని తన యనుచరులనుమాత్రము కోటలో రాజువద్ద నిలిపితాను పండుగసౌఖ్య మనుభవింక యూరుబైట చెట్లచాటున దాఁగు కొనెను. అంతలోఁ గోటలోఁ పృథివిరాజుచే విడువఁబడిన సేవకు లైదుగురు పరివారశూన్యుఁడై యొంటిగనున్న మీనరాజుపయింబడి వానిం దుదముట్టింపఁ దలంపఁ నతఁడు ప్రాణభీతుఁడై గుఱ్ఱముపై నెక్కి కోటవెలువడి యూరుబైట కొండలలోఁ దలఁదాచుకొనుటకుఁ బారిపోవుచుండెను. అతఁడు వచ్చు దారిలోనే చెట్లచాటును దాఁగి యున్న పృథివిరాజు తనపన్నినకుట్ర నిర్విఘ్నముగ నెరవేఱినందుకు సంతసించి పఱుగెత్తుచున్న మీనరాజును బట్టుకొని బల్లెముతోఁ బొడిచి వాని కష్టము నంతము నొందించెను. పిమ్మట మీనరాజు పరిజనులు కొంతయాగడముసేయ పృథివిరాజును వానియనుచరు లును వారినోడించి పట్టణము పరశురామప్రీతిఁ గావించి. దేశమును స్వాధీనముఁ జేసికొనిరి పృథివిరాజు తానప్పుడు సర్వస్వతంత్రుఁ డయ్యు నాదేశమునకు రాజగుట కిష్టలేక యోజుని దానికిఁ బాల కునిగాఁ నియమించి తనతండ్రిపేరనే పాలింపుమని వానికిఁజెప్పి తన కక్కడ కాలు నిలువకపోవుటచే ననేక సాహసకార్యముల నింక నొనర్చి ప్రఖ్యాతిం గాంచవలయు నని గద్వారు విడిచి యనుచరసమే తుఁడై యన్యదేశములకుఁ బోవ నిశ్చయించుకొనెను.

ఆకాలమున మీావారు రాజ్యమునందలి బదనూరు పట్టణము లో రాజ్యభ్రిష్టుఁడైన యొక రాజపుత్రప్రభు వుండెను. అతని రాజధాని తోడా యనుపట్టణము అతఁడొక తురక రాజువలన జయిం పఁబడి యూరువిడిచి తల దాఁచుకొనుటకు బదనూరునకువచ్చి మరలఁ దనరాజ్యమును దాను సంపాదించుకొనుట కనేకపర్యాయములు సేవ కులఁ బంపి విఫలప్రయత్నుండై యూరకుండెను. ఆరాజునకు తారా భాయి యనునొక చక్కని కూఁతురు గలదు. ఆబాలిక సూర్యరశ్మి రాని యంతఃపురముల గూపస్థమండూకమువలెఁ బడియుండుటకిష్టము లేక ఘోషావిడిచి విల్లువంచుటయుఁ గత్తిదూయుటయు గుఱ్ఱపు సవారు చేయుటయు పౌజులం గూర్చుకొని కయ్యములు నడపుటయు నేర్చి తండ్రినిమరలరాజ్యప్రతిష్ఠితునిఁజేయ నిచ్ఛగించె ఆవన్నెలాడి చక్కఁదనమును సాహసమును విని జయమల్లుఁడు తన కా కన్నియ నిమ్మని తండ్రికి సందేశ మంపెను. అమెతండ్రి యామాట కుత్తర మును దానియ్యక యాపని కూఁతురుమీఁదనే పెట్టగా నామె నాతండ్రి కెవడు మరల రాజ్యము సంపాదించి యిచ్చునో యతఁడే నాపాణిగ్రిహణము సేయుగాక" యని యుత్తరమిచ్చెను. జయమ ల్లుఁ డట్లుచేయుదునని ప్రమాణముచేసి నమ్మిక వొడమునట్లు సం చరించి తారాదేవినిం జూడగోర నామెతండ్రి దాని కంగీకరించె వారుభయులు పరస్పరసందర్శనము చేయువేళ జయమల్లు డామె చక్కఁదనముమ జూచి పరవశత్వముఁజెంది మతిభ్రిష్టుఁ డౌటచేతనో లేక రాజపుత్రు లందఱు మైకమునిమిత్తము ద్రావు నల్లమందు మద్ద తు మితిమీఱఁ ద్రావుటచేతనో యామె గౌరిరమునకుఁ దనగౌరవము నకుఁ దగనట్లు వర్తించి యాబాలిక నవమానించె. వెంటనే యభి మాననిధియగు నామెతండ్రి ఖడ్గపాణియై వచ్చి జయమల్లుని నిలుచు న్న వానిని నిలుచున్నయట్లె ఖండించివైచె.

జయమల్లుని మరణవార్తలు రాయమల్లు మహారాజునకుఁ దెలిసినప్పుడు వాని కొలువునందున్న రాజపుత్రు లనేకులు కోపోద్దీపితులై తారాదేవితండ్రినిం దెగటార్చి పగదీర్చుకొనక తప్పదని రాణాతో విన్నవించిరి. రాణా వారిని వారించి యిట్లనియె. రాజ్యము గోల్పోయి నిలువ నీడలేక మనయండనుండి యెట్టెటో కాలక్షేపము సేయుచున్న యారాజున కంత యవమానము చేసినవాఁడు నాకొడుకైనను జావవలసినవాఁడే, మానరక్షణమునకై యీసాహస మొనర్చిన యారాజుశౌర్యమునకు మెచ్చి బదనూరుభూముల నతని బహుమానములుగ నిచ్చుచున్నాను.

అంత గొన్నినాళ్ళకు పృథివిరాజు తనసోదరుని మరణమును తారాదేవి యొనర్చిన ప్రతిజ్ఞయు విని సత్వరంబుగబదనూరునకువచ్చి తన్ను వివాహమాడు మని యామెనడిగెను. తనతండ్రిని రాజ్యప్రతిష్ఠితుసేఁ జేయువానినేగాని వివాహమాడ నని యామె యెప్పటియట్ల పలుకుటయుఁ బృథివిరాజట్లు చేయుదునని శపథముచేయవానిసాహసములయందు నమ్మిక గలిగి తారాదేవినిచ్చి యామెతండ్రి యతని వివాహముచేసెను. వధూవరు లిరువురును తోడాపట్టణమును బట్టుకొనుటకు సమయము వెదకుచుండిరి. అంతలో తురకల మొహరము పండుగ వచ్చెను.

తురకరాజువాసిసైనికులుచుట్టములునానందపరవశులై యుత్సవములం జూచుచుండిరి. పండుగ కడపటిదినము నీళ్ళంబడిన వెనుక పీరులను శవాకారముగఁగట్టి తురకలు నాలుగువీథుల మొగలోబెట్టి వారియాచారప్రకారము దుఃఖించుచుండిరి. జను లనేకులు గుంపులుగూడి యావినోదమును జూచుచుండిరి. అప్పుడు గంభీరాకారములును చిత్రవేషములుం గలిగిన ముప్వురు మనుష్యులాగుంపులో గానఁబడిరి. తురకరాజు తనమేడమీఁదనుండి యాయుత్సవమునుజూచుచు

క్రొత్తమనుష్యులపై దృష్టినిలిపి వారెవ్వరని ప్రక్కవారి నడిగెను. ఆమాటలు వానినోటినుండి కడ దేరరాకమునుపె రివ్వురివ్వున యొక బాణ మాగుంపులోనుండి వెడలి నిలుచున్న యారాజును గుభాలున నేలంబడవైచి శవముగఁజేసెను. అంతట నగరమంతయుఁ గళవళము పుట్టెను. ఉత్సవముఁ జూడవచ్చినవారు నిర్విణ్ణులై పరుగెత్తిరి. మ్లేచ్ఛసైనికులు యదాయడలైరి. ఆక్రొత్తమనుష్యులు మువ్వురు పృథ్వీరాజు తారాదేవి వారిసేవకుఁడుదక్క మరొకరుగారు. వారు వచ్చిన పని నిర్వర్తింపఁబడినదిగదాయని యూరుబైటకుఁ బోవుచుండిరి. అప్పుడు కొందఱుమ్లేచ్ఛసైనికులు ధైర్యముఁ దెచ్చుకొని వారినిపట్టుమ నారంభించిరి. ఆముువ్వురు వారిని లెక్కసేయక చనుచుండ నగరద్వారమువద్ద కొండవంటి యొకయేనుఁగు వారికడ్డమువచ్చె. తోడనే తారాదేవి యొరలోనుండి ఖడ్గము నూడఁబెఱికి ఝళిపించి తొండమును నఱికి యేనుఁగును పీనుఁగును గావించె.

అనంతర మాముువ్వురు నూరుబైట సిద్ధముగానున్న తమసైన్యముంగలసికొని యనాయకమై యరాజకమైన మ్లేచ్ఛసైన్యము పయింబడి దానిం జెల్లాచెదరుగాఁజేసిరి. కాలికొలఁది పరుగెత్తినవారు తక్కఁదక్కిన మ్లేచ్ఛులుహతులైరి. తారాదేవియొక్క మనోరథము సంపూర్ణముగ సఫలమయ్యె. తోడానగర మామెతండ్రి స్వాధీనమాయె. పాటితురకరాజునకు జరిగిన పరాభవమునువిని యజమీరును బాలించుచున్న మ్లేచ్ఛప్రభువు పృథ్వీరాజును దండింపవలయునని నిశ్చయించుకొనెను. ఆవార్తవిని పృథివిరాజు వాఁడు తనమీఁదికివచ్చువఱకుఁ గనిపెట్టికొనియుండక తానే వానిమీఁదికి ముందుగ యుద్ధమునకు సిద్ధమయి సైన్యముం గూర్చుకొని తనజాడ వారెఱుంగకుండ నడిరేయి పయనముజేసి యుదయమగునప్పటి కాయూరుఁ జేరి వారిదళంబుల నోడించి కోట నొక్కపూటలోఁ బట్టుకొనియె.

రాయమల్లుఁడు తనకుమారుని మహాసాహసములు విని యా నందపరవశుఁడై వానిం దనసన్నిధికి రమ్మని వర్తమాన మంపె. జయమల్లుఁడు కులమునకు పరాభవముఁదెచ్చి దుర్మరణము నొందుటయు సంగునిజాడ యొక్కింతయుఁ దెలియరాకుండుటయుఁ దలంచి రాయమల్లుఁడు పృథివిరాజొక్కఁడే తనకుం గొడుకని యెంచి చిత్తూరునకు రావించి వానిని సబహుమానముగా నాదరించె. పృథివిరాజును తండ్రికి విధేయుఁడై యుండఁదలంచెను కాని, వానికిఁ జిత్తూరునగరమున శూరకర్మములుమాని సోమరియై భోగపరాయణుఁడై యుండుట కిష్టము లేకపోవుటచే తనయిచ్చవచ్చిన తెఱంగున వీరవిహారము సలుపుటకు మీవారు దేశమున పడమటిభాగమునను కమల్‌మియర్‌కోట లోఁ గాఁపురముచేయఁదలంచి యచ్చటికిఁబోయెను. ఆకోట యిప్పుడు మిక్కిలిపాడుపడియున్నను మిగిలినభాగములం జూచువారికి దాని తొంటిగొప్పతనము తెలియకపోదు. దృఢమయిన ప్రాకారములు మహోన్నతములయిన గోపురములు బురుజులు మంచిమంచి మేడలు గలిగి యాకాలమున నది సకలసౌఖ్యనిధానమై శత్రుదుర్భేద్యమయి యుండెను. పృథివిరాజందు భార్యాసమేతుఁడై వసియించి దుష్టుల దండించుచు దొంగలనడఁచుచు హాయిగనుండె. రాజపుత్రులనేకులా మహావీరునిఁ గొలుచుటకువచ్చి యాతఁడు చిచ్చులుకుమన్న నురుకుటకు సిద్ధముగనుండిరి. ఇట్లుండి పృథ్విరాజొకనాఁడు తండ్రిని దర్శించుటకు చిత్తూరునకువచ్చెను. అప్పుడు రాయమల్లుఁడు మాళవరాజు యొక్క సేవకునితో మిక్కిలి చనువిచ్చి తనగౌరవమునకు దగనట్లు వానితో మాటలాడఁజొచ్చె. ఆసంభాషణమువిని పృథ్విరాజు సేవకుఁడు చనినవెనుక తండ్రినిఁబిలిచి యట్టినీచుల కంతచనువిచ్చి మాట్లాడుట రాణావంటివాని కనుచితమనియు నాఁడుజరిగిన సంభాషణము తనకేకాక రాజబంధువుల కండఱకు నలుకపుట్టించినదనియు నట్టి

చనువులింక నియ్యఁగూడదనియుఁజెప్పెను. రాయమల్లుఁడామాటలు విని కుమారునితో “నాయనా! నీవు మహాసాహసుండవు. రాజులం బట్టి బంధింపఁగలవు. నాకంత ప్రయోజకత్వములేదు. నేను చుట్టుపక్క రాజులతో మంచిమాటచేసికొని మెట్టెటో నారాజ్యముఁ గాపాడుకొనుచున్నాఁడ” నని ప్రత్యుత్తరమిచ్చెను.

పృథ్వీరాజదివిని తండ్రికి మాటలతో నుత్తరమియ్యక వెంటనే యచ్చోటువాసి తనసెలవునకుంబోయి యొకసేనంగూర్చుకొని మాళవదేశముపై దండువిడిసె. మాళవరాజు వాని దౌర్జన్యమునకు నైపక మహాసేనాసమేతుఁడై వేశ్యాంగనల యాటపాటలు హెగ్గడల హెచ్చరికలు వందిమాగధుల కైవారములు సెలంగ మహేంద్రవైభవముతోఁ గయ్యమునకు బయలుదేరెను. ఈమహాసేన యొకనాటిరేయి యొకచోవిడిసియుండి సంగీతసాహిత్యములతో మహాకోలాహలముచేయుచుండ రాజుగుడారమునకుసమీపమునపెద్దకలకలముపుట్టెను.అదియేమగుననికొందఱుచూచునప్పటికిశూరశిఖామణులు కొందఱాయుధపాణులై గుఱ్ఱములనెక్కి శిబిరముంజొచ్చినిర్భయముగా రాజున్నకడ కరుగుచుండిరి. ఆకస్మికముగా శత్రువులు పయింబడుటచే మాళవసైనికులు నిశ్చేష్టులై పగతురను నిలువరింప నేరరైరి. అప్పుడు పృథ్వీరాజు సింగపుంగొదమవోలె మాళవరాజున్న గుడారములోనికి దుమికియామహారాజుం జెరబట్ట వానిసైనికులు రిచ్చవడి చూచుచుండ వానిం గొనిపోయెను. అంతఁ గొంతవడికి మాళవసైనికులు తెచ్చవాటునుండి మేలుకాంచి యాయుధముల సంగ్రహించి తమరాజును విడిపించుటకు పృథ్వీరాజు వెన్నంటి తఱుమజొచ్చిరి. ఆ సైనికులు తనకుఁ గూతవేటుదూరంబునకు వచ్చినప్పుడు పృథ్వీరాజు వారిని వారించి సమీపమునకు రావలదనియు సాహసించి రాజును విడిపించుటకు వచ్చిరేని రాజు నప్పుడ పొడిచి చంపెదననియు రాక

నిలిచినపక్షమున రాజున కేయపాయమును సేయననియు మాళవరాజును తనజనకుని పాదములపయిం బడవైచి మఱల వానిని విడిచిపుత్తుననియు వారికి సందేశమంపెను. ఆమాటలువిని మాళవసైనికులు వెనుకకుం జనిరి.

పృథ్వీరాజు మాళవేంద్రుని దీసికొని చిత్తూరునకుఁ బోవునప్పటికి రాయమల్లుఁడు కొలువుదీర్చియుండె. వీరగసావతారుఁ డగుకొడుకును బిక్కమొగముతోనున్న మాళవపతినిఁ జూచి రాయమల్లుఁడు మాళవపతి నదివరకెన్నఁడు జూచియుండమి నతఁడెవ్వరని కొడుకుం దఱచితఱచి యడిగెను. కొడుకు తండ్రితో "నీతఁడెవ్వఁడో నేను చెప్పను. తొల్లి మిక్కిలి చనువుతో మీతో మాటలాడిన యాసేవకునిం బిలిపింపుఁడు. అతఁడే చెప్పఁగలఁ" డని పలికెను. రాణా యాసేవకునిం బిలిపించి యతఁ డెవ్వఁడని యడుగ నాతఁడు మహేంద్ర వైభవుఁడగు తనయేలిక యంతటి దశలో నుండుట గనుంగొని బిచ్చవడి నోట మాటరాక మెట్టకేల కతఁడు మాళవేంద్రుఁ డని రాణాతో విన్నవించెను. రాణాయును వాని సామాన్యున ట్లాదరింపక రాజునకుఁ దగుగౌరవముతో నాదరించి చిత్తూరులోఁ గొన్ని దినములుంచి వానివద్దనుండి కప్పము గ్రహించి లోఁబఱచుకొని సబహుమానముగ విడిచిపుచ్చె. పృథ్వీరాజు తండ్రికి తనపరితాపముఁ జూపగలిగెగదా యని సంతసించి మఱల కమలమియరుకోటకుం జనియె ఇట్టిశూరకర్మల పృథివిరాజవలీలగా ననాయాసముగఁ జేయుచుండును గాని వానికై పెద్దప్రయత్నముఁ జేయనక్కరలేదు.

పృథివిరాజు కమలమీయరుకోటకుఁ బోయి కొన్నిదినములుండునప్పటికి వాని పినతండ్రి యగు సురేశమల్లుఁడు రాణాపై తిరుగబాటు చేసి యుద్ధమునకు సిద్ధమయ్యెను. పూర్వము చారుణీదేవి యర్చకురాలు తనకు ప్రభుత్వము రాజ్యము వచ్చునని చెప్పినమాట

మనసులో నుంచుకొని సురేశమల్లుఁడది యెంతకాలమునకు సఫలము కాదయ్యెనని వగచి సాహసేలక్ష్మి! యనుమాట నమ్మి భుజబలము చేత రాజ్యము సంపాదింపఁదలఁచి తనసోదరుఁడును మహారాణాయు నగురాయమల్లునిమీఁద గత్తికట్టెను. రాణాకు మున్ను మిక్కిలినమ్మకము గలవాఁడును దగ్గరచుట్టము నగు సారంగదేవుఁ డనురాజపుత్రుఁడు రాజద్రోహియై సురేశమల్లునితోఁ జేరెను. వారిరువురుం గలిసి మీవారు దేశముంజొచ్చి గ్రామంబుల దోఁచుకొని గృహంబుల పరశురామప్రీతి గావించి కొంత దేశము నాక్రమించిరి. రాయమల్లుఁడు తనసైన్యంబులం గూర్చుకొని వారిపై నడచి యెదుర్కొని సంకుల సమరము గావించి తాను నొక్క సామాన్యపుజోదువలెపోరిఁయిరువది రెండుగాయములఁ దిని యేమియుఁ జేయలేక యుండెను. అప్పుడు రాయమల్లుని సైన్యము పగతురచేత నిర్మూలింపఁబడుటకు సిద్ధముగ నుండెను. అంతలో పృథివిరాజు వచ్చి తండ్రిసేన నిర్మూలింపఁబడకుండఁ గాపాడెను. గాని శత్రువులను పరాజయము నొందింపలేదు.

ఉభయులసేనలు నొండొంటికి తీసిపోక వెనుకంజ యిడకచావునకు వెరువక రాత్రులాయుధములమీఁదనే బవ్వళించుచు నెప్పుడు దెల్లవారు నెప్పుడు పోరుసేయఁ గలుగునని యువ్విళులూరుచు దినములం బుచ్చుచుండిరి. అట్లుండ నొకనాఁడు రాత్రి సురేశమల్లుఁడు మంచముపైఁ బండుకొని వణిగ్వైద్యుఁ డగునొక మంగలివానిచే గాయముల గుట్టించుకొనుచుండెను. అప్పుడు పృథివిరాజు మెల్లమెల్లగ శిబిరముంజొచ్చి సైనికులచేఁ జిక్కకుండ పినతండ్రి గుడారమునకు వచ్చి వానికట్టెదుట నిలిచెను. వానింజూచి సురేశమల్లుఁడు భయవిస్మయములతో బలిమిని లేచెను. లేచునప్పటి కదివరకు కుట్టినగాయములన్నియుఁ బటాలున బగిలి నెత్తురులం గ్రిక్కిఱిసెను. పృథివిరాజు వానిసంభ్రమము వారించి భయములేదని సేమమడిగెను. సురేశ

మల్లుఁడును "నాయనా! సుఖముగానున్నాను. నీరాకచే మఱింత సుఖము గలిగినది సుమీ" యని కుమారునకుఁ బ్రత్యుత్తరమిచ్చెను. పిదప పృథివిరాజు "నేనుమిక్కిలి యాఁకలిగొనియున్నాను నిన్నెప్పుడు చూతునోయెట్లుచూతునో యని బెంగగొని మాతండ్రినైనం దర్శింపక యన్నమైనం దినక నీతావునకు వచ్చితిని. నాకించుక యన్నము బెట్టింపు"మని పినతండ్రిని బ్రార్థించె. సురేశమల్లుఁడు నన్నము తెప్పింప పగలెల్ల నొకరిప్రాణంబుల నొకరుదీసికొనుటకై ప్రయత్నము చేసిన యారాచకొడుకు లిరువురు నారాత్రి జుట్టరికము నెయ్యము మెరయ కలసి మెలసి భుజించిరి. అనంతరము పృథివిరాజు పినతండ్రితో "రేపు మన కయ్యమును ముగింపవలయు"నని పలుక "నాయనా! పెందలకడ రమ్ము పొమ్మ"ని సురేశమల్లుఁడు బదులుచెప్పి వానింబుచ్చె.

మరునాఁడుదయమున యుద్ధమారంభ మయ్యెను. ఆకయ్యమున నెప్పటియట్లు పృథ్వీరాజే జయమునందె. సారంగదేవుఁడును సురేశమల్లుఁడును యుద్ధభూమివిడిచి పలాయతులైరి. పృథ్వీరాజు వారిం దరుముకొనిపోవ నెడనెడ చిన్నచిన్నపోరాటంబులు జరుగుచుండె. వానిలోనయిత మెప్పుడు పృథ్వీరాజే విజయమునందుచువచ్చె. ప్రళయాంతకునిఁబోలు రాచకుమారునిదాడి కోడి సురేశమల్లెట్టకేలకొక యడవిం జొచ్చి యందు నట్టనడుమ దుర్భేద్యమగు నొకప్రదేశము నెలవుఁగా జేసికొని పగతురకు తమజాడలు తెలియ వనుకొని యచ్చటనుండెను. అట్లుండ నొకనాఁటి రేయి నిశ్శబ్దమైన యడవిలో కత్తులరాపిడిచప్పుడువినంబడియె. అదివిని సురేశమల్లుఁడు మాయన్నకొడుకు వచ్చినట్లు తోఁచుచున్నదని యింక నేమోచెప్పఁ బోవుచుండఁగనే పృథ్వీరాజు సపరివారముగ వానిముందరకు దుమికి ఖడ్గముతోఁ బినతండ్రి నొక్కవ్రేటు వేయుటయు సారంగదేవుఁడు

వానికడ్డమువచ్చి సు రేశమల్లుఁడు గాయములచేఁ బీడితుఁడై కదలలేక యున్నవాఁడు. తొల్లి యిరువదిదెబ్బలకైనను సరకుసేయని యీ శూరుఁ డిప్పుడొక గుద్దుకైన నోపలేఁడు గావున నవధ్యుఁ డని పలికె. అప్పుడు సు రేశమల్లుఁడు నేను పోయిన నాయన్నకొడుకు చేతిలోనే గదా యని పృథ్వీరాజువంకఁ దిరిగి కుమారా! కయ్యము మాను ము. నీవు నన్ను జంపినది యొక లెక్కలోనిది గాదు. నాకుఁ గుమారులు కలరు వారు రాజపుత్రు లగుటచే వారికి సాయసంప త్తులు గలుగును కాని మేము నిన్నే చంపుట సంభవించినయెడల చి త్తూరుగతి యేమగునో? నిన్ను జంపి నేనెల్లకాలము లోకనిందపాలు గావలసివచ్చు" నని వీరపురుషోచితముగఁ బలికెను. దయనీయముల కు పినతండ్రి పలుకులు విని పృథివిరాజు హృదయము గరుగఁ గత్తు లొరలో నుంచుడని తనసైనికుల కానతిచ్చెను. పిమ్మట పినతండ్రి యుం గొడుకును నొండొరుల బిగ్గగౌగిలించుకొనిరి. తోడనే నిరుబల ములు తమతమప్రాతపగలు కొండొకతడవు మరచి మరల కలసిమెల సి కూరుచుండి యిష్టగోష్ఠిం బ్రవర్తిల్లిరి.

అనంతరము పృథ్వీరాజు పినతండ్రిని జూచి "అయ్యా! నేనువ చ్చునప్పటికి మీరేమిచేయుచుండి"రని యడిగెను. చేయుటకేమి యున్నది, ఉన్నమట్టుకు దినియుబుసుపోక పిచ్చపాడి చెప్పుకొనుచుం టిమని సు రేశమల్లు డుత్తరమిచ్చెను. "కాని నీజాడ లరయుటకయి నేను విశ్వప్రయత్నము చేయుచుండుట నీవెఱిఁగియు నింత యజాగ్రి త్తతోనేలయుంటి"వని మరల గుమారుఁ డడుగఁ బినతండ్రి యిట్లనియె. "నాయనా! నే నేమి చేయగలను? నీవు న న్నెక్కడ కాలూది నిలువకుండ దఱుముచుంటివి. నే నెచ్చటనైన తలదాచుకో వలయునుగదా! అందుచే నిచ్చట నుంటి" నని సు రేశమల్లుఁడుప్రత్యు త్తర మిచ్చె. ఆరాత్రి యట్లుగడపి మఱునాడుదయమున పృథివిరాజు

పినతండ్రినిజూచి యచ్చటకు సమీపమున నున్న భవానీదేవాలయమునకు దనతోవచ్చి యాదేవికి బలి సమర్పింపు మని యడిగెను. సురేశమల్లుఁడు లోకానుభవ మెఱింగినవా డగుటచే పృథివిరాజు దన కీనెపమున నేదేని యపాయము సేయునని యనుమానించియో యంతకుమున్న కొన్నినెలలనుండి తెరపిలేక పోరులుసలుపుచు గాయములచే బీడితుఁడై కదలజాలకయో పృథివిరాజును జూచి క్రిందటి రాతిరి తగిలినగట్టిదెబ్బకే తాను కదలజాల కున్నవాఁడనని వంకపెట్టి తనబదులు సారంగదేవునిం గొంపొమ్మని యొత్తి పలికెను.

ఎవరువచ్చినను మంచిదేయని పృథ్వీరాజు సారంగదేవుని దన వెంట నాలయంబునకుం గొంపోయి యచ్చట వానింజంప నుంకించుటయు నావీరుడును పృథివిరాజునకులొంగక కొంతసేపు పోరొనర్చి తుదకు వానిచేత హతుఁడయ్యెను. తొల్లి మీవారు రాజులలో మొట్ట మొదటివానికి నప్రతిహతమగు ఖడ్గము బ్రసాదించిన యామహాదేవికి బృథివిరాజు భక్తిమెరయ సారంగదేవుని తల బలిగా సమర్పించి తండ్రికిఁగల ప్రీతపగ దీర్చికొని సంతుష్టాంత రంగుఁడయ్యె.

సారంగదేవుని దుర్మరణవార్తలు విని సురేశమల్లు డేదియో నెపముపెట్టి యన్నకొడుకుతో జనకపోవుట చాలమేలయ్యెనని సంతసించి గుఱ్ఱమునెక్కి ప్రాణభయంబున నచ్చోటు విడిచి సపరివారముగ నొండొకయెడకు బోవదలంచి మున్ను తానుజయించి యాక్రమించిన భూములకుం జనియె. ఆభూములలో నిరపాయముగ దాను నన్నినాళ్ళనుండి పగతురబారి కోడి తానందు నిలువలేనప్పుడు తనభూములు రాణాకు దక్కనిచ్చుట కిష్టము లేక సురేశమల్లుఁడు రాజుకన్న బలవంతులు బ్రాహ్మణులేకదాయని నమ్మి వారికి దానమిచ్చినమాన్యములు రాజు మరల గ్రహించుటకు భయపడునని యాభూములను వారికి దానమిచ్చి తానెందేనిం జనియె రాణా

సురేశమల్లుఁడు చేసిన యాపనికి గోపోద్దీపితుఁడయ్యు బ్రాహ్మణ క్షేత్రములను మరల గ్రహించినచో దానును దన వంశస్థులును నఱువదివేల యేండ్లు నరకకూపముల బాధపడవలయు నని నమ్మి యాబాధలు పడుట కిష్టములేక బ్రాహ్మణుల జోలికి పోవక యొక దండముపెట్టి యూరకుండెను.

అనంతరము సురేశమల్లుడు మీవారు శాశ్వతముగ విడిచి దక్షిణాభిముఖుఁడై చని యడవుల కొండల గుహ్మరుచుండ నొక్కనాఁడొక యాఁడుమేక తనపిల్లను తోడేలు కబళింపకుండ సంరక్షించు చుండగా జూచితొల్లిచారణీదేవి యర్చకురాలు తనకు జెప్పిన భవిష్యద్వృత్తాంతంబు జ్ఞప్తికిం దెచ్చుకొని యాసమయ మిప్పుడు వచ్చినదని యామేకను బిల్లను తోడేలు బారినుండికాపాడి యాప్రాంతములందె చరియించుచు మెల్లమెల్లగ నచ్చటి యాట వికుల లోబరచుకొని చుట్టుపక్కలదేశ మాక్రమించుకొని దేవల యనుగ్రామము దనకు నివాసముగ జేసికొని యం దొకకోట గట్టి రాజై తన జీవిత శేష మచ్చటనే గడపెను దైవయోగమున సురేశ మల్లుడు తాను చిత్తూరునకు దొంగమైనను యచ్చటం బుట్టిపెరిగిన వాఁడగుటచే నాపట్టణమందును మీవారుదేశమునందును ప్రేమము విడువజాలక తానాపురమందభిమానము గలవాఁ డగుటయేగాక యెల్లయపుడు చిత్తూరునే మాతృస్థానముగ నెంచుకొనవలసిన దని తనకొడుకుల కవసానకాలమున జెప్పిపోయె. ఆమాటలయందు వాని కొడులుకు విశ్వాసముంచుటచేతనే చిత్తూరున కగ్బరుచక్రవర్తివలన మహాపాయము వాటిల్ల రాణా యప్రయోజకుడై చావునకు వెఱచి యిల్లుదూరినప్పుడు సురేశమల్లుని తనయులలో నొకండు చిత్తూరు నిమిత్తము తనప్రాణములు ధారవోసె.

ఇట్లు పినతండ్రిని స్వదేశమునుండి పారదోలి యనంతరము

పృథివిరాజుతనయన్నయగు సంగుడప్పటికినిజీవించియున్నవాఁడనియు వానికి వివాహ ప్రయత్నములు జరుగుచున్నవనియు విని తొల్లి చారణీదేవి యర్చకురాలు చెప్పినమాట తలంచి సంగుడు జీవించి యుండినచో తనకు రాజయోగము బట్టదని వానిని వెదకి వెదకి జంపుటకు బయనమైపోవ నిశ్చయించుకొనియె అంతలో వానిసోదరి వచ్చి దీనమగు తనవృత్తాంతముజెప్పి సోదరుని పయన మాపెను

రాయమల్లుడు తనకూఁతును సిరోహి దేశపు రాజున కిచ్చి వివాహము చేసెను ఆకన్యక చక్కఁదనంబునకును సౌజన్యతకును బాతివ్రత్యమునకును బేరువడసిన యోగ్యురాలైనను మగఁ డామెను నిరంతరమును దగిన యాదరణము సేయక నీచముగాజూచుచుండెను. ఆరాజు నల్లమందు మద్దత్తు మితిమీరునట్లు ద్రావి యొడలెఱుంగక భార్యను కొప్పుపట్టి పాన్పుమీఁదనుండి లాగి రాత్రియంతయు గటికి నేలం బండుకొన జేయుచుండెను. అభిజాత్యముగల రాజకన్యక కంత కంటె నెక్కుడవమానము లేదు. కావున యాబాలిక తనదైన్యమును బాపు మని సోదరునకు విజ్ఞాపనమునంపుకొనియె. పృథివిరాజుసోదరీ వత్సలుండై సంగునిమీఁదికి బోవలసిన పయనము మాని సిరోహి పట్టణమునకు బయనిమైపోయి యానగరముజేరి యర్ధరాత్రిమున నెవ్వ రెఱుంగకుండ కోటగోడలందాటి యంతఃపురము బ్రవేశించి పండుకొన్నగదిలో నిలిచె అప్పుడు సిరోహిరాజు నల్లమందుమత్తుచే మేనుమఱచి మంచముపై బవ్వళించి యుండె వానిభార్యయు. భర్త చేత నవమానింపబడి వట్టినేలం బండుకొని యుండె.

పృథివిరాజు తన గారాపు జెలియలి దురవస్థ గన్నులారఁ గనుంగొని కోపావేశంబున పరవశత్వంబుజెంది పరాభవానలముం జల్లార్పఁగోరి నిద్రించుచున్న మరఁది మీఁదికి ఖడ్గము నెత్తెను. తన యన్న మగనిం దెగటార్చుటకు నుంకించుట జూచి యాబాలికమహా

పతివ్రత యగుటచే నట్టి క్రూరకార్యమున కిష్టపడక సోదరుని వారించి భర్తప్రాణముల రక్షించెను. ఈకళవళములో సిరోహిరాజు మేలుకాంచి యమదూతవలె నెదుట నిలిచిన బావంజూచి భయముచే వడఁకుచుండ పృథిరాజు వాని నుద్దేశించియిట్లనియె. "నీవు మా చెలియలికిఁ గావించినపరాభవమునకుఁ దగిన ప్రాయశ్చిత్తంబుజెప్పె దవినుము. నీ వామె పాదములంబడి వేఁడుకొని యామెచెప్పుల నీ తలం దాల్చితివా నిన్నురక్షించెద. లేనిచో నొక్కయేటుననిన్నుఁ గడతేర్చెద నని గంభీరనాదముతోఁ బలుక నానల్లమందుపిరికి చేయు న దేమియు లేక ప్రాణభయంబుననాపని కొడంబడి యట్లు చేసె.

తనచెప్పినచొప్పున నతఁడు కావించినతోడనే పృథివిరాజు మరదిం గౌఁగిలించుకొని వానిపై నెనరు కలిగి యాదరింప వారిరువురు కలసిమెలిసి సౌహార్దమున నుండిరి; కాని రాచకొమరునకు భార్యచెప్పులు నెత్తినిదాల్చుటకన్న నెక్కుడపమానము లేదు. కనుక సిరోహిరాజుహృదయమున నీ పరాభవాగ్ని రవులుచుండె. పందయగుటచే నప్పుడేమియుఁ జేయలేక యతఁడు సమయమునకయి నిరీక్షించుచుండె. పృథివిరాజు రాచనగరు దొంగతనముగాఁ బ్రవే శించినను రాజుగారికి స్నేహపాత్రుఁడై విందుల నారగించుచు మహా నందమున కొన్నిదినము లచ్చటపుచ్చి తన కమల్మియరుకోటకుబోవ బయసమై మరఁదని వీడుకొనియె. సిరోహి మంచి మంచి మిఠాయి లకుబ్రసిద్ధికెక్కిన దగుటచే రాజు మార్గమధ్యమున దినుమని పృథి విరాజునకు గొన్ని భక్ష్యముల నొసంగె.

పృథివిరాజు తనపై తనతండ్రిపై గత్తికట్టిన పినతండ్రిశిబిర మునకుబోయి నిర్భయముగా నిశ్శంకముగ నన్నముతిన సాహసికుఁ డగుటచే.దన బావయిచ్చిన భక్ష్యములనుగూడ మనంబున నేయను మానంబు నిలువక పుచ్చుకొని మార్గమధ్యమున వానిని భక్షిం

చెను. భక్షించి కొంత దవ్వరుగునప్పటికి వానిగుండెలు బరు వెక్కెను. నోట మాట రాదయ్యెను గుఱ్ఱముపై గూరుచుండ లేక పోయెను. అతఁ డిప్పటికి దనకోటకు కొంతదూరములోనున్న మామాదేవి యాలయమువద్దకు వచ్చె. అక్కడనుండి యొకయడుగైన గదలలేక యతఁడు కడసారి తనప్రియురాలిని గనుంగొనఁగోరి తారాదేవి నచ్చటికి రమ్మని వర్తమానమంపెను; కాని యాదేవి వచ్చులోపలనె తనకు బ్రియనివాసంబైన యాకోటపై దృష్టినిలిపి చూచుచుసిరోహిరాజుచేసిన విషప్రయోగముకతంబున ప్రాణంబులవిడిచె.

అనంతరము తారాదేవి యచ్చటకు వచ్చి భర్తకళేబరమును గాంచి విలపించి వీరపుత్రికయు వీరపత్నియు నగుటంజేసి పతివ్రతల మార్గ మనుసరింపనిశ్చయించి భర్తకు జితపజిపించిసిర్విచారముగ స్వయంవరమునకరుగు కన్యకవోలె చిచ్చురికి తన భర్తతో గూడ పరమ పదమొందెను. ఇప్పటికి కాదంపతులు గతించి రమారమి నాలుగువందల సంవత్సరము లైనను మామాదేవిగుడివద్ద నేటికిని తద్దంపతులు తమదేహములు నగ్నిహోత్రున కాహుతిచేసినస్థలము గనఁబడుచుండునఁట. పృథివిరాజు తనచేసిన యుద్ధములన్నిఁటియందు జయము కపటోపాయములచే నొందినను మొత్తముమీఁద నతఁడధికసాహసుండనియు రణమున వెనుకంజ యిడని వాఁడనియుపిఱికి కండలేనివాఁ డనియు జెప్పవచ్చును.

అన్నను జంపి తాను చిత్తూరు సింహాసన మెక్కఁ దలంచుట యాతనియందొక గొప్పలోపమే యనవచ్చును. ఈతఁడు గాకరాజపుత్రిలలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన పృథివిరా జింకొకఁడు కలడు. అతఁడు చోహణవంశస్థుడు ఢిల్లీచక్రవర్తి అతఁడే మహమ్మదు గోరీ యను మేచ్ఛరాజును మొట్ట మొదట జయించి మరల నామేచ్ఛుఁడు కన్యాకుబ్జభూపాలుఁ డగుజయచంద్రుని గలిసి యెత్తివచ్చినప్పుడు

వారిరువురచే నోడింపఁబడి రణముఖంబున ప్రాణములు విడిచినశూర శిఖామణి. చిత్తూరు రాజకుమారుఁడగు నీ పృథివి రాజును ఢిల్లీచక్రవర్తి-యగు నాపృథివిరాజని చదువరులు భ్రమచెందఁదగదు. కాలాంతర మందాపృథివిరాజు చరిత్రముగూడ ప్రకటింపఁబడును.

---

# రాణాసంగుఁడు

పదునారవ శాతాబ్ద ప్రారంభమునందు మీవారు సంస్థానమునం దొక మారుమూల నొక గ్రామమున బీఁదకాఁపు కుటుంబమొకటి యుండెను. ఒక చిన్న మేఁకలమంద నాలుగుకాళ్ళపశువులు కట్టుకొను మొతకగుడ్డలు మొదలగునవి తక్క వారికితర సొమ్మేమియు లేదు. ప్రపంచమునం దెంతటి దరిద్రులున్నను వారికన్న దరిద్రులు కొందఱు కనబడుచునేయుందురు. ఆకుటుంబయజమాని యొకనాఁడు పొలమునుండి వచ్చుచుండ దారిలో చినుగుగుడ్డలు కట్టుకొని యన్నము లేక మలమలమాడుచున్న యొకక్రొత్తమనుష్యుఁడు వాని కగుపడెను. పశువులఁగాచుట కెవనినైన నొకసేవకునిఁ బెట్టుకొనుట కది వరకే యోచించుచుండుటచే నతఁడీక్రొత్తవాని నాపనియందు నియోగించెను. ఆకాఁపువాని భార్య యీసేవకుని దెచ్చుట కిష్టపడక కొంచెము సణుగుకొని యిట్లనియె. "బ్రాహ్మణులకు బిచ్చగాండ్రకునన్నము పెట్టుట పున్నెముగాని తక్కినవాండ్రకు దానముచేసిన నేమిలాభము. దేశములో దుర్మార్గులనేకులు పనిపాటలుమాని తిరుగుచుందురు

ఈమహానుభావుఁ డెంతటివాఁడో మన మే మెఱుఁగుదుము ? అదిగాక పశువులను మేపుటమాత్రి మంత పైపై నున్నదా? ఆపని యందఱు జేయఁగలరా? చిన్నప్పటినుండియు యలవాటుపడిన కుఱ్ఱవాండ్రికె లొంగునుగాని పశువులు క్రొత్తవానిని దరికిఁ జేరనిచ్చునా? ఈమనుష్యుని వలన మనపని యగునని తోఁచదు."

భార్య పలుకులు పెనిమిటి మొదట సరకుచేయలేదు. కాని పిమ్మటఁ గొన్నినాళ్ళకవియే నిశ్చయము లయ్యెను. ఏలయన సరిగా నడువనైనలేనికుఱ్ఱవాండ్రికఱ్ఱపుచ్చుకొని యదలించినంత మాత్రిమున గడగడ వడఁకి దారినిఁ బోయి దారిని వచ్చుమోటపశువు లాక్రొత్తకాపరిని లక్ష్యముసేయక విజృంభించి తిరుగఁజొచ్చెను. యజమానుఁ డాసేవకుని తెలివితేటలు గనిపెట్టి యతఁ డందుకు పనికిరాఁడని యాపనిలోనుండి తప్పించి యింటిపనులు సేయుమని వానిని నియోగించెను. అతని దురదృష్ట మేమోకాని యాతఁ డింటిపనులకుం బనికి రాఁడయ్యె ఒకనాఁడు యజమానునిభార్య రొట్టెలు కాల్చుచు తానేదో మఱియొక పనిమీఁద లోనికిం బోయి యవి మాడిపోకుండా జూచుచుండుమని సేవకునకానతిచ్చెను. సేవకుఁడుసరే యని యామాటమరచిపోయి పరధ్యానముగా నుండునప్పటి కంతలోరొట్టెలు మాడి బొగ్గులయ్యెను. ఆపూట భోజనము బుద్ధిలేని సోమరిపోతు మూలమున నిష్కారణముగఁ జెడిపోయెగదాయని యజమానుని భార్యయేగాక యింటిలోనున్న వారందఱు వానిపై మండిపడి "రొట్టెలు కమ్మగా వేఁగినప్పుడు పొట్టబద్దలగునట్లు తినుటకు నీవు నోరు తెరవఁగలవుగాని యవి మాడిపోవుచున్నవేమో చూచుచుటకుఁ గన్నులు తెరవలేవు. నేవు మా కక్కరలేదు. నీకిష్టమువచ్చిన చోటికిఁ బొ" మ్మని చెప్పిరి.

ఆమందభాగ్యుఁ డామాటలు పడి బదులుచెప్పక యాయిల్లు

విడిచి మెల్లఁగ నవతలకు నడచెను. పశువుల కాపరిగను వంటలవాడుగను పనికిరాకున్న నతఁడు తెలివి తేటలు లేనివాఁడు కాఁడు. అతని శరీరము సుందరమయ్యు దృఢమయి చాకచక్యము కలదియు కష్టము నకోర్చునదియునై యుండెను. రాజపుత్రదేశమందుఁ బుట్టినవాఁడెవ్వఁడుచేత నాయుధము లేక సంచరింపఁడు. ఈపురుషుఁడు నిరాయుధుండగుటయేగాక నిర్భాగ్యుఁడై దారిద్ర్యమును వెళ్ళఁబోయుచుండెను. ధగ ధగ లాడు నతనిశరీరచ్ఛాయనుబట్టి యతఁడు కాపువాఁడనుకొనుటకు వీలు లేదు.

రాయమల్లున జ్యేష్ఠకుమారుఁ డగుసంగుఁడు వాఁడట్లొకమఠమువద్ద నొకరాజపుత్రవీరుని సహాయమున నెట్టెటో ప్రాణములు దక్కించుకొని యావలకు దాఁటి మహారాజు కుమారుని కొఱకెవ్వఱును పశువుల కాపరులయిండ్లు వెదకి రని నమ్మిగొల్లవాండ్రతో గలిసి మెలసి కాలక్షేపముఁ జేయుచుండెను. తాను నమ్మిన గొల్లలే తన్ను లేవఁగొట్టినప్పుడు పట్టుట కాయుధము తినుట కన్నము తలఁదాఁచుకొనుటకు పంచ కష్టసుఖములు జెప్పుకొనుటకు మిత్రుఁడు లేని విదేశములో నిఁక నెట్లు బ్రతుకుదునాయనిసంగుఁడు విచారింపఁజొచ్చెను. అట్లు విచారించుచు నతఁ డేమియుఁ దోఁచక నడవులఁ దిరుగుచుండ నొకనాఁడు కొందఱు గుఱ్ఱపురౌతులు వాని కగపడి వెంటనే గుఱ్ఱమునుండి దిగి వినయమున వానిపాదములపైఁ బడి నమస్కరించిరి. శరీరమునకు గాయపుమచ్చలు కొంతమార్పు దెచ్చినను ఆవిశాలలోచనములు ఆచక్కఁదనము నొకమాఱు చూచిన వారెవ్వ రతనిని మరచిపోరు. అందుచేతనే కనఁబడిన రాజపుత్రవీరులాతఁడు తమకు ముందు రాజగునని గ్రహించి సంగుని గౌరవించి "అయ్యా! మీరు బ్రతికియున్న వార్త పృథివిరాజు విన్నపక్షమున మీకపాయము గలుగును గనుక మేము మీరహస్యమును వెలి

పుచ్చము; కాని మేము మిమ్ము విడువక సేవించు చుందుము. ఈ ప్రాంతములకు సింహాస్వప్నముగా నున్న శ్రీనగరరాజుయొక్క కొలువులో మేమున్నాము. మీరుకూడ నారాజును కొలుతురేని మీకుఁ గావలసిన యాయుధములు గుఱ్ఱము నిప్పించెదము.” అని వారు పలుకుటయుఁ దాను బాగుపడుట కింతకన్న మంచిసమయము దొరక దని నిశ్చయించి సంగుఁడు శ్రీనగరరాజు కొలువు నంగీకరించి రాజపుత్రవీరులు విశ్వాసము గలిగి సేవింప దినము లొకతర బడిగాఁ బుచ్చుచుండెను.

ఒకనాఁడు శ్రీనగరరాజు పరివారసమేతుఁడై ప్రయాణమున నలసి సొలసి మట్టమధ్యాహ్నమున నెండ కోర్వలేక యొకపెద్ద మఱ్ఱిచెట్టుక్రింద పండుకొనెను. సంగునకు వంటయందు నేర్పు కుదుర నందున దక్కినవా రందఱు పండుకొనుచుండ నతఁడు వంట మాని యాచెట్టుక్రింద చల్లగఁ బండుకొనెను. అన్నమువండి వాని మిత్రులుదెచ్చునప్పటికి సంగుఁడు కత్తి తలక్రిందఁ బెట్టుకొని గాఢముగనిదురించెను. ఆమఱ్ఱిచెట్టు తొఱ్ఱలోనుండి యొక మహాసర్పము వచ్చి సంగునితలవద్ద నిలిచి పడగవిప్పి వానితల కెండ సోఁకకుండ గొడుగు పట్టినట్లాడుచుండెను. ఆపాము పడగమీఁద చిత్రవర్ణములు గల యొక పక్షి యవ్యక్తమధురముగాఁ గూయుచుండెను. ఆసమయమున నొక వెట్టిగొల్లఁ డాదారిఁబోవుచు నిది యేమివింత చెప్పుమా యని నోరు తెఱచి రెప్పవేయక చూచుచుండెను. తక్కిన రాజపుత్రులు వానిదగ్గఱకు రాగానే సంగుఁడు మేల్కని కన్నులు దెరచెను. ఆగొల్లబోయఁడు నేలపైఁబడి సంగునకు సాష్టాంగనమస్కార మొనర్చి భయసంభ్రమములతో “భళి భళీ! ఈబాబు గొప్పరాజు కాఁగలఁడు. ఇంతప్రభువు లోకములో లేఁడు.

ఆమాటలు విని సంగుఁడు తన రహస్యము వెల్లడిచేయుట

కిష్టములేక తాను పట్టినిరుపేదననియుఁ దన కట్టియోగముపట్టదనియు వాదించెను. గొల్లబోయఁడు వాని పలుకులు చెవిఁబెట్టి తనకు పాములయొక్కయు పక్షులయొక్కయు భాషలు తెలియుననియునవి రెండు నిద్రబోవువానికి మహారాజభోగముపట్టనున్న దని చెప్పుకొన్న వనియు దృఢముగాఁ బలికెను. సంగుఁ డప్పటికిని గొల్లవారిమాటలు కల్ల యని నిరసించెను. కాని శ్రీనగరరాజు తనకు బంట్రై పని చేయుచున్న రాజకుమారుఁడు నిజముగా బంటులా గుండకపోవుటచే నతఁ డెవ్వఁడో ప్రచ్ఛన్న వేషుఁడని నమ్మివానిజన్మవృత్తాంతాదికము నెఱిఁగింపు మనిబలవంత పెట్టి యెఱిఁగించినచోఁ దనకూఁతు నిచ్చి వివాహముచేసి రాజ్యమురావలసియున్న సాయముచేసి యిప్పించెద నని వాగ్దానము చేసెను.

అప్పటికి సంగునితమ్ముఁడు జయమల్లుఁడునీచమగుమరణమును బొందెనుకాని పృథివిరాజుమాత్రము మహోన్నతదశలోనుండెను. సంగుఁడు మొదటినుండియు దురదృష్టవంతుఁడేయగుటచే శ్రీనగరరాజు వానిని జేరదీయుట కూఁతునిచ్చి పెండ్లిచేయుట సాయముచేయఁదలంచుట మొదలగువార్తలు కర్ణాకర్ణిగ పృథివిరాజునకుఁ దెలిసినందున నతఁడు తనయన్నగారిని బెద్దపులినిఁ దరిమినట్లుఁ దరిమి చంపఁదలఁచె. అంతలో దైవయోగమున సంగుని పున్నెము బాగుండఁబట్టి పృథివిరాజు తన చెల్లెలియాపద గడువఁ బెట్టుటకుఁ బోయి తనకు మిక్కిలి ప్రియమైన కమలమియరుకోటకు దిరిగిరాకయె దారుణమరణము నొందె నని వెనుకటిరాజుచరిత్రిలోఁ జెప్పఁబడియున్నది. పృథివిరాజు గతించిన కొన్నిదినములకె తండ్రి యగురాయమల్లుఁడు మహాదుఃఖభారముచేత గుఱింగిపోయిన యామేనువిడిచి పరమపదమునుబొందెను. రాయమల్లుఁడు మీవారుదేశమున కంత యెక్కువయభివృద్ధిని దేలేక పోయినను మునుపున్నదానినిఁ జెడగొట్టకుండఁ గాపాడెను. రాయ

మల్లు(డు కృపాళుడై గౌరవనీయు(డై రాజపుత్రులయం దుండ(గూడని శాంతరసమునకు స్థానమైయుండెను కాని కొడుకులను వంచుకొనలేకపోయెను.

పితు రనంతరమున సంగు(డువచ్చి సింహాసనమెక్కి చారుణీదేవి యర్చకురాలిమాటయు గొల్లబోయనిమాటయు నిశ్చయములుగా జేసి రణసింహు( డనుపేరు వహించెను; రాజస్థానమునందె గాకయితర దేశములందును గట్టిరాజుగద్దె యెక్కె నని వెల్లడి యయ్యెను. మార్వారు, అంబగు, అజమీరు, బూందీ, గ్వాలియరు, కాల్పి మొదలగు రాజపుత్రసంస్థానములు సంగునియాజ్ఞను శిరసావహించుచు వచ్చెను. మాళవదేశము మొదలు ఆబూ యనుపర్వతశిఖరమువఱకు నత( డేకచ్ఛత్రాధిపత్యము వహించెను. రాజ్య మారంభించిన వెనుక నాత(డు పదునెనిమిది చిన్నచిన్నయుద్ధములు ఢిల్లీచక్రవర్తితోను మాళవరాజుతోను జేసి గెలుపు చేకొనుచు వచ్చెను. ఢిల్లిచక్రవర్తిని యొకమారుగాక యనేకమారులు గెలిచెను. మీవారు రాజ్యము యొక్క సరిహద్దు లన్నిపక్కలను పెరిగెను. ఉత్తరపు టెల్ల బయానా యను కోటవద్దనున్న పసుపుటేరు వఱకు వ్యాపించెను. సంగు(డు మీవారు రాణాలలో నెల్ల నగ్రగణ్యు(డగుట కొకకథ కలదు.

ఒకమారు దేవతలలో నొక(డు మనుష్యావతారమెత్తి తన పూర్వశత్రు వగు నొకమనుష్యునిమీ(ద పగతీర్చుకొనుటకు భూమిమీదకు వచ్చి తిరుగుచు జిత్తూరునకు వచ్చెన(ట. సంగు(డు వానిని చూడ(గనే యత(డు మహాపురుషు( డనిగ్రహించి యాదరించి గౌరవించెన(ట. ఆదివ్యు(డు సెలవుపుచ్చుకొనిపోవునప్పుడు పటుత్వముగల యొకరక్షరేఖ నొకసంచిలో(బెట్టి సంగునకిచ్చి దానిని మెడలో( గట్టుకొ మ్మనియు నది మెడతో నున్నంతకాలము వానికి( జయము గలుగుననియు నదిపొరబాటునగాని దైవవశమున(గాన వీ(పుమీ(దకు దిరిగినపక్షమున వానికి చెడ్డదినములు వచ్చునవనినమ్మవలసినదనియు

దృఢముగాఁ జెప్పెనఁట. తనమాట నిశ్చయ మని ఋజువుచేసికొనుట కు దివ్యపురుషుఁడు సంగునకు నెమలియీక నిచ్చి "దీనిని దీసికొని పోయి మీనగరమునందుఁ మృతినొందినవారినందరి దీనితో స్పృశి యింపుము. వారందఱు మరల బ్రిదుకుదు" రని పలికెను. ఆమాట చొప్పున రాణా చిత్తూరునకు వచ్చి కనఁబడిన ప్రతిశవమున కానెమ లియీకను దగిలింప నామృతకళేబరము ప్రాణవంతమై లేచి నిలుచుచు వచ్చె. అంతట దేవునిమాటలు నిజమనినమ్మి సంగు డాదివ్యపురుషు నిపేర తనయూర నొకయాలయము గట్టించెను. ఆయాలయము సం గుఁడు పోయిన వెనుక చాలకాలమువఱ కుండెను.

దివ్యపురుషు డిచ్చిన రక్షరేఖ రాజపుత్రులమీఁదను మహ మ్మదీయులమీఁదను పలుమాఱు ప్రయోగింపఁబడి యజమానునకు జయము కలిగించుచు వచ్చెను. కాని స్వల్పకాలములోనే మహా వీరాధివీరుడై మేటిమగల గండడగించి నసారమండలమును గడ గడ వడకించిన రాజసింహమునకుఁ దనకు వెరపుగలిగింపఁగల సాహ సుఁ డొకఁడు బయలుదేరుచున్నాఁ డని సంగు డించుకయు నెఱుఁగ డయ్యె. అప్పుడు సుల్తానుయిబ్రహిం మనునతఁడు ఢిల్లిచక్రవర్తిగా నుండెను. వానిక్రూరత్వము దౌర్జన్యము గర్వము మితిమీరియుం డుటచే మంత్రిసామంతాదులు వానితోవేగలేక వానినివిడిచిపోయిరి. దేశమందంతట పితూరీలు బయలుదేరెను. చక్రవర్తి యొకదానిని క్రౌర్యముతో నడప మఱియొకటి తలయెత్తుచుండెను. ఇట్లుండ చక్ర వర్తిపినతండ్రి ఢిల్లీమీఁద దండెత్తుమని బేబరును ప్రేరేపించుటకు కాబూలునగరమునకుఁ బోయెను.

ఈబేబరు మొగలాయివంశస్థుఁ డగుమహమ్మదీయుఁడు. ఈతని పూర్వులు చంగీసుఖానును టామరులేను మొదలగువా రింతకుమున్న హిందూస్థానముపై దండెత్తి తురకలకందఱకు దారిచూపిరి. బేబరు

చిరకాలమునుండి హిందూదేశముపై నెప్పుడుదండెత్తుదునాయని యూ టలూరుచు మంచియదనుకై వెదకుచుండెను. అదివఱ కతఁ డొక సారి పాంచాలదేశముపై దండెత్తెను. ఆదండయాత్రలో నతనికి రాజ్యలాభమంతగా లేకపోయినను వాని సైనికులు పర్వతమయమగు తమగొడ్డుదేశముల నెన్న డెఱుఁగని మహాభాగముల రత్నగర్భ మగు హిందూదేశమున ననుభవించుటఁజేసి యీదేశమును వదలి పోఁజాలక దండెత్తుమని తమయజమానునిబురికొల్పిరి. యజమానుని యొక్కయు సైనికులయొక్కయు కోరికలకనుగుణముగాఢిల్లీచక్రవర్తి బందుగుఁడు గూడవచ్చిపిలుచుట సంభవించెను. అందుచేత బేబరు దిట్టమయినసేనలంగూర్చుకొని పర్వతములోనుండి బయటఁబడి పం జాబుదేశమునుగడచి తన్నెదిరింపవచ్చినసేనల నొకదానివెనుక నొకటి జయించి క్రమక్రమమున ఢిల్లిమీఁదికి వచ్చెను. అట్లువచ్చివచ్చి పాని పట్టుగ్రామమున లక్షసైన్యముతో యుద్ధమునకు సిద్ధముగానున్న ఢిల్లీ యబ్రహీంలోడీని గాంచెను. ఇబ్రహీం రణరంగమున మృతినొంది చక్రవర్తి యని యానవాలుపట్టుటకు వీలులేనిస్థితిలో పడియుండెను. బేబరుచక్రవర్తి యగుటచే మసీదులో ప్రార్థన నతనిపేరనే జరిగెను.

మహాసేనాసమేతుఁ డగు ఢిల్లిచక్రవర్తి కాబూలుప్రభువగు చిన్నదొరచేత నోడింపఁబడుట హిందువులకు సంతోషకరము గాద య్యె. ఏలయన నిద్దఱు గొడ్డుమాంసముఁదినుపచ్చితురకలె. ఇద్దఱు హిందువుల దేవాలయములనాశనముచేయుఘాతుకులే. వారిరువురిలో నెవరుగెల్చిన వానిని దరిమికొట్టుభారము రాజసింహుఁ డగు మీా వారురాణాదని జనులు చెప్పుకొనిరి.

అందుచే రణమల్లుడును తేజోరాశియు నగు సంగమహా రాజు బేబరుపైఁ గత్తికట్టి కయ్యమునకువెడలెను. ఆరాజసింహునకు సాయమైయెనుబదివేలగుఱ్ఱపుదళము నుత్తమవంశజులగు నేడుగురు

మహారాజులు రావు బిరుదములు తొమ్మండుగురు సామంతులు, రావలులు రాహుత్తులనుబిరుదులుగలనాయకులునూటబదునలుగురు నడుచుచున్న కొండలవంటి యేనుఁగు లైదువందలును వచ్చి సంగర రంగమున నిలిచె. ఈసేనం గూర్చుకొని సంగుఁడు మొట్టమొదట బయానా యనునూరికి బోయి యచ్చటికోటను ముట్టడించెను. ఆ ముట్టడి జరుగుచున్న కాలముననే సంగుఁడొకనాఁ డచ్చటిపసుపునీటి యేటిలో స్నానము సేయుచుండ గంఠమునందలి రక్షరేఖ వెనుక వ్రక్కకుందిరిగి వీపుపై వ్రేలఁబడియె. అప్పుడు దనమరణ మాసన్న మైనదని యతఁడు దెలిసికొని తనుప్రయత్నముఁ జేయునప్పటికి కంత లో బేబరు బయానాకోటను విడిపింపు మని పదునైదువందల సైనికుల నంపెను. కాని యాసైనికులలోఁ గొందఱుమాత్రమే బ్రతికివచ్చి రాజపుత్రవీరుఁడు సామాన్యుఁడు కాఁడనియు జీతములకొఱకే యుద్ధ ములుసేయు ఢిల్లీసైనికులకును రాజపుత్రసైనికులకును జాలభేదము కలదనియుఁ జెప్పిరి. మీవారు రాజ్యమున కుత్తరపుసరిహద్దుగానుండ వలయునని సంగుఁడు కాణ్వాహ యను గ్రామమున గొప్పమేడ గట్టించెను.

ఆమేడయెదుటనే బేబరు శిబిరము వేయించెను. ఫిరంగులబం డ్లను సరకులబండ్లతో గలిపి గొనెసంచులతో గట్టి సేనలో మొదటివ రుస నమర్చి వాటివెనుక సేననునిలిపెను. ఆబండ్లు చాలనిచోట్ల కాపు దల నిమిత్తము గోతులు త్రవ్వించెను. వానిఫిరంగులలో జయఫిరంగి యనుపేర నొకఫిరంగి యుండెను. దానిని ఉస్తాదాయనుసేనానాయకు డొకఁడే మిక్కిలి నేర్పుతో నుపయోగించుచుండు నఁట. అతనిశక్తి యేమోకాని యొక్కమారాతఁ డాఫిరంగిని దినమునకు బదియారు సారులైనను బ్రయోగింపఁ గలిగియుండె నఁట. ఆయుద్ధ ముభయ కక్షులవారికిఁ గడుబాధకరముగ నుండెను; కాని పైనుండి చూచిన

వారికి మిక్కిలి వినోదముగ నుండెను. ఉభయులు నొకరి కొకరు దీసిపోవువారు కారు. జన్మమంతయు యుద్ధములయందె గడపి దేశ సంరక్షణము నిమిత్తము రక్తము ధారపోసి యుద్ధములలో నొకకన్ను నొకచేయి యొకకాలు పోగొట్టుకొని యెనుబది గాయములచేత తూట్లు బడియున్న శరీరము గలిగి శూరశిఖామణి యనుపేరు గాంచిన సంగుఁడొకపక్కనుండెను. పెద్దపులిమీసములు మెలిపెట్టుటకైన సింగపుజూలు నూడబెరుకుటకైన వెనుకతీయనివారును గయ్యములయందు నడుమ దిరుగనివారును బ్రతికియుండిన మహాకీర్తిని మృతినొందిన వీరస్వర్గమును జూరగొనుటకు సిద్ధముగ నున్నవారు నగు రాజపుత్రవీరు లనేకు లామహారాజు వెనుక బాసటయై నిలిచిరి. వారందఱుఁ దరతరములనుండి పూర్వులు చేసినశూరకర్మములఁ దలంచి గర్వోద్దీపితులై యుండిరి. ఆరాజకుమారరత్నములు క్రొత్తపెండ్లికూఁతులను వరించునట్లు మృత్యుదేవతలను గూడ వరించు విద్యను నేర్చికొని వీరపురుషునకు నంతఃపురమున హంసతూలికాతల్పము శాశ్వతమయిన పాన్పు కాదనియుఁ దమ యాయుధములచేఁ దెగిన పగతురకళేబరములతో నిండిన యుద్ధభూమియే శాశ్వతమయిన పాన్పనియు నమ్మిన మహాశూరులు.

ఇఁక రెండవపక్క నున్నవాఁడొ పదునొకండేండ్ల ప్రాయముననే రాజ్యమున కభిషిక్తుఁడైనవాఁడు. పరరాజుల పీడవలన పితృపితామహార్జితమయిన రాజ్యమును గోల్పడి దేశదిమ్మరియై చిరకాలము గడపినవాఁడు అదివఱకు సమర్కందునగరమున నతఁడు రెండుసారులు సింహాసన మెక్కి రెండుసారులు దానిని వదలుకోవలసినవాఁడయ్యు నెప్పటికైన దాని మఱల సంపాదించి మఱి చావవలయునని తలంచుచుండువాఁడు. సంగునివలెనే యిల్లువాకిలి లేక గొడ్లఁగాసికొనియు కొండలవెంబడి తిరిగియొఁ గొంతకాలము పుచ్చి మెట్టకేలకు

కాబూలు నగరమును బట్టుకొని దానికిం బ్రభువై యంతకన్న మంచి దేశమును స్వాధీనముచేసికొనుటకై యదను వెదకుచున్నవాఁడు. ఈ యుద్ధమునాఁటికైన నతఁడు నడివయస్సును దాఁటినవాఁడు గాక మంచి శరీరదార్ఢ్యముఁ గలిగి శత్రుదుర్నిరీక్ష్యుఁడై వెలయుచుండెను. బలము గల మనుష్యులనిద్దఱను చెరియొకచంకఁ బెట్టుకొనికోటగోడలపై బరు గెత్తుటకును వానికి సామర్థ్యము గలదు. అతఁడెప్పుడు గుఱ్ఱపుజీను మీదనే కాపురము చేసినవాఁడని చెప్పవచ్చును. మార్గమధ్యముననడ్డ మువచ్చిన ప్రతినదిని నతఁడు నిండువరదలోనైన ననాయాసముగానీదు కొనిపోవునేగాని దోనెలనైన నెక్కువాఁడుకాఁడు. అంతటి శూరాగ్రేస రుఁడయ్యు బేబరు పారశీకభాషలో మృదువయిన కవిత్వము చెప్పగల రసికుఁడు. అతనికి స్వమతాభిమాన మెక్కుడుగ నున్నదికాని యా యభిమానావేశముచేత శత్రురాజులయందు మంచిగుణము లేవైన నున్న వానిని మఱచిపోవక వానిని మెచ్చుకొనుచు నతఁడు వ్రాసిన గ్రంథములలో నెక్కుడౌదార్యమును జూపుచువచ్చెను.

రాణాసంగున కింతకంటె సుగుణవంతుఁడు నింతకంటె పౌరుష శాలియునగు శత్రువుం డెన్నఁడు దొరికి యుండలేఁడు. రెండు తెగల వారి కది మంచియుద్ధమే. రాజపుత్రులందఱు తమ దేవాలయముల నెల్ల నేలమట్టముగఁ జేసి దేవతావిగ్రహములఁ బగులఁగొట్టి పాడు చేసిన మ్లేచ్ఛులను తమకులదేవతయగు భవానిమాత తప్పక యడచి తమకు జయమును గలిగించుననినమ్మి ధైర్యముగ నుండిరి. మొగలా యీలు విగ్రహారాధనముచేయు బాపాత్ములగు హిందువుల సంహ రించుటకుఁ దోడ్పడు నని అల్లాను ప్రార్థించిరి. ఈరాజపుత్ర మొగ లాయి ప్రభువులు తక్కినగుణములలో సమానులైనట్లె కైపునకునల్ల మందు మద్దతుబీల్చుటలోగూడ సమానులే. పదునైదుదినములవఱకు రెండుసైన్యములు యుద్ధ మారంభింపక నొకదాని నొకటి చూచు

కొనుచు నేదిముందుగా గయ్యమునకు దిగిన నేమిపరిణామ మగునో యని శంకించుచు నూరకొనిరి. బేబరుసైనికులు కొంతవఱకునిరుత్సాహులయి యుండిరి. ఏలయన వారు తమ యాలుబిడ్డలను గృహములను బాసి చిరకాలముగుటచే నిండ్లపై దృష్టులు బార మిడిమిడి యెండలు గాయు హిందూదేశపుబయళ్ళను విడచి తమకొండగేహములకెప్పుడు పోవుదుమా యని బెంగగొని స్వదేశమునకుఁ దోడ్కొని పొమ్మని బేబరును బలవంతపెట్టిరి. వెనుక బేబరు పంపిన పదునైదువందల సైనికులలో హతశేషులు వచ్చి సంగుని సైనికుల పేరు విన్న గడగడ వడఁకునట్లు తక్కినవారిని భయపెట్టిరి. తురక శిబిరము నంటివచ్చిన జ్యోతిష్కు లెప్పుడుచెప్పినను నీచదశనేగాని యుచ్చదశను జెప్పరైరి. అంగారకుఁ డప్పుడు పడమట నున్నందున వాని కెదుటదిక్కున నుండి యుద్ధము చేయువారికి తప్పక యపజయము కలుగునని వారు నొక్కి పలికిరి.

ఆరెండువారములలోను రాణాకును ఢిల్లీచక్రవర్తికిని సంధి మాటలు జరిగిన వని రాజపుత్రచరిత్రకారులు కొందఱు వ్రాసిరి. బేబరు తానువిదేశములలో పంచాగ్ని మధ్యమువంటి శత్రుమండల మధ్యమున నొంటిగ నుండుట యెఱుంగును. ఈయుద్ధములో తన కపజయము సంభవించెనా పగతురు నలువురు నాలుగుమూలలనుండి వచ్చి తన్ను చుట్టుకొందురనియు నప్పుడు తాను కష్టపడి సంపాదించిన ఢిల్లీరాజ్యము చేయి దాఁటిపోవుటయేగాక స్వస్థానమైన కాబూలునైన చేరుటకు సంభవింపదనియు గూడ నతఁ డెఱుఁగురు రాణా సంగుఁడు చాకచక్యము గలవాఁడు వివేకియునై మావారు రాజ్యము నిమిత్తము స్వసౌఖ్యమును గణియింపక పాటుపడుచున్న వాఁడని యతఁడు వినియుండెను. అందుచే రాజపుత్రచరిత్రకారులుచెప్పినట్లు భయులు సంధిప్రయత్నములుచేసి యుందురనియే మనము నమ్మ

వచ్చెను. ఆయొడంబడికలో బేబరుకోరిన పద్ధతులునన్నియు రాణా కష్టమానరకములు గానివియు నతఁడు తప్పక యంగీకరింపదగినవియు నై యుండెను.

పద్ధతులివి. 1. పసుపునీటియేరు మీవారు రాజ్యమునకు త్తరవు హెల్లుగా నుండవలయును. 2. బేబరు ఢిల్లీరాజ్యము నాక్రమించినం దుకు రాణావారి కేఁటేఁట కొంతకప్పము నిచ్చుచుండ వలయును. కాని యట్లు సంధినిగురించి మాటలు జరుగుచుండ నంతలో బేబరు వద్దకుఁ బంపిన రాయబారి తురకలవద్ద లంచము గ్రహించి నీచుఁడై తనయజమానునిగుట్టు బయలుపెట్టెనని రాజపుత్రులలో నొకవాడుక కలదు. ఆరాజద్రోహి తారావంశస్థుఁడగు శిలాదేవుఁ డనువాఁడు. బేబరు పలుమారు తానుజేసిన తప్పులను గూర్చి నిజముగను పశ్చాత్తాపమును బడుచు వచ్చెను. దాని కుదాహరణముగ నొక చిన్నకథ గలదు.

అతఁ డదివఱకు మద్యపానము విశేషముగాఁ జేసెడువాఁడుక కలదు. అది పాపమనియు నాకారణంబున భగవంతునకుఁ దనపై నాగ్రహంబు వొడముననియు దెలిసికొని యత డాదినము మొదలు సారాయములను దాగనని యొప్పరొట్టు పెట్టుకొని యంతకాలమును సారాత్రాగెడు వెండి బంగారుగిన్నెలు పళ్ళెములు ముక్క ముక్కలుగా బగులగొట్టి యాముక్కలను పకీరులకు బీదలకు పంచిపెట్టెను. అంతతో తనివిసనక యతడు గూనలలో నున్న సారా నంతయు నేల బారబోయించి యాదినమున దనకు జయము లభించిన పక్షమున మహమ్మదీయులవద్దనుండి తాను గ్రహించుచున్న దస్తావేజుపన్ను గొట్టివేయుదునని ప్రమాణము చేసెను. మాటలతో బోవక కార్యముజేసి చూపిన తమచక్రవర్తియొక్క మార్గము ననుసరించి సేనాపతులు సామంతులు ఉమ్రావులు అధికారులు

మొదలగువారు మున్నూరుమంది యొక్కదినము లోపుగ త్రాగ
మని శపథముచేసి త్రాగుడుతనమును మాని పవిత్రులయిరి.
ఇట్లు జరిగినపిదప బేబరు విచారగ్రస్తుడయిన సైనికులను సేనాపతులను
బిలిచి వారికి మతావేశము గలిగించి కయ్యమునకు బురికొల్పవలయు
నని తలంచి యిట్లని విజ్ఞాపనము చేసెను.

ఓ వీరులారా! ఈప్రపంచమున బుట్టినవాడు గిట్టక
మానడు ఎప్పుడో యొకప్పుడీలోకమును విడువక తప్పదు. బ్రతి
కియుండి పరాభవములు పొందుటకంటె చచ్చి గౌరవమందుటమేలు
నేనుచచ్చినను సరే మంచిపేరుతో చనిపోయితినా చాలును భగవం
తుడు దయామయుడు మన మింకను గడతేరినా మతముకొఱకు
మృతినొందిన శూరులమగుదుము గెలిచితిమా దేవునిమెప్పించినవార
మగుదుము. కాబట్టి మనము మరణమునకు జంక మనియు యుద్ధ
భూమినుండి వెనుకంజ యిడమనియు నొకమారు ప్రమాణములు
చేయుదము."

ఆపలుకులు విన్నవారికందఱకు పౌరుష ముక్కెక్కెంచెను.
సైనికులందఱు దమ వేదమగు ఖురాను జేత బట్టుకొని యుద్ధమున
గెలువవలయు లేక చావవలయు నని ప్రమాణములు చేసిరి ఒడలిలో
నూపిరిలేనివాడు సయితము మతావేశముచేత పరవశత్వమునొంది
ప్రాణములపై నభిమానము వదలుకొని ముక్కాకలనుదేరినపగతురం
బొడుచుటకు సిద్ధముగ నుండెను. అంతట శత్రులపయిం బడుటకు
వారేర్పాటు జేసికొన్నంతున మొనలుతీరిన వెనుక బేబరు గుఱ్ఱము
నెక్కి సైనికుల కుత్సాహము గలిగించుచు సేనాపతులకు నడచుకొన
వలసిన పద్ధతులను గఱపుచు గొంతసేపు దిరిగెను.

1527 వ సంవత్సరమున మార్చి 27 వ తేది శనివారమునాడు
రాజస్థానముయొక్క భాగ్య మెట్లున్నదో నిర్ణయించెడు యుద్ధము

జరిగెను రక్ష లేక మఱియొక లాగైపోయినను మొట్టమొదట జయ మెప్పటియట్లు రాణాసంగునికే యగునని యెల్లరు భావించిరి. బేబరు చక్రవర్తియొక్క సైన్య మదివఱ కెన్నడు రాజపుత్రవీరుల పోటు చవిచూచి యెఱుగదు. నల్లమందుమత్తుతో కన్నులెఱ్ఱబడ రాజపుత్రయోధులు శత్రువులపయింబడి కత్తులను బల్లెములనురక్తములో ముంచి యెత్తుచువీరవిహారము చేయనారంభింప, దిట్టతనమునకు ప్రసిద్ధికెక్కిన కలకుతురక లేమియుం జేయులేక యూరకొనవలసి వచ్చెను. పూర్వ మెన్నెన్ని యుద్ధములలో సైనుల యదరిపాటుల నడచిన బేబరుయొక్క జయఫిరంగియైన రాజపుత్రుల నించుకయదుపులో నుంచజాలదయ్యె. ఆసమయమున నెఱిగి బేబరు మంచియుపాయము నాలోచించి తనసేనలో గొంతభాగమును గుండ్రముగా దిరిగివచ్చి రాజపుత్రుల జుట్టుకొమ్మని యానతిచ్చి ఫిరంగులను ముందునకు జరిపించి మూలబలమునకు తుపాకులిచ్చిముందునడిపించి బాణవర్షమును గురిపింప నారంభించెను. అప్పుడు రాజపుత్రసైన్యములో నొకభాగమున కధిపతియైన శిలాదేవు డనునతడు రాజద్రోహము సేయఁదలంచి గుండె రాయి జేసికొని తన సేనలతో బయలుదేరి వచ్చి శత్రుపక్షమునఁ జేరెను.

పగతురసేన వచ్చి యాకస్మికముగ వెనుక దాఁకుటచేతను స్వజనము మోసపుచ్చుటచేతను, తురకలు పట్టినపట్టు విడువకపోవుటచేతను రాజపుత్రసేన మెట్టకేలకుకట్టుచెడి తిరిగిపారిపోవలసివచ్చెను. మహమ్మదీయులు రాజపుత్రసేన నొకమూలకుం దరిమి ఫిరంగులు బారుచేసి కొట్టఁజొచ్చిరి. అందుచే దాఁదాపుగా నందఱుహతులయిరి. కొంద ఱెట్టెటో దెబ్బలు తప్పించుకొని పాఱిపోఁగలిగిరి. వారిలో రాణా యొకఁడు. ఆ రణమునఁ దగిలినగాయములచేత రాణా కుంటి యగుటచే రణరంగమునందుండి పారిపోవుట కతని కిష్టము లేకున్నను

సేవకులే యతనిని మోసికొనిపోయి యపాయమునుండి దాఁటించిరి కాని యనేకులు యుద్ధభూమినుండి విడువక ప్రాణము విడిచిరి. అట్టి వారిలో చందావతువంశస్థుఁ డగు రాజపుత్రవీరుఁ డొకఁడు మహాశూరు లగు మూఁడువందలమంది చుట్టములతో మృతినొంది రాణావారికి తొల్లి రాజ్యము సేయునప్పు డాలోచనలు చెప్పుటలో నెట్లు ప్రథమగణ్యుఁ డయ్యెనో వారినిమిత్తము ప్రాణములు విడుచుటలో నట్లేప్రథమగణ్యుఁ డయ్యెను. అతనికి సాయమై మార్వారురాజకుమారుఁడు మఱి యిరువదిమంది రాజకుమారులతోఁ గూడి నేలం బడియుండె. ఈయుద్ధము జరిగినదాపునకు సమీపమునందే బేబరు రణనిహతు లయిన రాజపుత్రశూరులపుత్త్రులతో నొకజయస్తంభమును గట్టించెను.

ఇట్లుసంపూర్ణ పరాజయమునొంది కూరుచున్నచోటనుండి కదలలేని కుంటియయ్యు రాణాసంగుఁడు శౌర్యగాంభీర్యములయందు సింహమువలె మెఱఁగ జొచ్చెను తలుపు వేసికొని చిత్తూరుకోటలో దాఁగికొనుట కతనికిష్టము లేక కోటతలుపు లెప్పుడు తెఱచి యుండవలసిన దని యానతిచ్చి తానెప్పటికైన శత్రువులను జయించి జయధ్వనులతోఁ గోటలోఁ బ్రవేశింతు నని చెప్పుచువచ్చె. ఈపరాజయమువలన గలిగినపరాభవమును పోగొట్టుకొనునఱకు యుద్ధభూమిలో నొకగుడారము వేసికొని యదియే యిల్లుగా నతఁ డుండెనఁట. అదివఱకు యుద్ధములో మృతినొందిన రాజపుత్రశూరులయొక్క భార్యలు సేనలం బోగుచేసి ఢిల్లీచక్రవర్తి మీఁదికిఁ జను మని రాణాకు సమర్పించిరిగాని పరాజయమునొందిన యొక్కసంవత్సరములో నేయతఁడు పరలోకగతుఁ డగుటచే నాసేనలం గూర్చుకొని తురకలతో పోరు నంతటిభాగ్య మతనికిఁ బట్టదయ్యె.

సంగుఁడు విషము దిని చచ్చెనని కొంద ఱందురు; కానియది

నిజము కాదు. చిన్నతనమునుండియు నిల్లువిడిచి తిరిగి యతఁడు పడిన కష్టములను మహాయుద్ధములయందు దగిలినయెనుబదిగాయములను విశేషించి కణ్వాహా దగ్గరజరిగినయుద్ధమును విషముకంటెనెక్కుడు తీక్షణములై వానికకాలమరణము గలిగించెను. మీవారు రాజ్యమును పాలించిన రాణాలలో సంగుఁడు మహాప్రతాపశాలి. అందుచేత నతఁడు యందఱికన్న గొప్పవాఁడని యప్పుడప్పుడుకొంద అనుచుందురు. ఆతనివెనుక సింహాసనమునకు వచ్చిన వానివంశస్థులు సంగునివలె దృఢచిత్తులై చరించినచో చిత్తూరునకు దీనదశ రాక యుండును.

సంగుని చరిత్రము సమగ్రముగాఁ జెప్పబడినది గావున నింక నతని వైరియగు బేబరు చరిత్రము నించుక చెప్పవలసి యున్నది ఇతఁడు మొగలాయివంశస్థుఁడు ఈతని పూర్వుడఁగు చంగిసుఖానుడు ఆశియా యూరోపుఖండముల రెండును దండెత్తి మిడుతలదండువంటి తురకసేనలతో నింపి రక్తప్రవాహములు ప్రవహింపఁజేసి యానాటి మానవజాతి నంతను గడగడ వడకించిన చండశాసనుఁడు. అతఁడు పదమూడవశతాబ్దముయొక్క ప్రారంభమున హిందూదేశముపై దండెత్తి సింధునదికిఁ బడమట నున్నభూముల నాక్రమించియెందుచేతనో మనదేశమున నిలువక స్వస్థానమునకుఁబోయె. వానితరువాత వాని వంశస్థుఁడును వానికంటెను క్రూరుఁడు నగు తామరలేను 1399 వ సంవత్సరమున హిందూదేశముపై దండెత్తివచ్చెను. ఈతనికాలొకటి కుంటిగ నుండెను. సహజముగ దుర్బలుఁడయ్యు నితఁడు మెచ్చఁదగిన మనోబలముచే మొగలాయిలకెల్ల ప్రభుపై తార్తారుదేశమున నున్న సమర్కందునగరమున సింహాసనమెక్కి యనేకదేశముల జయించెను. బేబరు తామరలేనునకాఱవతరమువాఁడు. ఇతడు తనవంశస్థులవలె ప్రతాపవంతుడెకాని వారివలె నిష్కారణముగా మానవ

జాతిని నిర్మూలించునట్టికౄరుఁడు కాడు. ఇతని తలిదండ్రులు చిన్న తనమునందె మృతినొందుటంజేసి బాల్యమునందే సింహాసనస్థుఁడై పలుమారు రాజ్యభ్రష్టుఁడై యనేకస్థలములయందు క్రొత్త రాజ్యములు స్థాపించి యెట్టకేలకు హిందూస్థానముపై దండువిడిసి ఢిల్లీచక్రవర్తి యయ్యెను. ఇతఁడు ప్రతాపవంతుఁడగుటయేగాక పారశీకభాషలో మంచి కవనముగూడ జెప్పఁగల సమర్థుఁడు. ఇతఁడు హిందూదేశమును జయించినాఁడన్నమాటయే గాని జయించిన పిదప పట్టుమని పది కాలములపాటు దేశము నేలలేదు, అతడు 1526 సంవత్సరమున చక్రవర్తియై 1530 సంవత్సరమున మృతినొందెను. ఆనాలుగుసంవత్సరములైనను మనస్థిమితము లేక యుద్ధములోనే గడపవలసివచ్చెను. ఇతని మరణమునుగూర్చి యొక చిత్రకథగలదు. అతని కుమారునకు జబ్బుచేసి ప్రాణముమీఁదికి వచ్చెనట కుమారునియందు బేబరునకు మితిమీరిన ప్రేమయుండుటచే దనకొడుకును రోగవిముక్తునిచేసి తనకాజబ్బు తెప్పింపుమని భగవంతుని ప్రార్థించెనట. అతడు ప్రార్థించినట్లుగానే క్రమముగా హుమాయూనున కారోగ్యము గలుగుటయు బేబరుజబ్బుపడి మృతినొందుటయు సంభవించెను. ఢిల్లీ పాలించిన మొగలాయి చక్రవర్తుల కితనె మూలపురుషుఁడు.

కణ్వాహాయుద్ధ మైనతరువాత పాడుపడిన స్థలములు బాగుచేసి కొనుటకును మరల పూటుపడుటకును రాజస్థానమునకు గొంత విశ్రాంతి కలిగినది. ఎవఁడో యొకవీరుడు మృతినొందని కుటుంబము గాని గృహముకాని లేకపోవుటచే రాజస్థానమందంతట శోకదేవత విహారము చేయుచున్నట్లు కనబడెను. ఆదారుణయుద్ధ మైనతరువాత గలిగిన విశ్రాంతిచే రాజపుత్రస్త్రీలు తమ మగవారలకు జరిగిన పరాభవపు మచ్చను దుడిచివేయగల శూరులగు కుమారులను గని పెంచుచుండిరి.

రాణాసంగుడు పోయిన రెండుసంవత్సరములకే బేబరుచక్రవర్తియు గాలధర్మమునొందుటచే క్రొత్తగా జయించిన భూములన్నిటిని గలియ గట్టుకొని సంరక్షించుకొను భారము వానికుమారుడగు హుమాయూనుపయి బడెను. హుమాయూను ధైర్యశాలియు నౌదార్యవంతుడునయి స్వగౌరవము గాపాడుకొనువిషయమున రాజపుత్రులెంత తీవరముగా నుందురో యంత తీవ్రముగ నుండి దయాళువై సర్వజనులచేత బ్రేమింపఁబడుచు వచ్చెను. రాచరికమున కుండవలసిన కాఠిన్యము మనోధైర్యము చిత్తస్థైర్యము మొదలగు గుణములు లేకపోవుటయేగాక తొల్లి వానితండ్రి కభ్యాసములయిన నల్లమందు మద్దతు మొదలగునవి వాని కలవడెను. అందుచేనతడు స్థిరబుద్ధి లేనివాడయి బేబరువలె నలుదెసలం జెదరియున్న రాజ్యమును కూడగట్టుకొని పాలింప లేకపోయెను.

అదియటుండ రాణాసంగుని జ్యేష్ఠపుత్రుడు రత్నసింగు రాజపుత్రికులజులవద్ద నుండు శౌర్యగాంభీర్యాది సమస్తలక్షణములు గలిగి తండ్రి పరోక్షమున రాజ్యమునకువచ్చెను. గద్దెయెక్కినతోడనే యతఁడు కోటకావలివాండ్రం బిలిచి "తొల్లిమాతండ్రియగు రాణాసంగుఁడు తెరచియుంచు మనిన తలుపులు తెరచియేయుంచవలయును కాని మరల మూయవద్దు. వానినాలాగుననే యుండనిండు. ఢిల్లీమండూరు పట్టణములే చిత్తూరునగరద్వారములగు గాక" యని నొక్కిచెప్పెను. కాని యతఁడెన్నోకష్టము లనుభవింపవలసి వచ్చెను. ఆకష్టములలోఁ గొన్ని స్వయముగ దెచ్చుకొన్నవియుఁ గొన్ని వానియనుచరుల బుద్ధిహీనతచేతను ద్రోహబుద్ధిచేతను దెచ్చినవియునైయుండె. మొట్టమొదట నతఁడు నిగ్రహింపవలసిన ప్రబలశత్రువు వాని సవతితల్లి యగు జవాహీరుభాయి. ఆమె మారువారు రావుల యాఁడుబడుచు. తనకుఁదోచినంతయెగాని యొకరుచెప్పినట్లు వినక

పోవుటయు దురాశచే నెప్పుడు కుటిలజేయుటయు నామెచేయు ప్ర ధానకార్యములయియుండెను. భర్తయగురాణాసంగుడు మృతినొం దినతోడినే జవాహీరుభాయి సవతికొడుకును రాజ్యభ్రష్టునిం జేయ దలంచి తనకుమారుడు విక్రమజిత్తును చిత్తూరుసింహాసనమునందు ని లుపుమనియు నట్లుచేసిన పక్షమున మున్ను మాళవదేశపు రాజగు మహమ్మదు చిత్తూరులో విడిచిపోయిన కిరీటమును రంతంబార్ అను కొండకోటను బహుమానముగ నిత్తుననియు బేబరుచక్రవర్తికి రహ స్యముగ వర్తమాన మంపెను బేబరు పనితొందరలోనుండి తెరపిలే క ఆమెకు బ్రత్యుత్తరమునయిన నొసంగకపోవుటచే నామె సంకల్ప మంతరించెను.

ఇదియటుండ రత్నసింగు అంబరుదేశపురాజు కూతును వివాహమాడదలంచి తనకత్తి యక్కడకుబంపి యామెను పెండ్లి చేసికొనెను వివాహమాడియు నెంతకాలమునకు నామెను దనవద్దకు దీసికొనిరాకపోవుటచే బూందీసంస్థానాధిపతియగు సురాజమల్లుడా బాలికను వివాహమాడి తన యంతఃపురమునకు దీసికొనిపోయెను. ఈకార్యముచేత సురాజమల్లునకును రత్నసింగునకును మనసులలో గ్రోధాగ్నులు పొడమి రవులుచుండెను. అట్లుండ రత్నసింగొకసారి వసంతకాలమున నొక యడవిలో వేటాడుటకు వచ్చిన సురాజమల్లు ను నిష్కారణముగ బొడిచి యాతనిచేత మరల నొకపోటు తిని పగతు ని చంపిన సంతోషము లేకుండ తానునుజచ్చెను రత్నసింగు స్వయం కృతాపరాధమున దెగుటచే జవాహీరువాభాయియొక్క చిరమనోరథ ము ప్రియత్నమక్కరలేకయే సిద్ధించెను. విక్రమజిత్తు చిత్తూరు సిం హాసనమెక్కెను. విక్రమజిత్తెట్టివాడని నిర్ణయించి వ్రాయుటకు వీలు లేదు. రాజస్థానచరిత్రకారులు వానియొద్ద సద్గుణములేవియు లేవని వ్రాసిరి. బంధువులయెడను సామంతులయెడను నిరాదరణము చూ

పుటయేగాక యతడు నీచులతో సహవాసము చేయుచు రాణాసం గుని కొడుకయినందుకు ప్రజలవలన బొందవలసిన గౌరవమును బొం దక నిరసింపబడుచు వచ్చె. రాజ్యవ్యవహారములను జూడక వస్తాదు లను పందెగాండ్రను గలిసి యతడు కాలమంతయు నేల వ్యర్థము చేసెనో తెలియదు. ఇట్లు దుస్సహవాసములు చేసి పాడగుచున్నను విక్రమజిత్తు సహజముగ తెలివిగలవాడని యీక్రిందికథ వలన దెలి యవచ్చును. అతనికాలము వఱకు రాజపుత్రవీరులు గుఱ్ఱములనెక్కి కత్తులు బల్లెములు బూని యుద్ధములు చేయుచుండిరి. రాజపుత్రుల శత్రువులు తుపాకులను ఫిరంగులను బూని యుద్ధము సేయుచువచ్చిరి. అందుచేత రాజపుత్రులు తరచుగ నోడిపోవుటయు మహమ్మదీయు లు గెల్చుటయు సంభవించెను.

విక్రమజిత్తు బుద్ధిశాలియగుటచే రాజపుత్రు లెంతశూరు లైనను నిప్పులుజిమ్ము ఫిరంగులు మొదలగు నాయుధములు లేక వట్టి కత్తులు కటారులు బూని గుఱ్ఱములపై నెక్కి యుద్ధముచేసినంతమా త్రమున గెలువజాలరని నమ్మి ప్రాతపద్ధతిని విడిచి క్రొత్తపద్ధతి ప్ర కారము నూతనాయుధములను బూనవలసినదని తనవారి నందఱిని బురిగొల్పెను. క్రొత్తపద్ధతి యనగా రాజపుత్రశూరులు యుద్ధరం గమున కొందఱు గుఱ్ఱములు దిగి ఫిరంగులు కాల్చుటయు మఱికొం తఱు నేలనేయుండి కాల్బలమై తుపాకులతోయుద్ధముచేయుటయునని తెలిసికొవలయును విక్రమజిత్తు చెప్పినమాటలు రాజపుత్రులకు మిక్కిలిగౌరవభంగమని దోచుటంజేసి వారందఱు బుఱ్ఱపోయినను గుఱ్ఱములు దిగి కత్తి విడిచి యుద్ధముచేయమని వాదించిరి. అట్టి మోటయుద్ధమువలన గలుగు నష్టమును తుపాకియుద్ధమువలన గలుగు లాభమును జూపి రాజు వారినెంత వేడుకొన్నను వినక వారు "గుఱ్ఱములమీద నుండియే శత్రువుల ఫిరంగుల బాలుపడి ప్రాణ

ములనైనను విడుతుము; కానినేల దిగితుపాకి చేతబట్టుకొని పశువు ప్రతిష్టలు జంపుకొనము సుమీ" యని ప్రత్యుత్తర మిచ్చిరి. అట్టి వారితోనాదించుట నిరుపయోగ మనిగ్రహించి రాణావారియెడల నాసవదులుకొని జీతములనిచ్చి కొండలు సిపాయిల నేర్పఱచి వారికి నూతనపద్ధతిప్రకారము యుద్ధముచేయుట నేర్పించెను.

ఈపనివలన రాజపుత్రులకు మనసులలో రాణాపై క్రోధము నిలిచెను. దానికితోడు విక్రమజిత్తుక్రొత్తసిపాయిలకు బహుమాన ములిచ్చి వారిని గౌరవించి వారితో గలిసిమెలిసి యుండుటచే రాజ పుత్రులు తమక్రోధమును లోలోపల నణచుకొనజాలక పైకి వెడలి రాణాతో గలహమునకు డీకొనిరి. రాజ్యమున ప్రతిస్థలమందు ప్రజ లు రాణాయొక్క యధికారము దిరస్కరించి రాజశాసనముల నతిక్రి మించి యుద్యోగస్తులను బరిహసించి యథేచ్ఛముగ దిరుగజొచ్చిరి. కొండలలోనుండు మన్నెగాండ్రు గుంపులు గుంపులుగ జిత్తూరునగ రమునకు వచ్చి రాణాకన్నులయెదుటనుండియే ప్రక్క పల్లియల దోచుకొని పశులమందలను దోలుకొనిపోవజొచ్చిరి విక్రమజిత్తు కొండదొంగలను దరిమి కొట్టిరండని తన గుఱ్ఱపుదళములకాజ్ఞాపింప రౌతులందఱు నవ్వుచు "జీతబత్తెము లిచ్చి నిల్పిన క్రొత్తకాల్బలము నుబంపుడు. మేమేమి చేయగల" మని పలికిరి.

చిత్తూరురాజ్య మట్టిదుస్థితిలోనుండుటచే శత్రువులు తమతమ ప్రాతపగలు దీర్చుకొనుట కదియే సందని విజృంభించిరి. గుజరాతు దేశప్రభువగు మహమ్మదుషా యనుతఱక కొంతకాలముక్రిందట బేబరుచేత జయింపబడి ఢిల్లీ రాజ్యముతో గల్పబడిన మాళవదేశము నాక్రమించుకొనెను. అప్పటికి బేబరు చనిపోవుటయు బరమసాధు వగుహుమాయూను సోదరులచేత బంధువుల చేతను పలుచిక్కులం బడి మనస్థిమితములేక యుండుటయు బహాదూరుషాకుమాళ్వాను బుచ్చుకొనుటకు మంచివీలు కలిగించెను.

అట్లు బహాదూరుషా పక్కలో బల్లెమై మునుపు మాళవ దేశపుప్రభువు లగుతురకల నిద్దఱిని చిత్తూరురాజులు ఖయిదీలుగా దీసికొనిపోయి వానిలో నొకనికిరీట మపహరించి యవమానించిన ప్రాగితవృత్తాంతమును జ్ఞప్తికి దెచ్చుకొని సాటితురకలకు జరిగిన దారుణపరాభవమునకు దగినప్రతీకారము జేయుటకు సమయమును వెదకుచు నెట్టకేలకు విక్రమజిత్తొకసారి బూందీనగరమునకు బోయి యున్నప్పుడు పెద్దసేనం గూర్చుకొని చిత్తూరుపై దండువిడిసెను.

విక్రమజిత్తు సహజముగ దొందరవాడగుటచే దనపత్తి కత్తులు తనసేనకన్న నధికసంఖ్యగలవారై యున్నను సరకుగొనక మహమ్మదీయసైన్యములందాక నిశ్చయించుకొనెను విక్రమజిత్తు తత్సమమమున నేమి సేయుటకుం దోచక మనోవేదన నందవలసి వచ్చె. కూలికి వచ్చినసిపాయిలు శత్రువుల గొప్పసేనం జూచి భయపడి పోరుటకు సాహసింపరైరి. రాజపుత్రసైనికులం బోరు మని రాణా యడుగ తమ్మవమానించి జీతగాండ్ర బిలిపించిన రాజుపక్షమున నిలిచి పోర నొల్లరైరి. అట్లు పోరక పోవుటయే కాక యారాజపుత్రులు యుద్ధభూమిని విడిచి పోయి రాణాసంగునకు నొక బూందీ రాజపుత్రికవలన బుట్టిన యొకచిన్నకుమారుని రాణాగా జేయ దలంచి కోట శత్రువులబారి బడకుండ గాపాడుటకు జిత్తూరు బ్రవేశించిరి.

ఈనగరమును గాపాడుట కామీవారురాజపుత్రులకు రాజస్థానమందున్న రాజు లందఱు సాయపడిరి. కణ్వాహాయుద్ధమున దమవారనేకులు నిహతు లయినను హతశేషు లగుచందావతువంశస్థులు చిత్తూరు సంరక్షణమునకు మరల సిద్ధపడిరి. ఆబూపర్వతమువద్దనుండి యాప్రాంతముల నేలుచుండిన రావువచ్చి మీవారునకుందోడు సూపెను. అట్లే మఱి యిరువురురాజులును దమ ప్రాతపగలమరచి

యీాయదనునవచ్చి మీావారును ఛాసటమై నిలిచిరి. వెనుకటిరాణా యగు రత్నసింగు బూందీసంస్థానప్రభువగు వెనుకటిరావునువేఁటాడు వేళ జంపెను. అతనివెనుక సింహాసనమునకు వచ్చిన యర్జునరావు మనసులో నామాట నుంచుకొనక మెరియలవంటి తనసైనికుల నైదు వందలమందినిఁ దోడ్కొని చిత్తూరునకు వచ్చెను. పృథివిరాజునకును వాని పినతండ్రి యగుసురేశమల్లునకును నెంతెంత మహాయుద్ధములు జరిగినవో పృథివిరాజు సాహసములఁ జదివినవారంద ఱెఱుఁగుదురు. ఆసురేశమల్లునికొడుకు భాగ్జీ యనునతఁడు గతించినకార్యముల దలపక తనతండ్రిని చిత్తూరురాణాలు దేశమునుండి వెడలఁగొట్టి రని క్రోధమునైన నిలుపక దేవలకోటనుండి కొంతబలముం దోడ్కొని వచ్చెను ఈపైన పేర్కొనఁబడిన శూరులేగాక మఱియు ననేకప్రభువులు కత్తిఁగట్టుకొని వచ్చి చిత్తూరును సంరక్షించు చున్నయీాదేవత యాపత్కాలమున రాజవంశస్థులను గాపాడక పోదని నమ్మియుత్సాహముతో రణోన్ముఖులైరి కాని ప్రపంచములో నున్నశౌర్యమంతయు ముద్దచేసి యొకచోటికిఁ జేర్చినను బహాదూరుషాయొక్క పిరంగులముందట నెందుకుం గొరకాదు.

ఆతురకరాజు తన గొప్పపిరంగులను కోటబురుజుల సమీాపమునకు లాగించుకొనిపోయి వానిసేనలలోఁ. బనిఁజేయుచున్నపోర్చుగీసువారిచేతఁ గడునిపుణముగ బనిజేయింపఁ జొచ్చెను. ఒకమూాల నుండి దారుణము లగుఫిరంగిగుండ్లు కోటలోనున్నమనుష్యులమీాఁద బడి నాశనము చేయుచుండ రెండవమూలనుండి మరికొన్నిగుండ్లు వచ్చి కోటగోడలను గుభాలు గుభాలు మని పడఁగొట్టఁ జొచ్చెను పూర్వ మల్లాయుద్దీను ముట్టడించినప్పుడువలెనే యిప్పుడును దక్షిణదిక్కున నున్నకోటభాగము బలహీనమై యుండెను. ఆవైపుబురుజు మీాఁద బూందీప్రభు వగునర్జునరావు తన యైదువందలమంది సైని

కులతో నిలిచెను. తురకసేనలో నున్నపోర్చుగీసుదొర యాబురుజుల కెదురుగా నేలసొరంగము ద్రవ్వి యందు తుపాకిమందు కూరి దాని నంటించెను ఆగని బ్రహ్మాండము గడగడ వడకునంతటి ధ్వనితోఁ బగిలి దక్షిణదిక్కునయున్నకోటగోడయనలువదియైదుమూళ్ళ పొడుగున గుభాలున కూల్చెను. అతిధైర్యముతో నాభాగమును గాపాడుచున్న యర్జునరావును వాని జోడులును పేలిపోయి యానవాలైనలేకుండ నశించిరి. ఈరంధ్రమునుండి మహమ్మదీయులు కోటలోఁ బ్రవేశింపఁ జూచుచుండ వీరరసావతారు లగుచందావతువంశస్థు లక్కడకు వచ్చి శత్రులు లోనఁ బ్రవేశింపకుండఁ బోరిరి. ఎక్కడనుండి యైనమఱి కొంతసేన దోడు వచ్చినగాని చిత్తూరుకోట నిలువదని యందఱు గ్రహించిరి. అప్పుడు ముఖ్యసేనానాయకు లందఱు గూడి సభ జేసి యాయాపద గడువంబెట్టుట కుపాయము వెదుకఁ జొచ్చిరి. వారికి మొట్టమొదట యాలోచన జెప్పినది విక్రమజిత్తు తల్లి యగు జవాహీరుభాయి. ఆమెమగడుపోయినస్వల్పకాలములోనే తన సవతికొడుకును రాజ్యభ్రష్టునిఁ జేసి తనకుమారుని రాజుని జేయుమని తురకచక్రవర్తిని బ్రతిమాలించినందుకు నిటీవల జాలపశ్చాత్తాపమునొంది యాసమయమున తనకుమారుని లాభమునుగాని తనలాభమునుగాని జూచుకొనక మీవారుయొక్కయు చిత్తూరుయొక్కయు గౌరవమును గాపాడుకొనుటకు సమస్తవిధముల బాటుపడి తాను యుద్ధమునకు బోవుదునని, సేనానాయకులతో జెప్పి వారి నొప్పించి తనమందిరమును తనగోషాను విడిచి కవచము దొడుగుకొని యాయుధముల ధరించి కొంతసేన నడపించుకొనిపోయి యొడలు దాచుకొనక కయ్యము చేసి స్వర్గస్థురా లయ్యెను.

ఈజవాహీరుభాయిగాక రాణాసంగునకు మఱియొకభార్య యుండెను. ఆమెపేరు కర్ణావతి. విక్రమజిత్తును రాజుగా నంగీకరింపక

ఆమె కొడుకగు నుదయసింగునే రాణాగాఁ జేయఁదలంచి రాజపుత్రిపీసులు నానాభాగములనుండి వచ్చి చిత్తూరులోఁ బ్రాణములు విడుచుచుండిరి. వీరస్వర్గమునుజూరకొన్న యర్జునరా వీదేవి సోదరుఁడే. మరణమునకుఁ జంకని శూరునిగర్భమునఁ బుట్టి శూరాగ్రేసరుఁడగు రాణాసంగుని చెట్టబట్టిన యీ దేవియు భయమెట్టిదో యెఱుఁగని సాహసికురాలేమై తనప్రాణములు విడువఁదలంచెను; కాని చిన్నకుమారుని ప్రాణములు సంరక్షించుట కర్తవ్య మనియూరకొనెను. వీరండఱు గోట సంరక్షణమునకై యుపాయములు వెదకుచుండ కుమారరక్షణమునకై యామె యుపాయములు వెదకి తుద కొకటికనిపెట్టెను.

రాజపుత్రులలో నొకచిత్రమైన యాచారము కలదు. రాజపుత్రిస్త్రీ తనకేదేని యాపదవచ్చినప్పు డాయాపద దీర్పగల సమర్థుడని తనకుఁదోచిన పురుషుని శరణువేఁడి వానికి రత్నఖచితమైన కంకణముకాని పట్టుతోరముగాని పంపుచుండును. ఆపురుషుఁడు రాజపుత్రుఁడు గావచ్చును. లేక తురక గావచ్చును. ఆస్త్రీ వాని నెఱింగి యుండనక్కఱలేదు. వానిపేరు విని శరణువేడవచ్చును. ఆపురుషుడాస్త్రీని జూడవలసినయావశ్యకమును లేదు. ఆస్త్రీ పంపినబహుమానము నాపురుషుండు ముంజేతికిం గట్టుకొని యామెను రంక్షించుటకు గంకణము గట్టుకొన్నశూరుడై యానాఁడు మొదలామెకు పెంపుడు సౌదరుఁడై యామె యేదిగోరిన నది చేయునట్లు ప్రమాణము చేయును. ఒకవేళ నాస్త్రీ యీపురుషునకు బ్రాణహాని కలుగుపనులు చేయుమన్న నతఁడు చేసితీరవలయును. ఆపత్సమయమునం దున్నస్త్రీలీవిధముగ గంకణమును బంపుట తమకెంతో గౌరవ మని మహమ్మదీయచక్రవర్తులు హిందూరాజులు గూడ దలంచిరి.

కర్ణావతి యీయాచారము నడపి తనకుమారుని సంరక్షించుకొనవలయు నని సంకల్పించి యంతఃపురమున మెత్తని పట్టుదారము

లతో గడువిన్నాణముగ నొకపట్టుతోరము నల్లి నమ్మికగల యొకబంటునుబిలిచి యిట్లనియె. శత్రుసేనలబారిఁబడకుండ తప్పించుకొని మెట్లయిన హుమాయూను చక్రవర్తియొద్దకు బోయి యీతోరము వానికిచ్చి యీతోరమువలన మీవారు రాణీ యగు కర్ణావతికి నతఁడిప్పుడు సోదరు డయ్యెంగావున యాపద గడువంబెట్టవలయు నని చెప్పుము." ఆతోరము దీసికొని యాబంటు నిరంతరప్రయాణంబుల ఢిల్లిపురమునకు జేరి యాసమయంబున నక్కడ చక్రవర్తి లేమింజేసి యాశాభంగమొంది యాగ్రానగరమున బేబరువేయించిన గులాబి పూలతోటలో నతఁడు విహారమును జేయుచుండు నని నిశ్చయించి కాళ్ళీడ్చుకొనుచు నచ్చోటికిఁ బోయి యచ్చటను వానింగానక నిర్వణ్ణహృదయుడై హుమాయూ నాసమయమున పితూరీల నడచుచు రాజద్రోహుల శిక్షించుచు బంగాళాదేశమం దున్నవా డని విని చిత్తూరెక్కడ శత్రువుల పాలై పోవునో యనుభయము తన కాళ్ళకింతింతనరాని సత్తువ గలిగింప నెట్టకేల కచ్చటకుంబోయి హుమాయూనుని సందర్శించి యాదేవియిచ్చినపారితోషిక మతనికి సమర్పించెను. సమర్పించుటయు హుమాయూను మహానందభరితుఁడై దానిం గ్రహించి యాతోరము ముంజేతికిఁ గట్టుకొని రాజపుత్ర స్త్రీరక్షణకు దీక్షవహించి "కర్ణావతి కేమికావలయును? ఆమె యేమడిగిన నది యిచ్చెద చెప్పు" మని యడిగెను. "స్వామీ! ఆమె కేమియునక్కఱలేదు. ఆమె మీతోబుట్టువగుటచే చిన్నవాఁ డగు మీమేనల్లుని రక్షింపుడు. ఇదియే యామె కోరిక" యని యాసేవకుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఆపలుకులు విని వల్లె యని హుమాయూను బంగాళమునందింకను దాను చేయవలసినపని యున్నను దానిం గట్టిపెట్టి విపత్సముద్రమునం దున్నస్త్రీని సముద్ధరించుట ప్రథమకర్తవ్య మని నిశ్చయించి మహాసేనాసమేతుఁడై రాజస్థానమునకుఁ బోవ బయనమయ్యెను.

అప్పటికి బహదూరషా యింకనుఁ జిత్తూరుకోటలోఁ బ్రవేశిం పలేదు. హుమాయూ నించుక త్వరపడినపక్షమున పట్టణము పరుల చేతం బడకయుండును. కాని యెందుచేతనో పట్టణసమీపమునకు వచ్చియు బహదూరుషా పయింబడక కాలహరణముచేసి యుదా సీనుఁ డయ్యెను. మహమ్మదీయమతద్వేషు లగు హిందువులను గెలు చుచున్న సాటితురకమీఁద గత్తిగట్టి పోరుట తనవంటితురక కనుచి త మనియు మతవిరుద్ధమనియుఁ దలంచి హుమాయూనుఁడట్లు పేక్షిం చె ననికొందరు చెప్పుదురు. రాజపుత్రులకుఁ బ్రత్యక్షముగ సహాయ ము సేయకున్నను ఢిల్లిచక్రవర్తి యిట్టియకార్యములు చేసినందుకు బహదూరషాను మిక్కిలి చీవాట్లుపెట్టి యధిక్షేపించె నందురు.

కోటలోనున్న రాజపుత్రులులోపలిబలము క్రమక్రమముగ క్షీణమగుటయు పయిసహాయము రాకుండుటయుఁ జూచి చిత్తూరున కంత్యకాల మాసన్నమయిన దనిగ్రహించి సర్వముసిద్ధముచేసికొనిరి. బాలుఁడగు నుదయుసింగును విశ్వాసముగల యొకసేవకున కప్పగించి పగతురచేతఁ జిక్కకుండ నావలకుఁ దాటించి తొల్లి లక్ష్మణసింగున కుఁ గలిగిన దేవతాసాక్షాత్కారమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని తమకు రా జుండవలయు నని రాజపుత్రసేనాపతు లెవ్వని రాజుం జేయుద మని యోచించుచుండ దేవలకోటనుండి వచ్చిన సురేశమల్లుని కుమా రుఁడు భాగ్జీ యనునతఁడు ముందరికి వచ్చి నేను చిత్తూరురాజులకు ర క్తస్పర్శగల జ్ఞాతివర్గములోనివాఁడను. నేను నాయకుడనై మిమ్ము నడపెద. నన్ను రాజుం జేయుఁ డనీకోరగా నప్పుడు యథావిధిగా బట్టాభిషేకము చేయుటకు వీలులేక వారందఱు వానిని రాణాగా నేర్పఱచిరి. గోటగోడ లొక్కటొక్కటిగా నేలంగూలజొచ్చెను. చి త్తూరు నలుమొగంబులును శత్రువులు చుట్టుముట్టిరి. ఒక్కగడియ లో కఱకుతురకలు బెబ్బులులవలె వచ్చి కోటలోఁ బడుటకు సిద్ధముగ

నుండిరి. అప్పుడు స్త్రీలు ప్రత్యేకముగా చితులనేర్పఱచుకొని యందు బడి చచ్చుటకు వీలులేదు. అందుచే పుట్లకొలఁది యెండుపుల్ల లొక్క చోట కుప్పగ పరపించి దానిపైఁ బారువులకొలఁది తుపాకిమందు పోయించి రాణీకర్ణావతి పదుమూఁడువేల రాజపుత్రస్త్రీలతోఁ గూడి యా కాష్ఠమున బ్రవేశించి చిచ్చుపెట్టుకొని యగ్నిహోత్రుని కేకాహుతి సమర్పించెను. మిగిలినస్త్రీలుకొందఱు విసముదినియుఁ గొందఱు ఖడ్గములతోఁ బొడుచుకొనియు కర్ణావతి మార్గము ననుసరించిరి.

ఇట్లు నిశ్శేషముగ నంతఃపురకాంత లందఱుఁ గులాచారమును నడపి గౌరవంబును నిలుపుకొన్నపిదప హతశేషు లగురాజపుత్రవీరులు నిర్విచారముగ రక్తాంబరములు ధరించి యాయుధపాణులై మృత్యుదేవతం దృణీకరించి కోటతలుపులం దీయించి ముట్టడివేయు మ్లేచ్ఛసైన్యములపైఁబడిరి. ఆదినము ముప్పదిరెండువేల రాజపుత్రులు దేశాభిమానము నిమిత్తము ప్రాణములు విడిచిరి. రాజస్థానము నందున్న శూరులందఱానాడు పంచత్వము నొందిరి.

అనంతరము బహదూరుషా చచ్చినవారితోడను చచ్చుచున్నవారితోడను నిండియున్న చిత్తూరుకోటలో పదునైదుదినములు నఱకు కొలువుఁ దీర్చియుండెను. అట్లుండ హుమాయూను దండెత్తి వచ్చుచున్నవాఁడనువార్త వినిదానికిం దగినప్రయత్నములఁ జేయ నారంభించెను. బహదూరుషాయొక్క సేనలోపోర్చుగీసువారుకొందఱుండి ఫిరంగులను మిక్కిలి నైపుణ్యముతో బ్రయోగించి కోటలో బడుచుగొనిరి. అందుచేనతనికి పోర్చుగీసువారిమీఁదను వారిఫిరంగులమీఁదను గడువిశ్వాస ముదయింప నతఁడు వారెంతచెప్పిన నంత నే యుచుండెను. ఆపోర్చుగీసువారి సహాయమున హుమాయూను రాక నడ్డగింపగల శిబిర మొకదానిని నిర్మించిదడులు గట్టించి కందకములఁ ద్రవ్వి యాశిబిరము దుర్భేద్యముగఁ జేసిరి. దానిబలము జూచుకొని

బహాదూరుషా యింక తాను సురక్షితుఁడ ననుకొని నిర్భయముగ నందుగూర్చుండెను.

ఆవ్యూహము పన్నిననేర్పరులు మిక్కిలి బుద్ధిమంతులే యగుదురు. గాని శతృవులు లోపలికి వచ్చుట యెంతకష్టమో లోపలివారు బైటికి బోవుటయు నంతయేకష్టమనుమాట వారు మరచిరి. వ్యూహము పన్నినయతఁడు పరాజయము గలిగినప్పుడు సేన బారిపోవుటకుఁ దగిన వీలుండునట్లు పన్ననలయును. పోర్చుగీసువారు బహాదూరుషా సేన కట్టిపీఁకను కలుగఁజేయసమరి. హుమాయూను సేనలనాలుగు దెసలం జుట్టుముట్టి యెక్కడచూచిన దామెయై కనఁబడుచుండెను. తనసేనకు తిండిసరకు లంతకంతకు తరిగిపోవుటయు వానిని దెప్పించుకొనుటకు మరల వీలులేకపోవుటయు సేన యావలకుబారిపోవుటకు దుస్సాధ్యమగుటయు శత్రుసేనను జయించుట స్వప్నవార్తయగుటయు నెఱిగి బహాదూరుషా తనయనస్థకుఁ దానే సిగ్గుపడి యైదుగురు బంట్లను సాయము దీసికొని మారువేషము వేసికొని యర్ధరాత్రిమున నావలబడి ప్రాణములు దక్కించుకొని సేనకర్మము సేనదని యూరకొనెను. సేన మేలుకొని ప్రభువుగానక వానకుఁ గఱిగిపోయిన యుప్పులాగున నదృశ్యమయ్యెను. బహాదూరుషా కష్టపడి జయించిన చిత్తూరుకోట హుమాయూనుని స్వాధీనమయ్యెను.

బహాదూరుషా తఱుమఁబడి యొక నెలవుననుండియొక నెలవునకు బరువులెత్తుచుఁ గొంతకాలమున కెచ్చట గానబడడయ్యె. హుమాయూను సమయమునకు వచ్చి చిత్తూరునగరమును గాపాడలేకపోయినను బహాదూరుషాయొక్క మంత్రుల తెలివితక్కువ ప్రయత్నమువలన వానింగెలిచి వానిరాజ్యములగు మాళవఘూర్జర దేశములను స్వాధీనము చేసికొనియెను. తనసహాయమున గోరిన కర్ణావతిదేవి మృతినొందుటచేతను నామెకుమారు డగు నుదయసింగెచ్చ

ట నన్నవాఁడో తెలియకపోవుటచేతను హుమాయూను విదేశములం దున్న విక్రమజిత్తును బిలిపించి రాణాగ జేసెను మొదటచిత్తూరు రాజ్యముయొక్క నాశనమునకు గారణుఁడైన బేబరుయొక్క కుమారుఁడే మరల చిత్తూరురాజ్యమునకు సంరక్షకుఁడై యుపకారముజేసి విక్రమజిత్తును సింహాసనమెక్కించి యతఁడు తనకు మిత్రుఁడు విధేయుఁడు నగునట్టు లేర్పాటులుచేసెను.

---

## ఉదయసింగుకథ.

చిత్తూరుయొక్క రెండవముట్టడి ముగిసిన కొలదికాలములోనే విక్రమజిత్తు మరలవచ్చి సింహాసనమెక్కి పరిపాలన మారంభించెను కాని యతడనుభవించిన కష్టములవలన నతఁడించుకేనియు బుద్ధిఁదెచ్చుకొనక మునుపటివలెనే మంత్రులను సామంతులను రాజబంధువులను నవమానించుచు వచ్చెను. వానికి లోబడిన రాజపుత్రప్రభువులందఱు విక్రమజిత్తును బారదోలి చిత్తూరుసింహాసన మెక్కగల సాహసుడు మఱియొకడు లేమిచే గొంతకాలమువఱకు నతఁడేమి చేసిన నదియేసహించి యుండిరి. విక్రమజిత్తుయొక్క సవతితమ్ముఁడగునుదయసిం గప్పటి కాఱుసంవత్సరముల వయసువాడు అతనిరాజుగా జేయుదమన్న నట్టిబాలకుని రాజుగా జేయవలసిన సమయము గాదు.

ఒకనాడు విక్రమజిత్తు నిండుకొలువుండి మజమీూఁదేశపు రాజుపయి నెందుకో గోపించి వానినొకదెబ్బ కొట్టెను అదిచూచిన లోడనే సభాసదులయిన రాజపుత్రప్రభువు లందఱు నొక్కమాటు దగ్గునలేచి సభవిడిచి యావలకుఁబోయిరి. ఆయవమానముఁనొందిన

యజమీరు రాజు కడువృద్ధుఁడు గౌరవనీయుఁడు. నిండుకొలువులో సాటిదొరలయెదుట నట్టియవమాన మెవరికయినను దుస్సహామే. అందులో విక్రిమజిత్తే యాయవమానమునకుఁ గారణుఁ డగుటచే రాజపుత్రుిల కోపమునకు మేర లేకపోయెను. అంతియగాక యాపరాభవము నొందిన రాజపుత్రుఁడు తొల్లి రాణాసంగుఁడు తల దాఁచుకొనుటకు పంచయయినలేక నడవులం దిరుగులాడుచున్న కాలమున వానికభయ మిచ్చి సాయముచేసిన శ్రీనగర రాజు. సంగుఁ డాతని యెడఁ గృతజ్ఞుఁడయి వానిచేసిన మేలుం దలంచి వాని కజమీరు రాజ్యము బహుమానముగ నొసంగెను.

రాజపుత్రివీరులు కొలువు విడిచి యావలకుఁ బోయినతోడనే చందావతుకులజుఁ డగువీరుఁడు తక్కినవారిం జూచి యిట్లనియె. "సోదరులారా! యీవరకు మనము పువ్వువాసన జూచితిమి రేపు ఫలమనుభవింపవలయు నుగదా!" అనవుడు నజమీరు రాజు పండు రుచియు నిప్పుడే తెలియుచున్నదని మెల్లగ ననియెను, ఈమాటలు చెవిని బడినతోడనే రాజపుత్రివీరుల కందఱకు విక్రమజిత్తుపయియలుక నినుమడింప కోపావేశమున విక్రిమజిత్తుయొక్కగాని నంగుని వంశస్థులలో నెవనియొక్కగాని యధికార మంగీకరింపఁగూడ దని యందఱు ప్రితినఁ జేసికొనిరి. ఆప్రతినానంతరమున మఱల నెవ్వని రాణాగాఁ జేయవలయునని సంశయ ముదయించెను. ఈవఱకు నంగునికుమారులిద్దరు పడుచుతనపుగరువముచేత విజృంభించి రాజవంశమున కప్రతిష్ఠయు రాజ్యమునకు దురవస్థను సంఘటించిరి. అందుచేత మరల రాజ్యము సుప్రితిష్ఠముగఁ జేయుగల బహుశాలియుండిన గాని వారిమనంబునకుఁ దృప్తి గలుగదు. అట్టివాఁడెవ్వఁడని యోచింపుచుండ వారిమనంబుల కొక్కపురుషుఁడు పొడకట్టెను. సంగునిసోదరుఁడును మహాబలసంపన్నుఁడును సాహసికాగ్రగణ్యుఁడును దిగంత

విశ్రాంతకీర్తియు నగుపృథివిరాజునకొక కుమారుఁడు గలఁడు. వాని పేరు వనవీరుఁడు హిందీభాషలో వానిని బన్బీరుఁ డందురు. అతని చిత్తూరు రాజ్యసంరక్షకునిగా నేర్పఱచు టుచిత మని వారు నిశ్చయించిరి. అతఁడు బలసంపన్నుఁడును సింహవిక్రముఁడు నగుపృథివి రాజునకుఁ గుమారుఁడు నగును గాని దాసిపుత్రుఁడగుటచేత వానిని వారు రాణాగాఁ జేసికొనఁజాలక కొన్నిసంవత్సరములపాటు చిత్తూరు రాజ్యమునకు కతఁడు సంరక్షకుఁడుగా నుండి దానిని గ్రమస్థితిలోనికిఁ దెచ్చినపక్షమున నింతలో నుదయసింగు యుక్తవయస్కుఁడై పరిపాలనకుఁ దగినవాఁడగునో కాఁడో తెలిసికొనుటకు వీలు గలుగునని నిశ్చయించిరి.

మనవీరుఁడు తొలుదొల్త సందేహించి సూర్యవంశపవిత్రదీపకులు మహాసాహసులు నగు చిత్తూరురాజులు పాలించిన రాజ్యమును తనవంటి హీనకులజుఁడు పాలింపఁదగదనియుఁగావున తన కదిష్టములేదనియు వారిం బ్రార్థించెను. కాని రాజపుత్రవీరుల లందఱుఁజిత్తూరు రాజ్యముయొక్క దురవస్థను వర్ణించిచెప్ప రాజ్యలక్ష్మి నట్టిదురవస్థ నుండి తప్పింపఁగల సమర్థు డతఁడుతక్క వేరొకఁడు లేఁడని నొక్కి పలికి బ్రతిమాలుటచే వారిమాటం ద్రోసిపుచ్చలేక యెట్టకేల కతఁ డంగీకరించెను.

కార్యగతులిట్లుండ విక్రమజిత్తుని సవతితమ్ముఁడగు నుదయసింగు పసిబాలుడగుటచే రాజపుత్రప్రభువులుచేయు కుట్రలెఱుఁగక యాఁకలి యగునప్పుడు భుజించుటయు వేడుక గలిగినప్పు డాడుకొనుటయు నిద్రవచ్చినప్పుడు పవ్వళించుటయు వ్యాపారములుగ నంతిపురమున బెరుగుచుండెను. తల్లిదండ్రులు చిన్నతనమందె గతించుటచే పున్నయను నొకదాసి వానికిఁ దల్లియై పెనుచుచుండె అదితల్లిగా తనయీడువాఁడగు దానికొడుకు తనకుం జెలికాఁడుగా నుదయసింగు క్రమముగా నభివృద్ధి పొందుచుండె.

ఒకనాఁడు సాయంకాల మెప్పటియ ట్లంతఃపుర సేవకుండగు మంగలిఁ ఉదయసింగునకు నన్నముదెచ్చి పెట్టి యారగింపఁ జేసెను. రాజపుత్రిగృహములలో మంగలివాండ్రు తక్కిన పనులకుఁ దోడుగ వంటలుగూడ చేయుదురు. ఉదయసింగుభోజనముచేసియొకపాన్పుపై నిద్రిపోయెను. వానిమంచముప్రక్కనే దాసీపుత్రుఁడును పండుకొని నిద్రించెను. పున్నయుఁ దన కన్నకుమారునికన్న నెక్కుడు ప్రేమం బెనుచుకొనుచున్న రాజకుమారుని గాపాడుకొనుచునించుక మేలుకొని యుండె. అట్లుండ, నాకస్మికముగ నంతఃపురములనుండి గోలయురోద నము వినవచ్చె. పున్న తొందరపడి యదియేమో తెలిసికొనుటకు లేచిచెవియొగ్గి వినఁజొచ్చెను. సాధారణముగ నంతఃపురములో దప్పు చేసినదాసిసలను శిక్షించునప్పుడును నందకత్తియలగు సవతు లోం డొరులతో కలహించునప్పుడును నార్తనాదములు వినఁబడుటకలదు కాని యానాటిధ్వను లట్టివిగా నుండవయ్యె. శ్రివణదారుణమైగర్భ నిర్భేదకమైవినఁబడిన యారోదనముమరణసంబంధమైనదిగాగ్రహించి పున్న యేదో యపాయము వాటిల్లెనని తలంచి తాను తనజాగ్రత్త మీఁదనుండెను.

అంతలో వంటలవాఁడగు మంగలి పరుగుపరుగున వగర్చు కొనుచువచ్చి యాకళవళమునకుఁ గారణ మేమని పున్న యడుగ నిట్లనియె. "నీవెఱుగనేయెఱుఁగవా? ఈమూల నుండుటచే నీకేదియు దెలియలేదు గాబోలు మనదొరలందఱు విక్రిమజిత్తును సింహాసన భ్రిష్టునిజేసి వనవీరుని చిత్తూరునకు సంరక్షకుఁడుగా నేర్పఱచిరి. ఆవనవీరుఁడు రాజ్యము స్వాధీనము చేసికొని విక్రిమజిత్తును వధించి నాఁడు. ఆరాజు నిమిత్తము వానిభార్యలు చుట్టములునేడ్చుచున్నారు ఈరోదనమది."

ఆపలుకులువిని పున్న నిశ్చేష్టయై యేమియుఁదోచక పండు

కొనియున్న రాజపుత్రునిజూచి తనలో విక్రమజిత్తును జంపినవాఁ డుదయసింగును బ్రతుకనిచ్చునా? రాచపురుగేది మిగిలిలను వనవీరు నకు క్షేమకరము గాదుగదా” యనుకొని చప్పుచప్పున రాజపుత్రుని మేననున్న విలువగల బట్టలు నగలు నొలిచివైచి వానినొక పండ్ల గంపలో పండుకొనఁబెట్టి మీఁద కొన్ని యాకులను పండ్లనుగప్పియది యొరులకంటఁబడకుండ జాగరూకతతోఁ దీసికొనిపొమ్మని మంగలి వాని కప్పగించి “నీవీక్షణమే యిచ్చటినుండి పోయి నదిలో నిసుక తిప్పమీఁద నీగంపపెట్టుకొని కూర్చుండుము. నేనుం ద్వరలోవచ్చి మిమ్ముం గలిసికొనియెద” నని చెప్పి వానిని సాగఁదోలెను.

మంగలి యాగంపెత్తుకొని కావలివాండ్ర యెదుటనుండియే యనేక కవాటములు దాటిదాటి కోటవెలుపలికిం జనియెను. రాజ భటులు వానింజూచియు రాజులు తినగా మిగిలిన కూరలు నన్నము మంగలి తన యాలుబిడ్డల నిమిత్తము పట్టుకొనిపోవుట నిత్యము జరుగుచుండుటచే నాదినముననుగూడ నట్లే మంగలి గొనిపోవుచుండ బోలునని గంప బరీక్షించి చూడకయే వానిని విడిచిపుచ్చిరి. పన్న యింకను గొంతపని చేయవలసినది. రాజపుత్రుని మీఁదనుండి తీసిన విలువబట్టలు తనకొడుకునకు దొడుగవలసి యుండెను.

ఆబట్టలు నిద్రించియున్న తనకొడుకునకు విసవిసదొడిగి రాబోవు దురవస్థ కెదురుచూచుచు నామెకూర్చుండెను. అంతట యచిరకాలములోనే యామెకు మనుష్యుని యడుగుల చప్పుడు విన బడియె. వనవీరుడు తలుపులు దీసికొని ఖడ్గపాణియై యామె యెట్ట యెదుట నిలిచి “అమ్మా! నీయధీనమునందున్న రాజకుమారుడేడీ? ఉదయసింగును నాకు జూపుమని గంభీరధ్వనితో బలికెను. కన్నకడు పగుటచే యాదాసిహృదయము నీరై పోయినందున నేమియుం బలుక జాలక యొక్కనిముస మూరకుండి పిమ్మట ధైర్యము దెచ్చికొని

యతడే రాజకుమారు డని చేతితో నిదురించు చున్నతనకొడుకుం జూపెను. కూరకర్ముడగు వనవీరుడు ఖడ్గముతో వానితల రెండు ముక్కలుగ నరికెను. నిదురించుచున్న దాసిపుత్రుఁడు నిదురించుచుం డగనే కన్నతల్లికన్నులముందుట యొక్క కేకవేసి ప్రాణములు విడిచెను. వనవీరుఁడును రాజ్యము నిష్కంటకమైనదని నమ్మి తాను రాణానై తినని సంతసించి సంతుష్టితో నంతఃపురము విడిచిపోయెను.

రాజకుమారుఁడు బ్రతికియుండిన పక్షమున దనవంటి దీనుల ననేకుల నన్నవస్త్రములిచ్చి పోషింపగలడని యెంచి దాసియగు పున్న తనకుం జిత్తూరు రాజకుటుంబమువారు చేసినమేలు మరువక కృతజ్ఞతగలిగి రాజపుత్రుని ప్రాణములు గాపాడుటకై తనకుమారుని ప్రాణముల నర్పించి యుత్తమచరిత్రగలదై యెల్లరచేతం గొనియాడ బడుచున్నది. రాజకుమారునకు దహనక్రియలు వానిఠీవికిదగినంత గొప్పగా జరుపఁబడెను. అవి ముగియువఱకు పున్న కన్నీరు సంతత ధారగా గారునట్లేడ్చి యనంతరమున క్రొత్త రాణావద్దను దక్కినరాజ బంధువుల వద్దను సెలవుగైకొని రాచనగరుఁబాసి యావలకుం బోయెను. పోయి పురము వెలుపల నేటిలో నిసుకతిప్పమీఁదగంపతో దనరాక కెదురుచూచున్న మంగలిం గనుగొనియెను. నల్లమందు పెద్దమోతాదు ప్రయోగించుట చేతనో మఱి యేకారణముచేతనో యుదయసింగు గంపలోనుండి యంతవఱకు మేలుకొనలేదు మారు మూల త్రోవలంబడి నోరులకంట బడకుండ నడచి యాపున్న మెల్ల మెల్లగ దేవలనగరముఁ జేరెను. ఆనగరమును చిత్తూరురాజ్యము నిమిత్తము తనప్రాణములు విడిచిన భాగ్జియను శూరశిఖామణికుమారుఁడు పాలించుచుండెను ఆతనివలన రాజపుత్రునకు సంరక్షణము జరుగునని దాసిపుట్టెడాస పెట్టుకొని యరిగెను ఆరాజును రాజ కుమారుని దాసిని సత్కరించి యాదరించెను కాని చండశాసనుఁడు

వనవీరునకు జడిసి తనరాజ్యమునందా రాజకుమారునినిలిపినపక్షమున దేవలకోట చిత్తూరునకు సమీపమున నుండుటచే నావార్త వేగుల వాండ్రవలనఁగాని మఱియొకరివలనగాని వనవీరునకు దెలియకపోదనియుఁ దెలిసినచో నతఁడు తనకెగ్గుసేయుననియు జెప్పి వారిం దన రాజ్యమునఁ నుండనీయక వేఱొకతావునకుంబంచె. దాదియు, మంగలియు మఱల గంపనెత్తుకొని పయనమై యిట్టట్టుదిరిగి దంజరుపుర మను గ్రామము చేరిరి.

ఆయూరిరాజు నుదయసింగునకు దగ్గరచుట్టమే కాని తాను బలవంతుఁడను కాననియు బాలకునకు శరణమిచ్చినట్లు దెలిసినచో వనవీరుఁడు తనప్రాణముల దక్కనీయఁడనియు గావున దానుసహాయము చేయఁజాలననియుఁ జెప్పియతఁడు వారి నక్కడనిలువనీయకపయనముచేసి వేరొక తావునకు బంపెను.

ఇట్లిరువురచేత నిరాకరింపబడియుఁ బున్న ధైర్యము విడువదయ్యె. మున్ను పృథివిరాజు కొంతకాలము వసియించినకమలమియరుకోటలో నాకాలమున జైనుమతస్థుడగునొకవర్తకుఁడు కొంతసేనం గూర్చుకొనివాసము జేయుచుండెను. శూరులమనివీరులమని చెప్పుకొనుచు సమయమగునపుడు రాజపుత్రునకుశరణమొసంగలేని యాక్షత్రియుల నాశ్రయించుటకన్న మతాంతరుఁడగునీకోమటి నాశ్రయించుటయే యుక్తమని తలంచి పున్న బాలుని, మంగలిని వెంటబెట్టుకొని కమలమియరుకోటకు బయన మయ్యె.

ఆపున్న తానెంత రాజపుత్ర స్త్రీయైనను ఉక్కుసరములనిండు పౌరుషము గలమగవానికన్న తానెంత ధైర్యముగల దైనను నోరు లెఱుఁగకుండ నామహారణ్యమధ్యమున నాకొండమీద కనుమలం గడచి శిఖరంబుల నెక్కిదిగి సెలయేళ్ళ దాటి ఘాతుకమృగంబుల బారినుండి తప్పిమెట్లు కమలమియరుకోట జేరినదాయని యాచిక్క

మార్గముల నెఱిగినవారంద రాశ్చర్యపడకపోరు ఆమె యసహాయ యై యీవనమధ్యమున బోవునప్పుడు ఘాతుకమృగంబుకన్న నెక్కుడు ఘాతుకు లగుభిల్లులు మొదలగు నడవిమనుష్యులుసహిత మామె కథను విని జాలిపడి యామెకుం దోడుపడిరి.

పూర్వకాలమున బప్పరావులకు భిల్లు డొకడు మొగమున టీకా వేసియనగా నెత్తురిచిహ్నము వేసి సజాతికతడు రాజని చెప్పినారికి లోబడియెను. అట్లే యాభిల్లులందఱు నుదయసింగు తమకు రాజని యంగీకరించి వానికిం దోడ్పడుదు మని వాగ్దానము చేసిరి కమలమియఱు కోటలో జైనుమతస్థు డగుకోమటి యసాసా యనునత డొకనాడు తల్లియుం దానును గూరుచుండి మాటలాడు చుండగా తననిమిత్త మొకయాడుది వచ్చి వేచియున్నదని విని యామెను లోపలికి రమ్మనియానతిచ్చెను అప్పుడు మేలిముసుంగు వేసికొని యున్నయొక రాజపుత్రస్త్రీ వానియెట్టయెదుట నిలిచెను నావల్ల నీకేమి కావలయు నని యసాసా యడుగ నామె తనప్రక్క నున్న రాజకుమారు నెత్తుకొని,యితడు నీరాజు ఈబాలకుని రక్షిం పుమని యాబిడ్డను వానిపాదములపై బడవైచెను అసాసా కొన్ని ప్రశ్నలడిగి పున్నవలన బాలకుని వృత్తాంత మంతయు నెఱిగి యేమి చేయుటకు దోచక కళవళపడజొచ్చెను. స్వామిభక్తినిబట్టి చూచి నను మతమునుబట్టి చూచినను గౌరవమును జూచినను బాలకుని రక్షించితీరవలయు నని యతనికి దోచెను కానిదుర్జను డగు వన వీరునితో గయ్యమునకు గాలుదవ్వుట కిష్టము లేదు. జైనుమత స్థునకు రాజపుత్రున కున్నంత సమరోత్సాహము లేదు అదిగాక రా దలంచిన యవస్థ తనస్వవిషయము కాకపోవుటచే నసాసా యుద్ధ మునకు మొదలే సమ్మతింప డయ్యె. అందుచేతనతండు సందేహించు చు దీర్ఘాలోచనము చేయుచు ననేకకష్టములు పడిపడివచ్చినపున్న కేసి

చూచుచు తనకు రాఁగలయిక్కట్టులనెల్ల జెప్పుచు గాలయాపనము చేయుచుండ నంతలో నతనితల్లి కుమారుని పిలిచి 'నాయనా! యేల సందేహించి భయపడెదవు? స్వామిభక్తిగలవారు గష్టముల గణియింపరుగదా. ఇతఁడు నీరాజగు సంగునికుమారుఁడు మనయదృష్టము బాగున్నచో మనకే జయము కలుగగూడదా' యని పలికి వాని కుత్సాహము గలిగించెను అసాసాతల్లిపలుకులచేఁ జోషముఁ దెచ్చుకొని వారికభయ మిచ్చెను. కాని మహాసాహసికురా లగునాస్త్రీ యింత కంటెనెక్కువకష్ట మగుపని యొకటి చేయవలసియుండెను ఉదయ సింగు నాఁడు మొదలుకొని యాసాసాయొక్క మేనల్లుఁడని చెప్పుట కువారు నిశ్చయించిరి. అసాసాకోమటి యగుటచేత నతనివద్ద రాజ పుత్రస్త్రీ పరిచారికగా నుండిన లోకు లనుమానింతురు అదికారణ ముగా తనకొడుకు నైనఁ జంపుకొని వానినే నమ్ముకొని యున్నయా దాది యాబిడ్డను విడిచి పోవలసివచ్చెను. బాలకుని విడువలేక విడువ లేక పున్న యెట్లుటో విడిచికన్నులు వాచిపోవునట్లేడ్చి యెక్కడ నైనం బాలుండుఁ బాగున్న చాలునని యభేచ్ఛం జనియెను.

ఆకొండలో నుదయసింగు పెరుగుచుండ బందుగులందఱు నతఁడు వనవీరునిచేతిలో మృతినొందినాడని యెక్కయేడు పేడ్చి యూరకొనిరి. వనవీరుండును రాజకుటుంబములో వారినందఱ గడ తేర్చి తనపదవి దిట్టపరచుకొని దాను దాసిపుత్రుడనుమాట మఱచి రాజపుత్రప్రభువుల యనుగ్రహముచేతఁ దనకింత మహైశ్వర్యము పట్టినదని తలంపక తానాగర్భశ్రీమంతుఁడే యనుకొని గర్వించి తిరుగఁజొచ్చెను అతని రాజసంరక్షకునిగా నేర్పరచిన రాజపుత్ర ప్రభువు లందఱు దమచేసిన లోపమునకు పశ్చాత్తాపమునొంది రాజపుత్రవంశమెల్ల నిర్మూలింపబడిన దనుకొని చేయునది లేక యెట్టెటో యేడుసంవత్సరములు వానిపాలనకు లోబడి యుండిరి

అటులుండ నొకమా రొకపండుగకు కమలమియరుకోట కనేక బంధువులు వచ్చి యసాసాచేత సత్కరింపబడి విందులనారగించిరి. వచ్చినరాజపుత్రులైన కందఱకు లోపలమందిరమును తనవర్ణమువారగువర్తకులకు మఱియొకమందిరమునకు నతఁడు వడ్డనల జేయించెను. భోజనమునవేళ నసాసా మేనల్లుఁడు రాజపుత్రుల బంతిలోనికిఁ బోయి యచ్చట నొకకంచములో పెరుగన్నము తిన నారంభించెను. ఆబాలుఁడు కోమటి యగుఁగొని వానిని పంక్తి బాహ్యుఁడుగా నెంచి యావలకుంబొమ్మని రాజపుత్రులు కొందఱు బ్రతిమాలిరి. కొందఱు వేఁడుకొనిరి. కొందఱు బెదరించిరి. బాలుఁడు వేఁడికోలు వినిపించుకొనఁడయ్యె. బెదరింపులకు బెదరఁడయ్యె. అసాసా యాబండబాలు నేమియు సేయలేక యూరకొనియెనని కొందఱు తలఁచిరి. అందులో నొకరిద్దరు బుద్ధిమంతులు బాలునియొద్ద కోమటిగుణము లేవియులేక పోవుటచే నతనికి నసాసాకు నేమియు సంబంధము లేదని నిశ్చయించిరి.

అనంతరము కొంతకాలము జరుగ నొకనాఁడు కమలమియరు మార్గమునఁ నొకరాజపుత్రుఁడు మార్గవశమునఁ బోవుచుఁ దనరాక నసాసాకు దెలియఁబరచెను. వానిని సగౌరవముగాఁ దోడితెచ్చుట కసాసా తనమేనల్లుని పంపెను. రాజచిహ్నములు ధీరలక్షణములు గలయాబాలుని ముఖమువైఖరిఁ జూచి యావచ్చినయతఁ డాశ్చర్యపడి యతఁ డసాసాకు చుట్టముగా డని నమ్మి వానివృత్తాంతము దెలుపుమని యసాసాను నొక్కియడిగెను. అసాసాయుఁ దగినపని చేయవలసినకాలము వచ్చినదని గ్రహించి, యాబాలుఁడు తనమేనల్లుఁడు కాఁ డనియు సంగుని మూఁడవపుత్రుఁ డగునుదయసింగనియు జెప్పి నిజము నొప్పుకొనియెను. ఈవచ్చినరాజపుత్రవీరుఁడు తొల్లి రాణా హమీరును విశంతువయిన తనకూఁతు నిచ్చి వివాహము చేసి వంచించిన మాల్ దేవుని వంశస్థుఁడు సోనిగుఱ్ఱయనుసంస్థానమునకుప్రభువు.

ఈకొండకోటలో సంగునికుమారుఁ డగునుదయసింగు వసించు చున్నవాడన్నవార్తలు దేశమంతట కొలదికాలములోనలముకొనెను. ఆమాట నిజమో యబద్ధమో తెలిసికొని రాజపుత్రుని కన్నులార చూచుకొనుటకై మీవారునుండియు దక్కిన సంస్థానములనుండియు రాజపుత్రప్రభువులు విరామము లేక కమలమియరునకు రాదొడగిరి. ఇటు లుండ చందావతుకులస్థుఁ డగు రాజపుత్రప్రభువు వనవీరునివలన పరాభవము నొంది వానిని విడిచి కమలమియరుకోటకు వచ్చి రాజ పుత్రుని కలిసికొనెను. వాని పరాభవకారణ మిది. పూర్వమునుండి మీవారు రాణా రాజబంధువులను విందులకుపిలిచినప్పుడు తనకెవ్వరి మీఁద నత్యంతగౌరవము గలదో వానిని గౌరవించుటకు తనకంచము లోనుండి కొంచె మెంగిలియన్నము వానికిఁ బంపుట యాచార మయి యుండెను. ఈయాచారము రాణా సరిగా నడుపనప్పుడు రాజపుత్రవీరు లనేకపర్యాయములు రాణాపైఁ గోపించుచువచ్చిరి.

ఒకమా రొక రాజపుత్రవీరుఁడు తనకు రాణాపంపవలసిన యన్నము మఱియొకనికి పంపుటచే గోపించి విందారగింపకయే లేచి పోయెను. వనవీరుఁడు తనస్థితిని మఱచి దాను నిజముగా రాణాయే యనుకొని యాయాచారమును నడుపఁజూచి తనయెంగిలి యన్నము మీవారు ప్రభువులగు కొందఱికి పంపఁగా వారాయుచ్ఛిష్టమును గుడువక యూరకొనిరి. అభిమాన ధనుఁడగు చందావతు వంశజుని గారవించుటకు మఱియొకమా రెంగిలి యన్నమును పంప నతఁడు కోపోద్దీపితుఁడై యాకంచముపొత్తును నిరాకరించి మీదుమిక్కిలి యిట్లని వానికి వర్తమాన మంపెను "బప్పరావుల వంశస్థుని యుచ్ఛిష్టము దినుటయే మాకు గౌరవముకాని దాసీపుత్రుని యెంగిలి కూడు తినుట మాకు గౌరవముకా" దని చందావతువంశస్థుఁడు చివాలునలేచి తనయూరికిఁబోయి వనవీరునకు లోఁబడక వానిని

రాజ్యభ్రష్టునిజేయుటకై యోచించుచు సంగునికుమారుఁడు కమల మియరుకోటలో నున్న వాఁడనివిని మహానందభరితుఁడై యచటికిఁ జనియె ఆమహావీరునితోఁగూడ ననేకరాజపుత్రు లాకోటకుంజని కొలువుదీర్చి కర్తవ్యము విచారింపఁ దొడంగిరి. అప్పుడు పున్న వెనుకటిమంగలిం దోడ్కొనివచ్చి యాకొలువుకూటముననిల్చి రాజ పుత్రులని పూర్వవృత్తాంత మంతయు వారికిం బూసగుచ్చినట్లుచెప్పి వనవీరుడు విక్రమజిత్తును వధించిన నాటిరాత్రి చంపబడిన బాలుడు తనకుమారుడుగాని రాజపుత్రుడు కాడనియు గడువుదీపియైనను మానుకొని తాను రాజపుత్రుని రక్షించితిననియు నతడు సంగుని కుమారుఁడగు నుదయసింగనియు గోమటి మేనల్లుడు కాడనియు బ్రమాణముచేసి వానికి నమ్మకము పుట్టునట్లు పలికెను. అక్కడకు వచ్చిన రాజపుత్రప్రభువులలో నప్పుడు చోహాణవంశస్థుడగు వీరుడుం డెను. అతడు చిత్తూరురాణాలకు దగ్గర చుట్టము కులవృద్ధు. అసాసా యాసభవారి యెదుటకువచ్చి యాబాలుడు తన మేనల్లుడు కాఁడని చెప్పి వానిని చోహాణవంశస్థుడగు రాజపుత్రులకు జేతిలో జేయివేసి యప్పగించి తనభారము తొలగినదని సంతసించెను.

అప్పుడా వృద్ధరాజు బాలుని గౌగిలించుకొని యతడు తన యేలినవాడని వానితోఁగలిసి వానియెంగిలియన్నము భుజించెను. అప్పు డుదయసింగు మొగమున లత్తుకటీకా యనగా రాజచిహ్న ముంచబడెను. వెంటనే యచట జేరిన రాజపుత్రప్రభువులందఱు నతడు తమరాజని వానిపాదములకు సాగిలబడి మ్రొక్కిరి.

ఉదయసింగునకు సహాయముచేయ మిత్రులు వందలకొలది వచ్చి వానికిగావలసిన సాధన సామగ్రులన్నియు సమర్పించిరి. అట్లు వచ్చినవారిలో మొట్టమొదటివాడు ముందుగానీబాలునివృత్తాంతము బయలుపెట్టిన సోనిగుఱ్ఱసంస్థానప్రభువు అతఁడు రాణాతోఁగలయు

టయే గాక తనకూఁతును వానికిచ్చి వివాహము చేయఁదలచెను. సోనిగుఱ్ఱప్రభువువంటి బలవంతునితో సంబంధబాంధవ్యములుండుట మంచిదని యుదయసింగుయొక్క ముఖ్యబంధువులు దానికంగీకరించిరి కాని యీసోనిగుఱ్ఱప్రభువు యొక్క వృద్ధప్రపితామహుఁడగు మాల దేవుఁడు తన వితంతుపుత్రికను రాణాహమీరునకు మోసమున వివాహము చేసినప్పుడు హమీరు మహాకోపోద్దీపితుఁడై తనసంతతివారెవ్వరు మాలదేవుని సంతతివారితో వియ్యమందఁ గూడదని శాసించెను. ఆమాట కొందఱు రాజపుత్రవృద్ధులు జ్ఞప్తికిఁ దెచ్చుకొని యుదయసింగు సోనిగుఱ్ఱప్రభువు కూతును బండ్లి యాడగూడదని పట్టు పట్టిరి. అయిన నుదయసింగుని బంధుమిత్రులుకలిసి యోచించి సోనిగుఱ్ఱప్రభువుతో వియ్యమొందుట వలన గలిగెడు ననేకలాభముల నుగ్గడించి హమీరుని శాసనము రెండువందల యేండ్లనాటి దనియు దేశకాలపాత్రములనుబట్టి తామది మార్చుకొన వచ్చుననియునప్పటి స్థితిని జూచిన పక్షమున రాణాహమీరే తన ప్రతిన మార్చుకొనుననియు నొక్కిచెప్పి యాపట్టుపట్టినవారి నొడంబరచి వివాహము చేసిరి.

ఉదయసింగున కన్నియు శుభసూచకము లేయయ్యెను. ఆదినములలోనే వనవీరుడు తనకూతునకు వివాహము చేసి యామెకు నైదువందలగుఱ్ఱములను బదివేల యెద్దులపై వేసి యమూల్యవస్తువులను సారె పంపెను. ఉదయసింగుని మిత్రులు కొంద ఱాసారె నడ్డముగొట్టి యాసరకులను దోచుకొని ఉదయసింగు వివాహము నిమిత్త ముపయోగించిరి. ఇరువురుతప్ప పేరుప్రతిష్టలుగల రాజపుత్రులందఱు వివాహమునకు వచ్చిరి. వివాహమహోత్సవములు మహావైభవముతో జరిగినపిదప పెండ్లికిరాని యాయిరువురు దొరలకు బుద్ధిచెప్పుటకై తక్కినరాజపుత్రులు వారిపై దండువెడలిరి.

ఆయిరువుర నొకఁడు రణరంగమున వధియింపఁబడెను. రెండవవాఁడు తెలివిగలిగి యుదయసింగునకు లోబడియె. వనవీరుఁడు ఇరువురు రాజపుత్రులకు సహాయము చేయఁదలచి తన సేనలం గూర్చుకొనిపోయెను. కాని మంచిసమయమున వాని సైనికులే వాని విడిచి పగవారితోఁ గలిసినందున నతఁడు నిర్విణ్ణుఁడై పారిపోయి చిత్తూరు కోటలోఁ దాఁగెను.

రాజపుత్రులెన్ని ఫిరంగులు తెచ్చి యెన్నియేండ్లు కోటముట్టడించినను వనవీరుఁడు నిశ్చయముగా గోటలో సురక్షితుఁడై యుండవచ్చును కాని వనవీరుని మంత్రిపైకి తనస్వామి కిష్టముగనున్నను లోలోపల నుదయసింగునకే కడుగూర్చును. ఒకమారు చిత్తూరుకోటలోనున్న వనవీరుల సైనికులకు భోజనసామగ్రిలు కావలసియుండినందున వేయిబండ్లమీఁద సరకులు వచ్చుచున్న వని మంత్రి వనవీరునితోఁ జెప్పి తలుపులుపూర్తిగా దీయించెను. వేయిబండ్లును గోటలోఁ బ్రవేశించినపిదప బండ్లలోనుండి సరకులకుమారు వేయిమంది రాజపుత్రవీరులు వడివడి దిగి కావలివాండ్ర నంపఁగ దెగటార్చిరి.

ఉదయసింగు విజయుఁడై భేరీభాంకరణములతోఁ గోటలోఁ బ్రవేశించెను. వనవీరుఁడు వెనుక విక్రమజిత్తును నుదయసింగును జేసినట్లు వాని నప్పుడు రాజపుత్రప్రభువులు చేసినచో బాగుండును. కాని తామేవానిఁ జిత్తూరుసంరక్షకునిఁగా నేర్పరచినందున తామే వాని జంపుట యనుచిత మని కరుణించి వానిం గడ తేర్పక సకుటుంబసపరివారముగా కోటవిడిచి యావలకుఁబొమ్మని వానిని విడిచిరి. వనవీరుఁడును రాజ్యభ్రష్టుఁడై బంధువిరోధియై నిర్భాగ్యుఁడై యసహాయుఁడై తనవస్తువులను దాను తీసికొని గోటవిడిచి దక్షిణహిందూస్థానమునకుఁ బోయి యచట నొకచిన్నసంస్థానమున కధిపతియై

కాలము సుఖముగ గడపెను. ఉదయసింగు చిత్తూరు రాణాయయ్యెను. ఘన్నయనఁగా హిందీభాషలో వజ్రమని యర్థము. ఆశబ్దమునకు నిజముగా ఘన్న దగినది యగుటచే నామెగీర్తి యాచంద్రార్కము లోకమున నిలుచుఁ గాక!

---

# చిత్తూరు మూఁడవముట్టడి.

చిత్తూరు దేశములోని సమస్తజనులకుఁ గన్నులు చల్లఁబడునట్లుదయసింగు రాజ్యపాలన మారంభించెను. అతఁడు చిత్తూరునకు వచ్చినసంవత్సరమే చిత్తూరుకోటను సంపూర్ణముగఁ బాడుచేసినయొకమహాశత్రువు జన్మించెను. ఆశత్రువుఁడు ప్రసిద్ధికెక్కిన అక్బరు చక్రవర్తియే.

ఉదయసింగుకొండకోటలోఁ గోమటియింటఁ బెరుగుచున్నపుడు ఢిల్లీలో మార్పు లనేకములు జరిగినవి. హుమాయూనుచక్రవర్తి పరమసాధు వగుటచేఁ దనమీఁద పితూరీలు చేసి జనులను తనపైఁ దండెత్తివచ్చి తన్నుజాలచిక్కులు పెట్టుచువచ్చిన తమ్ములను క్షమియించి కనికరించి యెప్పటియట్లు గౌరవమున జూడఁదొడఁగెను. యుద్ధములో నతఁడెంత శౌర్యవంతుఁడై యొడలునుఱచి పోరుసేయునో తదితరకాలములయం దతఁ డంత భోగపరాయణుఁడై నిశ్చింతతో కాలముఁ బుచ్చును. వేయేల? వానిదయాస్వభావమును, వానిసోమరితనమును తుట్టతుదకు వానిని సింహాసనభ్రష్టుని జేసినవి. అతఁడు కష్టపడి చెమటయూడ్చి మాళవదేశమును జయించెను. కాని లొంగిన దానిని పూర్తిగ లోఁబఱచుకొనక సంతోషపరవశుఁడై బంధుమి

తుర్కిలతో విందుల నారగించుటతోను మహాభోగములతోను గాలము వెళ్ళబుచ్చెను.

ఇట్లుండ "షర్ఖాను" అను పఠాను జాతిలోఁ జేరిన యొకతురక బంగాళమునందు చక్రవర్తియధికారమునకు తిరుగుబాటుచేసి యొక సేనం గూర్చుకొని దానిం జయించి తాను నవాబగుటకుఁ దలచు చుండెను. వెనుక హుమాయూను బంగాళాదేశమును జయించుచుం డఁగా జిత్తూరునుండి కర్ణావతీదేవి వానిని రమ్మని వర్తమాన మం పుటయు నతఁడు బంగాళము సరిగ లోఁబఱచుకొనకయే కర్ణావతి కు మారుని రక్షించుటకుఁ ద్వరపడి చిత్తూరునకు బోవుటయుఁ జదువరు లంద ఱెఱుంగుదురు. షర్ఖానుఁడు రేఁగినవాఁ డనివిని నతోడనే హు మాయూను సేనాసమేతుఁడై వాని నడఁచుటకు బంగాళమునకుఁ బో యెను. అతఁ డక్కడకుఁ బోయినతోడనే తొల్లి వానిచే దెబ్బలుతిని రాజ్యమును విడిచి యనాథుఁడై యెందో యడఁగియున్న బహ దూరుషా మరలఁ దలయెత్తి గుజరాతు మాళవదేశముల నాక్రమిం చుకొనియెను. హుమాయూను కనఁబడినతోడనే షర్ఖానుఁ కొంచెము వెనుదీసెను. చక్రవర్తియు బంగాళమునఁ బ్రవేశించి పగతుఁడు పారి పోయెనుగదా యనిగర్వించి యెప్పటియట్లు భోగాసక్తుఁడై కేళీవినో దములతోఁ గాలముబుచ్చుచుండెను; వానిజాడ యెఱిఁగి షర్ఖానుఁడు దారు లరికట్టి చక్రవర్తికి ఢిల్లీకి నుత్తరప్రత్యుత్తరములు జరుగ కుండ నాటంకము గలిగించెను; హుమాయూనుని తమ్ము లప్పుడయి నను వానికి సాయము చేయరయిరి. అందొకఁడు హుమాయూను సేనకు భోజనపదార్థములు పంపుదు నని వెళ్ళి యాగ్రానగరమున దానే చక్రవర్తి నని లోకులనుఁ జాటఁబంచెను. రెండవసోదరుఁడు గద్దెయెక్కిన యాతమ్ముని నావలకుఁ బాఱదోలెను. కాని గట్టిపగ తుఁ డగుషర్ఖాను విషయమున నేమియుం జేయఁడయ్యె. అందుచే

హుమాయూను తన పగతునితో సంధిచేసికొనవలసివచ్చెను. అంతట సంధిమాటలు జరుగుచుండఁగా ప్రాఁతపగలు మఱచిపోయి హుమాయూనుని సైనికులు శత్రుసైనికులతో మనసిచ్చి మాటాడుచుండఁగా నాకస్మికముగా నొక్కనాఁడు షర్ఖానుఁడు తనసైనికులం దీసికొని చక్రవర్తి సేనపయింబడి నిదురపోవుచున్న సిపాయిల నందఱను గటికవాఁడు మేకలంగోసి జంపినట్లు చంపెను. అప్పుడు హుమాయూను ప్రాణములు దక్కుటయే దుర్ఘట మయ్యెను.

పరాజయమునందిన యాచక్రవర్తి తానుతప్పించుకొని పాఱిపోవుట కేయుపాయమునుగానక గంగానదిలో దుమికి యీదిపోవుటకుఁ బ్రయత్నించి మిక్కిలి శ్రమపడుచుండఁగా నీళ్ళకావటివాఁడొకఁడు వచ్చి మేకతోలుతోఁ గుట్టినయొకసంచి తెప్పగాఁజేసి దానిపై హుమాయూనుని గూర్చుండఁబెట్టి యెట్టెటో నావలకుఁ దాటించెను. ఆవలఁబడి యతఁ డొకసంవత్సరము మంచిసైన్యమునుపోగుచేసి రాజపుత్రవీరులకు నిలయ మనిపూర్వముపేరువడిన కన్యాకుబ్జనగరము యొద్ద షర్ఖానుని గలిసికొని యుద్ధముచేసెను. అతఁ డప్పుడు తెచ్చిన సైన్యము వెనుక వానితండ్రి యగు బేబరు తీసికొనివచ్చిన సేనవంటిదికాదు. ఆసేనలో లెక్కకు లక్షమంది బంట్లుండిరి. కాని వారందఱు చావు పేరుచెప్పిన పాఱిపోవువారే. అందుచే గొందఱు యుద్ధప్రారంభముకన్న మున్నే యాచోటు విడిచిరి. కొందఱు శత్రువుల మొనటి ఫిరంగిచప్పుడు వినినతోడనే గుండెలు చెదరి చెల్లాచెదరై సిగ్గులేక కాలికొలఁది పరుగెత్తిరి హుమాయూనుమరలప్రాణములతో దాటిపోయి కొలఁదిపరివారముతో నొకతావునుండి మరియొకతావునకుఁ బోవుచు నుండుట కిల్లులేక భగవంతునిపై భారమువేసి తిరుగుచుండెను.

ఎంతమొత్తు[illegible] హుమాయూనువద్దతం

ఢిల్లీకడనున్న పట్టుదలయుఁ బ్రజ్ఞయు గొంతవఱ కున్నట్లు గనఁబడు చున్నది. ఏలయన నతఁడు తనకుఁ గలిగిన దుఃఖముచే నుత్సాహభంగమునందక నాపదలు గడచుచు క్రొత్త స్నేహితుల సంపాదించుకొనుచు దారపుత్రాదివియోగదుఃఖము ననుభవించుచు పదునైదువత్సరములు గడపెను. మొట్టమొదట కొంతకాల మత, డతిదారుణము లగుదుఃఖముల ననుభవించుచు నెప్పటికప్పుడు తలగొట్టుకొనిపోవునట్టి యాపదలను గడచుచు సింధుదేశమునందు రాజపుత్రస్థానమునందు గల యెడారులలో దిరిగెను ఆ యవస్థను గనిపెట్టి రాజపుత్ర ప్రభువులు చక్రవర్తికి తమ యోపినకొలఁది ధనమును సైన్యము నిచ్చి సాయముచేసి వానిని సింహాసన ప్రతిష్ఠితునిఁ జేసిన పక్షమున మొగలాయివంశస్థులు సూర్యచంద్ర వంశస్థులకునెల్లకాల ముకృతజ్ఞులై యుందురుకాని యట్లుజరుగలేదు. హుమాయూను సహాయము చేయుమని జసల్మేరుసంస్థానప్రభువు నడుగ తన కత నితో స్నేహముచేసికొనుట కిష్టములేదని ప్రత్యుత్తరము చెప్పెను. అనంతరము చక్రవర్తి మార్వారుసంస్థానప్రభువగు రావుమాల్దేవును దోడుపడుమని యడుగ నతఁడు సహాయముఁ జేయకపోవుటయే గాక మీదుమిక్కిలి యాహుమాయూనుఁబట్టి చెరసాలలో బెట్టింపఁ బ్రయత్నించెను. ఆచక్రవర్తి రాజ్యభ్రష్టుఁడై తిరుగుచున్న కాలముననే యొక మహమ్మదీయయోగికూఁతురు హామిదా యనునామె వానిని మోహించి తినుటకన్నము నిలుచుటకు నీడలేని యారాజును వివాహము చేసికొనియెను. మంచియవస్థలోనున్నపు డెందఱుభార్యలైన రావచ్చును. దురవస్థలోనున్నపుడు మరల రాజ్యప్రాప్తియగునని యైన లేనపుడు తనయంతనేవచ్చి తనతోఁ గలిసి తనకష్టములనే యనుభవించుటకుఁ దన్ను వివాహమాడిన యాకాంతను వెంటఁబెట్టుకొని హుమాయూను ప్రాణభీతిఁ బరుగెత్త నారంభించెను.

ఆ బాలిక కష్టదినములు వెంటనే బయలుపడెను. దేశమునం దెచ్చటఁ దలఁ దాఁచుకొనుటకు వీలులేక యాదంపతులు స్వసంరక్షణనిమిత్తము సింధు దేశపు టెడారిం బ్రవేశించిరి. ఈయెడారి నీళ్ళు లేని సముద్రమయి యంతము లేనిదై యుండెను. ఇందు ప్రచండ వాయువు లప్పు డప్పుడు వీచుచుండును. ఆగాడ్పులు విసరునపుడిసుక నేలనుండి నూరడుగుల యెత్తువఱకుఁ బెద్ద కెరటములాగున లేచిబాట సారులను మట్టిలో గప్పిచంపివేయును. అక్కడక్కడ నెన్నోయామడల కొక చోట నొకనూయియుండును. అది రమారమి యెనుబది నిలువులలోతు గలిగియుండును. అందుచేనాయెడారిలో నీరు దొరకనే దొరకదు. ఇట్లు దుర్గమమగుటచేతనే యీయెడారి మరణభూమి యని పేరు గలగినది ఎంతో జాగ్రత్తతో బోయినవారికే యనేక యాపదలు సంభవించుచుండును. ఇట్టి భయంకరప్రదేశమును, క్రొత్త భార్యను, కొలదిపరిజనమును వెంటఁబెట్టుకొని హుమాయూను ప్రవేశించెను. నడచినకొలఁది మధ్యమధ్య వారికి యెండమావు లగపడి భ్రమపెట్టి మోసముచేయుచు వచ్చినవి.

వారిప్రయాణములు వారిగుఱ్ఱముల బలమునే యాధారము చేసికొనియుండెను. అవి కదలలేకపోయిన వారిప్రయాణములు తుద ముట్టినవని చెప్పవచ్చును. మార్గ మధ్యమున వడగొట్టి యెవఁడైన పడిపోయెనా వానిగతి యంతే. కాని తక్కినవారు వానికొఱకు కాగుటకు వీలులేదు. ఒకనాటి యర్ధరాత్రమున హుమాయూను గుఱ్ఱము నెక్కి స్వల్పసేనాపరివారసమేతుఁడై కుటుంబముతోడొక్కనియమరకోటయను నగరమును జేరుటకుఁ బయనమై పోవుచుండెను. అప్పుడాయన యెక్కినగుఱ్ఱము మార్గాయాసమునఁబడి చచ్చెను. చక్రవర్తి తనకుందోడై వచ్చుచున్న 'టార్డీబేగ్' అనువాని యొద్దకుఁబోయి దృఢముగా నడచుచున్న యాతనిగుఱ్ఱమును తనకిమ్మని యడిగెను.

చక్రవర్తి యాదినములలో మిక్కిలియల్పుఁడగుటచే టార్డీబేగ్ వానిమాట లెక్కసేయక నిర్దయాత్ముఁడై నే నియ్యను పొమ్మని బదులు చెప్పెను.

మాల్దేవుయొక్క సైనికులు హుమాయూనుం బట్టుకొనవలెనని వెనువెంటఁ దరుముకొనివచ్చుచుండిరి. కాబట్టి యెక్కుటకుగుఱ్ఱమైనను లేని యాచక్రవర్తి వెంటనేయపాయము తప్పించుకొనుటకొక యొంటె నెక్కెను. అతనియవస్థఁజూచి జాలినొంది పరిజనులలో నొకఁడు నీడంకొలాయనువాఁడు గుఱ్ఱముమీదనుండి తనతల్లిని దింపి యాగుఱ్ఱమును జక్రవర్తికిచ్చి చక్రవర్తియెక్కిన యొంటెమీఁద యామె నెక్కించి యామెప్రక్కనే పాదచారియై తానునడచెను. వారుపోవుదారి జలశూన్యమగు గొప్ప యడారియగుటచే దాహమునకు నీరుదొరకక కొందఱు మృతులైరి. కొందఱు పిచ్చివాండ్రయి కేకలువేయ నారంభించిరి. ఆక్రందనధ్వనులకుతోడను హాహాకారములతోడను నింగి నిండిపోయెను. ఈకష్టములకుదోడు పగవారు దాపునకు వచ్చిరను వర్తమానము దెలిసెను. యుద్ధము చేయఁగలవారి నందఱిని పయనము మానిపించి తనవద్దనుంచి స్త్రీలను సామగ్రిలను సాగిపొమ్మని పంచెను. శత్రువు లెంతసేపటికి రానందున చక్రవర్తి తన కుటుంబమెట్లున్నదో చూచుటకు ముందువెళ్ళెను. ఆకాఱుఁ జీకటిలో హుమాయూను సైనికులలోఁ గొందఱు దారితప్పి శత్రువులకంటఁ బడిరి. అప్పుడు రాజపుత్రులకు మొగలాయిలకు నొకచిన్న యుద్ధము జరిగెను. మొగలాయీలు ప్రాణములపై నాసవిడిచి ఘోరముగఁ బోరి రాజపుత్రసేనాపతిం జంపి సేనం బారదోలి వారియొంటెలను గుఱ్ఱములను సామగ్రిలను దోఁచుకొనిరి.

ఎన్నిదొరికినను మూఁడుదినములవఱకు నీటిచుక్కయైన వారికి దొరకదయ్యె నాలుగవఁనాఁడు వారికిఁ గన్నులపండువుగ నొకబావి

గనఁ బడెను. అది యెంతలోతున్నదో చెప్పఁజాలముగాని మోట గట్టి నీళ్ళు తోడునపుడు బొక్కెన పైకి వచ్చిన దని మోటయెడ్లను తోలువానికి తెలియజేయుటకై మాట వినబడఁక పెద్దభేరీ వాయించ వలసివచ్చెను. ఇట్లతిప్రయత్నమున వచ్చిన యానీటినిమిత్త మదివఱకే నోళ్ళు తెరచుకొనియున్న యాజనులలోఁ గొందఱు దాహాతురులై నిలువలేక తిన్నగా బొక్కెన నూతియంచువఱకు రాకముందు పేదాని పయింబడి నీరు త్రాగఁబోవ వెంటనే యాత్రాడు తెగి బొక్కెన నూతిలో బడెను. బొక్కెనతోఁగూడ కొందఱుమనుష్యులానూతిలో బడి మృతినొందిరి. కొందఱు మితిమీఱిన దాహబాధ కాగలేకనాలు కలు దెఱచుకొని వగర్చుచు వేడియిసుకపైఁ బడి దొర్లసాగిరి. మఱి కొంద ఱాబాధకోర్వలేక నూతిలో గుభాలున నుఱికి తక్కినవారి కంటెత్వరగా ప్రాణములు విడిచి సుఖపడిరి. మరునాడు వారు మరల నొకనీటిపట్టుం జేరిరి గాని వారిదురవస్థ వెనుకటిదినముకంటె తక్కువకాలేదు.

అదివఱకు చాలదినములనుండి నీరుద్రాగియెఱుఁగక పోవుటచే నొంటెలు నీరు పోసినతోడనే మితిమీఱ దాగి యెక్కుసముచే యెన్నియోతత్క్షణమే మృతినొందెను. ఆయొంటెలవలెనే మనుష్యులును కొందఱు నీరుత్రావిన కొంతసేపటికి గుండెల బరువువలనబాధ పడి చనిపోయిరి. ఎట్టకేలకు హుమాయూను కొందఱుపరిజనులతో చచ్చి చెడి యమరకోటఁ జేరెను. అమరకోట మృత్యు దేవతకోట లలో నొకటియని చెప్పఁదగియున్నను అక్కడికోట యిటుకగోడలు రాతిబురుజులు చుట్టు గుడిసెలు గలిగి దర్శనీయముగ లేకున్ననునిరా ధారులగు నాజనులకు నయనోత్సవము గావించెను. ఆయూరి కుత్త రమున మంచినీళ్లకాలువ యొకటియుండెను. హుమాయూను పరి జనులందఱుఁ దమ కాదినము పండగదినమట్లు భావించి కరువుదీర

నీరుద్రావి సుఖించిరి. ఆయూరిరాజు వారిబాధలు తొలఁగించుటకు తనకు జేతనైనంతపని చేసి చక్రవర్తికి విధేయుఁడై యుండెను. హుమాయూనుని క్రొత్తభార్యయగు హామిడా నిండుచూలాలై యామెడాగులలో మగవారికంటె నెక్కుడుధైర్యముఁ గలిగి యద్భుత శక్తితోఁ బయనముచేసి దారుణ కష్టములం గడచి యమరకోటఁ జేరెను. అక్కడ నారున్న కాలముననే 1542 వ సం॥ ము అక్టోబరు నెలలో నక్బరు పుట్టెను. అతఁడు చక్రవర్తి చూడామణియనియు రాజన్యచూడామణియనియు భరతఖండమును బాలించినదొరలలో నగ్రగణ్యుఁడనియు పేరువడసెను. తనభార్యలను బిడ్డలను ప్రాణ ప్రదాతయగు నమరకోటరాజు సంరక్షణములో నుంచి హుమా యూను బయనమారంభించెను. ఇటు కొంతకాలము తిరిగి తిరిగి యతఁడు పారశీకదేశము జేరి యారాజు ననుగ్రహమున తనప్రితార్జిత మగు కాబూలు గాంధారదేశములను జయించెను. అదిమొదలతఁడు కొంచెము నిలువఁద్రొక్కుకొని క్రమక్రమముగాబలపడఁ జొచ్చెను. వానిసోదరులలో గొందఱు మృతినొందిరి. కొందఱు రాజ్యభ్రష్టులై దేశముపాలైరి.

ఇక్కడ ఢిల్లీలో షర్షాను హుమాయూనుం బారదోలి గద్దె యెక్కి ధర్మాత్ముఁడై దేశమును జక్కగా పాలించి చివఱకు యుద్ధ ములలో మృతినొందెను. వానివంశస్థులు నీతిదూరులు బలహీనులు నగుటచే రాజ్యము వారికిఁ దక్కదయ్యె. ఆయప్రయోజకులు దేశ మునంతయుఁ బాడుచేసి యరాజకమగునట్లు గావించి ప్రజల కనాతు లగుటంజేసి యాయద నెఱిఁగి హుమాయూను ముందుగా పాంచా లము జయించి తరువాత శత్రువుల నోడించి ఢిల్లీని పట్టుకొని మరల జక్రవర్తియయ్యెను. అతఁడు మఱల సింహాసన మెక్కినపిదపఁ జిర కాలము రాజ్యమేలలేదు. గద్దెయెక్కిన యారునెలలకే యతఁడు తన

మేఁడమీఁద స్ఫటికపురాళ్ళమీఁదనుండి జారి మెట్లమీఁదనుండిదొర్లి క్రిందపడి తత్కారణమున కొన్ని దినములలో మృతుఁడయ్యెను.

అతని యనంతరమున రాజ్యమును వహించిన యతఁడు తొల్లి యమరకోటలో నుదయించిన బాలుఁడే. తండ్రిపోవునప్పటికతఁడు పదుమూడేండ్ల ప్రాయమువాఁడు. అక్బరు పాంచాలమును ఢిల్లీనిమ జేయు దండిరిపాలనముక్రిందనున్న కాబూలుగాంధారములను జేసికొనియెను చిత్తూరును బాలించుట కుదయసింగెంత చిన్నవయస్సులో నారంభించెనో యక్బరు ఢిల్లీనేలుట కంత చిన్నతనమున నారంభించెను. కాని వీరిరువురు వేరువేరు స్వభావములవారు.

ఉదయసింగు రమారమి ముప్పదిసంవత్సరములు రాజ్యపాలనము చేసియున్నను వానియేలుబడిలో మంచిపనియని చెప్పఁదగినదొకటియు జరుగలేదు. శూరశిఖామణులలో నగ్రగణ్యుఁడని చెప్పదగిన రాజుకడుపున బుట్టియు నుదయసింగు సింగముకడుపున బుట్టిన మేఁకపిల్ల వలె సమయము వచ్చినప్పుడు పిఱికియై మూర్ఖుఁడై నగుబాట్లనొందుచు వచ్చెను. వేయిమాట లేల? బప్పరావులవంశస్థుల యొద్ద గానఁబడవలసిన శుభచిహ్నములు రాజలక్షణములు వాని యొద్ద కానబడకపోవుటచే వెనుక పున్న యనుదానిచేఁ బెంపఁబడిన మీవారురాజపుత్రుఁ డతఁడు గాడనియు నెవరో యొకదొంగపిల్లవానిం దెచ్చి యతఁడే రాజపుత్రుఁడని భ్రమపెట్టిరనియుఁ గొందఱు దలంచిరి.

అదియటుండ నిచ్చట హుమాయూనునకు నమ్మినచెలికాఁడును మంత్రియు నైనబేరాంఖా ననునతఁడక్బరుయొక్క చిన్నతనమందు నాల్గుసంవత్సరములు చక్కఁగా పరిపాలించి పిదప నక్బరున కప్పగించెను. అక్బరు చక్రవర్తియై తాను బాలుఁడైనను దృఢమనస్కుఁడై తనమాటయందు ప్రజలకు మంత్రికి గౌరవమునిలుచు

నట్లు నడచుకొనజొచ్చెను. అతఁడు రాజ్యముబూనిన కొద్దిదినములకే రాజపుత్రులమీఁద దండయాత్ర చేసెను. వానితండ్రి సింహాసన భ్రష్టుడై దేశాంతరములపాలై పోయినప్పుడు. రాజపుత్రప్రభువులు చేసినయనాదరణము ద్రోహమును బలుమారు తల్లియగు హమిడా దేవివలన వినియుండుటచేతనో లేక తల్లిపడినబాము లన్నియు గర్భములో నున్నపుడు వానిమనస్సుమీఁద ముద్రితము లయ్యెనోలేక శూరులను జయించి కీర్తిజెందగోరుటచేతనో యతఁడు రాజస్థానము మీఁదికే వెడలెను.

ఆమహాశూరుఁడు తొలుదొల్త మాఱువాఱు దేశము మీఁదికిఁ జని మాల్దేవుని నోడించెను. అంబరు సంస్థానప్రభువు చక్రవర్తికి జడిసి కప్పముగట్టి తనకూఁతును వానికిచ్చి వివాహముచేయుటచే నక్బరువానిం గరుణించెను. తురకరాజునకుఁ దనకూఁతునిచ్చి పెండ్లి చేసి యుత్తమక్షత్రియవంశమును పవిత్రముచేసిన రాజపుత్రులలో మొట్టమొదటివాఁడితఁడే తక్కిన రాజపుత్ర ప్రభువులందఱు తెలివిఁ దెచ్చుకొని జాగ్రత్తపడి చక్రవర్తికి లోఁబడి కప్పముఁగట్టిరి. అక్బరును వారిమతముజోలికిఁ బోక లోఁబడినపిదప వారినందఱ సన్మానించెను. హిందువులు తమ పుణ్యక్షేత్రములకు యాత్రనిమిత్తముపోవునపుడు తురక చక్రవర్తులు వారియొద్దనొకపన్ను గ్రహించుచువచ్చిరి. అదిగాక తురకలు కానందున హిందువులేజాదికి తలకొకరూపాయ వంతున పన్నియ్యవలసివచ్చెను. హిందువులమీఁద నన్యాయముగఁ గట్టఁబడిన యీ రెండుపన్నుల నక్బరు చక్రవర్తి తీసివేసెను. ఇట్లనేక రాజపుత్రులు ఢిల్లీశ్వరునకును లోఁబడినను సంధికి రాని మూర్ఖుఁ డొక డుండెను. అతఁడు చిత్తూరురాణా యగునుదయసింగు.

ఆయన గర్వముచేతఁ బౌరుషముచేత నక్బరునకు లోఁబడకపోలేదు. సోమరితనముచేత మూర్ఖతచేత నతడు చక్రవర్తి దర్శన

ముచేసి సంధి కోరఁడయ్యె. ఉదయసింగు బాల్యము నతిక్రమించి యౌవనమును బ్రాపించి తన సంరక్షకుల నావలకుఁబంపి యొక యుంపుడుక త్తెను జేరఁదీసి దానివలలోఁజిక్కి రాజ్యవ్యాపారాదివిముఖుఁడై దానితోడిదే బ్రతుకని యొడలుమఱచి యుండెను. అక్బరు మాళవదేశమును జయించి దాని రాజగు రాజబహదూరును బారదోల నుదయసింగు వానికి శరణ మిచ్చి యట్టిపనివలన గలుగు నష్టము నాలోచింపకయే వానిం దనకడ నుంచుకొనెను. అందుచే నక్బరు కుచ్చితుఁడై పగదీర్చుకొనుటకు మీవారుపై దండువిడిసెను. ఢిల్లీచక్రవర్తి యంటివాఁడు మహాసేనాసమేతుఁడై తనపై కెత్తివచ్చుచున్నాఁడని వినియు నుదయసింగు వినని వాఁడులోలె నేప్రయత్నములు చేయక మొద్దువలె నూరకుండెను.

ఉదయసింగు స్త్రీకన్న నధముఁడై యింటగూర్చుండుటం జేసి వానియుంపుడుకత్తె నగరమునకు రాదలచిన దుస్థితిని జూచి రోసముదెచ్చుకొని పనిచేయబూనెను. సిగ్గులేనిదియు వంచకురాలు నైనను నాపడతి రాజస్థానమున బుట్టినదగుటచే దేశాభిమానముం గలిగి పౌరుషవంతుడగు పురుషుడట్లు పని జేయజొచ్చెను. వెనుకటి చిత్తూరుముట్టడిలో రాణి జవాహిరుభాయి చేసినట్లే యీమెయు గవచముధరించి పురుషవేషము వేసికొని సేనలం దోడ్కొని మొగలాయి శిబిరముం బ్రవేశించి యొకమా రక్బరుచక్రవర్తి యున్నస్థలమునకే సాహసించి పోయెనట. ఇట్లీమె పనిచేయుచుండ దైవవశమున నక్బరుచక్రవర్తి పనులుతొందరచే జిత్తూరు విడిచి సేనాసమేతుఁడై మఱియొకచోటికి బోవలసివచ్చెను. చక్రవర్తి చిత్తూరు విడిచిపోవుటకు దన యుంపుకత్తెయే కారణ మనియు నామె తనకు జేసినమహోపకారమువలననే తన రాజ్యము తనకు దక్కిన దనియు నుదయసింగుచెప్పి సంతోషించెను. రాణాకు దనయుంపుడుకత్తెమీఁద

నున్నంతమాత్రిపుగౌరవమైన దనమీాద లేదనియు దాము కష్టపడి ప్రాణములకాశపడక పోరాడుటయెల్ల నిరర్థకముజేసి మెప్పునంతయు తుద కతడు తనవలపుకత్తియకే యిచ్చెననియు రాజబంధువులు కోపోద్దీపితులై యా వలపులాడిన జంపించిరి. అప్రయోజకు డగు రాణా దనరాజ్యమును నిలిపిన యాపడతి ప్రాణరక్షణము జేయం బ్రయత్నింపలేదు సరిగదా, దానిం జంపినవారిని శిక్షింపనైన లేదు. ఈపర్యాయ మక్బరు రాణాయొక్క భోగభార్యవలన బరాజితు డయ్యెనని మహమ్మదీయచరిత్రకారు లెవ్వరు వ్రాయరైరి. చరిత్ర కారులు వ్రాసినదేమనగా 1567 వ సంవత్సరమున నక్బరుచక్రవర్తి రాజస్థానమును దండెత్తి చిత్తూరుకోటను బట్టుకొనుటకు నాలుగువేల సేనతో వచ్చెనని ఈసంవత్సరమున జక్రవర్తి కోటను ముట్టడించి పట్టుకొనుటచే నదిమాత్రమే వారు వ్రాసి వెనుకటిపరాజయమును వారు వ్రాయరైరి. అక్బరు మంచిఫిరంగులతోడను సాధనసామగ్రిల తోడను వచ్చియున్నను జిత్తూరుకోటలో భోజనసామగ్రిలు జలము సమృద్ధిగా నుండుటచే దుర్గసంరక్షకులు మొగలాయిసేనం జూచి వీరా! మనల జయించువారని పరిహసించిరి. అక్బరు సైనికులును మొట్టమొదట కోట దుస్సాధ్యమని యాస వదలుకొనిరి. కోటగోడ దూర్పున నుత్తరమున నల్లరాతితో గట్టబడుటచే నావైపుంగోడలకు ఫిరంగులవలన నేమియు భయము లేదని వారలనుకొనిరి. అట్టికోట ప్రపంచమం దెచ్చట లేదని విదేశీయు లనేకులు వ్రాసిరి. బురుజులు మిక్కిలి దృఢముగా నుండెను. తుపాకిమందు కొట్లకొలది యుండెను అక్బరు కోటకు దూరముగా నొకకొండమీాద బసచేసి తనసైన్యము నకు రాత్రిలు వెలుతురు కలుగునట్లు తనయున్న పర్వతముయొక్క శిఖరముమీాద పెద్దమంట వేయించుచువచ్చెను. ఆమంటలు చిత్తూరు కోట కావలివాండ్రకుం బ్రతిరాత్రిము స్పష్టముగం గనంబడుచు

వచ్చెను. ఉదయసింగుమహారాజు ప్రాణముల కాసపడక చిత్తూరు గౌరవము నిలుపుటకై రేలుఁబవళ్ళు పోరాడుచున్న వీరయోధులకుఁ బ్రోత్సాహము గలుగఁజేయుటకు మారు దుర్గరక్షణ మన్యులపాలు చేసి, తాను కోటవిడిచి హారావళిపర్వతములకుం బారిపోయెను. అయినను మీవారు దేశముపై నభిమానముఁగలతక్కిన రాజపుత్రులు తత్సహాయార్థము రాకపోలేదు. బదనూరుప్రభు వగుజయమల్లుఁడును చందావతువంశస్థుఁడై ఖేల్వా సంస్థానప్రభు వైన పుట్టాయను పదునారేండ్ల బాలుఁడును వచ్చి తోడుసూపిరి వారిలో నప్పుడుపుట్ట తక్కిన రాజపుత్రులకన్నఁ పిన్నయయ్యు చందావతువంశస్థుఁడగుటచే తాను రాణాకు ముఖ్యుఁడనియు రాణా లేనపుడు కోట సంరక్షించు భారము తన దనియు దాను మొనగాఁడై సేనల నడుపుదు ననియుఁ జెప్పి కయ్యమునకు మొదట సిద్ధమయ్యెను. దేవలనగరాధిపతి తన పితృపితామహుల జన్మస్థాన మగుచిత్తూరుపై మహాభిమానముఁ గలిగి యాపత్సమయమున దానికిం దోడ్పడుటకుఁ దనకొడుకు నంపెను.

అక్బరుచక్రవర్తి యీకోటఁబట్టుకొనుటకెన్ని ప్రయత్నములు చేయవలయునో యనియుఁ జేసి హిందూదేశ మంతటనుండి నేర్పు గలపనివాండ్ర ననేకులఁ బిలిపించెను. కోటబురుజులమీఁదనుండి రాజ పుత్రులు నిప్పులవర్షము గురియించుచున్నను వెరువక మొగలాయీ సేన లంతకంతకు దరికిఁ బోవసాగెను. గెలిచినచో చాలబహుమా నము లిత్తునని చక్రవర్తి యాశపెట్టుటచేఁ బనివాండ్రు సైనికులు నోడలు దాఁచుకొనక యెవరు చేయవలసినపని వారు చేయఁబూనిరి. సొరంగములు త్రివ్వువారు సొరంగములుత్రవ్విరి. అందులోమందులు కూరువారు మందులు కూరిరి. మొగలాయిసైనికులు దినమునకు నూరుగురు చొప్పున చచ్చిరి. చావనివారు చచ్చినవారికళేబరములను

దమకు దెబ్బలు తగులకుండ నడ్డువెట్టుకొనుచు బనిచేసిరేగాని జంకి వెనుకంజ నిడరైరి. కోట సంరక్షించుచున్న రాజపుత్రులు తమదుర వస్థ నప్పుడు దెలిసికొని భయపడఁజొచ్చిరి. రాణా యదివఱకే తమ్ము విడిచిపోయి తనదారి తాను జూచుకొనుటచే వారు నిరుత్సాహులై ధైర్యలక్ష్మియే తమ్ము విడిచినట్లు కళవళ పడఁజొచ్చిరి. కోటదెస చూడ రాజుతోఁగూడ రాజ్యలక్ష్మి యాతావువిడిచి పోయినట్లుపాడు వారు చుండెరు.

అందుచే రాజపుత్రు లేమియుం దోఁచక తడబడుచుండ నింతలో తుపాకిమందు కూరిన యొకనేలసొరంగ మంటుకొని చుట్టు ప్రక్కలప్రదేశ మంతయు నాశనము చేసెను. ఒకప్రక్క కోటగోడ గుభాలునఁ గూలెను. దానితో ముట్టడించుతురకలు, ముట్టడింపఁబడు రాజపుత్రులు వందలకొలఁదిజచ్చిరి. తరువాత నుభయసేనలుకలియం బడి సందడికయ్యము జేసెను. అంతలో మరియొకనేలసొరంగమంటు కొన తురకలు రాజపుత్రులు మేనులు దెగి తుత్తునియలై మృతి నొందిరి. బ్రహ్మాండము వగులునట్లు మహాధ్వనితో నాసొరంగము లంటుకొనుటచే కోటగోడలు కూలిపోయెను. ఆప్రాంతమం దాకాశ మంతయు దుమ్ముతోను పొగతోను నిండి యుండుటంజేసిమనుష్యుల కూఁపిరి సలుపదయ్యె. ఆకసమున కెరిగిన మనుష్యావయవశకలములు మట్టిముద్దలు రాతిముక్కలు వర్షము కురిసినట్లు క్రిందరాలఁజొచ్చెను దుర్గసంరక్షణము చేయవచ్చిన వీరులలో వృద్ధులు కొందఱుముందుగా వీరస్వర్గము నలంకరించుటచే సైన్యాధిపత్యము బాలుఁడగు పుట్ట మీఁద బడెను. ఆబాలుని తల్లి చిత్తూరునగరమునందె యాసమయ మున నుండుటచేఁ దనకుమారుఁ డదివఱకుఁ గొన్నిదినములక్రిందట నూతనముగా వివాహమాడిన బాలికపై గలయనురాగాతిశయముచే జావునకుం వెఱచి వెనుకదీసి యప్రతిష్ఠ తెచ్చునేమొయని బెంగ

జెట్టుకొనెను కాని యావీరమాతకడుపున బుట్టినబాలకుడు కుల మున కపకీర్తి రానీయలేదు. చిత్తూరుకోటలో తలనెరసిన వృద్ధులు మీసములు రాని బాలురు మహాయుద్ధములలో గాయములు దిని బ్రతికినశూరులు నంతఃపురము విడిచి యెఱుగని పుష్పకోమల లగు స్త్రీలు సేవకులు మొదలగు నందఱు గెలువవలయు చావవలయునను మాటమీద నిలువబడి యుండిరి. ఈయుద్ధములోనె నూతనముగ భర్తను గోల్పోయిన యాబాలుని తల్లియు వానిం గోరి వరించిన క్రొత్తపెండ్లికూతురును కవచముల దొడుగుకొని బల్లెములు బూని యుద్ధసన్నద్ధులై మీవాఱురాజపుత్రులతో గలిసి పోరుసలిపివీరస్వర్గ మును జూరగొనిరి. ఆడువాండ్రే యంతసాహస మొనర్చినపుడుమగ వాండ్రు వెనుకదీయక సమరోన్ముఖులైరి చిత్తూరుముట్టడికథయన్నిటి కంటె నెక్కువ దుఃఖకర మయినదియు నతిసాహసవంతమయినదియు నని చెప్పవచ్చును. అక్బరు తాను వసియించు కొండచివఱనుండి చూచుచు నడుమనడుమ మంటవెలుతురులో గోటమీద నెవరైన మనుష్యులు నిలిచినట్లు గనబడినపుడు తనతుపాకితో వారిం గొట్టు చుండును. ఆదినమున సాయంకాలము సమాజువేళ నక్బరుచక్రవర్తి మున్ను వేట కరణ్యమునకు బోవునప్పుడు పట్టపు టేనుగు నెక్కి పెద్దపులిరాకకై యెదురు చూచినట్లె పర్వతశిఖరమునుండి మెలకు వతో నెవరినిమిత్తమో కనిపెట్టి యుండెను.

అప్పుడు దుర్గసంరక్షణము చేయుచున్న జయమల్లుడను రాజ పుత్రవీరుడు తనబంట్లకు గొంతయుపదేశము చేయవలసి బురుజుమీా దికి వచ్చెను. కొండమీాదనుండి జాగరూకతతో జూచుచున్నయక్బరు నకు వానియాకృతి చూచాయగ గనబడియె. కనబడినతోడనే చక్రవర్తి సంగ్రమను తనతుపాకిని బట్టుకొని గురిజూచి కొట్టెను వెంటనే జయమల్లుడు ప్రాణములు విడిచి నేలబడియెను.

అతఁడు పడుటయు గోటలోపల సైనికులు జయమునం దాశ వదలుకొని కడపటి కృత్యమును జేయబూనిరి. ఆఁడువాండ్రు చావులు కట్టి జోహారు సేయుటకు సిద్ధమైరి మగవారు రక్తాంబరధారులై తాంబూలములు నమలుచు నూరేగింపు మహోత్సవమునకు జనునట్లు యుద్ధమునకు జనిరి. పర్వతశిఖరమునందున్న యక్బరునకు గోటలో పొగలు మంటలు గనబడి కమురుకంపు గొట్ట నారంభించెను. మొగలాయి సైనికులు తత్కారణము నెఱింగి రక్షణము బొత్తిగా లేకయున్న యుత్తరపువైపుననుండి లోపల బ్రవేశించిరి. కాని యప్పటికిని జిత్తూరుకోట పగతురచే జిక్కలేదు ఏలయన నిర్భయముగా నగ్నికుండములబడి మృతినొంది వీరపత్నుల యొక్కయు వీర మాతలయొక్కయు గన్యలయొక్కయు భర్తలు పుత్త్రులు తండ్రులు రక్తవస్త్రములు గట్టి కోటలో బ్రవేశింపబోవు మొగలాయిసైనికుల హుమ్మని దలపడిరి. ఆ యుభయవీరులు పోరు సల్పినతావున బ్రత్యంగుళము రక్తముతో దడిసి యడుగు జారుచుండెను తురక సైనికులు చిత్తూరునగరమునందలి యిరుకుసందులును వంకవీథులను జొచ్చి యడుగడుగునకు నొక్కొక్కరాజపుత్రవీరుని వధియించుచు గ్రిమక్రిమంబున జొరుచుకొని లోలోపలకు బోయిరి. ఆదుర్దినమున నెనిమిదివేలమంది రాజపుత్రవీరులు మృతులై రణరంగము నలంకరించిరి. మృతినొందిన యాఁడువాండ్ర బలగములో దొమ్మండుగురు పట్టపుదేవులు నైదుగురు రాజపుత్రికలునుండిరి. ఆనాటితో చిత్తూరు యొక్కభాగ్యము కడముట్టెను అది మొద లానగరము మీవారు రాజ్యమున కెన్నడు మరల రాజధానిగ నుండలేదు.

అట్లు చిత్తూరునగరమును నిర్వీరముగ జేసి యక్బరుచక్రవర్తి 1567 వ సంవత్సరము మెయినెలలో నొకదినమున కోటలో బ్రవేశించెను. మీవారు రాణా తరువాత నెన్నడు నాభయంకర

బరి దేశమునకు వచ్చి కాపుర ముండలేదు. మరల మీవారు దేశస్థులు పగతురబారి బడకుండ దానిని సంరక్షింపలేదు. రాజస్థానకథావళిం జదివి మీవారు రాజ్యముయొక్కయుఁ జిత్తూరునగరముయొక్కయు మహావైభవమును దెలిసికొన్నవారందఱు జిత్తూరుయొక్కయీనాఁటి యవస్థం జూచినపక్షమున మున్ను సకలైశ్వర్యసంపన్నమైబహుజన సంకులమైన యానగర మంతపాడుగ నుండుటకును రాజ్యలక్ష్మి కిట్లు వైధవ్యము గలుగుటకును గారణమేమని తలంపకపోరు. తలంచి విచారింపకపోరు. ఉదయసింగుహారావళీపర్వతములోనికిఁ బాఱిపోయి మరల నెన్నఁడు చిత్తూరు రాక యాపర్వతములసమీపముననే యుద యపురమనుపేర నొకపట్టణమును గట్టించి దానిని రాజధానిఁ జేసి కొని దేశమును పాలించుచు దనజీవితకాల శేషమును గడపెను. అందుచేతనే నేటికిని మీవారురాణా యుదయపుర మహారాణా యను పేరం బిలువఁబడుచుండును. ఉదయసింగు తనజీవితకాలమం తయు మరలఁ జిత్తూరును బట్టుకొనినగాని విజయము నొందవలయునని తలంచుచుండువాఁడు. అందుచేతఁ దనయుద్యమము నెరవేఱునఱకు గడ్డమును కత్తిరించుకొనననని యతఁడు ప్రతిన జేసెను. ఆప్రతిన నెర వేరకమునుపే యతఁడు లోకాంతరగతుఁడగుటం జేసి యాతని సంతతి వారగు నుదయపుర మహారాణాలు నేటివఱకుఁ దమవంశకర్తవలెనే గడ్డములు కత్తిరించుకొనక యుందురు.

చిరకాలమునుండి మీవారు సంస్థానమునకు రాజధానియగు చిత్తూరునగరమును నామావశేషముగ నొనర్చిన యక్బరుచక్రవర్తి చరిత్రము సంగ్రహముగా నిచ్చట దెలిపెదము. ఢిల్లీపాదుషాలలో నక్బరువంటి యోగ్యుడు గుణసంపన్నుఁడు మఱియొకఁడు లేఁడని చెప్పవచ్చును. తండ్రి రాజ్యభ్రష్టుఁడై సింధుదేశపు టెడారులలోఁ జరియించుకాలమున 1542 సం॥ రమున నమరకోట పట్టణమునం

డతఁడు జన్మించెననియు జనకుని మరణానంతరము 1556 వ సం॥ రమున బదునాలుగేండ్ల ప్రాయమువాఁడై యున్నపుడు సింహాసన మెక్కెననియు నిదివఱకు జెప్పియుంటిమి. ఇతఁడు గద్దె యెక్కిన త్తోడనే షర్షాయొక్క సంతతివారికి మంత్రియగు హేముఁడను హిందువుఁడు తనస్వామిపక్షమున నభిమానము గలిగి మహాసేనం గూర్చు కొని యక్బరుమీఁదికి యుద్ధమునకు వచ్చెను. అక్బరును వాని గుండె కాయయు సంరక్షకుఁడు నగు బేరాముఖానును గలిసి హేమునిమీఁదికిఁబోయి వాని నోడించి పట్టుకొనిరి హేముని స్వహస్తముతోఁ జంపుమని బేర ముఖానుఁ డక్బరుతో జెప్పెను. అసహాయయుఁడై చెరలోనున్న దీనునిఁజంపుట యనుచితమని యతఁ డట్టిపని కొల్లఁ డయ్యె. బేరాముఖానుఁడు హేముని స్వహస్తముతో నరికిచంపెను. బేరాముఖానుఁ డక్బరును పుత్రప్రేమతో నాదరించి యుక్తవయస్కుడైనపిదప రాజ్యము నప్పగించెను. అక్బరు రాజ్యభారమును వహించి హిందువు లొక కన్నుగ మహమ్మదీయులు రెండవకన్నుగనెంచుకొని భరతఖండమును న్యాయముగఁ బాలించెను. ప్రజలందఱు అక్బరుని కేవలము ధర్మరాజని కొనియాడిరి. మహమ్మదీయులని పక్షపాతము లేక హిందువులని క్రోధములేక యిద్దఱను సమానముగ నమ్మి యిరువురకు గొప్పగొప్ప యుద్యోగములు భేదము లేకుండగ నిచ్చెను. సేనాధిపతులు దేశాధిపతులు వానిక్రింద హిందువులనేకు లుండిరి. రాజపుత్రులనకుఁ దనకు మైత్రి హెచ్చునట్టు వారిపిల్లలం దాను బెండ్లియాడి పట్టపుదేవులఁ జేసెను. ఈతని జ్యేష్ఠపుత్రుఁడును వానియనంతరమున రాజ్యమునకు వచ్చినయతఁడునగు జహాంగీరుచక్రవర్తి యొకరాజపుత్రస్త్రీవలనఁ గలిగినకుమారుఁడే. రాజపుత్రవీరులును దమయెడలఁ జక్రవర్తి చూపు గౌరవమునుబట్టి తాముగూడ జక్రవర్తికి విధేయులై చుట్టములై నెచ్చెలులై యవసరమగునప్పుడుతమ

ప్రాణములనైన నడ్డమువేసి వానిప్రాణము గాపాడుచు వచ్చిరి. అక్బరు మిక్కిలి పండితపక్షపాతి. ఆచక్రవర్తియాస్థానమున అరబ్బీ పారసీభాషలు నేర్చినపండితులే గాక సంస్కృతమును దేశభాషను నేర్చిన పలుపండితు లుండి యనేకబహుమానముల నందుచువచ్చిరి. అతనికి స్వమతమునందు గౌరవము దక్కినమతములందు నిరసనము లేదు. ఖురానునేర్చిన మౌలవీలను క్రైస్తవమతబోధకులను బౌద్ధ పండితులను వేదాంతిశాస్త్రజ్ఞులగు బ్రాహ్మణులను పారసీమతస్థులను దనకొలువునకు బిలిపించి వారిచే వాదములు చేయించి సర్వమతముల సారములం గ్రహించుచుండువాఁడు. వానిని హిందువులు వేదాంతి యనియుఁ క్రైస్తవులు క్రైస్తవుఁ డనియు మహమ్మదీయులు మహ మ్మదీయుఁడనియు జెప్పుచుందురు. ఉపనిషత్తులయెడ నక్బరునకు గడుప్రేమయని చరిత్రకారులు చెప్పుదురు. ఆయన వితంతు వివాహములు హిందువులలోఁ జేయింపవలయునని కొంతప్రయత్నము చేసెను. ఘోరదురాచారమగు సహగమనమును దనదేశమునఁ జాల వఱకు మానిపించెను.

ప్రజలకు భారముగానున్న పన్ను లనేకములు దొలగించెను రాజాటోటర్ మాల్ అనుహిందువునకుఁ గొప్పయుద్యోగమిచ్చి దేశ మునందున్న యినాం జిరాయితీ భూములను వానిచేత జాగ్రత్తగా గొలిపించి పంటనుబట్టి యాభూములకు పన్నులుగట్టించెను. పండిన పంటలో నాలుగవవంతు చక్రవర్తి పన్నుక్రింద గ్రహించుచుండును అక్బరుచక్రవర్తి విద్యావంతుఁడు మహావీరుఁడు లోకవ్యవహారములు చక్కగఁ దెలిసినవాఁడు. ఈతనివంటి చక్రవర్తి నేటివఱకు హిం దూదేశమునకు మరల రాలేదని జనులు చెప్పుకొందురు. ఆయన రమారమి యేఁబదిసంవత్సరములు భరతఖండమును బాలించి సకల జనస్తవనీయుఁడై క్రీస్తుశకము 1605 సంవత్సరమున లోకాంతరగతు డయ్యెను.

---

# హాల్డిగట్టు యుద్ధము.

అక్బరు చక్రవర్తి చిత్తూరును నాశనముచేసి పోవునప్పుడు దేశమునందంతట దారిద్ర్యమును మనుష్యుల హృదయములయందు నిరుత్సాహమును నెలకొలిపి పోయెను. మీవారుయొక్క గొప్పతనమంతయుఁ గథావశేష మయ్యెను పుణ్యభూములు పుష్పవనములు కోటలు కోవెలలు సంపూర్ణముగ నాశనము నొందెను. దేవతాచరిత్రములను రాజపుత్రవీరుల దిగ్విజయములను దెలుపుటకు దేవాలయపుగోడలమీదను మేడలమీఁదను వ్రాయఁబడిన చిత్తరువులు రూపుమాసెను. విన్నాణమును దెల్పు వింతసరకులను తీసికొనిపోవుటకు వీలైనంతవఱకు శక్తివంచనలేక మహమ్మదీయు లెత్తుకొని పోయిరి. దిగ్గజములను జెవుడు పఱుపఁజాలు రణభేరులు మ్రోఁగెడుకాలము పోయినది. నగరరక్షణము చేయుమని ప్రార్థించి నగరదేవత కఖండదీపారాధనము జరుగు మేలుదినములు గతించినవి. వేయేల? రాణావారి మందిరద్వారములే యక్బరు కట్టింపదలచిన క్రొత్తపట్టణమునందలి మందిరము నిమిత్తము తీసికొని పోబడెను. దేశమునంతను దుడిచి వేయుచున్న యుద్ధతరంగ మంతలో నిలిచిపోయెను.

రతంభారుకోట వెనుక బహదూరుషాచేతజిక్కెనని చదువరు లెఱుఁగుదురు. తరువాత దాని నామహమ్మదీయ ప్రభువువద్దనుంచి బూందీసంస్థాన ప్రభువగు హర యనునతఁడును జోహాణవంశస్థుఁడగు మఱియొకడును మఱల బట్టుకొనిరి. ఆకోట యాకాలమున బూందీప్రభువగు సూర్జనుఁ డనుతని యధీనమున నుండెను. అతఁడు మీవారురాణాకు లోఁబడి యరిగాపై యాకోట నేలుచుండెను. ఈసూర్జనుఁడు వెనుక చిత్తూరిముట్టడిలో బహదూరుషాతోయు

ద్ధముచేసి మృతినొందిన యర్జనమూరావు కుమారుడు అక్బరుచక్రి వర్తి యీకోటను కొంతకాలము ముట్టడించి పట్టుకొనలేకపోయెను. దానికిఁ దోడుగ నతఁడు కార్యాంతరములమీఁద మఱియొక చోటికి బోవలసివచ్చినందున నీముట్టడి నాపదలంచుచుండెను. అంతలో నక్బరునకు నమ్మికబంట్లును రాజస్థానమునకు ద్రోహులు నగు నిరువురు రాజపుత్రులు మోసము చేసి యీకోటను జక్రివర్తి కప్పగించిరి. అంబరుదేశ ప్రభువగు భగవానుదాసుఁడును వాని యన్నకొడు కగు మానసింగు ననువారే యామహాసుభావులు ఈయిద్దఱు ద్రోహము చేయనిపక్షమున రంతంబరుకోట శత్రుదుర్గమమై నిరపాయస్థితినుండి యుండునుగదా!

సూర్జనునిఁ గలిసి మాటలాడినపక్షమునఁ జక్రివర్తికిఁ జాల లాభము గలుగు నని నమ్మి మానసింగు దర్శనముచేసి మాటలాడ వలయునని యున్నది గనుక కొంతకాలమువఱకు యుద్ధము మాన వలసిన దని సూర్జనునకు వర్తమాన మంపెను. సూర్జనుఁ డందుకు సమ్మతించినందున మానసింగు తాను చక్రివర్తి రాయబారి నని పేరుపెట్టుకొని కొంతపరివారముతోఁ గోటలోనికి బోయి యాతనిచేత సబహుమానముగ గౌరవింపఁబడెను. మానసింగును సూర్జనుఁడునొం డొరులతో సంభాషింపుచుండ హఠాత్తుగ సూర్జనుని మేనమామ కూర్చున్నచోటనుండి లేచి రాజామానసింగుయొక్క వెనుకనిలిచియున్న చోపుదారువంకఁ జూడఁదొడంగెను. అటు కొంతసేపుచూచి యతఁడు చోపుదారు చేతిలోనుండి వెండికఱ్ఱను వినయమునఁ దీసికొని సూర్జనుఁడు సాధారణముగాఁగూర్చుండుస్థలమువనాచోపుదారుంగూర్చుండఁబెట్టెను. అపు డందఱు తెల్లబోయి చూడఁదొడఁగిరి. నిగనిగలాడునట్టి యాకాటుక కన్నులును మేని చామనచాయను ముక్కుమీఁద నెడమప్రక్కనున్న పుట్టుమచ్చను జూచి యతఁడు తప్పక

యక్బరుచక్రవర్తి యని మున్ను వాని నెఱింగినవారు కొందఱునిశ్చయించిరికాని గ్రహించినవారు సందేహించి చెప్పక యూరకొనిరి. గ్రహింపనివారు వెలవెలబారి చూచుచుండిరి. ఇంటికివచ్చిన యతిథికి హాని చేయుట రాజపుత్రధర్మవిరుద్ధము. హాని చేయక యుండవలయునన్న దుర్భేద్యమై పోతుటీఁగకైనఁ జొరరాక సింహగుహయని చెప్పఁదగిన యాకోటలోనికిఁ దనకుఁ దానై చక్రవర్తి వచ్చిలోటుపాటులనెల్ల గ్రహించెదగదా! చక్రవర్తిమాట యటుండ తమకంత మహాద్రోహము జేసిన మానసింగు నేమిచేయవలయునని యక్కడనున్న రాజపుత్రుల కందఱకు సందేహములు దోఁచెను.

రాజపుత్రు లిట్లు కళవళ మందుచుండ నక్బరు నదరుబెదరు లేక నిర్భయముగఁ గూర్చుండి కొంతసేపటికి గంభీరమగుస్వరముతో 'సూర్జనా! ఇప్పుడు కర్తవ్యమే' మని యడిగెను. సూర్జనుఁడు తెల్లఁబోయి యప్పలుకుల కేయుత్తర మిచ్చుటకుఁ దోఁచకయుండ మానసింగు ధైర్యము తెచ్చుకొని 'కర్తవ్య మేమున్నది? రంతంబొరుకోట చేవరవారికి సమర్పించి సూర్జనుఁడు మీవాఁడై గౌరవమందుటయే' యని పలికెను. చేయున దేమియు లేక కోట యక్బరున కప్పగించి తొలఁగెను. ఈవిధముగ బంధుద్రోహముచేత రంతంబరుకోట మొగలాయీలపా లైన దని రాజస్థాన చరిత్రకారులు వ్రాసిరి. అట్టి యవస్థలో నెంతటి మానవంతుఁ డైన నట్లే చేయవలసి యుండును గదా? రాజస్థానమునందలి సంస్థానములు తమలో తమ కైకమత్యము లేక దేనిమేలు నదియే చూచుకొనుచు బనిచేయుటయే గాని యావద్దేశముయొక్క మేలును జూడక పోవుటచే స్వనాశమును గ్రమక్రమముగఁ దెచ్చుకొనఁజొచ్చెను. దేశమునందు గల శూరశిఖామణుల నెల్ల రావించి దేశాభిమానము గలిగించి యుద్ధములు చేయింపఁగల సమర్థుఁడు రాణాసంగుఁడు గతించుటయు సూర్యవంశపు

రాజుల గద్దెమెక్కుట ననర్హుఁడగు నుదయసింగు రాజగుటయు నాశ నమునకు ముఖ్యకారణములు. అక్బరుచూపిన సాహసమును మనో ధైర్యమును 'రంతంబరు' కోటలో నున్నవారి కత్యద్భుతమును గలి గించెను. విశేషించి యతఁడు ధీరోదాత్తుఁడగు పగతుఁడనియు నీచ శత్రువుఁడు కాఁడనియు వారికిఁదోఁచెను. మఱియు నతఁడు రాజపుత్రి స్త్రీని వివాహము జేసికొని యామెను తనమతములో గలియుమని బలవంతపెట్టక యామె యిచ్చవచ్చిన దేవతల నారాధించుకొనవచ్చు నని సెలవిచ్చుటంజేసి యాచక్రవర్తి మహోదారుఁడని యారాజ పుత్రులు గ్రహించిరి. బూందీసంస్థాన ప్రభువు లదివఱకు మీవారు నిమిత్తము పోరి చాల నష్టపడిరి. అందుచే నక్బరు వారి యభిమాన మునకు లోపముగలుగకుండునట్లు సంధిఁజేయ దలంప 'సూర్జనుఁడు' సంతోషముతో నంగీకరించెను. ఆసంధి నిబంధన లివి. సూర్జనరావు తన యేఁబదిరెండు జిల్లాల నెప్పటియట్లు పాలించుకొనవచ్చును. అవ సర మగునపుడు ఢిల్లీపాదుషాకుఁ గొంతసేన నతఁడు పంపవలెను. బూందీరాజులు మొగలాయీలకు నెప్పుడు తలపన్ను నీయనక్కఱ లేదు. చక్రవర్తి బూందీప్రభువులను సింధునది దాఁటి యావలకు యుద్ధములకుఁ బంపఁగూడదు. బూందీరాజకన్యను మొగలాయీలు పెండ్లియాడఁ దలంపఁగూడదు. బూందీవారి భేరీలు ఢిల్లీకోటగోడల నడుమ వాయింపవచ్చును. ఆరాజులు ఢిల్లీచక్రవర్తి దర్బారు బ్రవే శించునపుడు తమయాయుధములనెల్ల ధరించి యుండవచ్చును. చక్ర వర్తికిఁ దక్కినరాజులంబలె నేల సాగిలంబడి మ్రొక్కనక్కఱ లేదు. షరతు లింతయనుకూలముగ నున్నపుడు సూర్జనుఁడు వాని కంగీక రించుట యొకవింత కాదు. కాని యతఁడు సమ్మతించిన మాత్రమున పోరణఁగలేదు. ఏలయన తొల్లి బహదూరుషా యాకోటంబట్టుకొన్న పుడు వానివద్దనుండి 'శాంతహారుఁ' డనునొకరాజపుత్రవీరుఁడుదానిని

వదలించి సూర్జనరావునకప్పగించి మీవారు రాణాలకు లోబడిదాని నేలుకొమ్మని చెప్పెను. అందుచే నతఁ డిప్పుడు జరిగిన స్వామిద్రోహమును సహింపక సూర్జనుఁడు చేసికొన్న సంధి కొడంబడక చక్రవర్తి నెదిరింప నిశ్చయించుకొనెను. కాని యతనివద్దనున్న సైన్య మతిస్వల్పముగ నుండెను. అయిన నేమి! చేఁ జేతుల కోటను పగతునికప్పగించి సుఖించుటకంటె నిష్కళంక చరిత్రుఁడై దేశమునిమిత్తము గౌరవముగ బ్రాణముల విడుచుటయే యుత్తమమని యతఁడు నిశ్చయించుకొనెను అట్లు కృతనిశ్చయుఁడై హారవంశజుఁడగు రాజపుత్రుఁ డెవ్వఁడు ప్రాణములు కంఠమునం దుండఁగా రంతంభొరుకోటవిడిచి పోవఁగూడదని యొట్టుపెట్టి యది యొక స్తంభముమీఁద వ్రాయించి యనంతరము రక్తాంబరధారుఁడై, దేశాచారప్రకారము తాంబూలము వేసి తన పరిజనులతోఁగూడి చక్రవర్తి సేనల నెదిర్చి ప్రాణములు విడిచెను. అది మొదలు నేఁటివఱకు హారవంశజుఁడగు రజపుత్రుఁ డాకోటదరిం బోవునపుడు సిగ్గునం దలవంచుకొని పోవుచుండును.

అనంతర మక్బరు చిత్తూరుం దోఁచుకొని యాద్రోఁపుడు ధనముతో ఢిల్లీ ప్రవేశించెను. అతఁడు మహమ్మదీయుఁ డైనను హిందువులలోఁ బరాక్రమవంతుఁడగు శత్రువుఁ డుండినపక్షమున వానినతఁడు తగునట్లు గౌరవించుచు వచ్చెను. ఈచిత్తూరు దండయాత్ర ముగిసినది మొదలు, అక్బరుచక్రవర్తి రాజపుత్రులకు గొప్పయుద్యోగములీయ నారంభించెను. ఆతనిప్రధానమంత్రులలోఁ గొందఱు సేనాధిపతులలో గొందఱు రాజపుత్రులుండిరి. చక్రవర్తి మీఁవారు విడిచిపోయినపిదప నుదయసింగు తానదివఱకు దాఁగియున్న యడవులలోనుండియుఁ గొండలలోనుండియు వెలువడివచ్చి తన గౌరవహీనమయిన జీవితము ననిచ్చటచ్చట కొంతకాలము గడపి వసియించుటకుఁ బట్టణమైన లేకపోవుటచే నొకనగరమును నిర్మింపఁ దలంచి ముందుగా నొకసరస్సు గల్పించి

యీసరోవరతీరమున నుదయపుర మనుపేర రాజధానింగట్టి యందుఁ బ్రవేశించె. ఆసరోవర మిప్పటికి నుదయసాగర మనుపేరం బరగుచున్నది. అది యేమిదోసమో కాని మీవారు రాజధానిలో సూరశిఖామణు లనేకులుండగ వారిలో నెవరిపేరంబరగక పౌరుషహీనుఁడగు నొక యసాతుని పేర నేటికిఁ బరగుచున్నది. ఉదయసింగను మహారాజునకు నిరువదియైదుగురు కుమారులు గలరు. బహుపుత్రులకు జనకుఁడై యుండుటఁ దప్ప యుదయసింగునివద్ద లోకులు సంతసింపదగిన యోగ్యత మఱి యేదియు లేదు. అతనిప్రియపుత్రుఁడు జగ్మాల్ అను నతఁడు. తన యనంతరమున వానినే రాజుంజేయుట కతఁడు నిశ్చయించుకొని సింహాసనమునకు న్యాయముగ రాఁదగినవాఁడును ప్రథమ భార్యకుమారుఁ డగు ప్రతాపుని రాజ్యహీనుం జేసెను. కొడుకుల యెడల నుదయసింగు మిక్కిలి కఠినుం డని చెప్పవచ్చును. వేఱొకమారు సూక్తుఁడను మఱియొకకుమారుని జంపింపఁ దలంపక బంధువులందఱు బతిమాలి యాపి యాకుఱ్ఱవాని దేశమునుండి యవ్వల కంపిరి.

సూక్తుఁడు పుట్టఁగానే వానిజాతకమును వ్రాయుమని తండ్రి జ్యోతిష్కులం బిలుపింప వారు మీనమేషములు లెక్కపెట్టి గ్రహచారములఁ జూచి నోరు చప్పరించి "ఈబాలుడు స్వదేశమునకు శత్రుఁ డగుటయేగాక స్వకులమునఁగూడ నిర్మూలముఁ జేయు" నని చెప్పిరి. అప్పలుకులు విని తండ్రి భయపడి యది మొదలు వానిని గడుజాగరూకతతోఁ జూచుచుండెను. సూక్తుఁ డైదేండ్ల ప్రాయము గల బాలుఁ డైనప్పు డొకనాఁడు తండ్రివద్ద నాఁడుకొనుచుండఁగా లోహకారుఁ డొకఁడు పదునైనఁగత్తిని దెచ్చి రాణా కిచ్చెను. అది వాడి గలదో లేదో చూచుచుట కుదయసింగు దానితో దూదిబుంగ నఱికి యది పదునైనదే యని సంతసించి యక్కడ పెట్టెను. వెంటనే

నూ _స్తం డాఖడ్గమునుం బట్టుకొని "కత్తులు మనుష్యులను నఱుకుటకు గాని దూది నఱకుటకుగాం" వని పలుకుచు నొక్క_వేటున నెముక గనంబడునట్లు తనచేయి నఱకుకొనెను. ఆచేతనుండి క్రొన్నెత్తురు జొట జొటగారి నేలంబఱచిన రత్నకంబళమును దడిపి చూపఱకన్నులకు వెరపు గొలుపుచున్నను బాలుండుమాత్రము బెదరక నొప్పి యని యేడ్వక యెప్పటియట్ల నిశ్చలుండై నిలిచెను. కడుపిఱికియగు నుదయ సింగు కుమారుని మహాసాహసమునుం జూచి సహింపలేక యా యీడు బాలునియందంత వైపరీతము గనంబడుట దేశమున కరిష్ట మని భావించి తత్క్షణమే యాబాలుని వధియింపుం డని తలారుల కప్పగించెను. తలవరు లాకుఱ్ఱని వధియించుటకుం గొనిపోవుచుండ మార్గమధ్యమున చందావతుకులస్థుం డగురాజపుత్రుం డగపడి యావ ద్వృత్తాంతము విని తెలిసి యుట్టిపడుచున్న యాబాలుని మొగముం జూచి విడువలేక కనికరముపెంపున వానిం జంపనీయక వెంటబెట్టు కొని రాణావద్దకు వచ్చి బాలుని బ్రతికింపు మని ప్రార్థించి నాకు సంతానము లేదు నేను వీనిం బెంచుకొనియెద, వీఁడు నాకులదీపకుం డై యుండుంగాక!" యని పలుక దగ్గరచుట్టమును మిక్కిలి ప్రబలుం డు నగు చందావతువంశస్థునిమాట కెదురాడలేక యుదయసింగు తల యూచి యూరకొనియె. చందావతుండును బాలుని తనరాజధాని యగు సాలుంబ్రానగరమునకు గొంపోయి నేల నడవనీయక కడు గారాబమునం బెంచుచుండె.

చిత్తూరు విడిచివచ్చిన నాలుగుసంవత్సరముల కుదయసింగు శరీరస్థితి చెడినందునం దన మరణ మాసన్న మగుచున్న దని యెఱింగి లోకాంతరప్రయాణమునకు వలయుప్రయత్నము చేయసాగెను. అది వసంతకాల మగుటచే మీవారుసంస్థానమునం గల సామంతరాజు లందఱు రాణాతోం గలిసి యడవిపంది వేఁటకుం బోవునట్టి సమయము

ఈవేఁటకుఁ బోవునప్పుడు రాణా సామంతపరిభువుల కాకుపచ్చని బట్టలు కొన్ని బహుమానముగ నిచ్చి వారిని వెంటఁబెట్టుకొని వేఁట సలుపు వాడుక గలదు. ఆవాడుకంబట్టి పరిభువులందఱు నుదయసింగు మంచముచుట్టుఁ జేరిరి. ఉదయసింగు చావనకమునుపు నోటమాట యున్నపుడె తనయనంతరమున జగ్మల్ రాణా కావలయునని చెప్పెను. అతనిమనసులో నేమున్నదో కాని యప్పుడైన జ్యేష్ఠపుత్రుఁ డగు పరితాపునిమాట యెత్తనేలేదు. అనంతరము కొన్నినాళ్ళ కుదయసింగు మృతినొందెను. ఆదేశాచార ప్రకారము పీనుఁగును పురోహితుని యింట భాఅవైచి దహనాదికర్మములు జరుపు మని చెప్పి రాజబంధువులు కుమారునిపట్టాభిషేకమునిమిత్తము మందిరము నలంకరింపఁ జొచ్చిరి.

ఉదయసింగు జగ్మల్లును రాజ్యార్హుఁడుగఁ జేసినప్పుడు సోని గుజ్జసంస్థానపరిభు వొక్కఁ డుండెను. ఉదయసింగుని పట్టపుదేవి యాతనికిఁ జెల్లె లగుటంజేసి యాప్రభువు పరితాపునికి మేనమామ. అందుచేఁ దన మేనల్లుఁడు సింహాసనభ్రష్టుఁడుగఁ జేయబడుటకు సహింపనోపక యావీరుఁడు చాపుననున్న చందావతువంశస్థుని జూచి మీరు దగ్గఱనుండియే యిట్టి యక్రిమము జరుగుచుండ నుపేక్షింతురా? యని యడగెను. చందావతుఁ డాపలుకులు విని మఱియొక మాటమీఁదబెట్టి యిట్లనియె. "చావునకు సిద్ధముగనున్న యతఁడు పాలిమ్మని యడుగుచుండఁగ మనము వద్దననేల? మృతినొందుచున్న వానిమాట కడ్డము చెప్పనేల? వానికోరిక యాలాగే చేయుదమని తరువాత మనయిష్టము వచ్చినట్లు చేసికొనగూడదా" యని యామాటల యభిప్రాయము. అట్లుపలికి తనపలుకుల యర్థము విస్పష్టమగునట్లు పరిభువునకు వెండియు నిట్లనియె. "ఆయ్యా! నేను నీమేనల్లుని పక్షమువాఁడనే తప్పక నేను పరితాపునకే సహాయము చేయుదును.'

ఇట్లు వాగ్వాదములు జరిగినను జగమ్మల్లునకు పట్టాభిషేకము చేయుటకే ప్రయత్నములు జరుగుచుండెను. సామంతరాజులందఱు నుదయసింగు కోరిక చొప్పున జగమ్మల్లును రాణాగాఁ జేయుటకు వచ్చి కూరుచుండిరి. ప్రతాపుఁడు సోదరుని రాజ్యమునం దుండుట తనకు సేమముకాదని తలంచి యేదేశాంతరములకైనఁ బోవనిశ్చయించి గుఱ్ఱములకు జీనువేసి పయనముగమ్మని సేవకుల కాజ్ఞాపించెను. జగమ్మల్లు పట్టాభిషేకమహోత్సవమునకై లేచి గద్దె యెక్కఁబోయెను. పట్టాభిషేకమప్పుడు చందావతులలో వృద్ధు రాణాకునడుమునకుం గత్తి కట్టవలసిన యాచారము గలదు. ఆయాచారము నడపుటకు జగమ్మల్లున కొకప్రక్క చందావతువంశస్థుఁడును రెండవప్రక్క వాని చేయిపట్టుకొని తారువంశస్థుఁ డగు వేరొకవీరుఁడు నుండిరి. అప్పుడు చందావతుఁడు గద్దెయెక్కఁబోవుచున్న జగమ్మల్లుయొక్క హస్తముఁ బట్టుకొని "దేవా మీరు పొరఁబడుచున్నారు. ఈపీఠము మీ రెక్కవలసినదిగాదు. ఇది మీసోదరుఁ డగు ప్రతాపుఁ డధిష్ఠింపవలసినది" అని నిర్భయముగఁ జెప్పెను. జగమ్మల్లు వాని పలుకులు సరకు సేయక యతనిచేయి విదల్చుకొని యాగడముచేయఁ దలంచెను. కాని చందావతుఁడు వానిని సందిట నిఱికించి యొకచోటఁగూలవైచి ప్రతాపునిం దోడితెచ్చి గద్దె యెక్కించి వాని మొలకుఁ గత్తికట్టి సాగిలంబడి మువ్మాఱు వానిచరణములకు మ్రొక్కి మీవారు రాణా ప్రతాపసింగేయని మేఘగంభీరభాషణములతో నొక్కి చెప్పి చప్పట్లు గొట్టెను.

అంతకుమున్ను రాజ్యభ్రష్టుఁడై దేశములపాలై పోవలసిన యవస్థలోనుండి యాకస్మికముగ మండలాధిపతియై సింహాసన మెక్కఁగలిగినందులకు గర్వించి విజృంభింపక ప్రతాపుఁడు నిశ్చలమనస్కుఁడై శాంతముతో నుండెను. పట్టాభిషేకమహోత్సవము ముగి

సినతోడనే ప్రతాపుఁడు సామంతప్రభువులఁ బిలిచి యది వసంతకాల మనియు నడవిపందిని వేఁటాడి గౌరికి సమర్పించి ముందుసంవత్స రము తన యదృష్ట మెట్లుండునో తెలిసికొనవలయుననియుఁ జెప్పి గుఱ్ఱమెక్కి వారిం దోడ్కొని వేటకుఁ బయలువెడలెను. రాజస్థాన మునందంతట గౌరి యిప్పటికి ననేకనామములతోఁ బూజింపఁబడుచు న్నది. ఇట్లు వెడలి వారడవిపందిని జంపి దానిని దేవి కర్పించి యామెను సంతుష్టిపఱచి మఱుచటియేఁడు తమకు జయకరముగ నుండునని తెలిసికొని సంతసించిరి. అది మొదలు రాణాప్రతాపసింగు పలుమాఱీవిధముగఁ బలుకుచు వచ్చె. "రాణాసంగునకు నాకును నడుమమాతండ్రి యుదయసింగు లేకుండ నేనే సంగునికుమారుఁడ నైన పక్షమున గొడ్డుమాంసము తిను తురకవాఁడు వచ్చియీ దేశము న నడుగు పెట్టఁగలఁడా. రాజపుత్రులను లోబఱచుకొనగలఁడా."

మీవారు రాజ్యమునకు స్వాతంత్ర్యమును దేవలయునని ప్రతాపునకు గోఁకయున్నది; కాని యదినెఱవేఱుట యసాధ్యము. ఏ మన. ప్రతాపసింగునకు ఢిల్లీచక్రవర్తి సైన్యములె కాక స్వబంధు జనములలోఁగూడ శత్రువులుండిరి. మార్వారు, బూందీ, బికనీరు, అంబరు మొదలకు సంస్థానముల యధిపతులు చక్రవర్తికిదాసులై యుండిరి. అందు బూందీసంస్థానప్రభువు నక్కఁ దక్కినవారు దాసు లగుటతోఁ దనివినొందక తమయాఁడుపడుచులఁ దురకకిచ్చి పెండ్లి గూడచేసిరి. వారిమాటయేల? ప్రతాపుని సోదరులలో నొకఁ డగు సూగుఁ డనువాఁడు తనయన్నను విడిచి యక్బరుచక్రవర్తి శరణంబు సొచ్చి యాతనిచేత నేలుటకు గ్రామంబులం బడసి మా న్యుఁడై యుండె. అతఁడును బిడ్డలును సూగ్రవతు లను పేరఁ జక్రవ ర్తి కొలువులో బ్రతిష్ఠితులైయుండిరి. మీవారు దేశము నిరంతర యుద్ధములచేత ధనశూన్య మగుటయే గాక యాయుధశూన్యమై వీర

శూన్యమై యడవియటు లుండె. ఆయవస్థలో మహావీరుఁ డగు ప్రితాపుఁడొక్కఁడు చక్రివర్తితోఁ బగసాధించెనుగాని మఱియొకఁడైనఁ పతుమున సందుదొరికిన దేచాలు నని చప్పుచప్పునఁ జక్రివర్తితో సంధిచేసికొని యాతన మన్ననలకుం బాత్రుఁడై సుఖముగ నుండి యుండును.

మీవారు దేశములోఁ బుట్టిన రాచవాఁడు ఢిల్లీచక్రివర్తికి లొంగి సలాము చేయఁగూడదనియు వానిని తాము గెలువలేకపోయిన తఱిమి దోఁచుకొని బెదరగొట్టి సిలుగులం బెట్టవచ్చుననియు వీలుదప్పివచ్చినప్పుడు గౌరవముగ రణముఖంబునఁ జచ్చి వీరస్వర్గము జూఱగొనవచ్చు ననియు నందుచే సంధి చేసికొనగూడదనియు వాని యభిప్రాయము. ఆయభిప్రాయముంబట్టి తురకలను స్వదేశమునుండి వెడలఁగొట్టి మీవారును తొల్లింటి గొప్పదశలోనికిం దెచ్చువఱకుఁ గడుపారఁ గూడు తిననసియుఁ గంటినిండ నిదురపో ననియు నతఁడు ప్రితిన జేసెను.

ఇట్లు సంకల్పించి యాగడియ మొదలు ప్రితాపుఁడు సంకల్ప సిద్ధి యగువఱకు గొన్ని నియమముల నేర్పరచుకొనియెను. సేనబయలు దేరునపుడు ముందుమ్రోవు రణదుందుభు లదిమొదలు వెనుక వాయింపవలయును. శత్రువులను జయింపలేని పిఱికివాని రణదుందుభులు వెనుక నుండనలయునేగాని ముందుండదగవని యిట్లుచేసెను. 2. రాణావారు భోజనముచేయు వెండిబంగారుపళ్ళెములుపాత్రములు తీసివేయించి తనకును తనతోడి సామంతప్రిభువులకును శత్రునాశనము సేయువఱకు భోజనార్థము విస్తళ్ళుచాలునని యానతిచ్చెను. 3. ఆయన నిత్యము పవ్వళించు హంసతూలికాతల్పము లవ్వలఁ బాఱవైచి తనగుఱ్ఱమును శత్రువులకోటలోఁ గట్టివేయువఱకుఁ దానుగడ్డిపాన్పుమీఁదనే పండుకొనునట్లు శపథముచేసెను. 4. చిత్తూరునగర

మెప్పటియట్లు రాజస్థానమునకు దీపమై వెలయునంతవఱకు ప్రతాపుఁడు తాను తన సామంతులు గడ్డములు కత్తిరించుకొనఁగూడ దని శాసించె ఆదినము మొదలు చిత్తూరు రాజధానిం జేసికొనువఱకు మఱల రాజధానిలో నుండఁగూడ దని యుదయపురమును విడిచి కమలమియరుకోటలోఁ గాపురముండి యెందేని బోవలసివచ్చినప్పుడు గుడారములోనే వసించుచు వచ్చెను.

ఇట్లు సంకల్పించినతోడనే మున్ను తనతండ్రి మూర్ఖతవలన యన్యకుటుంబమునకు బోయిన తనతమ్ముని సూక్తుని రావించెను. ఆబాలుని పెంచుకొన్న తండ్రికి ముసలితనమున గొడుకులనేకులు పుట్టినందున దత్తపుత్రుపై మోహముతగ్గెను. కావున సూక్తుఁడును పాలకపితను విడిచివచ్చుటకు వగవక కడుసంతోషమున నన్నవద్దకు వచ్చి యతని యనుగ్రహంబునకుఁ బాత్రుఁడై వానిం గొల్చుచుండెను. వచ్చినక్రొత్తలో నన్నదమ్ము లిద్దఱు మిక్కిలి సౌహార్దముతో నుండిరి. కానిదినములు గడచినకొలఁది స్థితి వెనుకటియట్లేయయ్యెను తమ్ముని కన్నపై నసూయ బొడమెను. రాజ్యమేలుటకు తనయన్న కంటెఁ దానే యెక్కువ సమర్థుఁడనని సూక్తుఁడు తలఁచి యప్పుడప్పుడు దుర్వినయములు జూపుచుండ నొకనాడు వేఁటాడుతఱి నన్నదమ్ములకు మాటపట్టింపులు వచ్చెను. ఆమనస్పర్థ యంతంతకుఁ బ్రబలవైరముగ బరిణమింప సూక్తుఁ డన్నతో నిట్లనియె. "మనమిరువురము గుఱ్ఱములనెక్కి బల్లెముల చేతఁబట్టుకొని ద్వంద్వయుద్ధము చేసి యెవఁడెక్కువ బలవంతుడో నిర్ణయించుకొందము. పూర్వము తనతాత వ్యాఘ్రగిరియొద్ద జయముగొన్నట్లు తానును జయముగాంచ వచ్చునను ధైర్యమునఁ బ్రతాపుఁ డాయుద్ధమునకు సమ్మతించెను. దేశాచారప్రకారము గౌరవముల నడపఁదలఁచి వారుభయులు ముందు నీవుకొట్టుమునీవుముందుకొట్టుమని యొకరినొకరు హెచ్చరించుకొని

ముందారంభించుట కెవనికిం జేతులురాకపోవుటచే నొక్కసారిగ నిరువురు నొకరిపై నొకరు దుముటకు సిద్ధముగనుండ నంతలోఁ బురోహితుడు వారియిరువురనడుమ నడ్డముగ నిలిచి యతిదారుణమైన కులనిర్మూలకారణమైన యాపోరు డగుమని వేఁడెను.

అప్పటికా వీరుల క్రోధములు మేరమీఱినందున గురువుమాటమీఁది గౌరవముచేతగాని బంధుత్వముచేతగాని వారుపోరుమాననొల్లక బొడుచుకొనుటకు బల్లెములుదూసిరి. ఏయుపాయము నైన నీకుటుంబ కలహమును నివారింపదలఁచి పురోహితుడు కర్తవ్యమేమియుం దోపమి యెట్టకేలకుఁ దనచేతిబల్లెములో దానుబొడుచుకొని యిరువురకు నడుమ నేలబడియె. ఆయమానుషకృత్యముజూచి రాజపుత్రులిరువురు సంభ్రాంతులై గురుప్రాణరక్షణము చేయుటకు గుఱ్ఱములమీదనుండి క్రిందికి గుభాలున దుమికిరి, కాని గురువుగారంతకుమునుపే మేనుదొరగిరి. పవిత్రమగు గురువుగారి శరీర రక్తము సోదరుల కిరువురకు మధ్యగబాఱుటచే నదిదాఁటి యొకరిపై నొకరు దుముకుటకు వారికి మనసొప్పదయ్యె. గురువుపోయినఁ బోయెగాని కలహముమాత్రము నివారితమయ్యెను. ప్రతాపుఁడు కొంతసేపటికిఁ దెలివి తెచ్చుకొని సోదరునింజూచి నీవు నాయెదుటనుండి దేశాంతరమునకుం బొమ్ము ఇచట నిలువవలదని పలికెను. చిత్తమని కపటవినయముతో నమస్కరించి సూక్తుకు గుఱ్ఱమెక్కి వెంటనే ఢిల్లీకిఁ బోయెను ఆనాటి పోరువలన రాణాప్రతాపునకు సోదరవియోగమును ఢిల్లీచక్రవర్తికి గొప్ప మిత్రలాభమును గలిగెను.

ఇట్లు కొంద రాప్తబంధువులు కొందరు రాజపుత్రులు విడిచినను ముఖ్యసామంతప్రభువు లనేకులు ప్రతాపునకుఁ దోడుపడిరి. జగమ్మల్లును సింహాసన మెక్కింపదలఁచిన నాఁడెట్లుండెనో యట్లే చందావతుకులజుఁడు నేటికిని రాణాపక్షము వహించియుండెను. జయ

 

మల్లుని కొడుకులును, పుట్టరెయొక్క కొడుకులును తండ్రిమార్గము ననుసరించి రాణాకు విధేయులైరి. అక్బరుచక్రవర్తి వారి కెంతెంత లంచమున నియ్యడలంచుకొన్నను వారు తమ స్వామిభక్తిని దుచ్ఛ ధనమునకై విక్రయింపనొల్లరైరి.

శౌర్య మెంతయున్నను సేనాబలము తక్కువగుటచే రాజపుత్రులు తురకలను బ్రత్యక్షముగ నెదిరింపఁ జాలరైరి. అందుచే వెనుక రాణాహమీరు "అలాయుద్దీను" మీఁద బ్రయోగించిన మాయోపాయములే రాజపుత్రులు మరలఁ బ్రయోగింపవలసివచ్చెను అంతట రాణాప్రతాపసింగు కొండలలో వసియింపఁ బోవుచుండుటచే దేశమునందలి జనులందఱు వానిని వెంబడింపవలయుననియు రాని వారు కానివారేయనియు దేశమందంతట నతఁడు చాటఁబంచెను ప్రజలు రాజాజ్ఞ శిరసావహించి నేలఁ దున్నక పొలముల పైరుసేయక తమపశువుల నెల్ల శత్రుదుర్గమము లగు హారావళిపర్వతములోని కిందోలి తావు రాజువద్దకుఁ జనిరి. పట్టణములు పల్లియలు నిర్జనములై భయంకరము లయ్యెను. మహావీరులు వసియించిన తావులవనములనుండి వెలువడివచ్చి ఘాతుకమృగములు సంచరింపఁ జొచ్చె. బాటసారులు నడువకపోవుటచే మార్గములన్నియు ముండ్లతోనిండి బయనంబునకు నిరోధము గలిగించెను. ఢిల్లీచక్రవర్తి ప్రతాపుని మీఁదఁ దండువిడియ వానిసైనికులకుఁ దినుటకన్నముగాని ద్రావుటకు జలంబులుగాని లభింపవయ్యె. ఆయిక్కట్టులకు దోడుగ మహారాణా ప్రతాపసింగు నడుమ నడుమ కమలమీయరుకోటలో నుండియో మఱి యేయడివిలోనుండియో నాకస్మికముగ బయటకువచ్చి సూరతు నగరమునుండి ఢిల్లీచక్రవర్తి నిమిత్తము విలువగల సరకులం గొని పోవు బిడారములను కొల్లఁగొనుచుండెను. మఱియొకమాఱు తన యాజ్ఞ జెల్లింపక బుద్ధిహీనుఁ డెవండైన కక్కుఱితిచే నేలదున్నుట

పశులమందలను బెనుచుట మొదలగు కృత్యములఁ జేయుచున్న వాఁడేమో పరీక్షించి చూతమని రాజస్థాన మధ్యభాగమునకువచ్చి శోధించుచుండును. ఇట్లువిహరించుచుండ నొకనాఁడొకచోట మందభాగ్యుఁడొకఁడు రహస్యముగఁ దన మేఁకలమందను పచ్చికబీళ్ళ మేపుకొనుచుండెను. అది రాణాచూచి వానిం బిలిచి నాలుగుమాటలు వాని నడిగి సంగతి తెలిసికొని తత్క్షణమే వానికి మరణదండన విధించెను. ఆనిర్భాగ్యుని శవము దహనముచేయుటకైన దిక్కులేమిచేఁ గాకుల గ్రద్దలపాలయ్యెను.

అక్బరున కీకార్యములన్నియు నసహ్యములుగనుండెను. అతఁడీవిరోధమును మితిమీఱునట్లు చేయుటకిష్టపడఁడయ్యె. సహజముగ పరిశుద్ధమనస్కుఁడగుటచే నక్బరు భరతఖండము నంతయు దా నేకఛత్రముగఁ బాలింపవలయు ననియు, దన చల్లని పాలనముక్రిందట నన్ని తెగలవారు సుఖముగ బ్రతుకవలయుననియు సంకల్పించెను. అందుచేతనే యతఁడు రాజపుత్రుల నదివఱకే తక్కిన తెగలవారికంటె నెక్కువ గౌరవించుచుండెను. ఆతని పట్టపుదేవి యగు జహాంగీరుతల్లి రాజపుత్రుల యాఁడపడుచు. ప్రధానమంత్రులలో నొకఁడైనతోడరుమాలు రాజపుత్రుఁడు మఱియు నంబరుసంస్థానాధిపతి యగు భగవానుదాసుఁడును వానియన్నకొడుకగు మానసింగును సేనాపతులై చక్రవర్తిని గొలుచుచుండిరి. ప్రజలనిమిత్తము చట్టములు చేయునప్పు డక్బరుచక్రవర్తి యతిబాల్య వివాహము, యజ్ఞములలో జీవహింస, బలత్కారసహగమనము, మొదలగు దురాచారములు జరుఁగగూడదని నిషేధించి హిందువులకుఁ గొంచెమనిష్టమే గలిగించినను మొత్తముమీఁద సర్వమత సహనముఁగలిగి యెవరిమతమువారిపూజలు తనకోటలో నయితము జేసికొనవచ్చునని యొప్పుకొని గోవుల నితరజాతులవారుకూడ చంపకూడదని కట్టు

బాటుచేసి ధర్మోత్తరముగఁ బ్రజాపాలనము చేసెను. ఈసౌమ్యత వలన నక్బరునకు ననేకరాజపుత్రులు లోఁబడి కప్పము గట్టుటకు సమ్మతించిరి. కాని చిత్తూరునగరమును నాశనముచేసి తానుగొండలలోనికిం బాఱఁదోలినను రాణాలకింకను బుద్ధిరాలేదని యక్బరు విచారింపజొచ్చెను. రాజపుత్రునియెడల చక్రవర్తి చూపు దయా గౌరవాదులంబట్టి స్వమతాభిమాన మెక్కుడుగల మహమ్మదీయుల కక్బరుపై కోపముగూడఁ గలిగెను. కాలక్రమమున రాణాకును జక్రవర్తికిని దొంగపోటుయుద్ధములు కడముట్టి ప్రబలయుద్ధములుజరుగ నారంభించెను. దానికికారణము రాజపుత్రికవు లిట్లుచెప్పియున్నారు.

"అంబరురాజవంశస్థుఁ డగుమానసింగు చక్రవర్తిపంపున నేదేశమునకో పోయి పగతుల నక్కడఁచి మరల ఢిల్లీకిఁ బోవుచుమార్గవశమున మీవారుదేశములోనుండి పోవలసివచ్చెను. ప్రతాపసింగు ధనహీనుఁడై దుర్బలుఁడై యుండినను ముప్పదియాఱు రాజపుత్రకుటుంబములకు నాయకుఁడై వెలయుచుండుటచే "మహారాణావారి దర్శనము నేను జేసికొనవలయునని యున్నది రావచ్చునా?" యని మానసింగు వినయముగ వర్తమాన మంపెను. అప్పుడు ప్రతాపుఁడు కమలమియరుకోటలో నున్నందున వాని నక్కడ కలసికొన ననియు నుదయసాగర మను సరస్సుతీరమున గలిసికొందు ననియు, వర్తమానమంపెను. దానికి సమ్మతించి మానసింగు సపరివారముగ నటకుంజన, వాని నెదుర్కొనుటకుఁ బ్రతాపుని పెద్దకొడు కగు ఉమారి యనునతఁడు మీవారుప్రభువులను దోడుకొని యక్కడకు వచ్చెను. వచ్చి మానసింగును సన్మానించి తలనొప్పిబాధచే రాణావారుస్వయముగ రాలేక తన్నుఁ బంపిరని చెప్పి పిండివంటలు చేయించి విందారగింపుమని వానిం బ్రార్థించె.

ఉమారికు నక్కడ నున్న తక్కిన రాజపుత్రులను బ్రతా

పుఁడు స్వయముగ వచ్చి మానసింగునకు నెందుకు విందు సేయలేదో కారణము తెలియదు. అంబరు రాజులు తురకలతో వియ్యమందుటచే ప్రతాపుఁడు వారిపంక్తిని దినఁడు. ఆసంగతి గ్రహించి మానసింగు "ప్రతాపుని తలనొప్పికారణము నేనెఱుఁగుదును. అతఁడే స్వయముగ వచ్చి నాకు విందు సేయవలయును కాని వానిస్థానమున వేఱొకరు పనికిరా" రని పలికెను. ఆపలుకులు విని ప్రతాపసింగు నిర్భయముగ నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను. "తనయింటియాఁడుపడుచును దురకకిచ్చి పెండ్లిచేసి వానితోఁ గలిసి కూడుదిను సతనితో నేను భుజియింపఁ జాల"

ఆపలుకులు విని క్రోధలజ్జాపరవశుఁడై మానసింగు విందార గింపక దిగ్గునలేచి "దేవుని కారగింపుచేసి తెచ్చినయన్నమే గాని మీ చేతియన్నము నేను దినను. మీమానములఁ గాపాడుటకే మీరాజ్యములు నిలుపుటకే మేము తురకలతో వియ్యమంది వారికూడు తినుచుండుట. సరేయిఁక మీఁద నీవేమాత్రము పౌరుషశాలివో చూతము కాఁచుకొమ్ము" అనిపలికి తనపరిజనుల నందఱిని లెమ్మని పయనమయి పోవుచుండ నింతలో ప్రతాపుఁ డీవలకు వచ్చి మానసింగును జూచుచుండెను. చిక్కి శల్యమయి మనోవ్యథచే పాలిపోయి మాసిన బట్టలు గట్టుకొని సామాన్యవ ట్లుండియు రాజతేజంబుచే మెఱయుచున్న ప్రతాపసింగును జూచినతోడనే మానసింగున కెక్కడలేని కోపము రాఁగా నాపుకొనలేక ప్రతాపునితో "నేను నీగర్వ మణగింపకపోదునేని నాపేరు మానసింగు గాదుసుమీ" యని పలికి యొట్టు పెట్టుకొని పోవఁదొడంగెను. ప్రతాపుఁ డాపలుకులకుఁ గోపింపక మానసింగుతో యుద్ధము సేయుట నాకును సంతోషమే యని గౌరవముగఁ బలికెను; కాని ప్రతాపుని పరిజనులలో నొక్కఁడు కోపమాపుకొనలేక చప్పటలు గొట్టి మానసింగును వెక్కిరించుచు మీ

యక్బరు నీమాటు తీసికొనిరా! ఈసారి వానికి నీకునుగూడఁ దగినట్లు బుద్ధి చెప్పించెద నని బిగ్గరగఁజెప్పి యిక్కడ వ్రాయుటకు వీలులేని తిట్లు చక్రవర్తిని వానిని దిట్టెను. మానసింగు సపరివారముగఁ బయన మయి పోయినవెనుక నతఁడు నతనిసైనికులు బసదిగినచోట గూర్చున్నచోట నడచినచోట పవిత్రమగు గంగానది జలము తెప్పించి చల్లించి పుణ్యాహవాచనము చేయించి యంతతోఁ బోక వారి మైల గాలి తమపై సోకినందుకుఁ బ్రాయశ్చిత్తముగ దానును దనబంధు గులును శిరస్నానముచేసి వెనుకటి బట్టలు విడిచి మంచిబట్టలు కట్టు కొని కమలమీయరుకోటకుం జనిరి.

పరాభవము నొందిన మానసింగు వడివడిం బయనము చేసి ఢిల్లీకిఁ బోయి యక్బరును దర్శించి ప్రతాపుఁడు తనయెడల జూపిన యగౌరవంబును జక్రవర్తి యధికారమునెడం జూపిన తిరస్కారమును బ్రతాపుని పరిజనులు చక్రవర్తిని జేసిననిందలను మరచిపోక యొకటికిఁ బది జేర్చి పూసగ్రుచ్చినట్లు విన్నవించెను. ఈకొండెములు విని యక్బరు మీవారుపై దండెత్తుటకు సేన సిద్ధము చేసెను. ప్రతాప్రు నితో మానసింగు చెప్పినవిధమున నక్బరు స్వయముగ దండయాత్రకు రాలేదు గాని తనకుమారుఁడగుసలీమును సేన గధిపతిగఁ జేసి మాన సింగును వానికి ముఖ్యమంత్రిగ నొనర్చి దండయాత్ర నడపించెను.

ప్రతాపసింగు తన చిన్న సేనతో నెనుబదిచతులపు మైళ్ళ వైశా ల్యము గల నుదయపురజిల్లాలో నొకయడవిలో నుండెను. మొగ లాయీసేన నానాఁటికి రాణానుజుట్టి నలుదెసలం గ్రమ్ముకొనెను. ఆయడవి కొండలతో నిండి సమప్రదేశము లేక నిమ్నోన్నతముగ నుండుటజే నిలిచి యుద్ధము చేయుట కిద్దఱకు వీలు లేదయ్యె. ప్రతా పుడు దాఁగొనియున్న కారడవికి సమీపమున హల్దిఘా టనుబయ

లుండుటచే నది యుద్ధమునకుం దగినభూమి యని యిరువు రచ్చటఁ జేర నిశ్చయించి 1576 వ సంవత్సరము జూలై నెలలో జేరిరి.

ప్రతాపవంతుఁడగు ప్రతాపుఁడు చైటకమను పేరుగల తన గుఱ్ఱమునెక్కి రాచలాంఛనమగు శ్వేతఛత్రమును సేవకులుపట్ట కవచము ధరియించి ఖడ్గపాణియై యుద్ధమున నిలిచినతోడనే ప్రాణము లెంతో తీపియని చావునకు వెఱచి మూలగాఁగొన్న పిఱికిసయితము తెగించి కత్తిబూని తనరాణాకుఁదోడుపడెను. శత్రుసైన్యములఁ జూచినతోడనె మనోనిశ్చలమగు ప్రతాపునిమనస్సుఁగూడ నించుక జంకెను. దీనింబట్టి యక్బరుపంపిన గొప్పఫిరంగులు సాధనములు మహాయంత్రములు మొదలగువానిం జూచి రాణా జంకెనని మనము దలఁపరాదు. అన్నను జంపుటకు తమ్ముఁడును తమ్ముని దెగటార్చుట కన్నయు నొండొరులం జంపుకొనుటకుఁ జుట్టములు నచ్చటఁ జేరినందు కతఁడించుక వగచె. ఆ మహాసైన్యములో ప్రతాపుని సోదరుఁ డగు సూక్తుఁ డొకమూలనుండెను. మఱియొక సోదరుఁ డగు సూగ్రుని కుమారుఁడు కొంతసేన కధిపతియై నిలిచెను. చక్రవర్తి పుత్రుఁడగు సలీము రాజపుత్రుల యాఁడుపడుచు కొడుకేగదా! ఈ సేనాచక్రము నంతను ద్రిప్పుచున్న యంబరరాజపుత్రుఁడు మానసింగు ప్రతాపునకుఁ జుట్టమేకదా? అతనిం జూచినతోడనే ప్రతాపుఁడు రోషావేశ పరవశుఁడై యుద్ధమేమయిన సరే వానిపై కసిదీర్చుకొన వలయునని ప్రతినచేసెను.

బ్రతాపుని పక్షముననున్న సైనికులందఱు నిరువది రెండు వేల మంది. వారు మహాపౌరుషశాలురేగాని సకలసాధన సంపత్తిఁ గల ఢిల్లీసైన్యమున కీఁడగువారుగారు. వారితో ననేకులు రాజపుత్రులు గడువిశ్వాసముఁగల భిల్లులు గలిసియుండిరి. ఆయడవిలోఁ గొందఱు వనచరులుండిరి. వారిని యుద్ధమునకు రప్పింపవలయు ననుకొన్నఁ

గ్రిమమయిన యుద్ధమున నిలుచుట యెట్లో పోరుటయెట్లో వారెఱుంగరు. ఆకారణమున వారు రణమునకు రాక యే రాణాకు సాయముఁ జేయదలంచి కొండలెక్కి చెట్లచాటున నుండి వీలగునప్పు డొకటి రెండుబాణముల విడుచుచు శత్రువులు కొండలనడుమనుండి పోవునప్పుడు వారిపయిన పెద్దపెద్దఱాళ్ళను దొర్లించుచు యథాశక్తిగ స్వామిభక్తిని జూపుచుండిరి. అంతట నుభయసేనలకు ఘోరయుద్ధమారంభమాయెను.

కొండకనుమ నాక్రమించినచోఁ దమకు సేమమగునని తురకలు ప్రయత్నించిరి. రాజపుత్రులు వీరావేశముతోఁ గొండదారి తురకలపాలఁ బడకుండఁ గాచుకొనిరి. ఎక్కడ యుద్ధము సంకులమయ్యెనో యక్కడ భానుబింబ చిహ్నముగల ధ్వజముతోడను, వెల్లగుబ్బ గొడుగుతోడను తప్పక ప్రతాపుఁడు గానఁబడుచువచ్చెను. ఆతని ముఖ్యాభీష్టము మానసింగునుగలిసి వానినోడింపవలయునని. అందుచే నంతకంతకు ముందుకు చొరుచుకొనివచ్చి ప్రాణములపై నపేక్ష విడిచి యతఁడు బోరఁజొచ్చె. రణరంగమున నతఁడు కొంతదవ్వు పోవునప్పటికిఁ వివిధాలంకారములచేత నలంకృతమయి బంగారపు టంబారీగల యొకపట్టపుటేనుఁగు వాని కగపడియెను. దానిచుట్టు వందలకొలఁది జనులు జేరుటచే నది చక్రవర్తిపుత్రుండగు సలీముని యేనుఁగని గ్రహించి ప్రతాపుఁడు విజృంభించెను. విజృంభించుటయు సలీముని యంగరక్షకులు రాజపుత్రులచే నిహతులై నేల నొఱఁగిరి. మావఁటివాడు కూర్చున్న చోటుననే కురింగిపోయె. అంబారీకి నలుప్రక్కలనున్న యినుపపలక మూలమున సలీము బ్రతుకఁ గలిగెను. గాని లేకున్నచో ప్రతాపుని బాణప్రహారములచేత చక్రవర్తి పుత్రుఁడు నాఁడే కడతేఱియుండును. అప్పుడు పోరు మఱింత సందడి యయ్యెను. చక్రవర్తి కుమారుని రక్షించుటకు మొగలాయీసేన

లన్నియు నచ్చటికివచ్చె. రసపుత్రవీరులందఱుతమస్వామికి బాసటమై నిలిచిరి. ప్రతాపుఁడు మూఁడుబల్లెపు పోటులచేతను మూఁడు కత్తిదెబ్బలచేతను గాయములనుండి నెత్తురు సంతతధారగఁ గాఱు చున్నను లెక్కసేయక పోరుచుండ నొకతుపాకీగుండు కవచమును భేదించుకొని వానిశరీరమునఁ జొచ్చెను. ప్రతాపుని గుఱ్ఱము కైటక మనుమదగజమును డీకొన నింతలో నామదపుటేనుఁగు దెబ్బలచే నొడలునొచ్చి పిచ్చియెత్తినట్లు విజృంభించి వేఱొకయెడకుం బాఱి పోయెను. అందుచె సలీము పులినోటి కండవలె దాఁటి యావలఁ బడియె.

మొగలాయీ సైనికులు మిడుతల దండువలె రాజపుత్రులం జుట్టుముట్ట నారంభించిరి. ప్రతాపుఁడు మున్నూరు పగతులచేఁ జుట్టు ముట్టబడియు మున్నూఱును వారిం దనశక్తికి బలియిచ్చి యప్రతి హతుఁడై నిలిచెను. రాజపుత్రులు క్రమక్రమంబుగ నశించుటయు దురక సేన నెందఱుబంట్లు చచ్చిన నిసుకపాతరవలె తఱఁగకుండు టయుఁ జాలవంశస్థుఁడగు నొక రాజపుత్రవీరుఁడు చూచి ప్రతాపుని యపాయస్థితినిఁ దప్పించుటకు సూర్యబింబధ్వజమును తనచేతం బట్టుకొని గబగబ పరుగెత్తెను. తురకసైనికు లది చూచి ధ్వజ మెక్కడనుండునో రాణాయు నక్కడనే యుండుననుకొని జాలవంశ స్థుని వెంటఁబడిరి. ఇంతలోఁ గొందఱు రాజపుత్రులు ప్రతాపుని గుఱ్ఱపుకళ్లెమును బట్టుకొని వాని కిష్టములేకున్నను రణరంగమునుండిఁ వాని నవలకుఁ దీసికొనిపోయిరి.

ఆరాజసింహ మావలకుఁ జనినపిదప వెనుక చిత్తూరు ముట్టడి లోఁ జెక్కు చెదరక బ్రతికిన తువారువంశస్థుఁడును వానికుమారు డును రాజప్రాణసంరక్షణార్థము ధ్వజముపట్టుకొనిపోయిన జాలవంశస్థు డును ఉక్కుతునుకలవంటి మఱియేనూరు రాజపుత్రవీరులును హూ్ఘా

హాోరీగాఁ దురకలలో యుద్ధముచేసి మృతినొంది వీరశయన మలంక రించిరి. నాఁడు యుద్ధమునకు వచ్చిన యిరువదిరెండు వేల రాజపుత్రు లలో నెనిమిదివేలుమాత్రము గాయములతో బలాయితులైరి. అప్పుడు శూరశిఖామణియైన ప్రతాపుఁడు వెంటనొక్క బంటయినను లేక యొంటరిగ గుఱ్ఱమునెక్కిఁ దనకు శరణమీయగలతావు లవియే యని కొండలోనికిఁ బోవుచుండెను. రాజపుత్రసైనికులు శత్రువులు తమ రాణామీఁదికిఁ బోకుండ వారినాపి పోరుచు చేతనయినంత సాయము చేసిరి. తనకుమారుఁడగు నమ్రా తాను మృతినొందినచో స్వదేశ మును గాపాడఁ దురకల నెదిరింపలేఁ డని రాజ్యలక్ష్మి నిమిత్తము ప్రతాపుఁడు కొంత కాలము బ్రతుక నిశ్చయించుకొనియుఁ దనతోడి వీరులు గౌరవముగ రణరంగమునఁ బ్రాణములవిడిచి వీరస్వర్గమును గొల్లఁ గొనుచున్నందుకునుఁ దాను పిఱికివాఁడై యేకాకియై ప్రాణ ములు గాఁచుకొనుటకు బ్రతికివచ్చినందుకు నతఁడు తద్దయు విచారిం చుచుఁ గైటకమునెక్కి మెల్ల మెల్లగ రాళ్ళనడుమ బయనము సేయు చుండ నంతలో వాని వెనుక గుఱ్ఱపుడెక్కల చప్పుడయ్యె. అప్పుడేమి యని యతఁడు తిరిగి చూచునప్పటికి నిద్దఱు తురుకలు వానిం బట్టు కొనుటకు వెంట దగిలివచ్చుచుండిరి. వారికంటెదూరముగ నింకొకఁడు వచ్చుచుండెను. గుఱ్ఱముకంటె ప్రతాపుఁడును ప్రతాపునికంటె గుఱ్ఱ మును నలసియుండిరి. గోరుచుట్టుపై రోకలిపోటువిధమున వారి దారి కడ్డముగ కడువేగమునఁబాఱు నొక కొండయేఱు అడ్డమువచ్చెను. ప్రతా పుఁడు కైటకమును కొంచెము తరటచేయ నది యెక్కడలేని యోపికఁ దెచ్చుకొని నొక్క యుగురెగిరి యేఱుదాఁటి యావలంబడియె. తరుము కొనివచ్చిన తురకలిద్దరు ఱాళ్ళమీఁద జారిపడితిమా చావవలసివచ్చు ననియు ప్రతాపునివంటి యసహాయశూరుని మీఁదికి తమరిద్దఱు చ న గూఁడదనియు దమవారు మఱికొందఱు వచ్చువఱకు నిలుచుట మంచిదనియుఁ దలఁచి యేఱుఁదాఁటరైరి.

ప్రతాపుఁడు పలుగాయములతో నెట్టుకొని కొంతదూరము పోయి నడచుటకు గుఱ్ఱమునకు దానిపైఁ గూరుచుండుటకుఁ దనకు బొత్తిగ నోపిక లేకపోవుటచే నేమి సేయఁదగు నని యోచించుచుండ నంతలో వెనుకనుండి కడువేగముగ దఱుముకొనివచ్చు నొకశత్రువుఁడు కనఁబడెను. వానిబాఱినుండి తప్పించుకొని పోవుటకు వీలులేదని తెలిసి పోరాడి గౌరవముగ మృతినొందవలయునని నిశ్చయించి ప్రతాపుఁ డెదురుతిరిగి నిలిచెను. నిలిచినతోడనే "యోమహావీరుఁడా! యుద్ధమునుండి పాఱిపోవు వీరుని మన సెట్లుండునో యిప్పుడు చెప్పఁగలవా;" యనుమాటలు వానికి వినఁబడియె. ఆమాట లెవరివోయని యతఁడు చూచునప్పటికిఁ దన మరణముఁగోరి శత్రుపక్షములోఁ గలిసిన తనసోదరుఁడు సూక్తుఁడే యతఁడని గ్రహించి యాపలుకుల కుత్తరమియ్యక ప్రతాపుఁడు పోరునకు సిద్ధముకాఁగా కైటకము నిలువలేక నేలఁబడి మృతినొందెను. అప్పుడు చేయున దేమియులేక ప్రతాపుఁడు నిశ్చేష్టుఁడై నిలువ "నీవు భయపడనక్కరలేదు నేను నీకు హాని సేయుటకు వచ్చినవాఁడను గాను. నీప్రాణములు పుచ్చుకొనుటకు వచ్చిన తురకలిద్దఱు నదె కావలనే యున్నార"ని చెప్పి సమీపమునకు బోవ నన్నదమ్ములిరువురులో నడఁగియున్న చిరక్రోధానలము చల్లఁబడునట్లు వైరము మఱచి యొండొరులక గౌఁగలించుకొని కన్నీరువిడిచిరి. అట్లు కొండొక వగచిన పిదప సూక్తుఁ డన్నతో నిట్లనియె. "అనేక మహావీరులచే నిరంతరము కొలువఁబడు సూర్యశిఖామణులగు మీరు గాయములచే బడలి కొండలంబట్టి పోవుచుండుటఁజూచి సహింపలేక యేకగర్భజనితున కింతకంటె సాయము చేయవలసిన సమయముండదని నేను పరుగుపరున వచ్చి మిమ్ము తఱుముచున్న తురకల నిద్దఱను, నేనే పొడిచి చంపితిని. ఇదిగో నాగుఱ్ఱము దీనినెక్కి మీప్రాణముల దక్కించుకొనుఁడు. నేను ప్రస్తుతము సమీమువద్ద

కుం బోయి కొలఁదికాలమున మీపాదసేవ చేయుటకువచ్చెద" అని పలికి సూక్తుఁడన్నకు తనగుఱ్ఱమిచ్చి తనదారిం జనియె. చిరకాలము తనకుఁ గడు విశ్వాసముతోఁబనిజేసిన కైటకమున్దనవైపుఁ జూచుచు నప్పుడే ప్రాణములు విడుచుటచే ప్రతాపుఁడు దాని కాపస్సమయమున దగునుపచారములు చేయలేనైతినని కన్నీరువిడిచి క్రొత్తగుఱ్ఱమునెక్కి మరలఁ బయనమయ్యెను.

సూక్తుఁడును సోదరునివద్ద సెలవుపుచ్చుకొని పాదచారియై మొగలాయిశిబిరముం బ్రవేశించెను. అంతయాలస్యముగ నొంటిగఁ గాలినడకను వచ్చుటకు గారణమేమని సలీము వానినడుగ సూక్తుఁ డొక పెద్దకథకల్పించి యిట్లని చెప్పెను. "అయ్యా! దేవరవారియెడ ద్రోహియగు ప్రతాపుఁడు రణరంగము విడిచి పలాయతుఁడగుచుండ నాదురాత్ముని బట్టుకొని దేవర పాదపద్మములమొద్దఁ బడవేయవలయునని నేనును ముల్తాను ఖొరసాను ప్రభువులగు నిద్దఱు తురకలును బయలుదేఱితిమి ఆప్రతాపహతకుఁడు మీతురకబంట్ల నిరువురఁ గడతేర్చి నాగుఱ్ఱము నపహరించి నన్నుఁగూడఁ జంపనుంకించెను; కాని యేలినవారిపాదములు మరలఁ జూడనోచుకొనుటచే నెట్టెటో గండముగడపి నేను బయటఁబడితిని." అనవుడు నాపలుకుల యం దొక్క యక్షరమైనను సలీము నమ్మడయ్యె. నమ్మకపోయినను మహాక్రూరస్వభా డగు నతఁ డెందుచేతనో సూక్తుని వెంటనే చంపింపక వానితో "జరిగిన నిజమును నీవొప్పుకొంటివేని నీకభయమిచ్చెద నున్న దున్నట్లు పలుకు" మని నిర్బంధించెను. అట్టిసమయమున నిజ మొప్పుకొనుటయే మంచిదని వానికి సూక్తుఁడిట్లనియె. మీవారు రాజ్యభారము "మాప్రతాపుని భుజములపైనిలిచియున్నది. అతని దురవస్థఁజూచి నామనసు కరఁగిపోవ నేను నాసోదరునిం గాపాడుకొంటి" నని యావద్వృత్తాంతము జెప్పెను. అదివిని సలీము

వానింజంపింపక తనసేన విడిచిపొమ్మని యానతిచ్చెను. సూక్తుఁడు బయలుదేఱి వచ్చుచునొకచిన్నసేనం గూర్చుకొని మధ్యమార్గమున మొగలాయిల యాధీనములోనున్న భిల్సురారను పట్టణమును బట్టుకొని యాకస్మికముగ నొకనాఁడు ప్రతాపునియొద్దకు వచ్చి నమస్కరించి నిలిచెను. అతఁడు విస్మయమంది తమ్ముని రాకకు గారణమడుగ సూక్తుఁడంతయు జెప్పి "నేను మీసేవకుఁడనై తిని. మీదర్శనమునకు వట్టిచేతులతో రాఁక భిల్సురాపట్టణము పట్టుకొనివచ్చితిని. అది కానుకగ గ్రహించి మీవారునన్ను మన్నింపఁదగు" నని ప్రార్థించుటయుఁ బ్రతాపుఁడు కృపాయత్తుఁడై భిల్సురారాజ్యమును సూక్తునకిచ్చి తనకు లోఁబడి పాలింపుమని యానతిచ్చె. అదిమొదలు సూక్తునిసంతతివారు సూక్తావతులను పేరంబరగి రాణాకు విధేయులయి యుండిరి, సూక్తునిపేరుగాక యీయుద్ధమున మనము జ్ఞాపకముంచుకొనఁదగిన మరియొక వీరుని పేరుఁగలదు ధ్వజమును మఱియొకచోటికిఁ గొనిపోయి రాణాప్రాణములను గాచి మృతినొందిన జాలవంశస్థుఁడే యీరెండవవీరుఁడు. అతఁడు చూపిన స్వామిభక్తికి మెచ్చి ప్రతాపుఁడు వాని సంతతివారికి రాజబిరుదమును నగారానౌబతుల నిచ్చి చాలగౌరవించెను. ఆవంశస్థుఁడు రాణాబయలుదేఱునప్పుడు వానికిఁ గుడిప్రక్కను బోవునట్టి గౌరవముఁ గలిగియుండె. ఈవిధముగ హాళ్డిగట్టుయుద్ధము ముగిసెను.

---

# రాణాప్రతాపసింగు

హల్దిఘాటుయుద్ధమునందు రాణాప్రతాపసింగు సంపూర్ణముగనోడింపఁబడినాఁడను నమ్మకముచేతను, యుద్ధయాత్రలు చేయుటకనర్హమైన వర్షకాలము వెంటనే ప్రాప్తించుటచేతను జహంగీరుచక్రవర్తి తాను గెలిచిన గెలుపు సఫలమగునట్లు రాజపుత్రుల నడుగంటద్రొక్కక విడిచి తనసేనలను ఢిల్లీనగరమునకుఁ దీసికొనిపోయెను అందుచేత స్వేచ్ఛగా నూపిరి విడుచుకొనుటకు నలుదెసలకుం జెదిరిపోయిన తనమూకల మరలఁ జేర్చికొనుటకుఁ బ్రతాపునకు వీలుదొరకెను. మరుచటి సంవత్సరము దండయాత్రలు సేయుట కనుకూలమగు వసంతకాలమున జహంగీరు తన విజయమును సంపూర్ణముసేయుటకు మరల రాజస్థానముపై దండువిడిసెను. అప్పుడు ప్రతాపుఁడు రణరంగమున మొగలాయిసేనలం దాఁకి దారుణయుద్ధము చేసెను. కాని దైవయోగమున రాజపుత్రులు పూర్ణముగ బరాజయమునొందిరి. అందుచేత మున్ను పృథివిరాజేకోటలోనుండి శత్రువులఁ దృణప్రాయముగఁ జూడఁగలిగెనో యా కమల్మీయరుకోటకుఁ బోయిన తాను సురక్షితముగ నుండవచ్చునని ప్రతాపసింగు సపరివారముగ నక్కడికిం జనియె.

ఎచ్చటికిఁబోయిన నాపదలు వెంటవచ్చునన్నట్లు ప్రతాపునకు నక్కడఁగూడ దనకపాయము సేయనెంచిన మహాద్రోహి యొకఁడుండెను. వెనుక పృథివిరాజునకు విసముపెట్టిన దేవరకోట రాజువంశస్థులలో నొకఁడు ప్రతాపునిపక్షమున యున్నట్లే యుండి కోటలోని సైనికులు త్రావునీటిలో విసము గలిపించెను. అది కారణముగ ప్రతాపునినిమిత్తము రాజపుత్రమహావీరులు ప్రాణములు విడువ

వలసి వచ్చెను. ఆవీరులు చాటుచాటున దమ రాణాను గోడదాఁటించి యావలకుఁ బంపి సోనిగుఱ్ఱసంస్థానప్రభువును నాయకునిఁ జేసికొని మొగలాయిసేనల నెదిరించి తుట్టతుదవఱకు దుర్గమునుఁ గాపాడి ఖడ్గహస్తులై యొక్కఁడు లేకుండ వీరమరణము నొందిరి. ఆజనముతో పాటు ప్రతాపునిపరాక్రమములు పాటలుగ బద్యములుగఁజేసి పాడుచు వానిసైనికులకు మహోత్సాహమును గలిగించుచు వచ్చిన యాస్థానకవికూడ మృతినొందెను.

అనంతర మొకదానివెంట నొకటిగ గోటలన్నియు మొగలాయీల సేనాధిపతి యగు మానసింగు చేఁజిక్కెను. రాజు దాఁటిపోయె నని గ్రహించి మొగలాయీసేనలు ప్రతిపర్వతమార్గము నరికట్టి నలుదెసల జుట్టుముట్టి వానికి విశ్రాంతి నొసఁగక తఱుమజొచ్చిరి వేయేల! ప్రతాపుని రాజధానియగు నుదయపురమే పగతుర యధీనమయ్యెను. అందుచే పులులు వసించుపొదలు, సింగములుండుగుహలు నుదయపురమహారాజుగారికి విడిదు లయ్యెను. అడవిమృగములతో గలసిమెలసి చాలకాల ముండుటచేఁ బ్రతాపమహారాజు వనమృగంబులవలెనె దాగి యుండుటయు, పొంచుండుటయు, నదను వెదకి తన పగతురమీఁద దుముకుటయు మొదలగు లక్షణముల నేర్చికొనెను. పలుసారులు తాము ప్రతాపుని జుట్టుముట్టి పట్టుకొనఁ గలిగితిమని మొగలాయిసేనలు సంతసించుచు నుండఁగనే వారియాసలు భంగమగునట్లు ప్రతాపుఁడు తనసేనతో నింకొకమూల శత్రుసేనలఁ దఱుముచుఁ గానఁబడుచువచ్చె. ఒకప్పుడు రాణా చాలదూరమున నున్నాఁడని విని తురుష్కసైన్యము నిర్భయముగఁ బోవుచుండ నాకస్మికముగ నేమూలనుండియో ఇదె రాణా వచ్చెవచ్చెనని కేక వినఁబడుటయు వినబడినతోడనె ప్రతిపొదనుండి ప్రతిమూలనుండి వీరులచేతులనుండి బాణవర్షములు గురియుటయుఁ దఱుచుగ సంభవించుచు వచ్చెను.

ఈవిధముగ వారిం దప్పుదారులం బెట్టుచు నొకమాఱు ప్రతాపుఁడు మొగల్ సేనలలో నొక పెద్దభాగమునే పట్టుకొని నిశ్శేషముగ సంహరించెను. వనవాసులగు భిల్లులు విధేయులై మిత్రులై వానికిఁ గన్నులట్లు నుపచరించిరి. ఒకానొకప్పు డతఁడు పలాయితుఁడగుటకు వీలు లేనపుడు దైవమే వానికి సాయముఁ జేయుచువచ్చె. అదియెట్లన నయ్యడవులలో నాకస్మికముగఁ గాఱుమబ్బులు పొడమ, జడివానలు దిమ్మరించి మొత్తుచుండును. అందుచే వాగులు నేఱులు కొండకాలువలు నిండి మార్గమరికట్టుటయెగాక దేశమంతయు జలమయమయి యుండును చక్రివర్తి సైన్యము లాకారణమునఁ బ్రతాపుని విడువవలసి వచ్చుచుండును.

ప్రతాపుఁ డెక్కడనున్న నక్కడనే యతనికొలు వుండును. రాజ్యపరిపాలనము సేయుచున్నప్పుడు, భ్రిష్టుఁడై తిరుగుచున్నపుడు, గృహమునం దున్నపుడు, కారాగృహమునందున్నపుగూడ ప్రతాపుఁడు రాచరికమె చేసెను. సింహాసనముమీఁద నున్నపుడెంత గౌరవమో నిరాధారముగఁ జెట్టుకిర్రింది కూర్చున్నపుడు వానియెడ వాని యనుచరుల కంతె గౌరవముండెను. చెట్లనుండి గోసినపండ్లు, బీడు గడ్డితోఁ జేసినరొట్టెతప్ప వారికి వేరాహార మేదియులేదు రాణా తన కొలఁదియాహారములోనుండి యొకభాగమును దీసినయతో నే సేనాధిపతికైన నిచ్చెనేని తొల్లి యుదయపురమున మహైశ్వర్య సంపన్నులైననాఁడు దయచే నిచ్చినబహుమానముల కెంత సంతసించుచువచ్చెనో యిప్పుడు నతఁ డంతియ సంతస మొందుచుండెను. కడుపునిండఁ గూడులేక కట్ట సరియైనగుడ్డ లేక తలదాచుటకుఁ దావులేక యరచేత ప్రాణములుంచుకొని యొకయడవినుండి యొక యడవికిఁ దిరుగునాసూరఖామణులవద్దఁ గనఁబడు పరస్పరప్రేమము గౌరవము వేఱొండుతావునఁ గనఁబడుట యరిది. అతనియనుచరు

లీకష్టములఁ బడుటకంటె ఢిల్లీచక్రవర్తికి లోఁబడితి మని యొక్క మాట నోట నుచ్చరించినఁ జాలు. వెంటనే వారి కేలుట కూళ్ళు, నడుపుటకు సేనలు, వహించుటకు బిరుదులు, గావలసినన్ని వచ్చి పడి యుండును; కాని యైశ్వర్యము రాని రాకపోనీ యన్న ముండనీ లేక పోనీ వా రామాటమాత్రమనరు. రాణా వారియెడదయగానున్నన్ని నాళ్ళు వారు వానియెడఁ గృతజ్ఞులై యుందురు ఈకష్టములకు నపాయములకుఁ దోడుగఁ బ్రతాపుని యాలుబిడ్డలు వానివద్దనే వనములలో నుండిరి. బంగరుతొట్లలో నూగవలసిన యామహారాజు చిన్నిపాపలు చెట్లకొమ్మలకు వ్రేలఁగట్టిన గుడ్డయుయ్యేలలలో నూగవలసి వచ్చె. ఒకప్పుడు మగవాఁడు యుద్ధములకుఁ బోయిన సమయమునను నాడువాండ్రు పగతురకు జంకి పొదలలోఁ దాఁగొన్న సమయమునను జిన్నబిడ్డలను బులులు దీసికొని పోకుండ బుట్టలలోఁ బెట్టి చెట్లకొనకొమ్మలకుఁ గట్టవలసివచ్చెను. ప్రతాపుఁడు గతించిన రెండువందల యేఁబదియేండ్ల తరువాత నసఁగా నేఁడు సయితము వనవాసులు ప్రతాపమహారాజు కునికిపట్లగుచెట్లను రాచబిడ్డ లుయ్యేలలూఁగిన కొమ్మలను జూపుదురు. శత్రుభీతిచేతఁ బలుమాఱు లాడవాండ్రు మగవాండ్రుఁ పరుగెత్తవలసి వచ్చుటచే నొకమాఱు ప్రతాపుఁడు తనబిడ్డలను దనతో తీసికొనిపోవుటకు వీలు లేకపోయెను. అప్పుడు భిల్లులు కొండఱు కనికరముఁ బూని యాశిశువులను గంపలలోఁ బెట్టి తీసికొనిపోయి తగరపుగనులలో దాఁచి శత్రువులు దాఁటిపోవునఱకు పాలుపోసి పెంచి మరల తలిదండ్రుల కప్పఁజెప్పిరి.

వీరిగతి యిట్లుండ నక్బరునకు లోఁబడిన రాజపుత్రులుసమస్త సంపదలు గలిగి సుఖపడుచుండిరి. చక్రవర్తిని శరణుజొచ్చిన రాజపుత్రులలో ముఖ్యులిరువురు గలరు. బికనీరుసంస్థాన ప్రభువుయొక్క నిరువురుకొడుకులు రాయసింగు పృథివిరాజు ననువారు. అక్బరు చక్ర

వర్తి యయ్యెరువుకు రాచకొమరులను గడుగౌరవమున నాదరించి యందు రాయసింగు కూఁతును దనకుమారుఁడగు జహంగీరునకిచ్చి పెండ్లిచేసెను. పృథివిరాజు మహావీరుఁడగుటయేగాక మంచికవియు నగుటచే రాజపుత్రులలో నెల్ల నతఁడగ్రగణ్యుఁడని యక్బరు వానిని శ్రద్ధయు సమ్మానించె. మానవతియు సౌందర్యవతియు ప్రతాపసోదరుఁడగు సూక్తసింహపుత్రికయు నగు నొకయువతి నాపృథివిరాజువివాహమయ్యెను.

అక్బరుచక్రవర్తి తన వినోదమునిమిత్తము, తన్నుఁ గొలుచువారి వినోదమునిమిత్తము, ప్రతిమాసము తన యంతిపురమున నొకసంత జరుపవలయునని యానతిచ్చె. చక్రవర్తి యాదరణమున జరుగుటంజేసి యాసంతకు విదేశములనుండియు స్వదేశమునుండియు వర్తకులభార్యలు వచ్చి విలువసరకుల నమ్మఁజూపుచు వచ్చిరి. చక్రవర్తిభార్యలు కొమార్తెలు వారి చెలికత్తెలు దాసీజనములు మంత్రులు సేనాపతులు మొదలగువారి భార్యలునచ్చి యాసంతలో దుకాణములు పెట్టి తాము స్వయముగఁ గుట్టి సిద్ధముచేసిన పట్టుదుస్తులు మొదలగువాని నమ్మవలయును. అమ్మకయున్న వర్తకుల భార్యలవద్దనుండి కొననైనఁ గొనవలయును. చక్రవర్తి యంతఃపురస్త్రీలు దుకాణములు పెట్టి యమ్ముటచే విలువలేనిసరకులకుసయితమమితిమీరిన వెల వచ్చుచుండెను. ఆసంతకు స్త్రీలేగాని పురుషులు రాఁగూడదు. చక్రవర్తి యప్పుడప్పుడు స్త్రీవలె మాఱువేసము వేసికొనియాసంతయొక్క వైభవమును జూచుచుండును. ఆసంగతులు వెల్లడియైనప్పుడు రాజపుత్రులు కోపించి చక్రవర్తి దురుద్దేశముతోడనే యాపని చేసెనని నమ్మిరికాని యక్బరు వివిధదేశములనుండి వచ్చిన వింతవింతసరకుల వెలలు నాణెములు స్వయముగఁ దెలసికొనుటకు వాణిజ్యము వృద్ధిచేయుటకు నటులు చేసెనేకాని చెడతలంపున నా

తావునకుఁ బోవలేదని మహమ్మదీయచరిత్రకారులు వ్రాసిరి. ఎట్లయి నను రాజపుత్రుల కీవిషయమున గట్టియవమాన ముండుటచేత వెనుక నక్బరునకు లోఁబడి రంతంబపుకోట నప్పగించినబూందీసంస్థానప్రభువు తన యాఁడువాండ్రను సంతకు రమ్మని బలవంతపెట్టకూడదనియొడం బడికలో స్పష్టముగ వ్రాయించెను.

ఈవింతసంతలో నొకమా అక్బరు తన వియ్యపురా లగు రాయసింగుభార్యను జూచెను. ఆచూపు నిక్కలి యనర్థకమును దెచ్చెను. ఆరాజు దృష్టితగిలిన కొలఁదికాలముననే రాయసింగుభార్య యమూల్యము లగుమణులను వెలలేని బంగారునగలను చక్రవర్తి వద్దనుండి తెచ్చుకొని కులుకుచుండె. మహాకవియగు పృథివిరాజు తన యన్నకుజరిగిన యీదారుణపరాభవము వర్ణించుచుగొన్ని పద్యములు వ్రాసి వాని యవస్థకు చాల దుఃఖించెను. ఇది యెఱింగియు బృథివి రాజుభార్య సంతజరిగినపు డెల్ల నంతఃపురమునకుఁబోక తప్పదయ్యెను. అట్లు పోవునపుడు డొకసారి యామె చక్రవర్తి దృష్టిపథమునం బడి యెను. పడినతోడనే యతఁ డామె జగన్మోహనాకారమును జూచి మోహపరవశుఁ డయ్యెను.

ఆమె సంతలో తనకుఁ గావలసిన సరకులనెల్లఁ గొని చీఁకటి పడినవెనుకఁ దనమందిరమున కరుఁగదలఁచి నిర్జనములగు గదులు దాఁటి పలుచిక్కుదారులం బడి చనుచుండ గొంతదవ్వరుగునప్పటికి యెట్టయెదుట నొకమనుష్యుఁడు దారికడ్డముగనిలిచెను. ఆమనుష్యుని చూడఁగనే యతఁ డెవ్వఁడో, యేలవచ్చెనో యామె తక్షణమెగ్రహిం చెను. చక్రవర్తి మానభంగము చేయఁదలఁచి యెదుట నిలిచినపుడు రాత్రి చేతనాయుధమైన లేక నొంటికత్తెయగునాడుది యేమిచేయఁ గలదు? బప్పరావులవంశపు మొలకయగు నీమానవతి తన తోడ్కొ డలువంటిది కాదుగనుక వెంటనే ధైర్యము దెచ్చుకొని యసహాయ

రాలగు తనకుఁ దోడుపడి మరణముకంటె దారుణమగు నీపరాభవ మును దప్పించు మని తన యిష్ట దేవతను వేఁడుకొనెను. ఆ దేవియుభక్తు రాలిమొఱ నాలకించి పులివాహనమెక్కి వచ్చి ప్రత్యక్షమైయొకఖడ్గ మును రాజపుత్రికకిచ్చి యంతర్హిత యయ్యెనఁట. ఆకత్తి చేఁబూని యావీరపత్ని డేఁగపగిది చివాలున చక్రవర్తిపై దుమికి యతఁడు మరల నామెను గొట్టఁ బ్రయత్నింపకమునుపే ఖడ్గము వాని కంఠ ముపై మోపి మరల దయఁదలచి యతనితో నిట్లనియె. “నీవు బ్రతుకఁదలఁతువేని యిఁకముం దెన్నఁడు రాజపుత్రస్త్రీకి మానభం గము చేయ నని ప్రమాణము సేయుము.” ఆపలుకులు విని యక్బరు చక్రవర్తియట్లే ప్రమాణముచేసి గండము తప్పించుకొని చల్లఁగ నావలకుఁబోయెను. రాజపుత్రికయు మానరక్షణముఁ జేసికొనఁగలిగె నని సంతసించి గృహమునకుఁ బోయెను.

అనంతర మొకనాఁడు చక్రవర్తి పృథివిరాజును పిలువనంపి యొకయుత్తరమును జేతికిచ్చి చదువుమనియె. ఆయుత్తరము ప్రతాప మహారాజు తనపై ననుగ్రహము చూపవలసిన దని చక్రవర్తిని వేడు కొనుచు వ్రాసెను. పృథివిరాజు కాలవశమున ఢిల్లీచక్రవర్తికి లోఁబ డవలసి వచ్చినను వానిమనసునఁ బ్రతాపునిపై నతిగౌరవ ముండెను. చక్రవర్తికొలువులోనున్న మహాకవులు మహాశూరులు సైతమునంప దలను సౌఖ్యములను రోసి యాకులలములదినుచు వనముల వసియిం చుచు వీరధర్మము నడపుచు నామాహాశూరునియందే గౌరవముగలిగి యుండిరి. చక్రవర్తులిచ్చు నైశ్వర్యముమాన్యములుమన్ననలునశించు నుగాని కీర్తి నశించదుగదా రాజపుత్రరక్తముగల పృథ్వీరాజుదృష్టికి తురక చక్రవర్తి కెన్నఁడు తలవంచి సలాముచేయని ప్రతాపుఁడు దేవుఁడువలెఁ గనబడుటఁజేసి ప్రతాపుడు లోఁబడెనా ప్రపంచమంత ము గావలసిన దే యని యతఁడు నమ్మచు వచ్చెను. పృథివిరాజా

యుత్తరముఁ జదివి క్రిందఁబెట్టుచుండ "నీయభిప్రాయ మేమి? అతఁడు లోఁబడునా" యని చక్రవర్తి యడిగెను. పృథివిరాజు కోపవిషాద ములు మొగమునఁ దేటపడ "అతనిని నే నెఱుంగుదును. అతఁడు దీనిని వ్రాసినట్టు నమ్మను శత్రు లెవ్వరో వానిపేరుపెట్టి యిట్లువ్రాసి యుందురు. ఈరాజ్యమంతయు ధారవోసిన నతఁడు లోఁబడువాఁడు కాఁడు. అయిన నతఁడు లోఁబడదలఁచుకొనునేమో వానికి వ్రాసి కనుఁగొనియెద." నని ప్రత్యుత్తర మిచ్చెను.

నిజస్థితి యేమన నొకనాఁడు ప్రతాపుఁడు మహాకష్టములో నుండి నిరుత్సాహుఁడై యాజాబు చక్రవర్తికి వ్రాసెను. ఆయేటి కాయేఁడు గడచుచున్న దన్నమాటయేగానియతనికష్టముమాత్రము గడువక యంతకంత కెక్కువకాసాగెను. అతని నమ్ముకొనిన యను చరులు కష్టములచేతనో గాయములచేతనో క్రమక్రమముగ నంత రించిరి. శత్రువులుమాత్రము విసుగులేక వారిని బాధించుచునే యుం డిరి. వేటకాండ్రపగిది పగవాండ్రు వెనువెంట నంటి తఱుముచుండు టంజేసి యొకనాఁడు వారైదుసారు లన్నము వండుకొని యైదుసారు లు దినుటకు వీలులేక విడిచి ప్రాణభీతిం బఱచిరి. ఒకసారి ప్రతాపుం డడవిలో నొకచెట్టుక్రిందఁగూరుచుండ చిన్నకూఁతు రేడుపు వానికి వినఁబడె. తల్లి యాపిల్లకుఁ దినుమని యొకరొట్టె యిచ్చెను. ఆబిడ్డ సగముదిని యాఁకలి పూర్ణముగదీరకున్ననురాత్రికుండదను భయము న తక్కినసగమును దాఁచుకొనెను. అంతట నొక మానుపిల్లి చెట్టు మీఁదనుండి దిగివచ్చి యాసగమురొట్టె నెత్తుకొనిపోవ బాలిక వెక్కి వెక్కి యేడ్చెను. అదివఱకెన్నికష్టముల కైనఁగరుగని ప్రతాపునిమన సాచిన్నబిడ్డయేడ్పులతోఁ గరిగినీరైపోయెను. "నామట్టుకు నేను సకల సౌఖ్యములను రాజ్యవైభవమును విడిచి యీవఱకుఁబడినట్లే యెంత కాలమైనను గష్టములఁ బడఁగలను; కాని దారపుత్రాదులను నానిమి

త్తము సుఖములను జుట్టములను బాసి వచ్చినమిత్రులను బాధపెట్టి చంపుటన్యాయము కాదు. వారంద ఱింతవఱకు నభిమానమునిమిత్తము పడవలసినన్ని కష్టములను బడినవారు. పరువుగల వీరులంద రింతకు మున్నె చక్రవర్తికిలోబడియుండ నే నిప్పుడు లోఁబడుటతప్పుగా” దని తనలో తానువిచారించి ప్రతాపుఁడు తాను లోఁబడుదునని చక్రవర్తి కాయుత్తరమును వ్రాసి పంపెను.

ఎట్టకేలకు ఢిల్లీనుండి యుత్తరము పట్టుకొని యొకదూత వచ్చెను. కాని ప్రతాపుఁడు సకుటుంబముగ ఢిల్లీకివచ్చి చక్రవర్తి సింహాసనమున కెదుట మ్రొక్కవలయు నని యాయుత్తరమందు లేదు. ఆజాబు పృథివిరాజే వ్రాసెను. అతఁడు మంచికవి యగుటచే దనవిచారము విస్మయము రసవంతము లగు పద్యములుగ వ్రాసి యాలేఖలోఁ బంపెను. అందుల సంగతు లిట్లున్నవి. “హిందువుల కష్టసుఖములకు హిందువులే తోడుపడవలయును. అయినను రాణా యిప్పుడు వారిని విడుచు చున్నాఁడు ప్రతాపుఁడు లోఁబడెనేని యక్బరు రాజపుత్రుల నందఱిహీనముగఁజూచు. ఈవఱకే మనలో మగవారు శౌర్యధనమును ఆడువారు మానధనమును గోల్పోయిరి. అక్బరు మనజాతివారిని వెలకుఁగొను, సర్తకుఁడై యుదయపురాధీశుని దక్కఁ దక్కినవారిని క్రయమునకుం దీసికొనియె. నిజమయిన రాజపుత్రుఁడు గౌరవము నమ్ముకొనునా. అయిన నెందరీవరకు విక్రయించిరో మీరె యెఱుంగుదురు. ఉదయపురముఁగూడ నిపుడీబజారునకు వచ్చునా? ప్రతాపుడు తన సర్వధనములఁ గోల్పడినను మానధనమును మాత్రము నిలుపుకొనియె నని మేము తలంచు చున్నాము. ఆశ లడుగంటుటచేత రాజపుత్రులీవిధమున నొకనికిఁ జేమొగ్గిరి. అట్టి యవమానముపాలఁ బడకుండ హమీరుని వంశస్థుఁ డొక్కఁడే యిప్పటికి మానము దక్కించుకొనియున్నాఁడుప్రతాపుని

కెక్కడనుండి సహాయము వచ్చు చున్నదని లోకు లందఱు విస్మయ మందుచున్నారు. వానియభిమానము వానిఖడ్గము వానికి సహాయము లగుచున్నవి. వానిధైర్యముఁ జూచుకొనియే యతఁ డింతకాలము రాజపుత్రులపేరు నిలువఁబెట్టె. వీరపురుషులను క్రయమునకుఁ గొను నీవర్తకుఁ డెప్పటికైనఁ గడతేరకపోఁడు. మనుష్యు డెల్లకాలము జీవించునా? అప్పుడు మనరాజపుత్రులందఱు నిస్సారము లగుతమ హృదయక్షేత్రముల మీఁద దేశాభిమానబీజములను జల్లుమని యుద యపురాధీశ్వరునివద్దకు వత్తురు. అభిమానము నిలుపవలసినదనియు మునుపటికన్న మెఱయునట్లుఁ జేయుమనియు రాజపుత్రులందఱు వేఁడుచున్నారు.

ఈయుత్తరముఁ జదువుకొన్నపిదపఁ బ్రతాపుఁడుచక్రవర్తితో సంధిచేసుకొను తలంపు మానుకొనెను. తనస్వజన మంతయుఁ దన మీఁదనే యాసలు పెట్టుకొని యున్నవారు గావున వారియాస లడు గంట జేయఁగూడదని యేమయినఁగాని నేను లోఁబడ ననియతఁడు నిశ్చయించుకొనెను. ప్రస్తుతస్థితినిబట్టి చిత్తూరు మరలఁ బట్టుకొను టకు వీలులేదని గ్రహించి యతఁడు మీవారురాజ్యమును విడిచి తురకలబాధ లేని మఱియే దేశాంతరమునకైనఁ బోయి తన్ను నమ్ముకొనబంట్లతోఁ గలసి క్రొత్తరాజ్యమును స్థాపించి యచ్చట సుఖింపఁ దలఁచుకొనియెను.

మొగలాయీలకు మూలపురుషుఁడును రాజపుత్రులకుమహా శత్రువు నగు బేబరు తనపితార్జితమగుసమర్కందువిడిచికాబూలు రాజ్యము స్థాపించి యటనుండి మరల పగతురచేఁ దరుమఁబడి ఢిల్లీ రాజధానిం జేసికొని తనవంటివారికి మార్గదర్శి యయ్యెనని జ్ఞప్తికి దెచ్చుకొని ప్రతాపుఁడు తనతలంపు నెరవేర్పఁ దలఁచెను. రాణా సింధునదీపరిసరభూములకుఁ బోయి కాఁపురముండు ననియువానితో

నెవ్వరెవ్వరు పోయి వాని సుఖదుఃఖముల ననుభవింపఁ దలఁచిరో వా రందఱు బయలుదేఱవలయు ననియు మీవారెల్ల మోగి గజొచ్చెను. అప్పుడనేకులు రాణా ననుసరింపఁ దలంచిరి. వారినందఱం దీసికొని ప్రతాపసింగు కొండలు దిగి యడవులు దాటి సింధుదేశపు టెడారి మొగకు వచ్చెను. అక్కడ విడిసియుండ 'భామసా' యను నతనివద్ద నుండి యొకరాయబారి రాణాకడకు వచ్చెను భామసాయు వాని పూర్వులు పలుతరములవారు మీవారురాజులవద్ద మంత్రులైయుండి యితింత యనరానిధనమును గణించిరి. అప్పుడు భామసావద్ద నిరు వదియైదువేల సైనికులకు పండ్రెండుసంవత్సరములవఱకు నెంతధనము కావలయునో యంతధన మింట మూలుగుచుండెను. ఆవచ్చిన రాయ బారి ప్రతాపుని దర్శనము చేసి భామసా కావలసిన ధనమంతయు నీయఁదలఁచుకొన్నాఁ డనియు పాఱిపోవక మీవారుదేశముయొక్క ప్రతిష్ఠను నిలువబెట్టుటకు మఱియొకమాఱు యుద్ధప్రయత్నముఁ జేయఁదగు ననియుఁ బ్రార్థించెను.

ప్రతాపుఁడు దేశమును విడిచిపోయె నని విని చక్రవర్తి సైని కులు సంతసించి యతఁడు సింధుదేశపు టెడారిలో నెక్కడనో త్రాగ నీరులేక వడఁగొట్టి చచ్చియుండు నని నమ్మి కోటలలోను పట్టణముల లోను మిక్కిలి యశ్రద్ధగా నుండిరి. అటులుండ నాకస్మికముగఁ బ్రతాపుఁడు వచ్చి పడెపడె నని యడవులఁ గొండల గొప్పవాడుక పుట్టెను. పుట్టినోడనె ప్రతాపుని సైన్యము నడచినదారి యంతయు పీనుఁగుపెంటయై యతఁడు వచ్చిన యానవాలుఁ జూపెను.

మీవారుదేశమునఁ జక్రవర్తికి స్వాధీనమయిన భాగమంత యుఁ బ్రతాపుఁడు నాశనముచేసెను. ఇది ప్రారంభించిన సంవత్సర ములోపుననే యజమీరు చిత్తూరునుదక్క తక్కిన మీవారుదేశము రాణాస్వాధీన మయ్యెను. ఇట్లయినపిదపఁ గొంతశాంతి నొంది ప్రతా

పుఁడు తన ప్రాఁతపగతుఁడగు మానసింగుమీఁదఁగల యక్కసుఁ దీర్చుకొనఁదలఁచి యాతని రాజ్యమందలి ముఖ్యవర్తకస్థానముం గొల్లగొని యపారమగు ద్రోపుడుధనమును మీవారుపనకుఁ దరలించుకొనిపోయెను.

పరాభవము నొందిన మానసింగునకుఁ దప్పఁ దక్కిన రాజపుత్రుల కంతఅకు రాణామీఁద మహాభిమాన ముండుటచే నక్బరునాతని నేమియుం జేయఁజాలఁ డయ్యె- దానికిం దోడుగాఁ గొన్నిజిల్లాలు చక్రివర్తి యధికారమును దిరస్కరించెను. అదిగాక యక్బరునకు వార్ధకావస్థవచ్చెను. ఆసమయంబున గృహకలహములు గూడ నెక్కువయ్యెను. అతని కొడుకులలో నిద్దఱు తెగత్రాగి యొడలు తెలియక చచ్చిరి. జ్యేష్ఠకుమారుఁ డగు సలీము (జహాంగీరు) తండ్రిని ధిక్కరించి గృహము విడిచిపోవుటయేగాక తండ్రికిఁ బ్రాణమిత్రుఁడు, మహాపండితుఁడు, సజ్జనుఁడు నగు నబులుఫెజ లనువానిని నిష్కారణముగఁ జంపించెను. ఈగృహచ్ఛిద్రములచే మనోవైకల్యము నంది యక్బరు రాజస్థానవ్యవహారములను మునుపటియట్ల శ్రద్ధగా జూచుట మానెను.

అయిన నక్బరుచక్రివర్తియె ప్రితాపుఁనికన్న నెక్కుడుకాలము బ్రితికెను. ప్రితాపుఁడు బహుకష్టములఁ బడి చీమునెత్తురు శత్రువులకు ధారవోయుటచే నకాలమరణము నందె ముసలివాఁడై త్వరగ మృతినొందెను. ఎంతశ్రమపడినను ప్రతాపుఁడు చిత్తూరును పట్టుకొనఁ జాలఁడయ్యెను. తనకొడు కగు నుమార్రి యప్రయోజకుఁ డగుటచే ముందుముం దానగరును బట్టుకొనునాశయు విడచెను. చిత్తూరు పట్టుకొనక తనరాజధానిం బ్రివేశింపఁగూడ దని యతఁడు ప్రితినఁజేసినందున నుదయపురసరోవరము చెంతఁ దాను నిర్మించుకొన్న గుడిసెలోనే యామరణాంతము వసించెను.

అడవులలో గాయయు పండ్లు తిని పగతురతో యుద్ధములుచేసినంత కాలము ప్రితాపుఁ డేయాయాసము నెఱుఁగడు గాని కష్టములు గడపి యిల్లు చేరిన పిదప వాని దేహము క్రిమక్రిమముగ దుర్బలమై రోగభూయిష్ట మయ్యెను. వ్యాధి యంతకంత కెక్కువకాఁగా రాణాకు మరణసమయ మాసన్నమయిన దని బంధుమిత్రులందఱు చుట్టుం జేరిరి. అతఁడు మరణవేదనఁ బడుచు నోటిలో నేదియో గొణుగుకొనుచుండ నది చందాతువంశస్థుఁడు విని దగ్గఱకుఁ బోయి "నీప్రాణము సుఖముగా పోకపోవుటకు నీ కున్న విచారమేమి?" యని యడిగెను. ప్రితాపుఁ డాసీరసములోనే కొంచె మోపికఁ దెచ్చుకొని మెల్లన నిట్లనియె. "నాయనా! మీరు కంఠములో ప్రాణములుండగా మన రాజ్యమును తురకవానికి లోఁబఱచ మని నాచేతిలో చేయివేసి ప్రమాణము చేయువఱకును నాప్రాణము పోదు. ఆమాట శ్రవణానందముగా విని పోవలె నని యున్నది" అని చెప్పి తనకొడుకును గూర్చి వెండియు నిట్లనియె. "ఉమ్రా నావలె నీ చిన్నగుడిసెలోఁ గాపురము సేయనొల్లఁడు. ఈపర్ణశాలలు పీకి యిచ్చోట వాఁడు పెద్దపెద్దభవనములు కట్టును. అటుపిమ్మట నతిసుకుమారుఁడై కూర్చున్నచోటనుండి లేవలేకపోవును. మననెత్తురు ధారవోసి మనము సంపాదించిన యీమీవారు దేశమును వాఁడు సుఖము మరఁగి నిష్కారణముగ గోల్పోవును."

మరణమునకుసిద్ధముగ నున్నయీ మహారాజు మాటలువిని రాజబంధువులు నైకకంఠ్యముగ నిట్లనిరి. "చిత్తూరు మరలఁ బట్టుకొనువఱకు మీవారునకు సంపూర్ణస్వాతంత్ర్యము వచ్చువఱకుయీ గుడిసెగుడిసెప్రాశమున నే యుండునుగాని యచటి మేడలుగీడలు కట్టము. మేము మీగద్దెయానగాఁ బ్రమాణముఁ జేయుదుము. ఉమ్రా కూడ మీయాన దప్పకుండు నటుల నడిపించెదము."

ఈమాటలు వెడలినతోడనే రాణా వెనుకకు పడిపోయి ప్రాణములు విడిచెను. ప్రతాపసింగు రమారమి యిరువదియాఱు సంవత్సరములు మీవారురాణా యైయుండెను, కాని యాకాలమున స్వల్పభాగమే రాజ్యపాలనమందును విశేషభాగము కష్టములఁబడి యుద్ధములు చేయుటయందును జరుపఁబడెను.

---

# షోడశ రాజకుమార చరిత్ర

తనకుమారునివిషయమై రాణాప్రతాపుఁ డనుకొన్నదంతయు నిశ్చయమయ్యెను. ప్రతాపునిశరీరము దహనమయినతోడనే వానిపుత్రులు మంత్రులు సామంతులు వాని చెప్పినమాటలుమరచిరి. పెద్దకొడు కగునుమ్రా సింహాసన మెక్కెను. కాని యతఁడు బాల్యమునుండియుఁ గడుపునిండఁ గూడు కంటినిండ నిదురయు లేక కష్టపడుచు నడవులఁ జరియించుటచే రాజ్యప్రాప్తి యయినపిదప నింటిపట్టున నుండి సుఖపడఁదలఁచి భోగపరాయణుఁడై వీరకర్మములు మఱచెను. అదియునుఁగాక నిరంతరము రణకేళిఁ బురికొల్పు తండ్రిలేకపోవుటచే చక్రవర్తి యంతవానితోఁ దనవంటియల్పుఁడు వైరముగొనుట యనుచిత మని యుమ్రా కయ్యమును మానుకొనెను.

ప్రతాపుని మరణానంతరము ఉమ్రా మున్ను తండ్రినిర్మించుకొన్న కుటీరము తీసివైచి స్ఫటికపురాళ్ళతో నొకదివ్యమందిరము గట్టించి యందు హంసతూలికాతల్పంబులం బొరలుచు వేశ్యాంగనల యాటపాటలం జొక్కుచు నిలువుటద్దములలోఁ దనముద్దియల చెలువంబునుగనుంగొని మురియుచు విషయాసక్తుఁడయి లోకంబు మఱచి

కొంతకాలము బుచ్చె. అటులుండ నట ఢిలీపురమున 1605 వ సంవత్సరమున నక్బరుచక్రవర్తి మృతినొందెను. అనంతరము వానికొడుకులలో హతశేషుఁడగు సలీము జహంగీరు బిరుదుతో సింహాసనమెక్కెను. జహంగీరన జగమంతయు గెల్చినవాఁడని యర్థము. అతఁడక్బరునకు రాజపుత్రస్త్రీ వలన కలిగినకొడుకగుటచే హిందువులయెడఁ గొంతయభిమానము గలదు; కాని యతఁడు వట్టితాగుబోతు. హిందువులమీఁద నెంత యభిమానమున్నను తనయధికారము నిరాకరించు రాజపుత్రుల బంటుదనము సహింపనివాఁడగుటచే జహంగీరు తండ్రిపోయిన కొన్నినాళ్ళకే యొకసేనగూర్చి యుమ్రామీఁదికిఁ బంపెను.

మొగలాయిసేనలను జూచినతోడనే రాజపుత్రులకుఁ గోపాగ్ని మరలఁ గొంచెము ప్రజ్వరిల్లెను. ఆమహావీరులందఱుక్రొత్తగానభ్యాసము చేసికొన్న భోగములను విడిచిపెట్టి వీరరసశోభితులై పగతుర జంపుటయో తాము దెగటారుటయో కావలయు నని నిశ్చయించుకొని గుఱ్ఱములనెక్కి మహారాణా యగు నుమ్రాకడకుఁ జని తమకు సేనాధిపత్యముజేయు మని వాని నడిగిరి. ఆసూరులు వచ్చునప్పటికుమ్రా మేనొత్తనిమెత్తని పాన్పులం బవ్వళించి వారివిన్నపములఁ జిత్తగించి వారి కిట్లనియె. "నేను నూగుమీసముల వయసునాఁడే మహాయుద్ధముఁ జేసి విసిగియుంటి. చక్రవర్తితోఁ బోరుట మన నాశము గోరుట కావున యిపుడయిన బుద్ధిగలిగి వైరము మానుకొనుట యుచితము."

అప్పలుకులు చెవులఁబడుటయు రాజపుత్రవీరులు తెల్లఁబోయి యొండొరుల మొగంబులు చూచుకొని లోలోపల గొణుగుకొనుచుండ నపుడు చందావతువంశజుఁడగు శలుంబ్రా కర్తవ్యము మోచించి యూరకొనిన గార్యము చెడునని యొకసాహసము చేసెను.

రాణా యున్న మేడమీఁద విలువగల రత్నకంబళములు పరుపఁబడి యుండెను. ఆకంబళముపై పరషుచేసి యాబట్టలు కదలకుండ కొనల నిత్తడిగుండ్లెత్తిపెట్టి యుంచిరి. శలుంబ్రా యాయిత్తడిగుండ్లలో నొక టి తీసికొని రాణా కెదురుగా నున్న పెద్దనిలువుటద్దముపయి విసరెను దోడనే యాదర్పణము వేయితునకలయి పడియె. పిమ్మట శలుంబ్రా సాటిరాజపుత్రులఁజూచి వీరులారా! గుఱ్ఱము లెక్కుఁడెక్కుఁడని పురిగొ ల్పి రాణాచేయిపట్టుకొని పాన్పునుండి బలవంతముగ లేవఁదీసి యత ని యిష్టములేకయే "గుఱ్ఱ మెక్కు మెక్కు" మని బరబర లాగికొనిపోవఁ జొచ్చెను. శలుంబ్రాయొక్క మొంఢితనమునకు మహారాణా కడు కిన్కఁబూని "వీఁడు రాజద్రోహి రాజద్రోహి" యని యఱచుచు వానిచేతినుండి వదలుకొనుటకు గిజగిజ తన్నుకొనఁజొచ్చెను. కాని సా టిసామంతు లందఱు శలుంబ్రాపక్షము బూనుటచే వానిరోదన మర ణ్యరోదనము కాఁగా నతఁడు కోపము పట్టఁజాలక రోషము వావిడిచి యేడ్వసాగెను. అతం డేమిచేసినను లెక్కసేయక శలుంబ్రా రాణా ను గుఱ్ఱముమీఁద గూలవేసి నడిపించుకొనిపోఁ జొచ్చె.

అట్లు గొంతదూరము చనినపిదప నుమారి కోప మణచుకొని యేమువుమాని యందఱియెడలఁ బ్రిసన్నుఁడయి వారివందనములందు కొని శలుంబ్రాను బిలిచి "నీవు మంచిపని చేసితివి. నీమోటతనము చేతనే నాకిప్పుడు బుద్ధివచ్చినది. లేనిచో నప్రతిష్ఠ పాలయిపోవుదును గదా? ఇదెచూడు నాదెబ్బ మీపూర్వపురాణా చేసినంతపనిచేసెద" నని వీరాలాపము లాడుచు సంగరమునకు సైనికులఁ దోడ్కొనిపోయె.

అవ్విధంబున నుమారి పౌరుషోక్తులు పల్కుటచేత రాజపుత్ర సైనికుల కుత్సాహము పొంగిపొరలెను. ఆయుత్సాహముతో రణ మునకుఁ జని వారు తురకసేనల నవలీలగా నోడించిరి. ఓడిపోవుటచే మఱింతపౌరుషము తెచ్చుకొని యెట్లయిన రాజపుత్రుల నోడింపవలె

నని చక్రవర్తి యుమ్రామీఁదికి రెండేండ్ల తరువాత మఱియొక సేన నంపెను. ఈ సేనయు వెనుకటి సేనగతినే పొందవలసి వచ్చెను. అందుచే జహంగీరు రోసముఁజెంది మోసముచేత రాజపుత్రుల జయింపవలె ననియెంచి చిత్తూరుపురమన్న రాజపుత్రులకు మిక్కిలి ప్రేమయనియు దానినిమిత్త మెందరెందరో ప్రాణములను విడిచిరనియు నెవ్వఁగిన వాఁడు దానికి వానిని రాణానుజేసి యేలుకొమ్మనియె. ఈసూగ్రుఁడు ప్రతాపుని తమ్ముఁడు. ఈతఁ డన్నతోఁ గలహించి దేశద్రోహి యయి ఢిల్లీచక్రవర్తిని గొలువఁబోయిన నాఁటనుండియు నచ్చటనే యుండెను.

సూగ్రా పాడుబడిన చిత్తూరులో రాజ్యముచేయుటవల్ల కాటిలో రాజ్యముచేయుటగా భావించెను. పాడుపడిన దేవాలయములలోను దిబ్బలయిన మేడలలోను వానికంటికి దయ్యములు భూతములు దేవతలు నప్పుడప్పుడు కనఁబడుచున్నట్లు దోఁచెను. తురక బంట్ల సాయముతోఁ దనపూర్వుల పట్టణము నేలుటకు వచ్చిన యావీరునకు వీరరసము జారి వెనుకటిసంగతులు జ్ఞప్తికివచ్చి భయము క్రమ్మకొచ్చెను ఎంతకాలమతఁ డక్కడ వేచియున్నను తనవెంటవచ్చిన తురకబంట్లఁ దానను దప్ప దేశస్థులు బంధువులు నెవ్వరు నచ్చటికి రారయిరి. అట్లుండగా నొకనాఁడు పురదేవత వానికిఁ గనఁబడి వాని నచ్చోటు విడిచిపొమ్మని యాజ్ఞాపించెను. అందుచే నతఁడు కడువెఱచి యచ్చట నుండఁజాలక నగరమును స్వాధీనము చేసికొనవలసినదని యుమ్రాకు వర్తమానమంపి వాని భటులకుఁ గోట నప్పగించి యాతఁడు ఢిల్లీకిఁ బోయెను. చక్రవర్తి వానిపై నలిగి యేల వచ్చితివని యడుగ నతఁ డామాటకుత్తరముచెప్పక యొరలోనుండి కత్తి యూడఁబెరికిపొడుచుకొని చచ్చెను. చేసిన రాజద్రోహమునకు నాత్మహత్యకు వానిని హిందువులు తురకలు నేకగ్రీవముగ నిందించిరి.

చిత్తూరు దొరకుటచే రాజపుత్రుల కుత్సాహము మఱింత హెచ్చెను. పాడుపడి యుండుటచేఁ జిత్తూరు రాజపుత్రులకంత ప్రయోజనకారి కానందున నక్బరు వెంటనే దానిని మెప్పటియ ట్లడవిమృగములకు విడిచిపెట్టి యప్పటికిని మొగలాయీల స్వాధీనములోనుండిన ప్రధానములగు దుర్గములఁ గొన్నిటిని బట్టుకొనఁ దలంచెను.

అట్లు యుద్ధసన్నాహము సేయుచుండ వానికి బదునార్గురు రాజకుమారులు వచ్చి తోడ్పడిరి. ఆకుమారులచరిత్ర యీక్రింద సంగ్రహముగా వ్రాయుచున్నాము. కలఁడుగదా ప్రతాపసింగునకు సూక్తుఁడను సోదరుఁడొకఁడు. అతఁడును దేశద్రోహి యయి తురకలలోఁ గలిసి యన్నతో యుద్ధము చేసి హల్దిఘాటు యుద్ధములోఁ బ్రతాపుఁడు పారిపోవుచుండ వానిఁ దరుముకొనిపోయి యెట్టకేలకు సోదరునిప్రాణములు కాపాడెను. అతఁడు తనకడపటిదినముల చక్రవర్తిని విడిచి భింసురాకోటలో గడపెను. చనిపోవునప్పటి కతనికిఁ బదునేడుగురు కుమారు లుండిరి. అతఁడు మృతినొందినతోడనె పెద్దకొడుకు భాంజీ యనునతఁడు తమ్ములను వంచింపఁ దలఁచి వారిం జూచి "నేను కోటఁ గాచుచు నిక్కడ నుండెదను. మీరుపోయి నాయనగారి కుత్తరక్రియలు సేయుఁ" డని చెప్పెను. అన్నమాటలు నమ్మి వారంద ఱవలకుం జని తండ్రి కగ్నిసంస్కారము నుత్తరక్రియలను చేసి మైల వెళ్లినవెనుక మరలఁ గోట కరుగ భాంజీవారిని లోపలికి రానీయక కోటతలుపులు వేయించి యందఱను బోషించుటకుఁ దనకు శక్తి చాలదు గావున వేరొకతావునకుం బోయి యెవరి పొట్ట వారు పోసికొండని యానతిచ్చెను.

షోడశ రాజకుమారులు సోదరునాజ్ఞ శిరసావహించి తమయాయుధములను తమ గుఱ్ఱములం దమకిచ్చినచోఁ దొలఁగిపోదుమని చెప్పిరి. భాంజీ సరే యని వాని నీయ వారందఱు విదేశములకుబయలు

చేరి తమలో నొకఁడగు యచలుని సేనాపతిగఁ జేసికొని మహాబలశా లియగు బలుఁడనువానిని రెండవ సేనాధిపతిగఁ నియమించుకొనిచనిరి.

ఆసోదరు లట్లు బయలుదేరి మీావారునకు దక్షిణమున రహతూ గువంశస్థుల పాలనములోనున్న మేడూరుగ్రామమునకుఁ బోవ సమ కట్టిరిగాని పయనము తుదముట్టకమునుపే యచలునిభార్యప్రసవవేదన పడ నారంభింప వారందఱు మఱుగుతావు వెదుక నారంభించిరి. అత్త రివర్షము విరామము లేక దిమ్మరించెను. ఎంత వెదకినను వారికి గో ప్పాదమంత చోటయిన నాయాపచ్ఛమయమందు దొరకకపోవుటచే నెట్టకేలకు వారొక పాడుదేవాలయమును గనిపెట్టి కొంచెము బాగు చేసి యామెను దానియందుఁ బరివేశ పెట్టిరి.

ఆజడివానకు నానినాని యాగుడి రాతిదూల మొకటి జారి యామెపై బడుటకు సిద్ధముగ నుండ దైవవశమున బలుఁడు దానినిఁ జూచి వెంటనే యత్తావున కరిగి తనతల బోటుపెట్టి రాయి పడకుండఁ జేసెను. ఇంతలో నచలుఁడు మొదలగుసోదరు లాస్థితిఁజూచి చేరువ చెట్టునరికి దానిందెచ్చి బోటుపెట్టి భీమబలుండగుబలు నీవలకులాగిరి.

ఆరాత్రి యచలునిభార్య యాపాడుగుడిలో నొకకుమారుని గనియెను. ఏదోభాగ్యము గల్గునని పుట్టెడాశతో వారు పోవుచుం డుటచే నపుడు గల్గిన యాబిడ్డకు వారాశుఁడని పేరుపెట్టిరి. అనంతర మాసోదరులు యీాడూరుగ్రామమునకుం జన నాపురాధీశుఁడు వారి నాదరించి తగినబసలు మాన్యములు నిచ్చెను. అక్కడవారు సుఖము గ కాలక్షేపము సేయుచుండ నొకనాఁడు మీావారు దేశపుమంత్రియా దారిం బోవుచు భార్యాసమేతుఁడయి యాయూరుబయటగుడారము లో విడిసెను. అప్పుడు పెద్దగాలి వానసంభవింప దానిచే గుడారము లెగిరిపోవసాగెను. మంత్రియు భార్యయు నిలువనీడలేక యిబ్బంది ప డుచుండ బలుఁడు నచలుఁడు వారిదుస్థితి విని తొల్లి తాము నట్టిదుర

వస్థనే బడియుంటిమనుమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని వారిం దమయింటికిఁ బిలుచుకొనివచ్చి యుపచారముచేసి యాదరించిరి.

ఆమంత్రియు వారియాదరణంబునకు మహానందభరితుఁడయి వారినందఱఁ దనతో నుదయపురమునకు రమ్మనియువచ్చినచో రాణా వద్దఁ దగినయుద్యోగము లిప్పింతుననియు వారియన్న యగు భాంజీ మఱియొకలా గనుకొనకుండ తాను సర్దిచెప్పెదు ననియు నొక్కి చెప్పెను. కాని యచలుఁడు వానిమాటల కీయకొనక పిలువని పేరంటముగ పోయినచో లోకువ యగునని స్వగౌరవము కాపాడుకొనఁదలచి మా జ్ఞాతి యగు రాణా వర్తమానమంపినచో వత్తుమనియు లేనిచో నచ్చటనే యుందు మనియుఁ జెప్పెను.

మీవారు రాణా ఢిల్లీచక్రవర్తిపై కప్పము పోవయత్నించుచుండ మంత్రి సూక్తుని కొడుకులఁగైకొని యాపదునాల్గురనచ్చటికి రావించెను. అంతకుమున్నె సూక్తవంశమునం దగ్రిగణ్యుఁ డగు భాంజీ రాణాకుఁ దోడుసూపుట కచ్చటికి వచ్చియుండెను. అతఁడందఱికన్నఁ బెద్దవాఁడైనను వానిమాట సరకుసేయక యెల్లవారును వానితమ్ములయందే యనురక్తులయిరి. మహాసాహసుఁ డగుబలుఁడు శూరులగు తన సోదరులు కడు విధేయులయి పనులు సేయుటచే రాణాకు వారియందే యనుగ్రహ ముండెను. అందు ముఖ్యముగ బలుఁడు రాజానుగ్రహపాత్రుఁడు, రాత్రులు మంచు గురిసెనా వెంటనే బలుఁడు చెట్లునరికి రాణాకొఱకు నెగళ్ళువేయును. సేనలు తుపాకలలో దలపడెనా పగతురం బారదోలుటలో మొదటివాఁడయి యాబలుఁడే యొడలెఱుంగక యుద్ధము సేయును. అట్లాడలు దాఁచుకొనక పని సేయు నాషోడశరాజకుమారులమీఁద నింతింత యనరాని యనుగ్రహము గల్గి సంతోషపరవశుఁడయి రాణా యొకనాఁడు తన సేన లీక ముందు యుద్ధమునకుఁ బోవునప్పుడెల్ల యాషూ కనతులే సేనలనునడ

పవలసినదని శాసించెను. ఇది రాజపుత్రులకు రాణా చేసెడి గౌరవ ములలో మిక్కిలి గొప్పది. చిరకాలమునుండి యీగౌరవము చందావతువంశస్థులకుఁ జెల్లుచుండెను. వెనుక చండుఁడు చిత్తూరునుండి పగతుచేఁ బారఁదోలుటచే రాణా యావంశస్థుల కాగౌరవము జూపెను. ఉమాప్రిసూ క్తవతుల కీగౌరవ మిచ్చినప్పుడు తనమాట చెప్పుకొనుటకు చందావతువంశజుఁ డగు సలుంబ్రా యచ్చట లేకపోయెను. తక్కిన వారు రాణాకు జంకి యెదు రాడజాల రయిరి.

మఱునాఁడు తురకలతో యుద్ధమని తెలియుటచే నారాత్రి కొంచెము నిదురబోవలయు నని సలుంబ్రా తనగుడారమున నుండెను. కాని యతనికి నిద్రపట్టకుండ వానిబిరుదుల కీర్తనముసేయు భట్టు వాఁడు పలుమా రట్టిటు తిరుగుచు వానిబిరుదనామములు గట్టిగ కేకలు వేయుచుఁ జదువ నారంభించెను.

ఆకేకలు వినివిని సలుంబ్రా విసిగి "యోరీ! యేలరా యిట్లర చెదవు. నన్ను నిద్రపోనిమ్ము. శత్రువులు దాపున లేరుగదా యిప్పుడు మనబిరుదులు చదువ నవసర మేమున్న" దని మందలించెను. ఆపలుకులు విని యాబట్టువాఁడు స్వామీ! మీబిరుదులు నేను కైవారము సేయుట కిదియే కడపటిసారి ఇఁకముందు ప్రియశః మీబిరుదులుచ్చరింప నవసర ముండదు. నేనను నడపించు నధికారముతోపాటుమీబిరుదులును రేపు సూక్తవతులకే యీయఁబడు"నని యుత్తరము చెప్పెను.

అప్పలుకులు విని సలుంబ్రా దిగ్గున లేచి పరుగుపరుగున రాణా యొద్దకుఁ బోయి తరతరంబులనుండి తనకుటుంబమునకు జరుగుచున్న యాగౌరవమును తీసివేసి యింకొకరియధీనము చేయుటతగదనిగట్టిగ వాదించెను. సూక్తవతులును వెనుదీయక రాణాయొద్దకుఁబోయి "మీరు నేనల నడపునధికారము మాకిచ్చితిమని మీనోటితో మీరే సెలవిచ్చి

యున్నారు. చందుఁడెన్నఁడో యేమో చేసెనని మాకిప్పుడిచ్చినవరము మరల పుచ్చుకొనుట న్యాయము కాదు. ఎవరడ్డము వచ్చినను సేన నడుపకమానము" మని ప్రతిఘటించినిల్చిరి.

అప్పుడు పొడమినయీర్ష్యచేత సూక్తవతులు చందావతులు మహారోషపరవశు లయి యొకరినొకరు నరుకుకొనుటకుఁ గత్తుల దూసిరి. కాని యమరాణివారినడ్డగించి "మీకీపోరాటము లెందుకు? మీవివాదము నేను దీర్చెదను. ఇప్పుడు మొగలాయీలయధీనములో నున్న యంతల్లాకోటలో మీరిరువురలో నెవరు ముందుగాఁ బ్రవేశింతురో వారే నాసేన నడపించు గౌరవమునకుఁ బాత్రులగుదురని యానతిచ్చెను.

అంతల్లాకోట యప్పటికిని మొగలాయీల యధీనములో నుండెను. ఇది దుర్గమములయినకోటలలోనొకటి. ఇదియుదయపురమునకు ,పదునెనిమిది మైళ్ళదూరమున చిత్తూరునకుఁ బోవుదారిలో నున్నది. ఆకోటయడుగున నొక చిన్ననది పారుచుండును. ఆకోటలో నొక చిన్న కోట కలదు. అందులోనే దుర్గరక్షకుఁడు వశించుచుండు. రాణా యానతిచొప్పున సూక్తవతులు చందావతులు మరునాఁడుదయమున నంతల్లాకోటకు బయలుదేరిరి. కాని సూక్తవతులు పదునాలుగురు చందావతులు రాక మున్నె దుర్గముఁజేరి తాము పెందలకడ వచ్చినందుకు చందావతులు రానందుకు సంతసించి గోడలెక్క బ్రియత్నించిరి; కాని పయనపుగడబిడలో నిచ్చెనలు తెచ్చుకొనుట మఱచినందున వారు కోటగోడ లెక్కజాలరైరి. అందుచే సూక్తవతులు సింహద్వారము భేదించి కోటలోఁ బ్రవేశింపవలసియుండెను. ఈపనికయి అనేకాయుధములు పుచ్చుకొని వారు తలుపుగోడలఁ గొంతవఱకు శిథిలపఱచిరి. తలుపులు కొంతవఱకు వదులయిన వని గ్రహించి యచలుఁడు తన మనపుటేనుఁగుచే

దో్రియించి తలుపులు విడఁగొట్టవలయు నని తలంచి యేనుఁగుం బురి కొల్పుమని మావటివాని కాజ్ఞాపించెను. ఇంతలో నక్కడ కోటకావలివాండ్రు వచ్చి కోటగోడలపయి నిలిచి సూత్తువతులతో ఘోర యుద్ధమారంభించిరి. మావటీడు యజమానుని యాజ్ఞబూని కవాట భేదనము సేయుమని యేనుఁగుం బురికొల్పి ముందుకుఁ దో్రిసెనుఁగాని యది తలుపులవఱకుఁ జని యటనుండి కదలదయ్యె. మావటీని బెదరింపులు బ్రతిమాలుటలు వాడిగల యంకుశపుపోటులు వ్యర్థములై మదగజము నొక్కగజమయిన కదపఁజాలదయ్యె. తలుపులకు ఇనుప బొంగరములట్లు మొనలుదేరిన వాటిబొగడలు వందలకొలఁది యుండెను. ఆబొగడలు గ్రుచ్చుకొనినచో దట్టమయిన తన కుంభస్థలము గూడ.బగిలి నెత్తురు వరదలుపాఱు ననుభయమున తలపులం ద్రోయక మదపుటేనుఁగు మొద్దువలె నిలిచెను. అటులుండ నంతలో దుర్గము యొక్క రెండవప్రక్క నొకకలకలము వినఁబడెను, చందావతులు వచ్చి నిచ్చెనలువేసికొని కోటగోడల కెగఁబ్రాకిఁ తమవంశబిరుదులం జదువుకొనుచు సింహనాదములఁ జేయనారంభించిరి. ఆకలకలము సహింపక కార్యము దప్పిపోవుచున్నదని భయపడి యచలుఁడు మద గజమునుండి గుభాలున నేల కురికి విసవిసబోయి తనయేనుఁగునకుఁ దలుపులకు నడుమ నిలిచి మావటీని బిలిచి "యోరీ! యీసారితలుపులు పగులఁదో్రియుట కేనుఁగు బురికొల్పుము. ఏనుఁగు కుంభస్థలమునకు నామెత్తని శరీరము తగులునుగాని మేకులుగుచ్చుకొనవు. నీవు సందేహించితివా చచ్చితివని నమ్ము" మని యాజ్ఞాపించెను.

స్వామియానతి యలంఘ్యమగుటచే మావటీడు విధిలేక యేనుఁగు నంకుశముతోఁ బొడిచి కవాటభేదమునకుఁ బురికొల్పెను. కొల్పుటయు నమ్మదగజంబు హుంకరించి యుంకించి కుంభస్థలముతో డలుపులను దో్రియుటయు తలుపులు ఫళఫళ పగిలి విడిపోయెను.

శూరశిఖామణియగు నచలుఁడు ఇనుపబాగడల పోటులచేత మేనెల్ల జల్లెడవలెఁ జిల్లులువడ నెత్తురులు గ్రిక్కుకొని క్షణములో శవమయి నేలం బడియె. కవాటంబులు విడిపోవుటయు మదగజములవెంట బలుఁడు మొదలగు సూక్తవతులు యచలుని శవము మీఁదనుండి నడిచి కోటలోఁ బ్రవేశించిరి. అట చందావతులు వచ్చినవిధము వినుఁడు. ముందుగా వారు తెల్లవారుజామున నే బయలుదేరి దైవవశమునదారితప్పి యొకపట్టులోఁ బ్రవేశించి తెన్నుగానక సిలుగులంబడి పడి సూక్తవతులు ముందుగాఁ గోటఁ జేరిరి కాబోలునని వగచుచు జేయునదిలేక యొట్టకేలకొకగొల్లవానిఁ గలిసికొని వానిసాయమున దారినెఱిఁగి కోటం జేరిరి, సలుంబ్రా నిచ్చెనలుకూడఁ దెప్పించిగోడలకు వేయించి తనసైనికులు తానుబురుజులపయి కెగఁబ్రాకి మొదలు పెట్టిరి. అప్పుడు దుర్గరక్షకులు తత్తరపడి కొంద ఱామూలకుం జేరికొని చందావతుల నిచ్చెనల పడద్రోసి తుపాకులతోఁ బెక్కండ్ర గొట్టి చంపి విజృంభించిరి. అట్లు చచ్చినవారిలో మొదటివాఁడే సలుంబ్రా. చందావతుల యీదురవస్థకుఁ దోడుసూక్తవతుల జయధ్వనులుచెవులకు శూలములట్లు దాకెను.

నాఁడక్కడకు వచ్చిన చందావతులలో నొక చండశాసనుఁడుండెను. అతఁడు దేవఘురుకోట కధిపతి. వేటలలో నడవిమృగములను యుద్ధములలో మనుష్యులను నిర్భయముగా నతఁడు చంపినట్లు ఎవరును చంపఁజాలరట ఆగజ్జెట్టి సలుంబ్రా మృతినొందినతోడనే నిర్విణ్ణుఁడు గాక రౌద్రమూర్తియయి యాశవమును తన శాలువలోఁ జుట్టి భుజముపైఁబెట్టుకొని గోడపయి కెక్కఁజొచ్చెను. అత్తరి దుర్గరక్షకులు వానిం గత్తులతో నరుకను, బల్లెములతోఁ గ్రుమ్మను తుపాకులతోఁ, గాల్పను బాల్పడిరిగాని యాజోదు చెక్కుచెదరక యుక్కుతునకలాగున బురుజుపై కెక్కెను. ఎక్కి యటనుండి గంభీర

స్వరముతోఁ "రాణాసేనను నడుపుటకు చందావతులే యర్హులు మేమే కోటముందు జొచ్చితి" మనిపలికి శవముఁ జేతపట్టుకొని విసరి కోటగోడల నడుమ పారవైచెను.

అనంతరము చందావతులు మిడుతలదండుం బోలె కోటపయి కెక్కి తమయేలిక చచ్చిను బ్రతికినువానినె యనుసరింతు మనుమాట రూఢిచేసిరి. అంతలో సూక్తావతులు కులగౌరవము నిమిత్తము తమనాయకుఁడగు యచలుని బలియిచ్చి కవాటంబు భేదించి లోనం జొచ్చిరి. కోట యెవరు ముందుజొచ్చిన నెవరు వెనుకజొచ్చిన యా మాట యటులుండనిచ్చి యారెండు తెగవారు సామాన్యశత్రువు లగు తురకలఁ దరిమితరిమి కొట్టిరి అందుచే రాజపుత్రులకుఁ గన్నుల పండువుగ మీవారు రాజుల విజయధ్వజము అంతల్లాకోటబురుజుపై నిల్చెను.

కోట స్వాధినము చేసికొని రాజపుత్రులు లోపలిమందిరం బులకు జన వారి కొక చిత్రము కనఁబడెను. ఆమందిరమున నొక గదిలో నిద్దఱు గొప్పతురకలు నిర్విచారముగ చదరంగ మాడుచుం డిరి. ఒకవిధమయిన కలకలము వారి చెవులం బడియెనుకాని పగతురు వచ్చి యంతల్లాకోటను బట్టుకొనుట యసాధ్యమని వారు సరకు సేయరయిరి. ఆట మంచి రక్తియగు పట్టునకు వచ్చినప్పుడు రాజ పుత్రులు యమదూతలవలె యాయుధపాణులయి వచ్చి నిల్చివారిం జంపఁబోయిరి. అప్పు డాకరకుతురక లిరువురు రాజపుత్రులం గనుం గొని "ఆగుఁడు. ఆగుఁడు. ఆట మిక్కిలిరక్తిగా నున్నది. ఈయాట ముగియువఱకు మమ్ముఁ జంపఁవల"దని బ్రతిమాలుకొనిరి. రాజ పుత్రులు వారిపట్టుదల కాశ్చర్యమునొంది సరేయని యాయుధపాణు లయి యచ్చటనే నిల్చి యాట ముగిసినవెనుక తురకల నరికిరి.

కోటస్వాధీన మయినదని వారు రాణాకు వర్తమాన మంప

నతఁడు తత్క్షణమే యచ్చోటికిం బోయెను. పోయి చూచునప్పటికిఁ గోటలోపలను వెలుపలను, గుమ్మముకడ, బురుజులమీఁదను తన నమ్మినబంట్లు శీనంగులయి పడియుండిరి. సలుంబ్రాయొక్క శవము పగతుర మధ్యమున గానఁబడియె. అచలుఁడు నలుగురుతమ్ములనడుమ వీరశయన మలంకరించె. అందులో బలుఁడు మాత్రము రాణా వచ్చునప్పటికి కొనయూపిరితో నుండియెట్టెటో సలాముచేసి "దానద్వయమునష్టచతుష్టయ" మ్మని పల్కి ప్రాణమువదలెను. తనకత మున నిష్కారణముగా నంతటి మహాబలిశాలి మృతినొందవలసివచ్చె నని రాణా తద్దయు విచారించెను.

ఆదినము మొదలు సూక్తావతులు యుద్ధరంగమున "దానద్వయము నష్టచతుష్టయ"మ్మని కేకలువేయుచు వచ్చిరి. బలుఁడవసాన సమయమునఁ బల్కిన యానిష్టురంపుఁబల్కులే యాతెగవారి కందఱకు జయనాదమయ్యెను. చందావతుఁడే ముందుఁగా గోటఁ బ్రవేశింపుటచే రాజసేన నడుపు నధికారము వానికే చెందెను.

ఉగ్రమాచేసిన తెలివితక్కువవలన మహావీరులుమహాసాహసులు పలువురు నిష్కారణముగ నింధనమొందిరి. బలుఁ డన్నమాటల కర్థ మదియే. దానద్వయ మనగా నొకవిషయముననే రెండుదానములు చేయుట నష్టచతుష్టయ మనగా నాలుగురెట్లు నష్టమని యర్థము నాఁడు మొద లారెండు తెగలకు మితిమీరిన మనస్పర్థపొడమెను. అందుచే రాజస్థానమునకుఁ దురకలవలనఁ గలిగిన యాపదకంటె వీరి మనస్పర్థలవలన నెక్కుడాపద సంభవించెను.

---

# ఢిల్లీకిని మీవారునకును సంధి

ఒకసారి కార్యనిర్వాహము సేయవలెనని పూనుకొనెనా రాణా యుమ్రా చేయవలసినంతపని చేసి యాతంత్రికిం దగిన కొడుకే యని

ప్రఖ్యాతిఁ బడయజాలును గదా! అతఁడు ఢిల్లీచక్రవర్తి సైన్యములతో నొకసారిగాదు, రెండుసారులు గాదు పదునేడుసారులు పోరాడెను. పోరాడినపుడెల్లఁ దానె జయమునందుచు వచ్చెను. చక్రవర్తియగు జహంగీరు, ఉమ్రామీదికిఁ దనమూడవ కొడుకగు పార్వీజునిబంపెను. కాని యతఁడు ప్రతిపర్యాయము పరాజయమును నొందుటచేవానిని తిరిగి ఢిల్లీకిఁ బిలిపించెను.

ఎన్నిసారు లోడిపోయినను ఢిల్లీచక్రవర్తి సైన్యములిసుక పాతర లవలె తఱుగక మరల రాణామీఁదికి వచ్చుచుండెను. రాజపుత్ర సేన లన్ననో యుదయసింగు పరిపాలన మొదలు నిమిషమయినను నూపిరి పుచ్చుటకుఁ దెరపిలేక యెల్లకాలము కలహమే కార్యముగాఁ గ్రమక్ర మముగ క్షీణించుచుండెను. అందుచేత యుద్ధము సరిగా జరుగుటకు వీలు లేదయ్యె. ఏలయన నోడిపోయిన సేన యోడిపోవుచుండఁగాఁ జక్రవర్తి పక్షమున వచ్చెడు క్రొత్త సేన వచ్చుచుండెను. రాజపుత్రుల పస కడముట్టెను. 1613 వ సంవత్సరమున జహంగీరు చక్రవర్తి మహా సేనాసమేతుఁ డయి మీవారుపై బోవఁదలఁచి యజమీరువద్ద విడిసి ముందుమార్గము సరిగా నుంచుటకుఁ దన రెండవకుమారుఁ డగు షాజహానును బంపెను. అదివిని యుమ్రా మీవారునకు వినాశకాలము సమీపించిన దని నిశ్చయించుకొనెను. చక్రవర్తి నెదిరించుటకు ర మ్మని రాజపుత్రులను బిలువనంప ననేకు లదివఱకే స్వదేశరక్షణముని మిత్తము ప్రాణములు గోల్పోవుటచే హతశేషులగు వీరులు కొలఁది మందిమాత్రమే రాణాయొద్దకు వచ్చిరి.

ఈస్వల్పసైన్యముతోడనే రాణా యుమ్రా కొంతకాలముచక్ర వర్తి సేనల నెదిరించి శౌర్యము చూపెను, కాని యెట్టకేలకు దుర్దశల బారికి నిలువలేక రాణా లోబడవలసి వచ్చె. ఈరాణా యెట్లు లోబ డెనో యావృత్తాంతము జహంగీరు స్వహస్తముతో వ్రాసిన దినచర్య

(డయిరి) నుబట్టి తెలిసికొనవచ్చును. అం దిట్లున్నది. "నేను సింహాసన మెక్కిన 9 వ సంవత్సర ప్రారంభమున (అనఁగా 1614 సంవత్సరమున) నాకుమారుడు "జగద్గర్వ" మను బిరుదులుగల రాణాపట్టపు టేనుఁగును భద్రజాతిగజముల మఱి పదునేంటిని బట్టుకొని యొక మంచిదినమున నాకుం గానుకగాఁ బంపె. నేను మహానందభరితుఁడనై మఱునాఁడు జగద్గర్వముపై నెక్కి యూరేగి లెక్కలేని సొమ్ము పంచిపెట్టితిని."

చక్రవర్తిసైన్యములు తనదేశమును నిరంతరము నాశము చేయుటయుఁ దనకుఁ కుడిభుజములట్లు పనిచేయు రాజపుత్రవీరులు రణభూమిం ద్రెళ్ళుటయు నమ్మహావీరుల దారపుత్రాదులు తురకలచే జిక్కి బంధింపఁబడుటయు, విశేషించి తనప్రాణపద మగు పట్టపు టేనుఁగు పరులపా లగుటయు చూచి విహ్వలుఁడై రాణా యమ్మాత్రొల్లింటిగర్వమెల్ల డీలుపడి వినయముతోఁ జక్రవర్తికుమారున కిట్లు రాయబార మంపెను. "మీరు నన్ను క్షమియించి చక్రవర్తియనుగ్రహమునకుఁ బాత్రుఁడుగఁ జేయుదురేని నేను మీకు లోఁబడుదును తక్కిన రాజకుమారులట్లే నాకుమారుఁడును జక్రవర్తి సేవం జేయఁగలవాఁడు."

రాణా పంపిన యీసందేశము విని జహాంగీరు మేరమీరినసంతోషము నొంది తన దినచర్యలో నీక్రిందివిధమున వ్రాసికొనెను "ఈ గొప్పకార్యము నాపరిపాలనములోనే జరిగినందుకు నేను పొందినయానంద మింతింత కాదు అతిప్రాచీను లగు నా రాజపుత్రులను వారి రాజ్యమునుండి తరిమివేయవలదని నాకుమారున కాజ్ఞాపించితిని. ఈనాటివఱకు రాణా యమ్రమాయు, వానిపితృపితామహప్రపితామహులు తమసైన్యములు మిక్కిలి మిక్కిలి శౌర్యవంతములనియుఁ దమదేశము పర్వతమయ మగుటచే శతృదుర్భేద్య మనియునమ్మి యెవ్వరిని

లక్ష్యము సేయక హిందూస్థానచక్రవర్తి నెన్నఁడుఁజూడఁబోక, యితరుల నెన్నఁడుఁ దమదేశములో నడుగు పెట్టనీయక గర్వ భూయిష్ఠులయి యుండిరి. అట్టిగర్వోన్నతులు నాయదృష్టవశమున నాకాలములోనే లోఁబడుటచేత నిట్టిసమయము దాటిపోఁగూడదని నిశ్చయించి నాకుమారుని ప్రేరణంబున రాణాను క్షమియించి యతనినిజాగరూకతతో రక్షింతునని స్నేహపత్రిక నొకదానిని వ్రాయించి నాహస్తము మంచిగంధమున నలఁది యాచేతిముద్రి కాగితముమీఁద వేసి రాణాయొద్ద కంపితిని. అట్లు పంపుటయేగాక సుప్రసిద్ధుఁ డగు నీరాజపుత్రుని వానిమనసు వచ్చిన తెఱఁగున సగౌరవముగా నాదరింపుమని నా కుమారు నియమించితిని."

అదివఱకే గుండెలుచెదరిపోయియున్న రాణా యాలోఁబడుట వలన మఱింత దుఃఖపడకుండునట్లుచక్రవర్తివానియెడ దయామయుఁడయి యుండెను. జహంగీరు సహజముగమదగజమువలెపొగరుకలిగి యప్పుడప్పుడు మద్యపానమత్తతచేత మిక్కిలి క్రూరుఁడై యుండినను కొన్ని వేళల జాలిగుండె గలిగి చేఁజిక్కినశత్రువులనైన నత్యంతగౌరవముతోఁ జూచుచుండును. అందుచేత మీవారు రాణా లెవరు స్వయముగ చక్రవర్తినిఁ గొలుచుటకుఁ ఢిల్లీకి బోనక్కరలేదనియునేరాణాయయిన నూతనముగ మీవారు సింహాసన మెక్కినప్పుడు చక్రవర్తి దాని యాధిపత్యముగు స్థిరపర్చుచుఁ బంపెడు ఫర్మానా రాణాకోటలోనుండి వెలుపలకు వచ్చి పుచ్చుకొనవలసిన దనియు చక్రవర్తిసైన్యమునకు రాణా వేయిగుఱ్ఱపుదండుఁ బంపవలసినదనియు జహంగీరునకు నుమారికు నొడంబడికలు జరిగెను. ఇదియే నుమారి కోరిక. సంధియయినపిదప నుమారి చక్రవర్తి దర్శనమునకుఁ బోవలసియున్నను వార్ధకముచేత నిల్లు కదలి రాలే నని వర్తమాన మంప జహంగీరు వానిని క్షమించెను.

చక్రవర్తిని జూచుట తప్పించుకొన్నను రాణా వానికుమారుని దర్శనము చేయక తప్పదయ్యె. అందుచేత సుమారి షాజహాను దర్శనమునకుఁ బోయి వానిమోకాలిమీఁద జేయివేసి తన్ను క్షమింపుమని ప్రార్థించెను. షాజహాను వానిని మన్ననతోఁ గౌరవించి వానిపరివారమునకు గుఱ్ఱములు విలువగల నగలు బహుమానము లిచ్చి పంపెను.

షాజహానుతల్లి రాజపుత్రస్త్రీ యగుటచే నతని శరీరమునఁగూడ రాజపుత్రరక్తమే ప్రవహించుచున్నందున గాఁబోలు కడుదీనుఁడైముఖవిలాసము డీలుపడియున్న రాజపుత్రప్రభువును జాల బహూకరించెను. ఉమ్రా షాజహానున కెన్ని మన్ననలు చేసినను కొట్టకొనకు ఢిల్లీనుండి చక్రవర్తి ఫర్మానా వచ్చినప్పుడు కోటవెలుపలకు వచ్చి దానిని పుచ్చుకొన్నం జాలు నొక్క తురకబంటైనామీావారు దేశమున నుండకుండఁ జేసెదనని షాజహా నెన్నివిధముల వర్తమాన మంపినను వినక రాణా షాజహానుని యందుగల సుగుణములబట్టి యతని దర్శనము మాత్రమే చేసి వెళ్ళిపోయెను.

ఇదియైన కొన్నినాళ్ళకే రాణాకుమారుఁడు కరుణుఁడు చక్రవర్తి కొలువుసేయుట కజిమీరునకుఁ బోవలసివచ్చెను. అప్పుడు కరుణునిసభలోఁదన సింహాసనమునకుగుడివైపున దగుపీఠముమీఁదగూర్చుండఁబెట్టవలయునని జహంగీరునకు షాజహాను వ్రాసెను. ఆ రాజకుమారుఁడు మిక్కిలి మొగమోటము గలిగి యెవరితో గలిసి మెలసి మాటాడక సిగ్గుపడినట్లు సభలోఁ గూర్చుండుచు వచ్చినాఁడని జహంగీరు తన దినచర్యగ్రంథములోఁ బలుమారు వ్రాసెను. అందరికంటె నెక్కువ నల్లమందు మద్దతు పీల్చుచు సాయంకాలమునందు హాకిర్డు అనియెడియింగ్లీషువాని నొకనిగూడి నోటిలో నన్నపుముద్దనయిన బెట్టుకొనుటకు నోపికయుండనట్లు చెడత్రాఁగి యొడలు తెలియకుండ దొర్లుచుండ నాషోకులమారిచక్రవర్తి గుణములఁజూచుట

చేతనో మఱియెందుచేతదో తెలియదుగాని యాబాలుఁడు చక్రవర్తి యెంతయాదరించినను దిగులుజెందినవానివలెనే సభలో నుండుచు వచ్చెను. షాజహాను వానిని క్రొంచెము సంతోషపెట్టుటకు ప్రతిదినము వాని కొక క్రొత్తబహుమాన మిచ్చుచు, అప్పుడప్పుడు నూర్జహాను కొలువునకుఁ దీసికొని పోవుచుండెను. చక్రవర్తిని తన వలలో వేసికొని యతఁడు తనగీచినగీటు దాఁటకుండఁ జేసికొని మగని మనస్సునేగాక హిందూస్థానమంతయు నేల గలిగిన యానెరజాణ నూర్జహాను యారాజపుత్రకుమారునకు మంచియేనుఁగ నొకటి గుఱ్ఱమొకటి కత్తియొకటి బహుమాన మిచ్చెను. అంతియేగాక రతనాలు చెక్కినకత్తులు మేలిమియుంగరములు పారసీకతురగములు ముత్యాల హారములు రత్నకంబళములు సుగంధద్రవ్యములు బంగారుపాత్రలు మొదలగు పారితోషికములు షాజహానుఁ డా క్రొత్త సామంతరాజకుమారునకు విసుగులేక యర్పించెను. అట్లు రాజపుత్రుఁడు బడసిన బహుమానములఁగూర్చి తనగ్రంథమున నిట్లు వ్రాసెను;

"ఆరాజకుమారుఁడు నాసభకు వచ్చినది మొదలు తిరిగివెళ్ళువఱకు నాకుమారుఁడు షాజహాను డిచ్చిన యైదుయేనుఁగులు నూటపదిగుఱ్ఱములుగాక నేను స్వయముగానిచ్చినరత్నములుబంగారు గలుగజతురంగములు మొదలగు బహుమానముల విలువ పదిలక్షల రూపాయలు" ఈయల్పబహుమానములఁ జేకొని కరుణుఁడు రాణాయమ్రాయు "మీవారు రాజ్యపు పరువుముందర పదిలక్షలరూపాయిలనెంత. మనము పొరపాటుపడి నిష్కారణముగ దేశస్వాతంత్ర్యము తురకల కమ్ముకొంటి" మని తద్దయు విచారించి లోలోపల కుళ్ళుచుండిరి. జహంగీరు సభలోఁ గరుణుఁడుగూడ ముఖవికాసము తగ్గియుండుటకుఁ గారణ మిదియే సంగభూపాలుని కాలమునుండియు దురకలబారిపడి స్థిమితమెట్టిదో యెఱుంగని మీవారు రాజ్యమిది

మొదలు దండయాత్రిలు కలహములు లేక సేమముగ నుండు నని సంతోషింపవలసినపని లేదయ్యె. ఏలయన నదిమొదలు మీవారు ప్రభువులు ఢిల్లీచక్రివర్తికి లోఁబడినవారయిస్వాతంత్ర్యముముగోలు పోవుటచేత రాణాకు రాజకుటుంబమునకుఁ గాలక్రమమున ఢిల్లీనుండి వచ్చుబహుమానములు దుఃఖకరములుగ నుండెను. యుద్ధము మాను కొని చక్రవర్తిని గొలుచువారికి యుద్ధపుగుఱ్ఱములు మహాయుధము లేందుకు; జహంగీరు రాణాయొక్కయు వానికుమారుని యొక్కయు బ్రతిరూపములను స్ఫటికశిలలలోఁ జేయించి తన యుద్యానవనమునఁ బెట్టించుకొనియె. అవి చూచినవారందఱు చిత్తూరురాజవంశమున కంతకన్న నవమానకరమగు పని లేదని భావించిరి. అది యటుండ రాణాయొక్క మనుమఁడగు జగత్సింగు నయితము ఢిల్లీలోనేయుండి చక్రవర్తి యిచ్చుబహుమానముల కుబ్బి వారినే మెచ్చుచుండెను. జహంగీ రొకసారి కొన్నిబంగారుబొమ్మలఁ జేయించి రాణావద్దకు వానిమనుమనిచేతనే పంపెను. రాణా యాబొమ్మలఁ జూచి తనయొక్కయు తనకుమారునియొక్కయు బొమ్మలే చక్రివర్తి యుద్యానవనములలో దాస్యముచేయునట్లుండి హృదయము నెప్పుడు గాల్చుచుండ నీబంగారుబొమ్మను మాకేమి యానంద మీయఁగలవని విచారించెను. విచారించుటయేగాదు ఈమహాపరాభవము నతఁడు సహింపజాలఁడయ్యె. తొల్లి ప్రతాపరాశియగు ప్రతాపసింగుజీవించియున్న కాలమున వానిచేతిక్రిందనుండి మహమ్మదీయులతోఁ బోరిపోరినతని పరోక్షమునఁ దాను గద్దెయెక్కి సేనలం బురికొల్పి నడపించియప్రతిహతపరాక్రిములగు ఢిల్లీచక్రివర్తుల ననేకపర్యాయముల రణరంగంబునఁ బరాజయము నొందించి పావనచరిత్రి యగురాజ్యలక్ష్మిని గోహంతకులపాలు గాకుండఁ జేసి పితృపితామహుల ప్రతిష నిలిపిన తాను నేఁటికాలమున నిట్లధోగతిపాలయినందులకుఁ దద్దయు సిగ్గుపడి యుక్రమా యీవిధముగఁ జేసెను.

తనకుమారుఁ డగు కరుణుఁడు చక్రవర్తిసేవ చేసి ఢిల్లీనుండి వచ్చినపిదప నొకనాఁడు మంత్రి సామంతుల నందఱఁ బిలువనంపి కొలువుదీర్చి రాణా వారినందఱఁ జూచి "నాపని యయినది. ఇంక రాజ్య మెంతకాల మేలినను ఢిల్లీచక్రవర్తికి దాసుఁడ నయి యేల వలయును. అ ట్లభిమానము జంపుకొని యేలుట నాకిష్టము లేదు." అని పలికి కుమారునిఁ బిలిచి "నాయనా! కులప్రతిష్ఠలు నీవు నిలుపఁ దగినవాఁడవు. రాజ్యమునందు నిన్ను బ్రతిష్ఠించెద" నని వానిమొగమున స్వయముగ దన హస్తముతో టీకావేసి పట్టాభిషిక్తునిఁ జేసి యప్పుడ సభవిడిచి కోటవదలి కొంతదవ్వున నున్నసరోవరము పొంతకుఁ బోయి యక్కడ ము న్నుదయసింగు గట్టించిన మందిరమునఁ బ్రవేశించి దలుపుమూసికొనియె. ఆదినము మొద లామహారాజెన్నడు మరలఁ బ్రజలకంటఁ బడలేదు. ఆయిల్లువిడచి యీవలకురాలేదు. అటుపిమ్మట నై దేండ్ల కతఁడు మృతినొంద దహనమునిమిత్తము కొనిపోవుచున్నప్పుడు వానిమృతకళేబరముమాత్రము ప్రజలు చూచిరి.

అదిమొదలు మీవారురాజ్యమునకుఁ గ్రొత్తశకము ప్రారంభమయ్యెను. అంతకు ముం దారాజ్యము ఢిల్లితో సంబంధములేక తన కున్నంతవఱకు తృప్తినొంది ప్రజాసౌఖ్యకరముగా నుండెను. కాని మీసంధియైన పిదప నదిగూడ చక్రవర్తిగారి రాజ్యతంత్రపు సుడిగుండములలోఁ బడక తప్పదయ్యెను. అదృష్టవశమున ఢిల్లి మీవారులకు నూతనముగా సంధి జరిగినప్పుడు మీవారు మంచిరాజులచేతిలో బడినందున దాని గౌరవము దక్కె. కరుణునికంటె నెక్కుడు ప్రతాపవంతులు విశేషప్రజ్ఞావంతులు నగు రాజపుత్రు లనేకులు చక్రవర్తిసభలోఁ బెక్కుసార్లు పరాభవము నొందినట్లు చాలకథ లున్నవిగాని గరుణునివిషయ మట్లు లేవు. అతఁడు మీవారును పాలించిన యెనిమిదియేండ్లలో దేశమును జక్కనిస్థితిలోనికిఁ దెచ్చి పాడిపంటలతోఁ

దులతూఁగునట్లు చేయుటయేగాక కొమ్మ్మలేనుఁగులవంటి శారాజుల కయిన మానములుదక్కని ఢిల్లీశ్వరుని దర్బారులో నొక్కనాఁడయిన నవమానమందక యేపనిఁజేసిన బుద్ధికుశలతఁ జూపి చేయుచు ఢిల్లికి లోఁబడి యే వెలితి లేకుండ నేలెను.

జహంగీరునకు మీవారు రాణాలమీఁద నెందుచేతనో నత్యంతాభిమానము గలిగెను. రాణా కుమారునిఁ జక్రివర్తి తనప్రక్కను పీఠము వేయించి కూర్చుండఁబెట్టుకొనును. ఈరాణా బంధువులను తక్కిన రాజుల బంధువులకంటె నెక్కుడుగ గౌరవించును. జహంగీరు పుత్రుఁడగు షాజహానునకును రాణాతమ్ముఁడగు భీమునకును గాటముగా మైత్రియయ్యెను. ఈభీముఁడు రాణా చక్రివర్తికి గానుకగాఁబంపు సేన కధిపతియై దర్బారులోనే యుండువాఁడు. అందుచేత షాజహాను దానియందలి స్నేహంబుపెంపున తండ్రితోఁజెప్పి భీమునకు రాజబిరుద మిప్పించి యంతతోఁబోక లోడా యను చిన్నజిల్లాకు వానిని రాజుగఁ జేయించి బహువిధముల గౌరవించెను. జహంగీరు కొడుకు ప్రేరణంబున భీమున కనేకోపకారములఁ జేసినకొన్ని నాళ్ళకె యేల మేలుచేసితి నని విచారింపఁ జొచ్చెను.

జహంగీరునకు నలుగురు కొడుకులు. అందు జ్యేష్ఠుఁడు ఖుసూ్రి యనువాఁడు తండ్రి నెదిరించు పట్టువడి బంధింపబడి తుదకు చెరసాల లోనే మృతినొందెను. రెండవవాఁడు షాజహాను. ఇతనిమీఁద జహంగీరు ప్రియురాలగు నూర్జహానున కనిష్టము. అది కారణముగ జక్రివర్తికి వానిపై నంతయిష్టములేదు. అందుచేత నాతాఁగుబోతు చక్రవర్తి, షాజహానునిఁ దోసివైచి తనమూడవ కుమారుఁడును, త్రాఁగుబోతుతనమునఁ దనకుజ్జీయగువాఁడునగు పార్వీజును దనయనంతరమున జక్రివర్తి యగునట్లు నియమించెను. నూర్జహాను జహంగీరు నాల్గవ కుమారుఁడగు పార్యురునకు సింహాసన మిప్పింపఁబ్రియ

త్నించుచుండెను. స్థితిగతు లిట్లుండుటచూచి షాజహాను తానురాజ్యమును స్వాధీనము జేసికొను నుపాయము వెదకుచుఁ బ్రియమిత్రుఁడగుభీమునితోడను, వానిచుట్టము చెలికాఁడు సూక్తావతువంశస్థుఁడు నగు మానసింగుతోడను గట్టియాలోచన చేయసాగెను. ఆకుటిలసడి యెఱింగి చక్రవర్తి యామిత్రుల నొకచోఁ గలసి యుండనిచ్చినచోఁ బ్రమాదము వాటిల్లు నని భీముని గుజరాతీదేశమునకుఁ బాలకునిఁజేయు మిషతో నక్కడకుఁ బొమ్మని యాజ్ఞాపించెను. ఈయుద్యోగము తన కక్కఱలే దని నిర్భయముగఁ జెప్పి యక్కడకుఁబోనని రాజపుత్రసాహస మంతయు మూర్తీభవించినట్లతఁడు ప్రత్యుత్తరమిచ్చెను. అంతవఱకు వచ్చినతర్వాత నూరకున్నచోఁ దనప్రాణము మీఁదికి వచ్చు ననిభయపడి షాజహాను తండ్రితో ప్రత్యక్షవైరము బూనెను. అత్తరి భీముఁడు మానసింగు మొదలగు సూక్తావతులు, చక్రవర్తి సర్వసేనాధిపతి యగు మహబతుఖానుఁడును షాజహానుతోఁ జేరిరి. ఈనడుమ నతికూరిరుఁ డని పేరు వహించి జనవిరోధి యైయున్న షార్వైజు నెవరో జంపివేసిరి.

జహాంగీరు మహాసేనాసమేతుఁడై తనపై ధ్వజమెత్తిన కొడుకును దండించుటకు బయలుదేఱెను. షాజహాను నెంతో యతఃకరణశుద్ధియు దయాస్వభావము గలవాఁ డగుటచే రాజపుత్రులు వానిపై నభిమానము గలిగి తత్పక్షము జేరఁజొచ్చిరి. షాజహాను తల్లి మార్వారు దేశపు రాజసింగుయొక్క కూఁతురు. ఈకుటుంబకలహమునందు వృద్ధుఁ డగు గజసింగు తన యల్లునిపక్షము వచ్చునా మనుమని పక్షమువచ్చునా యని లోకులు సందియముపడి దాని పరియవసానము ప్రతీక్షించుచుండిరి.

ఎట్లయిన లోకానుభవము గల గజసింగు దూరమాలోచించిన రహాతూరుబలముతోఁ గూడి చక్రవర్తిపక్షమున కే వచ్చెను. అ

వ్వుడు జహాంగీరు మితిమీరిన యానందమునొంది సామంతరాజమండలము నెదుట మానుగారిచేయి పట్టుకొని ముద్దుపెట్టుకొని వానిని గౌరవించెను. అప్పుడు కొడుకురు దండ్రికూడ గాశీపట్టణము పొద్దయుద్ధసన్నద్ధులయి గలసిరి. ఉభయసైన్యము లొండొరుల దాకుటకె సిద్ధమైనపుడు చక్రవర్తి యెవరిదురాలోచనమో విని మహావీరుడు నుత్తమకులస్థుడు నగు తనమామగారికి సైన్యాధిపత్య మీయక యంబర దేశపురాజు గజసింగునికంటె తక్కువవాడు నగు జయసింగున కిచ్చెను. అభిమానధను లగు రహతూరువంశస్థులు తమరాజునకు సైన్యాధిపత్యము లేనిచో గత్తియే ముట్టమనిరి. గజసింగును నిర్భయముగ దనవారి యభిప్రాయముం జక్రవర్తితో జెప్పి తన సేనందీసికొని దూరముగం బోయెను. అట్టిసమయమున భీముడు గజసింగు తనతో గలియునేమోయని యాసపడి వానికిం బౌరుషము గలుగు నట్లివిధముగవర్తమాన మంపెను. "రహతూరువంశస్థు లూరకున్నారేమి? కలసిన మాతో గలియుడు. లేనిచోం గత్తిందూసి యుద్ధము చేయుడు" సందేశమునం కనుకొనినట్లేపరిత్యుత్తరము వచ్చెను. సంధిఘ్నమనస్కుం డగు నాముసలి రాజు భీమునిపలుకులకు రోసముంజెంది చక్రవర్తి పక్షముం జేరి రహతూరులం బురికొల్ప వారువిజృంభించి యుద్ధభూమి బీనుంగుపెంటలు జేసి యాదినమున షాజహాను నోడించిరి. భీముడు రణరంగమునం బడి చచ్చెను. మానసింగు గాయపడుటచే రహతూరులు వాని నెక్కడకో మోసికొనిపోయిరి. మహబతాఖానుడు షాజహాను ప్రాణభీతిచే రణరంగము విడిచి యుదయపురమునకుం బారిపోయిరి.

రాణాకరుణుడు తమ్ముడగు భీమునిచేత సమరసంబంధము మానిపింపలేక పోయినను సహజముగం జాల బుద్ధిశాలి యగుటచే మొదటనుండియుం దానుమాత్రి మీకలహమున జోక్యము కలుగ జేసికొ

నఁడయ్యె. అతని సంకల్పము చక్రవర్తికిఁ గృతజ్ఞుఁడై యుండుటయే. అట్లు కృతనిశ్చయుఁడయినను జక్రవర్తికొడుకంతటివాఁడు దీనుఁడై తనదేశమునఁ దలదాచుకొనవచ్చినప్పుడు వేఱుభంగి నుపేక్షించుట పాడిగా దని కరుణుఁడు వానిని గరుణించి సగౌరవముగ నాదరించెను. ఉదయపురసమీపమున నున్న సరస్సులో నొక లంకమీఁద తాజా మనోహరమగు మందిరము నొకదానిని కట్టించి మహమ్మదీయులకు రాజపుత్రులకు సంబంధమేమియు లేకుండునట్లు షాజహానుని వానిసేనాపతి నందు విడియించెను. కరుణుఁ డామందిరమున షాజహానున కేసౌఖ్యమునకు వెలితిలేకుండున ట్లేర్పాటులు చేసెను. అతసి టెక్కెము మేడపయి నాటించెను. లోపల స్ఫటికసిలతోఁ జక్రవర్తి పుత్రున కొక సింహాసనము జెక్కించెను. వేయేల! ఆ హజారమున కెదుట నమాజుసేయుటకు మసీదుగూడ కట్టించెను.

ప్రాణమిత్రుఁడగు భీమరాజు నేలఁగూలుటయు వానిచెలికాఁడగుమానసింగు మిత్రవియోగముచేత జీవితాశ విడిచెనని వినుటయు షాజహాను మనోహరమందిరమునుండి సుఖ మనుభవించుచున్నను వానిమనస్సుమాత్రము స్థిమితము గలిగియుండదయ్యె. మానసింగునకు భీమునకుఁగల స్నేహము లోకాతీతమయినది. భీముఁడు మృతినొందినచో మానసింగు బ్రతుకనని ప్రతినబట్టెను. అందుచేత మానసింగుసేవకులు భీముఁడు మృతినొందినవార్త వానితోఁ జెప్పక దాఁచి ప్రతిదినము పళ్ళెములతో ననేకభక్ష్యములు తెచ్చి యవి భీముఁడే పంపినాఁడని తెలియఁజేయుచు గొంతకాలము గడపిరి. దురదృష్టవశమున నెట్లో భీముని మరణవార్త యొకనాఁడు మానసింగుని చెవులంబడియె. పడుటయు మానసింగు దుస్సహమగు మిత్రవియోగమునకు దాళఁజాలక దేహమాపాదమస్తకము నిండియున్న యెనుబదిగాయములమీఁద పట్టీ నూడఁబెఱికి తాను చావకమాననని నేలంబండుకొని ప్రాణములు విడిచెను.

అనంతరము షాజహాను తన కుదయపురమే నెలవుగాఁజేసికొని దేశదిమ్మరియై కొంతకాలమిందు కొంతకాలమందు తిరుగుచు వచ్చెను. ఎంతతిరిగినను లాభములేమిచే షాజహాను స్వలాభముఁజూచుకొని తండ్రితో సంధిచేసికొనుటయే యుత్తమమని యెంచి తాను లోఁబడితినని రాయబారమంపి విశేషించి తండ్రికిఁ జాలనమ్మిక పుట్టుటకు దన యిరువురకుమారులఁ దారా యౌరంగజీబులనువారిని తండ్రివద్దకు జామీనులుగఁ బంపెను. మహబత్ఖానుఁడు పేరు తురకపేరు పెట్టుకొన్నను కులమున రాజపుత్రుఁడే. అట్లగుటచే నతఁడు షాజహానుని విధమున జక్రివర్తికి లోఁబడక సంధికంటె సాహసమే లెస్సయని నిశ్చయించి సూక్తావతులు మొదలగు కొందఱు రాజపుత్రుల సహాయముగఁ బడసి యేరాజపుత్రుఁడు నెన్నఁడు కలలోనయినఁ జేయఁదలఁపని యొక మహాసాహసమును గావించెను. కుమారుఁడు లోఁబడినపిదప మహబత్ఖాను ఱెక్కలు తెగిన పక్షివిధమున నొంటిగాఁడయి యున్నవాఁడని గ్రహించి జహంగీరు వానిపయి ధనాపహారణము జనపీడనము నను రెండునేరములు మోపి తనయెదుటికి వచ్చియానేరముల కుత్తరము చెప్పుమని వాని కాజ్ఞాపించెను. ఎందునిమిత్తము చక్రవర్తి తన్ను రమ్మనియెనో యాసంగతి పూర్తిగ నెఱిఁగినవాఁడు గావున వెళ్ళుటకిష్టములేక నిదిగో నదుగో యని కొన్నినాళ్ళు జరపెను. సత్వరముగ రాకతప్పదని చక్రివర్తి పట్టుపట్టెను. అటుమీద నొకనాఁడు మహబతుఖానుఁ డైదువేల రాజపుత్ర పరివారముతో వచ్చి శిబిరము జేరినాఁడని చక్రివర్తికిఁ దెలిసెను. ఆసమయమున జహంగీరు కార్యాంతరముమీఁద కాబూలునగరమునకుఁ బోవుచు సింధునది కుపనదియయిన జీలమును దాఁటబ్రియత్నించెను. సేనయంతయు ముందు నదిదాటి యావలియొడ్డు జేరెను. చక్రివర్తి నూర్జహాను వారిపరివారములు మాత్రి మీవలియొడ్డున గుడారములోనుండి

సందడి తగ్గినతోడనే యేరుదాటఁ దలపోయుచుండిరి. అప్పుడే తెల్ల వాఱుచుండెను. నూర్జహాను తక్కిన యంతఃపురాంగనలతోఁ గలసి యొకగుడారమున నుండెను. చక్రవర్తి రాత్రి తాగిన సారాయముల యొక్క నిషాయింకను దిగనందున నొడలుమరచి యుండెను.

అంతలో మనుష్యులయడుగుల యలుకుడు చేతులలోని యాయుధముల చప్పుడులు వానిచెవులకు వినంబడ చక్రవర్తి యులికిపడి దిగ్గునలేచి చూచెను. చూచునప్పటికిఁ దనగుడారమంతయు యమదూతలవంటి రాజపుత్రసైనికులతో నిండియుండెను. అయిన నతఁడు జంకక ధైర్యము చిక్కబట్టి ఖడ్గముపైఁ జేయివైచి పయికిఁ దీయుచుండ మహావీరుఁడగు మహబత్ఖానుని మొగము వాని కగపడెను. ఆఖానుని జూచుటకుఁ గాని వానిపేరు వినుటకుఁగాని యతనికి లేశమిష్టము లేనందున యతని ముఖదర్శనము చక్రవర్తి క్రోధమును బెంచెను. అయిన నతఁడప్పటి తనయవస్థను జ్ఞప్తికిఁ దెచ్చుకొని తొందరపడిన గార్యము పాకముతప్పునని మహబత్ఖానుని జూచి "ఓ రాజద్రోహి! ఇదియేమి?" అని యడిగెను. ఆపలుకులు విని మహబత్ఖాను చక్రవర్తి కాళ్ళపైఁబడి యనేకవిధముల దీనాలాపములం బలుకుచు నిట్లనియె. "నాశత్రువులు దేవరవారితో నామీఁద నేరములుచెప్పి నాకు మీకెడబాటు చేసిరి. అందుచేతనేగదా నేనుకొన్నినాళ్ళకిందటనే మీ శిబిరముఁ బ్రవేశించినను మీరు నామొగముజూడ రయిరి. నాతోఁ బలుకరైరి. ఎట్లయిన దేవరవారిదర్శనముఁ బడయంగోరి యిట్లుచేసితినిగాని ద్రోహముచేయుటగాదు." అని మొఱ పెట్టుకొనెను. అతని పలుకులు చక్రవర్తి క్రోధాగ్నికాజ్యధారలయ్యెను. అయినను సమఁయము గాకపోవుటచే జహంగీరు కోపముదిగమ్రింగి పయికి మంచి మాటలేచెప్పుచు సదను దొరికినప్పుడు మహబత్ఖానుని కొంపఁదీయ వలయు నని నిశ్చయించుకొని యతఁడేమన్న నదియేసరి యనసాగెను.

అప్పుడు మహబత్ఖాను చక్రివర్తితో "దేవా! మీరు పట్టపుటేనుఁగు పై నెక్కి సామంతరాజులకు సైనికులకు దర్శన మీయవలసిన సమయము వచ్చినది. మీరగపడకున్న వారందఱు కళవళపడుదురుగదా! కావున నేనుఁగు నెక్కు"డన మనవిచేసెను. చక్రవర్తి సరేయని తనదుస్తులు తొడుగుకొనుటకు ప్రిక్కగుడారములోనికి వెళ్ళివత్తునని చెప్పెను. అక్కడికి వెళ్ళినా చక్రివర్తి యిఁక దనకు దక్కక నూర్జహాను చేతిలోఁ జిక్కిపోవుననియుఁ దనపన్నినపన్నుగడ లన్నియునిష్ఫలము లయి పోవుననియు శంకించి మహబత్ఖానుఁడు దేవరవారు దుస్తులిక్కడనే తొడుగొనవచ్చునని చెప్పెను.

జహంగీరు వానిమాట కడ్డముచెప్పక యక్కడనే దుస్తులు వేసికొని బయలుదేరుటకు గుఱ్ఱమెక్కెను. అప్పుడు మహబత్ఖానుఁడడ్డమువచ్చి "స్వామీ! గుఱ్ఱమెక్కుటకంటె నేనుఁగెక్కుట మంచిది. ఏనుఁగెక్కినచో నందఱకు మీరగపడుదురు. అది నిరపాయము కావున దాని నెక్కుఁడగు"నని పలికెను. అప్పుడు జహంగీరు తన యేనుఁగుపయి నెక్కఁదలఁప రాజపుత్రులు వాని మావటివానిం జంపిరి. అప్పుడు మహబత్ఖాను చక్రివర్తినిఁ దన యేనుఁగుపై నెక్కించి యిరుప్రక్కల ఖడ్గపాణులగు నిరువుర రాజపుత్రులను గావలిపెట్టి తన శిబిరమునకుఁ దీసికొనిపోయెను.

ఆశిబిరముచుట్టు మెఱియలవంటి రాజపుత్రులను మహబత్ఖాను కావలి వేసి జీలము నదిమీఁద నున్నపడవల వంతెన నూర్జహాను పాలఁబడకుండఁ గాపాడుటకు మఱిరెండువేల రాజపుత్రులను నియమించెను. మహబత్ఖాను తన్ను ఖయిదీగాఁ బట్టుకొనియెనని తెలిసికొనినను చక్రవర్తి కాలముదప్పివచ్చినప్పు డేమిచేయం గలమని యూరకుండి "నాసారాబుడ్డి కావలసినప్పుడు సారా యందిచ్చు సేవకుని నాకిచ్చినారుగదా తక్కిన ప్రపంచమేమయిన నాకేమి" యని సరిపెట్టుకొని యక్కడనే హాయిగ నుండెను.

చక్రవర్తి పక్షమున నున్న జనములో ధైర్యము సాహసముగ లది నూర్జహానొక్కతెయె చక్రవర్తికి జరిగిన భంగపాటు వినినతోడనే నూర్జహాను పిరికిపడక నిరుపేదవాని వేసము వేసికొని చిన్న సవారి నెక్కి యాడంబర మేమియు లేకుండ నావలియొడ్డుఁ జేరుటకు బయలు దేరెను. చక్రవర్తి శిబిరము వెంట వచ్చిన పేదరా లెవ్వతెయో పోవుచున్న దనుకొని వంతెనగాఁచు రాజపుత్రులామెను నిర్భయముగఁ బోవనిచ్చిరి. అట్లు నిరపాయముగ నావలియొడ్డు జేరి సేనాపతులను సామంతులను రావించి వారి పాలుమాలినతనమునకు మూర్ఖతకు గట్టిగఁ జీవాట్లు పెట్టి చక్రవర్తిని విడిపింపకున్నచో నందఱి ప్రాణములఁ దీయింతునని బెదరించెను.

పరాక్రమవంతుఁడగు నొకతురకజోదు రోసముఁ దెచ్చుకొని చక్రవర్తిని విడిపించుట కారాత్రి యత్నించెనుకాని వానియత్నము నెరవేరదయ్యె. మరునాఁడుదయమున నూర్జహాను స్వయముగ నేనుఁగు నెక్కి కత్తియు విల్లు నమ్ములు చేఁబూనితన సేనలం బురికొల్పుకొని మహబత్ఖానునిఁ దాకుటకు రాఁబోవుచుండెను. అప్పుడు రాజపుత్రులు పడవల వంతెనఁ గాల్చి వారిని రాకుండఁ జేయ వారు పాటిరేవులందిగి రాఁజొచ్చిరి. రాజపుత్రులు వారిపై శరవర్షంబులు గురియించియు తుపాకిగుండ్లఁ బ్రయోగించియు నూర్జహాను సేనల నురుమాడి నీటనున్నవారిని నీటను మెరకనున్న వారిని మెరకను జంపిరి. కొందఱు ప్రవాహవేగమున కొట్టుకొనిపోయిరి. అన్నిగండములను గడపి దరిజేరినవారిని కత్తులతో నఱికి చంపిరి. మహబత్ఖానుఁడు వాని రాజపుత్ర సైనికులు విజయము సంపూర్ణముగ నందిరి. కానియాతనిజయము చిరకాలము నిలువదయ్యె. ఏలయన నూర్జహాను పౌరుషంబు లగుచేతలు చేయలేక పరాభవము నొంది యాగడుసుపోకడలంబోయి కార్యము సాధించుకొనియె. ఆమె నిర్భయముగ మహబ

త్ఖానుని శిబిరముఁ బ్రవేశించి నాభర్తతోఁపాటు నన్నుఁగూడ ఖయిదీగాఁ జేయుమని యాతనిం గోరెను. మహబత్ఖాను మిక్కిలి యుబ్బిపోయి సరేయని యూరకుండెను. అది సందుచేసికొని యామె సేనాధిపతులమనస్సుల విరువనారంభించెను. అదివరకే ఖానుయొక్క యనుచరులలోఁ గొందఱతనిగర్వమును జూచి వానిని ద్వేషించుచుండిరి. కొందఱు వాని రాజపుత్రపక్షపాతమును జూచి కడుపుమంట గలిగి యుండిరి. అందుచేత నూర్జహాను పన్నుగడ లవలీలగ వారిమతములఁ ద్రిప్పెను. కొన్ని దినము లామె ఖానుశిబిరములోనుండి యెట్టకేలకు చక్రవర్తినిఁ జెరనుండి విడిపించి స్వతంత్రునిఁ జేసెను. అప్పుడు ఖానుఁడు రాజపుత్రసైనికులు భగ్న మనోరథులై తమయవివేకమునకుఁ జింతించుచుఁ దొలఁగి పోయిరి.

ఈనడుమ మీవారు రాణా పరలోకగతుఁడయ్యెను. కరుణుని కుమారుఁడగు జగత్సింగు తండ్రిపగోతుమున రాజ్యప్రతిష్ఠితుండై యెప్పటియట్ల షాజహానుతో నెయ్యముఁ బాటించుచుండె. జగత్సింగు రాజయినపిదప షాజహానుఁడు కొన్ని దినము లుదయపురమున వసియించి యుండెను. అతఁడక్కడ నుండఁగనే జహంగీరు చక్రవర్తి కాశ్మీర దేశమునందు దగ్గుబాధచేతఁ గాలధర్మము నొందెనని వర్తమానము తెలిసెను. షాజహానుఁడు సరోవరమధ్యమున నున్న మేడలో నున్నప్పుడె రాణా మొదలగు సామంతరాజులు తమక్రొత్తచక్రవర్తి దర్శనము ముందుగఁ జేసి కానుకలు సమర్పించిరి. షాజహానుఁడు సింహాసన మెక్కుటకు ఢిల్లీకిఁ బయనమయి పోవునపుడు మీవారు రాణాకు వెనుక వానియొద్దనుండి తీసికొనిన యయిదుజిల్లాలను మరల వానికిచ్చి వెలలేని కెంపొకటి బహుమానమిచ్చి యవసరమయిన పక్షమునఁ జిత్తూరుకోట బాగుచేసికొని యుపయోగించుకొమ్మని సెలవిచ్చి యుదయపురము వెడలెను.

జగదీశ్వరుఁ డగుఢిల్లీశ్వరునిపుత్రుఁ డుదయపురమున నుండినట్లు రెండుమూడానవా ళ్ళిప్పటికిఁ గలవు. షాజహానుని డాలొకటి, కుసుంబావర్ణముగల వానితలపాగయొకటి. ఈతలపాగ షాజహానుఁ డుతనతలమీఁదనుండి తీసి రాజపుత్రులిచ్చిన శిరోవేష్ట మొకటి ధరియించెను. మొదట చుట్టినప్పు డెన్నిమడత లున్నవో యన్నిమడతల నిప్పటికిఁ గలిగి చుట్టినట్లున్నది. జగత్సింగు బుద్ధిశాలియయి యిరువదియాఱు సంవత్సరములు రాజ్యముచేసి చక్రవర్తి యనుగ్రహమునకుఁ బాత్రుఁడయి కాలము గడపె. షాజహాను తక్కిన సంస్థానములకంటె మీవారు నెక్కుడుదయతో నాదరించుటచే నారాజ్యము పాడి పంటలు గలిగి వర్ధిల్లెను.

మొదటిభాగము-సమాప్తము.






రెండవభాగము.

# మారువారురాజుల చరిత్రములు

ఈవఱకు మీవారు సంస్థాన ప్రభువుల చరిత్రములు తెలుపఁబడినవి. ఇఁక మీఁద మారువారు సంస్థాన ప్రభువులలోఁ గొందఱి చరిత్రములు సంగ్రహముగా దెలుపఁబడును. రాజపుత్రులు సత్కుల ప్రసూతులు శౌర్యరాసులు నగుటచేత నెట్లయిన నమ్మహావీరులనురప్పించి తమ కొలువులో నిలుపుకొనుటయే మొగలాయి చక్రవర్తులకుముఖ్యసంకల్పమయి యుండెను. ఆసంకల్పము సంపూర్ణముగ నెరవేరుచునే వచ్చెను. ఎట్లన దమరాజులచేత రాయబారులుగఁ బంపఁబడి కొందఱు రాజపుత్రులును, దమరాజులతో కలహమాడి దేశమునుండి వెడలఁగొట్టఁబడి కొందఱు రాజపుత్రులును, నేదో యుద్యోగమునంపాదించుకొనుటకుఁ గొందఱు రాజపుత్రులును వచ్చి చక్రవర్తిం గొలచుచు వచ్చిరి. చక్రవర్తికి వారిపై నభిమానముండుటకుఁ గారణమిది; రాజపుత్రులు తమస్వజాతివారితో బోరవలసి వచ్చినను సరే తదితరులతో బోరవలసి వచ్చినను సరే యుద్ధమున భయమను మాటనెఱుఁగక మడమఁదిరుగక తమ్ము నమ్మినవారిం జెరుపక పగతుం గెలుతురు. గెలువజాలని యెడ ప్రాణములు విడుతురు. యుద్ధములులేక దేశము

నెమ్మదిగా నున్నప్పుడు డిల్లీకోటలోఁ గాఁపురముండి యారాజపుత్రులు చీటికి మాటికి నెవరితోనో గయ్యమునకుఁ గాలుదువ్వుచు గర్వోన్మత్తులై యెల్లప్పుడు నేవో గొడవలు సేయుచునే యుండువారు వారు చక్రవర్తికి లోఁబడి వంగి సలాముచేసి వినమ్రులై యుండినను దైవవశమున నేదో కోపకారణము గలిగినప్పుడు తమ యెదుటి వాఁడెంతవాఁడైనను సరే సరకుఁగొనక సభాసదులతో సభలో నేగలహింతురు. సభాసదులతో నననేల యొక్కప్పుడు నల్లమందు మద్దతు మత్తుచేత నొక్కప్పుడు క్రోధాతిరేకముచేత వారొడలు మరచి తమ్ము బోషించు చక్రవర్తినే సంహరింపఁ జూచెడువారు. రాజపుత్రు లిట్టి యుగ్రస్వభావులని యెఱింగియే చక్రవర్తులు తరుచుగా వారిని బట్టణములో బ్రత్యేకముగా నొకస్థలమందు విడియించి సాధ్యమయినంతవఱ కితరులతో సంబంధము లేకుండఁ జేయుచు వచ్చిరి. అటులుంచినను వారిమూలమున సంభవించు కలహము లంతము నొందవయ్యె.

షాజహాను చక్రవర్తియయిన కాలములో నతని కొలువున జగజట్టియగు నునూరియను రాజపుత్రుఁ డొకఁడుండెను. అతఁడు రహతూరు వంశస్థుఁడు. మారువారు సంస్థాన ప్రభువగు గజమహారాజు పెద్దకొడుకు జ్యేష్ఠుఁడగుటచే నతండు యువరాజై తండ్రికి చేదోడువాదోడుగ నుండవలసినదే, కాని సహజముగ మహా క్రోధస్వభావులగుతన దేశప్రజలకు బంధువులకుఁ గూడ నతఁడు మిక్కిలి దుండగుఁడై భయంకరుఁడై మెలంగుటచే రాజ్యభ్రష్టుఁడయ్యె. అతఁడు బాల్యమునుండియు దుండగులు దుస్స్వభావులు దుర్నయులు నగు నల్లరిపిల్లలను వెంటబెట్టుకొని ప్రజలకెంతయు బాధనుగలిగించుచు వచ్చెను.

కొంతకాలము బాధలు పడిపడి ప్రజ లెట్టకేలకు వానియాగడములకు సహింపఁజాలక గజమహారాజువద్దకువచ్చి "దేవా! మీకుమారుని దేశమునుండి బా[illegible]. మన కెవ

రైన శత్రువులున్న పక్షమున వారిమీఁదికి మన సేనల నడపించుటకు మీఁకొడుకు కడుదిట్టరియే కాని యేశత్రువులు లేనప్పుడు ప్రజలనేయి తండు శత్రువులుగానెంచి చంపుచున్నాఁడు. ఇతని కతమున బ్రజలుకం టినిండ నిదుర కడుపునిండ కూడు నెఱుంగరు. ఇతఁడు దేశములోనున్న యెడల ప్రజలు గాఁపురము సేయఁజాల" రని విజ్ఞాపనము జేసిరి. గజమ హారాజు కొడుకునవులోనుంచఁజాలకపోవుటచే ప్రజాభిమతమునకంగీ కరించి మంత్రులను సామంతులను బంధువులను పురోహితులను సేనా పతులను బిలిపించి నిండుకొలువుదీర్చి కుమారుని రావించి యందఱియె దుట వానిని రాజ్యభ్రష్టునిఁ చేసినట్లు శాసనము వ్రాసి దేశమునువిడిచి తక్షణమే పోవలసినదని యాజ్ఞాపించెను. ఉమ్రాయు దేశమువిడిచి పో వువారు చేయవలసిన విధముగ నల్లబట్టలు కట్టుకొని నల్లనిడాలుమూఁ పునదాల్చి నల్లనికత్తి చేఁబట్టుకొని నల్లజీనువేసిన నల్లగుఱ్ఱముపై నెక్కి యందఱివద్ద సెలవుపుచ్చుకొని యాశలెల్ల వదలుకొని జన్మభూమి విడిచి దేశాంతరములకుం బోయెను.

రాజకుమారుఁ డెంతదుష్టుఁడైన నతఁడు వెళ్ళినదినము దుర్దిన మేయని దేశస్థులందఱు విచారించిరి. ఆరాజకుమారునితో ననేక సా మంతరాజపుత్రులుగూడ బయలుదేరి వానిస్నేహమును బాయలేక దేశము విడిచిపోవుటచే రాజకుటుంబమేగాక బంధుకుటుంబములన్నియు దుఃఖనిమగ్నములయ్యెను. అట్లు వెడలి యుమ్రాపయనంబులఁ జేసి చేసి యాగ్రానగరంబునకుఁ బోయి షాజహానుని సందర్శించివానిం బ్ర సన్నుని జేసికొని తనకథ వానికెఱిఁగించి తనతండ్రినిశిక్షించితన్నెమ రల మారువారునకుఁ బంపుమని ప్రార్థించెను. షాజహానునకు నలుగు రు కొడుకులుండిరి. వారతి దుండగులై మాటిమాటికిని యొండొరులతోఁ గలహించుచువచ్చిరి. దుర్వినయముగల కొడుకులవలన గలుగుబాధ లు షాజహాను స్వీయముగ ననుభవించుచుండుటచే గజమహారాజుమా

డ తనకొడుకు కతముననెంతబాధ పడియుండునోయనియూహించివాని కేసాయమును జేయుననిచెప్పి "కావలసినయెడల నావద్ద కొలువుండుము నేనొకయుద్యోగ మిచ్చెద"నని పలికెను. గత్యంతర మేమియు లేకపోవుటచేనా రాచబిడ్డఁడు మంచిదని వానికొలువున గుదిరెను. కుదిరిన కొలఁదికాలముననే వానిని మూడువేలసైనికుల కధిపతినిజేసి రావుబిరుదమునిచ్చి నాగూరుతాలూకా వానికిముఖాసాగా నిచ్చిపలువిధముల నాదరించెను.

ఉమ్రావుకుఁ జిన్ననాఁటినుండియుయుద్ధమే యభిమానవ్యాపారము. అదిలేనినాఁడు వేఁట పరమప్రీతికరము. ఈరెండును లేకకడుపునిండ తిని చక్రవర్తికొలువులో నిరర్థకముగఁ గూర్చుండుటయుఁ బ్రతిదినము దర్బారులలోనికిఁబోవుటయునచ్చటమితిమీరిన మొగలాయిమర్యాదలు నడుపుటయు రాచవిందులకుఁబోయి యొదిగియొదిగియుండుటయు భోగముబోటుల యాటలు చూచుటయు బాటలు వినుటయు మొదలగు పనులన్నియు వానికి మిక్కిలి నసహ్యములుగ నుండెను. హాయిగా నడవులలోఁ దిరుగుచు సెలయేటినీళ్ళు ద్రాగుచుయడవిపందిని దఱుముట పెద్దపులినిజంపుటమరలనెన్నఁడయిన తనకుఁగలుగునా యని యూటలూరుచునతడక్కడకొంతకాలముగడపెను. ఒక్కనాఁడు షాజహాను నిండుకొలువుదీర్చి కూర్చుండి యుమ్రావుసభలో కనఁబడక పోవుటచే నతఁడేడని సభాసదుల నడిగెను. సభలోనివారెవ్వరెఱుఁగమనిరి. ఎవ్వరితోడం జెప్పకుండ నతఁ డాగ్రానగరము విడిచిపోయెగావలయునని యెల్లవారు నూహించిరి అనంతరము రెండు వారములుగడచుటయు నొకనాఁడా రాజకుమారుఁ డెప్పటియెట్ల సభకరిగిషాజహానుని కంటఁబడియె పడుటయుఁజక్రవర్తివానిపై నలిగి "మావద్ద సెలవుగైకొనక యెవ్వరితో నొక్కమాటయయిన జెప్పక యెందరుగుదువో తెలియక యేలపోయితివి. నీకు గొప్ప జరిమానావేయదలచు

చున్నార" మని కఠినముగా బలికెను. "నేను వేటకుఁబోయితినిక త్తి యేతప్ప వేరుధనములేనివానికి ధన దండనవిధించుట యేమిలాభ"మని నిర్భయముగ నతఁ డుత్తరము జెప్పెను.

ఈపలుకులు చక్రవర్తి యలుకను రెండు రెట్లుగఁ జేసెను. తరువాత నమ్రాట్కొలువు విడిచి తనబసకుఁబోయినకొంత సేపటికి షాజహానుని సైన్యములకుఁ బ్రతిమాసము జీతములు పంచిపెట్టునట్టి యుద్యోగస్తుఁడు సలబత్ఖానునతఁడు పోయి "చక్రవర్తిగారు నీకు జరిమానా వేసిరి. ఆధనమిమ్ము" అని యడిగెను. "జరిమానాకాదు చిల్లిగవ్వయేని నే నియ్యనని చెప్పు" మని యమ్రా యతిగర్వముతో బ్రత్యుత్తర మిచ్చెను. మాటమీఁద మాటవచ్చుటచే నిరువురు తీవ్రముగ సంభాషించి యొండొరులను నిందించి యధిక్షేపించి తిరస్కరించుకొనిరి. కోపావేశమున నమ్రా సలబత్ఖానుని దన యింటనుండి మెడబట్టి యావలకు గెంటెను. ఖానుతద్దయుఁ గంపితుఁడై రాజపుత్రునిపాగరెక్కైన నణచవలయునని కసిబూని చక్రవర్తి కడకుఁబోయి "స్వామీ! యాదురాత్ముఁడు మీయాజ్ఞనధిక్కరించెను. నన్నేగాక మిమ్మునుగూడ నవమానించె" నని యొకటికి పదిబన్ని చెప్పెను. అప్పలుకులువివి చక్రవర్తి కాలరుద్రుఁడై యమ్రాని తక్షణము దోడ్కొనిరమ్మని యొకబంటునంపె. వాఁడును పరుగు పరుఁగున వగర్చుకొనుచు వచ్చి పిలుచుటయు నరేయని యమ్రామాతీవ్రమైన యొక ఖడ్గము జేతబూని చిన్నసూరకత్తి మొలలోదోపుకొని యేటుతిన్న బెబ్బులివలె చక్రవర్తి యెదుటికిం బోయెను. అప్పుడు చక్రవర్తి కొలువులో ననేక రత్నస్థగితమైన విన్నాణపు నగిషీలతో నిండి సొంపులనింపు స్ఫటిక సింహాసనముమీఁద గూర్చుండి కోపారుణిత నేత్రుఁడై రాజపుత్రుని రాక కెదురుచూచుచుండెను. సలబత్ఖాను గద్దెయెదుట నిలువంబడి రాజపుత్రుఁడు గావించిన దుర్వినయమును దౌర్జన్యమును

గంతమెత్తి తన యేలికతోఁ జెప్పుచుండెను. రాజపుత్రుఁ డాపలుకులు విని మితిమీరిన బిట్టలుకం బట్టఁజాలక "సూర్యవంశము నందు పరిభవించిన సుక్షత్రియుఁడను నేను గోమాంస భక్షకుఁడైన యీకటికు తురకచేతవంచింపఁబడుదునా" యని లోఁదలంచిచక్రవర్తిగద్దె చుట్టునున్న సామంతులను సరదారులను గడచి సలబత్ఖాను వద్దకు బోయి యందఱు నివ్వెరపడునట్లుఖడ్గమునెత్తి యొక్క యేటునయాఖానుని నేలంగూల్చెను. సభాసదులందఱు రిచ్చపడి యేదిసేయుటకుం దోఁచక యుండ నంతలో రాజపుత్రుఁడు నరసింహమూర్తి వడువున లోకభీకరుఁడై యుచితానుచితము లెఱుంగక చక్రవర్తిం దెగటార్ప వలయునని వానిపై ఖడ్గమువిసరెను. అదృష్టవశమున ఖడ్గముషాజహానునకుం దగులక స్ఫటిక స్తంభములలో నొకదానికిం దగిలి విరిగిపోయెను., అప్పుడు సభాసదులు భయసంభ్రమాక్రాంతులైరి. చక్రవర్తియొక చిన్నగుమ్మమున నంతఃపురమునకుం బారిపోయి యెట్లో ప్రాణమును దక్కించుకొనియె.

రాజపుత్రుఁడు ఖడ్గపాణియై పిచ్చియెత్తిన మదపుటేనుఁగు విధమున సభామందిరమున విచ్చలవిడిగా దిరుగుచు మిత్రుఁడనక శత్రుఁడనక కత్తికందిన వారినందఱఁ దెగటార్పఁజొచ్చె. ప్రళయకాల రుద్రునివలె నున్న వానియెదుట నెవ్వరు నిలువఁజాలరైరి. ఎట్టకేలకు వాని మఱఁది వానిచేసిన పరాక్రమంబుల మెచ్చుకొనుచు మిత్రుఁడు వోలెచల్లని మాటలు జెప్పుచు వానిదాఁపునకుంబోయి యల్లన చేతిలోని కత్తిలాగి యొక్కపోటుఁ బొడిచి వాని నేలంగూల్చెను. దారుణమయిన గాయముతగిలియు రాజపుత్రుఁడు కొనయూపిరి యున్నంతవఱకు సభాసదులకు దేరిచూడ శక్యముగాక యుండెను. ఆదినమున నమరుచేత నైదుగురు మొగలాయి దొరలు నిహతులైయుండిరి. అయిన నమరావృత్తాంత మంతతో ముగియలేదు. ఈరాజకుమారుఁ

డు పాదుషా కొలువులో మృతినొందెనని వానిసైనికులు విని రోషవి హ్వాల చిత్తులై క్రిందుమీఁదుగానక మెరపిబట్టలు కట్టుకొని యాయు ధపాణులై ద్వర్బారు ప్రవేశించి నేలం గూలియున్న తమ దొరం జూచి రెట్టించిన యలుకతో సింగంబులట్లు విజృంభించి యడవిలో వృక్షములు నరికినట్లు మొగలాయిబంట్లను నరికి నేలయంతయురక్త ముతో జారునట్లు చేసిరి. ఆసభాభవనములోని స్తంభములు జూచు వారికి నాఁడుజరిగిన చర్యలు నేఁటికైనజ్ఞప్తికి వచ్చుచుండును.

అట్లనేకులఁబరిమార్చి యావీరసైనికులు పలుగాయములంజెం ది తమస్వామిఋణము దీర్చుకొని నేలనుగూలిరి. అనంతరము దర్బా రున జరిగినవృత్తాంత మంతయు నుమారిభార్య విని కొందఱు పరిచా రకులతో సభా భవనముం బ్రవేశించి తననాథుని శవము వెదకి యా నవాలుపట్టి సేవకులచే దాని మోయించుకొని శ్మశానభూమికరిగి భర్తృసహగమనము జేసెను.

నాఁడు రాజపుత్రులు సభాభవనములఁ జొచ్చినద్వారము పా జహాను మూసివేయించి మరల నెన్నఁడు తెరువనీయలేదఁట. అక్క డగోడకలుగులలో నొకకాలసర్పము వసియించి యెవ్వరి నాదారిని నడువనీయదని లోకులు చాలకాలము జెప్పుకొనిరి. వారిమాట నిశ్చ యమేయయ్యెను. ఆగ్రానగర మింగ్లీషువారి స్వాధీనమైనపిమ్మట రమా రమి నూరేండ్లక్రిందట నొక యింజనీరుదొర యాగోడం బగుల గొట్టించెను. అక్కడ పామున్నది. ఆగోడజోలికి పోవద్దని పురవాసు లు చెప్పినను వినక యాదొర పగులగొట్టింప నొకకలుగులోనుండి యొక మహాసర్పము బయలు దేరి దొరగారి కాళ్ళనందునం బడెను. కూలివాండ్రు భయభ్రాంతులై చెల్లాచెదరైరి. అదియేమి అదృష్ట మోకాని పాము దొరగారి నేమియుఁ జేయఁజాలక వానిచేఁ జచ్చెను.

ఈకథనిక్కడముగించి మఱియొకవీరునిచరిత్రము చెప్పెదను.

ఉమాత్రితమ్ముఁడగు రాజా జస్వంతుఁడు మారువారు నేలుచుండ కుంపావతి వంశస్థుఁడు అసోపుసంస్థాన ప్రభువగు ముకుందదాసను రాజపుత్రుఁడు మిక్కిలి ప్రసిద్ధుఁడై జస్వంతుని కొలువులో నుండెను. వానిసాహస మెఱిఁగి యట్టివానిని విడిగ నుండనియ్యఁగూడదని షాజహాను కొడుకగు నౌరంగజేబు చక్రవర్తి వానిని బలవంతముగ రావించి వానికనిష్టమయినను దనసభలో నుంచుకొనియె. ఒకనాఁడు చక్రవర్తి తనయొద్ద కేదో వర్తమానమంప ముకుందదాసు నిర్లక్ష్యముగఁ బ్రత్యుత్తరమిచ్చెనఁట. అది సహింపక యౌరంగజేబు మహాకంపితుఁడై తక్షమే యారాజపుత్రుని నిరాయుధునిజేసి పెద్ద పులిబోనులో ద్రోయవేయుఁడని యాజ్ఞాపించెను. ఆవైచిత్ర్యమును జూచుటకుఁజక్రవర్తియు వాని పరివారమును నొకచోట జేరిరి. రాజపుత్రుఁడు బోనులోవిడువఁబడెను. బెబ్బులి యాశూరునింజూచి కనులెర్రజేసి తోకయాడించుచు ముందుకు వెనుకకు దిరుగఁజొచ్చెను గాని వానిమీఁదికిం బడఁజాలదయ్యె. పులికన్నులకంటె నల్లమందు మద్దత్తుచేత రాజపుత్రుని కన్నులు మిక్కిలి యెఱ్ఱబడి యుండెను.

అట్లు నిరాయుధుఁడై కొంతసేపుబోనులో నిలిచి ముకుందదాసు బెబ్బులిం జూచి “ఛీ! తురకపులీ రాచపులిమీఁదికి రావేమే” యని బిగ్గరగా బలికెను. ఒక్కనిముసమువరకు బెబ్బులియు రాజపుత్రుఁడు నొండొరులం రెప్పవాల్పక జూచుకొనిరి. ఏమిజరుగునో యని చూపరులు నిశ్చేష్టులై యుండునంతలో వ్యాఘ్రము తలవంచుకొని బోనులో వెనుకప్రక్కకుఁబోయెను. అదిచూచి ముకుందదాసు చక్రవర్తి వంకదిరిగి “చూచితిరా! మీపులి నామీఁదికి రాఁజాలక తోకముడిచినది. బెదురుచున్న శత్రువును సంహరించుట రాజధర్మము గాదుకావున నేనీ వ్యాఘ్రమును జంపక విడిచితి” నని కంఠమెత్తిపలికెను.

జన్మమధ్యమున నట్టిమహాద్భుతమెన్నఁడు గనివిని యెఱుంగక పోవుటచే నౌరంగజీబు లేనిషంతోషము కొంత తెచ్చిపెట్టుకొనిముకుం దదాసును బోనలోనుండి బయటికి రావించి వానికి బహుమానము లుకుప్పతిష్ఠలుగనిచ్చి "అసాధారణమగు నీపౌరుషధనమునుస్వీకరించి నీకుంబ్రతిష్ఠ తేఁగల కొడుకులున్నారా" యని యడిగెను. ఆపలుకు లకు ముకుందదాసు "మీరు మాయిండ్లకుఁ బోనీక మమ్మ చిరకా లము మీకొలువులో నేబడవేసి నిలుపుచుండఁగ మాకు సంతాన మెట్లు గలుగఁగల" దని నిర్భయముగ బత్యుత్తరమిచ్చెను. ఆదినము మొదలు ముకుందదాసు పులిదొరయను పేరంబరఁగెను.

ఈతని రెండవసాహస కార్యము చక్రవర్తి కుమారులలో నొకనితో వివాదము సంభవించినప్పుడు చేయఁబడెను. రాజపుత్రుల లోమిక్కిలి కష్టమైన గుఱ్ఱపుదాడొకటికలదు. అదిచేయువారికిహాని కరము చూచువారికి భయంకరమునై యుండును. రౌతుగుఱ్ఱముమీ దనెక్కి యదినిండుదౌడు తీయుచుండఁగ దానినొక చెట్టుకొమ్మక్రింద నుండిపరుగెత్తించి గుఱ్ఱమునాపకుండగనే యతఁడు చెట్టుకొమ్మను పట్టు కొనవలయును. ఇట్టిమహాసాహసమును చేయఁబ్రయత్నించి మీవారు రాజపుత్రుఁడొకడు ప్రాణములఁగోల్పోయెనఁట. ఈపనిసేయునపుడు సాధారణముగ నెట్టిశూరుఁడయినను గుఱ్ఱముమీదనుండినేలఁబడనివా డుండడు. ఈవిద్యలో ముకుందదాసు నిరుపమాన ప్రజ్ఞగలవాడు. అట్లగుటచే నౌరంగజేబు కొడుకులలో నొకడీ చిత్రగతుల జూడవేడుక పడి యాపనిని సేయుమని వానికి వర్తమానమంపెను. దొమ్మరివానినో గారడివానినో బిలపించి చక్రవర్తిపుత్రుఁడు విద్యలు సేయమన్నాడని యుఁ దనకుఁ జాల గౌరవభంగము గావించెననియుఁ గోపించి ముకుంద దాసు ముప్పొద్దు తిని గూర్చుండి పనిపాటలులేనిసోమరిపిల్లవానిమెదు ట నేనా నావిద్యజూపించుట యని యభిమానముజెంది "నేనుకోతినిగా

ను నావిద్యలు జూడవలసిన పక్షమున నాఖడ్గము తళతళ మెరయుచున్న ప్పుడు చూడవలసినచోటఁ జూడవచ్చు" నని యాబాలునకు వర్తమానమంపెను. ఆవార్తఁదెచ్చినవాఁడు ముకుందదాసుపలుకులు తూచదప్పకుండ నబ్బాలునకు విన్నవించెను. విన్నవించుటయు నతండు తండ్రితోఁ జెప్పియతని పొగరడంపదలఁచి యాకాలమున జక్రవర్తికిలోఁబడక తిరుగుబాటుఁజేసిన సిరోహిప్రభువగు సూర్తానునులో బరచుకొనిరావలసినదని ముకుందదాసున కానతిచ్చెను. అట్లెయనిముకుందదాసుబయలువెడల వానియనుచరులగు రాజపుత్రులును వెంటఁజనిరి. కానిసూర్తాను నసియించు కోట యీపులిదొరకును, వానియజమానుఁడగు నౌరంగజేబునకును సాధ్యముకానిదియు వాని ఫిరంగి దెబ్బలకు సరకుగొననిదియునైయుండె. అచలఘరని దానిపేరు. అనగా చలనములేనిది యని దానియర్థము. సూర్తాను కోటవిడిచిబయటికివచ్చి యుద్ధమెన్నఁడు సేయక లోపలనే చిరకాలము డాగియుండెను.

అట్లు కొంతకాలముండి శత్రుభయము పోయినదనుకొని యాసూర్తానొకనాఁడు రాత్రియజమీరు ప్రాంతమున నున్న కొండనడుమ వేఁటకువచ్చి యొకచెట్టుక్రింద నిజపరివార సమేతుఁడై నిద్రించుచుండెను. అక్కడకు శత్రువు లెవ్వరు రాజాలరని నమ్మి పర్వతముఖద్వారమున నొకజోదును గావలియుంచి రాజుతోపాటు పరివారముగూడ గాఢనిద్రఁ జెందెను. అట్లు కొంతసేపు నిద్రించి సూర్తానుమేలుకొనిమంచముమీఁదనుండి లేవబోవగా నతనికాలు సేతులతనికి స్వాధీనము గాకపోయెను. ఎవరో యెట్లోవచ్చి తన తలపాగాతోనే తన మంచమునకే తన కాలుసేతులు తనకుఁ దెలియకుండ నెవరో గట్టిపెట్టిరని యతఁడప్పుడు తెలిసికొనెను. తెలిసికొని కన్నులు తెఱచి చూచునప్పటికి తన యనుచరుల విగ్రహములు గాక మున్నెన్నఁడు చూడని క్రొత్తవిగ్రహములు గానఁబడెను. ఇదియేమని కలవరము పడుచుండ మాఁసువారుఁ రాజు

ల యుద్ధపు కేక మేఘగర్జనమునంటి గంభీరస్వరముతో వానిచెవులంబడె
ను. ఆధ్వనివిని సూర్తానుయొక్క పరిచారకులు దిగ్గున లేచి మేలుకాంచి
యాయుధపాణులై చూచునప్పటికిఁ గావలివాఁడు చచ్చి పడియుండెను
రాజుబంధింపఁబడి శత్రుహస్తములజిక్కెను. వానిచుట్టు యమదూతల
ట్లు శత్రుయోధులు గ్రమ్ముకొనిరి. వారినడుమ ఖడ్గపాణియై పులిదొ
ర నిజముగా బెబ్బులియట్లు బొరయజొచ్చెను. సూర్తానుయొక్కయను
చరులు తమయేలికను విడిపించుటఁ బ్రయత్నములుసేయుటఁ జూచి
ముకుందదాసు వారల కిట్లనియె. "మీరాజు ప్రాణములు నా చేతనున్న
వి. అతని విడిపింపఁ బ్రయత్నించి మీరు నాపైకి గవియుదురా యి
ప్పుడే మీదొర చచ్చెనని నమ్ముడు. ఆప్రయత్నము మానుకొందురా
మీరాజు చెక్కు చెదరక మరల మీకడకు వచ్చు. మీతోఁజెప్పకుండ
తీసికొనిపోఁగూడదని మీరు మేలుకొనునట్లు కేకలువేసితినిగాని రహస్య
ముగ దీసికొని పోఁజాలకఁగాదు. కావున మీప్రయత్నము మానుడు.
ఆపలుకులు విని వారు వివేకులై యూరకొనిరి. తొల్లి పృథివిరాజు
మాళవరాజుం జెరపట్టి తెచ్చినవిధమున ముకుందదాసు సూర్తానుం
బట్టుకొని తనయొకటి యజమానుఁడగు రాజాజస్వంతసింగున కప్ప
గించెను. జస్వంతసింగు తక్షణమే సూర్తానును ముకుందదాసుని వెంట
బెట్టుకొని చక్రవర్తిననలన నేయపాయము లేకుండ జేసెదనని సూర్తా
నున కెన్నో బాసలుచేసి యౌరంగజేబువద్దకుఁ బోయెను. చిరకాలము
నుండి దొరకక మొగలాయీసేనలకు ముప్పుతిప్పలు పెట్టిన సిరోహీ
రాజువచ్చెననివిని యౌరంగజేబు వానిం దనయెదుటకు రప్పింపుమని
యానతిచ్చె. ఇరువురు సేనాపతులు సూర్తానకుఁ జెరియొక ప్రక్క
నిలిచి వానిం గొలువునకు దోడ్కొనివచ్చి యెదుటనిలువంబెట్టి చక్ర
వర్తికి సమస్కరింపు మనిరి. రాజపుత్రుఁడు కన్నులు మూసిచి
రోషాయత్తుఁడై "నేనా సమస్కరించుట. నాప్రాణము చక్రవర్తి

చేతులలో నుండినను నుండుగాక! నా గౌరవము నా చేతులతోనే యున్నది. ఈవరకెన్నఁడు నేను మనుష్యమాత్రునకు వంగి నమస్కరించి యెఱుఁగ. ఇఁకముందు నమస్కరింపఁ"నని ప్రత్యుత్తరము చెప్పెను. ప్రక్కనున్న సేనాపతులిద్దరు బలవంతపెట్టి వానిచేత నమస్కారము జేయింపవలయునని యూహించిరి కాని యతఁడు జస్వంతసింగుయొక్క సంరక్షణమునం దుండుటచేతను జస్వంతసింగుమాట యనిన జక్రవర్తికిఁ జాలగౌరవముండుటచేతను తెగించి వారేమియుఁ జేయఁజాలరైరి. దండము పెట్టింపక పోయినచోఁ జక్రవర్తియేమనునో బాధించిపెట్టించినచో జస్వంతసింగేమనునో యనుభయమున సేనాపతులు వేరొకగడసుపోకడ పోఁదలఁచి చక్రవర్తి కూర్చుండిన గదికి రెండవప్రక్కనున్న దొడ్డిదారిని దీసికొని లోనంబ్రవేశింపుమనివానికానతిచ్చిరి. ఆదారిం బోవునప్పుడైన సూర్తాను తలవంపక తప్పదుగదా? యదియే తలవంచి చక్రవర్తికి నమస్కరించినట్లు భావించుకొనవచ్చునని యాసేనాపతు లూహించిరి. కానిసూర్తానుఁ డావులించిన ప్రేవులులెక్కపెట్టువాఁడగుటచే వారుపన్నిన యీకుట్రను గ్రహించి తలుపువద్దకుఁబోయి ముందుగా తల దూర్చక కాళ్ళలోపలికిబెట్టి యాగది ప్రవేశించెను. అదృష్టవశముచేత నప్పుడౌరంగజేబు రాజపుత్రుని గౌరవాసక్తికిని వానిపెంకితనమునకును గోపించుటకు మారు వినోదమునొంది సూర్తానును క్షమించి వానికిఁ గొన్నిగ్రామములు ముఖాసాగా నిచ్చెను. ఆముఖాసా పుచ్చుకొన్నచో జక్రవర్తికిదాసు కప్పముగట్టవలసివచ్చునని శంకించి సూర్తానిట్లనియె "స్వామీ దేవరవారు నాకెన్నియిచ్చినను నా యచలుఘురుకోటకవి సమానములు కావు. కాబట్టి నాకోటనాకు దయచేయుఁడు" అనవు డౌరంగజేబు కప్పముమాటఁ దలపెట్టకయే వానికోట వానికిచ్చెను. పులిదోర పట్టి తెచ్చిన యారాజపుత్రుఁడు తనకోటకుబోయి తలవంచి యొకరికెన్నఁడు నమస్కరింపకయే కాలము గడపెను.

ఔరంజేబు చక్రవర్తి మార్వారు రాజగు రాజా జస్వంతసింగు మీఁద మనస్సులో మిక్కిలి యీర్ష్యవహించి యుండెను. ముకుందదాసు కుక్కవలె జస్వంత సింగునెడ విశ్వాసము గలిగియుండి యెప్పటికప్పుడతని కంటికి రెప్పవలెఁ గాపాడుచు పలుసారులు గొప్పయపాయముల నుండి వానిని దప్పించెను. ఆయపాయము లన్నిఁటికంటె నెక్కువయిన యపాయ మొకటి జస్వంతున కొకసారి సంభవించెను. అది యేదియన జస్వంతునకు దయ్యముపట్టెను. కష్టపడి దానిని ముకుందుఁడు వదలించెను.

ఉదయసింగు మహారాజు కుమారుఁడగు ప్రతాపసింగు మేవారు నేలుచుండిన కాలమున మఱియొక యుదయసింగు మారువారు రాజ్యము నేలుచుండిరి. అతనికి మోటరాజాయని రెండవపేరుగలదు. అనగా లావురాజని యర్థము. ఆతని తండ్రి మహాపరాక్రమశాలి. అతఁడు తండ్రికడుపున చెడఁబుట్టి యక్బరునకు లోఁబడి ప్రతిష్టజంపుకొని యిరువదియేడుగురు కన్యలం బెండ్లియాడి భోగపరాయణుఁడై నిరంతర మంతఃపురములో నివసింపుచు వచ్చెను. ఆరాజు మనము నమ్మ టకువీలు లేనంత లావుగానుండుట సంస్థానములోనున్న గుఱ్ఱమేదియు వానిని మోయలేకపోయెనఁట. అందుచేత నతఁడు తనబంధువులగు రహాతూరులతోఁ గలసి యుద్ధమునకుఁ బోవుటకు వీలులేక యాడువాండ్రతో గోడిగంబు లాడుచుండవలసివచ్చెను.

ఈలావురాజు తనరాజ్యములోనున్న యొక బ్రాహ్మణునికూతురునుజూచి యతిసుందరియగునామెను మోహించి యామెనుబలిమినిదన యంతఃపురమునకు దీసికొనిపోవ నిశ్చయించెను. ఆబాలికతండ్రి రాజు నెన్నో విధముల వేడుకొనెను బెదిరించెనుకాని యవియన్నియునిరర్థకములయ్యె. మరణమువల్లగాని బిడ్డమానము దక్కదని బ్రాహ్మణుఁడు నిశ్చయించి తనముద్దుకూతురును ఖడ్గముతో ముక్కముక్కలుగ నరికి

చితిపేల్చికాల్చిరాజునకు ఘోరశాపము బెట్టి యామంటలో దానుగూ డ దుమికి యగ్నిహోత్రునకు కాహుతియయ్యె. అప్పుడతఁడిచ్చిన శాప మిది. "నేనే సత్యవంతుఁడనగు బ్రాహ్మణుఁడ నయితినేని యీదు రాత్మ్ముఁడగు రాజీగడియ మొదలుకొని మూఁడుసంవత్సరముల మూఁడు మాసముల మూఁడుదినముల మూఁడుగడియలలో మృతినొందునుగాక. నేమృతినొంది యీదినము మొదలు బ్రహ్మరక్షసునయి యీయూరి చెరువువద్ద నుండెద" బ్రాహ్మణుని యాదారుణకృత్యమువినియారాజు బెంగబెట్టుకొని క్రమక్రమముగ కృశియించి బ్రాహ్మణుఁడేర్పరచినకా లమునకే మృతినొందెను. రాజాజస్వంతసింగు లావు రాజని పేరుపడిన యాయుదయసింగుని మునిమనుమడు. ఈరాజు తనవద్దనున్న యుద్యో గస్థులలో నొకని కూతును మోహించి యామెనొడంబరచి తనముత్తా త మోహపరవశుఁడై చెడియెననుమాట మరచి బ్రహ్మరాక్షసుఁడున్న సంగతి యెఱుఁగక యాచెరువుగట్టుననే ప్రియురాలుం దానురాత్రిక లసికొనునట్లు సంకేతమేర్పరచుకొనెను. సంకేతము మరచిపోక రాత్రి వేళ యిరువురక్కడకలసికొనిరి. కాని సౌఖ్యమునకుమారు వారికిదుః ఖము ప్రాప్తించెను. జస్వంతసింగు తనవలపుకత్తియను మక్కువమెయి గౌగలింపఁబోవ వారిరువురినడుమ నొకభూతమువచ్చి నిలిచెను. రాజా భూతముతో బోరదలఁచెను. కాని వెంటనే స్మృతియెఱుఁగక నేలంబడి యె. ప్రియురాలి దారిని ప్రియురాలు పోయెను. పిదపనతఁడు కొంతతడ వునకుఁ దెప్పిరిలి యింటికిబోవ దనవెన్నంటి యెవఁడోవచ్చుచుండినట్లు మాటిమాటి కతనికి నొడలు జల్లుమనియెను. తరువాత సయితమతఁ డెక్కడకుబోయిన నేపనిచేయుచుండిన వెనుక నెవరోవచ్చునట్లె కాన బడుచు వచ్చె. పిమ్మటఁ గొన్నినాళ్ళ కతనికి మతిచెడి పిచ్చియెత్తెను.చె ఱువుగట్టు నాశ్రయించి యుండిన బ్రహ్మరాక్షసుఁడు రాజుం బట్టుకొ నియెనని ప్రజలు చెప్పుకొనసాగిరి. మహారాజుగారి దయ్యము విడల్చ

టకు దేశ మంతటనుండి మంత్రివేత్తలు బ్రాహ్మణోత్తములు వచ్చి ధూపములువేసి జపములుచేసి మంత్రములజదివి యెన్నో ప్రయత్నములు సేయ నెట్ట కేలకు బ్రిహ్మరాక్షసుఁ డిట్లుపలికెను. "నేనొక బ్రహ్మరాక్షసుఁడను ఈరాజును బట్టినమాట నిజము మఱియొక రెవరయిన మనుష్యుఁడునాకు లభించినగాని నేనువీనిని విడచిపోను. రాజు ముఖ్యమంత్రిలలో నెవఁడయిన నాకు గావలెను." జస్వంతసింహునకు ముకుందదాసుకంటె ముఖ్యమంత్రి లెవ్వరు లేరు. అతఁడు మంత్రియై రాజునకు రాజనీతి నుపదేశించుటయే గాక సేనాధిపతియయి రహతూరు వంశపుదొరలను రణరంగమునకు నడిపించెడు నధికారము గౌరవము గలిగియుండెను. అందుచేత నీభారమునతఁడే పూనవలసివచ్చె.

ముకుందదాసుఁడు వెనుఁగొనక ముందరికివచ్చి రాజునువిడిచి భూతముతన్ను బట్టుకొనుట కిష్టపడిన పక్షమున దానాకష్టము ననుభవింతునని విస్పష్టముగ జెప్పెను. బ్రిహ్మరాక్షసుఁడందు కొడంబడియె. అప్పుడు మంత్రివేత్తలొక గిన్నెలో నీరువోసి యాగిన్నె మూడుసారులు రాజుతలచుట్టుఁ ద్రిప్పి దానిని ముకుందదాసుచేతికిచ్చిరి. ముకుందుడొక చుక్కయైన మిగల్చక యానీరు ద్రావెను. వెంటనే దయ్యము జస్వంతసింగును వదలి ముకుందుని పట్టుకొనియెను. ఆదినము మొదలు ముకుందునివంటి రాజభక్తుఁడు కృతజ్ఞుఁడు లోకములో లేడని జనులు జెప్పుకొనిరి. కాని ముకుందుఁడీ పెనుభూతము నేత మితిలేని బాధలపడియెనఁట. ఆకారణముచేతనే యతఁడు మరణకాలమున తనకుమారుని బిలిచి "నాయనా! మారువారురాజునకు మంత్రిగానుండి నేబడిన సౌఖ్యము జాలును. నీవీ దినముమొదలు మంత్రిగా నుండవద్దు. మంత్రులమైతిమా రాజునకువచ్చు యాపదలన్నియు మనమే భరింపవలయు." అని హితోపదేశము చేసెను. ఆహితోపదేశమును వాని కుమారుఁడు మన్నించి పితరు ననంతమున

మంత్రిపదమును వదలుకొనియె, అదిమొదలు చంపావతి వంశస్థు లగు రాజపుత్రులు మారువారు దేశమునకు మంత్రులగుచు వచ్చిరి.

---

# జస్వంతసింగు

మారువారు సంస్థానమునకుజాద్పురము రాజధాని. మారువార నునది మరువారను శబ్దము చెడిపోయి పుట్టినది. మరువారనగామరణ భూమియని యాభాషలో నర్థము మీవారు రాజ్యమునకుఁ బడమట నున్న దేశమునకంతకు మరువారనుపేరుచెందుచున్నది. ఆదేశములో నెడలేని యిసుకయెడారులునిర్జలస్థానములు నిస్సారభూములువిశేషము గనుండుటచేత దానికి మరువారను సార్థకనామము గలిగినది. జాద్పు రము గాక బికనీరు జసల్మీరు మొదలగుననేకచిన్నసంస్థానములు గూడ నీమారువారులోనే జేరియుండును. అయినను మరువారుశబ్దము జాద్పురము రాజధానిగఁ గలసంస్థానమునకేముఖ్యముగఁజెందుచున్న ది. ఈదేశమధ్యమునందే యజమీరులోఁ బుట్టిన లూనీయనునది ప్రవ హించుచున్నది. దీనిపొడవు నూటయేబదిమైళ్ళు. మరువారు దేశము నేలునిట్టి రాజులు రహతూరువంశస్థులు క్రీ॥ శ॥ 1193 సం॥ నందు మహమ్మదుగోరీ కోహాణవంశస్థుడగు పృథివిరాజునుజయించిఢిల్లీనాక్ర మించుకొని మరుచటిసంవత్సరము మరల హిందూస్థానముదండెత్తికా న్యాకుబ్జము నేలుచుండిన రహతూరువంశస్థుఁడగుజయచంద్రునిపై యు ద్ధమునకు బోయెను. జయచంద్రుఁడు పరాజితుఁడై మృతినొందెను. అతని యనంతరము వానిమనుమ లిద్దఱు కొంతకాలమచ్చటనుండి తురకల దాడికోర్వలేక తమ పితృపితామహార్జితములగు గంగాతీరక్షే

త్రిములు విడిచి రెండువందలమంది యనుచరులంగూడియెందేని సుఖముగ బ్రతుకఁదలంచి వెడలి వెడలి కొంతకాలము తిరిగితిరిగియారాజనందనులు లూనీనదీతీరము జేరి యచ్చట రాజ్యము స్థాపించిరి తరువాత నూటయేఁబది సంవత్సరములవఱకుఁ దద్వంశస్థులచరిత్రము రాజ్యములో స్థాపించినవారి ప్రారంభదశ లెట్లుండవలెనో యట్లుండెను. అనగా దగ్గర రాజులతో సంబంధబాంధవ్యంబులు జేసికొనియుబలహీనులతో బోరిగెలిచియు సాగినప్పుడు ద్రోహముచేసియుజుట్టుప్రక్కల రాజ్యముల గలుపుగొని యావంశస్థులుప్రసిద్ధులయిరి. ప్రప్రథమమున వారికి మండూపనగరము రాజధానిగనుండెను. అటులుండకొంతకాలమునకు జోధాయను నతఁడుజాద్పురమును గట్టించి రాజధానిగజేసికొనియెను. అదినానాఁటికి ఝూద్పురమనిప్రసిద్ధికెక్కెను. చాలకాలమువఱకు మారువారురాజులు దేశచరిత్రములోనంతగాబ్రసిద్ధికెక్క లేదు. ఢిల్లీచక్రవర్తియగు హుమాయూను రాజ్యభ్రష్టుఁడై యీమారువాగులో దిరుగుచుండ నప్పటి జాద్పుర రాజగు మాల్దేవుఁడు పాపము వానికి నిలువనీడయైన నొసఁగక దేశమునుండి తరిమెను. వానిమనుమడగు శూరసింగు శూరుఁడై యక్బరుచక్రవర్తికిహితుఁడై యుండుటంజేసి యాచక్రవర్తి వానిం దనశత్రువులమీఁదికప్పుడప్పుడుపంపుచువచ్చెను ఆశూరసింగు కుమారుఁడె మున్నొకసారి జహంగీరునకు విపత్సమయమున సహాయముచేసినగజుఁడు. ఆగజునికుమారుఁడే రాజనీతివిశారదుఁడగుజస్వంతసింగు. ఈజస్వంతసింగుఢిల్లీచక్రవర్తులగుషాజహాను ఔరంగజీబులకాలములలోనుండి యాకాలపు దేశచరిచరిత్రనందుజాల ప్రసిద్ధిగాంచెను. 1658 వ సంవత్సరమున షాజహానుచక్రవర్తి ప్రబలమైన వ్యాధిచేత పీడితుఁడయ్యెను. అతని నలువురు కుమారులు తండ్రి చనిపోవువఱకైన వేచియుండలేక యతఁడు జీవించియుండగనే సింహాసనమునకై బోరిడిరి తండ్రి చక్రవర్తియైన కాలమున నీన

లువురునాలుగురాజ్యములు నేలుటకుఁ దండ్రిచేత నధికారముపొంది పరిజలిచ్చినకప్పపుసామ్మంతయుఁ నొకరినొకరు గెల్చుటకొఱకు సేన లంగూర్చుటకే వినియోగించిరి. షాజహానుపుత్రులలో జ్యేష్ఠుఁడు దారాయనువతఁడు. ఇతఁడు తండ్రివద్దనే యుండెను. రెండవయతఁడుషుజా. ఇతఁడప్పుడు బంగాళమునఁబరిపాలించుచుండెను. మూడవయతఁ డౌరంగజేబు ఇతఁడు దక్షిణదేశమును బాలించెను. నాలుగవవాఁడు మురాదు. ఇతఁడు గుజరాతునేలుచుండెను.తండ్రిరోగపీడితుఁడై చావు మీఁద నున్నవాఁడని విని ముందుగ రెండవకొడుకగు షుజా తానే హిందూస్థానచక్రవర్తిననని దేశమంతటఁ జాటబంచి తనపేరుతో నాణెములు ముద్రింపించి మహాసైన్యముం గూర్చుకొని తనయన్నయగు దారామీఁదికి యుద్ధసన్నద్ధుఁడై పోయెను. కడపటివాఁడగుమురాదు వానికంటె ఘనుఁడై తానేచక్రవర్తినైతినని తనదేశమున జాటబంచి తనపేరగూడ నాణెములువేయించి విశేషించి సూరతునగరముదోఁచుకొనియు పురజనులవద్దనుండి యాఱులక్షలరూపాయిలు బలిమిఁదీసికొని సేనలంగూర్చుకొని బయలుదేరెను కానియౌరంగజేబు మొదటినుండి టక్కరితనమున మహాపండితుఁడగుటచేఁ దనకు ప్రపంచసంబంధమేమియు లేనట్లు వైరాగ్య మభినయించి తక్కినసోదరులప్రయత్నము లెట్లు పరిణమించునో చూచుటకు గాఁబోలు కొంతకాల మూరకొనెను రోగపీడితుడగు ముసలిచక్రవర్తియు జ్యేష్ఠకుమారుఁడగు దారాయు నాసమయమున దగుసహాయము జేయగలసహాయులు రాజపుత్రులేయని గ్రహించి ముందుగా షుజామీఁదికి విశ్వాసపాత్రుఁడైన యంబర సంస్థానాధిపతియగుజయసింగును పంపిరి. సార్థకనాముఁడగు జయసింగు యుద్ధమున షుజానోడించి వానిధనమును ఫిరంగులను గొల్లపెట్టి తరిమెను. షుజా యోడిపోయినతోడనే యౌరంగజేబు మురాదుతోఁగలసి దారాతో బోరవలయుననని నిశ్చయించుకొనితనకురాజ్యమక్కరలే

దనియు మురాదును సింహాసనమెక్కించి పిమ్మట దానఃఫకీరై మక్కా లో జీవయాత్రి గడపుదునవియు మూర్ఖుఁడగుమురాదునకుసమ్మికపు ట్టబలికి వానిసైన్యమును దనసైన్యముతోఁ గలిపికొని యన్న మీఁదికి దండువెడలెను.

ఈవార్త వారిరువురు కలియకముందెదారావినిజస్వంతసింగున కుసైన్యాధిపత్యమిచ్చి వారిరువుర మీఁదికింబంపెను. వీరరసావతారుల గు తనరాజపుత్రిసైనికులను కాలకింకరులవంటి మొగలాయిబంట్లను గూర్చుకొని జస్వంతసింగునర్మదానదీతీరమున విడిసెను. అప్పటికౌరం గజీబుమురాదులసైన్యములు గలియ లేను. ఆతరుణమెఱిఁగి వెంటనే జస్వంతసిం గౌరంగజీబుసైన్యమునడచినచోఁ బిమ్మటగోరలుదీసిన పా మునుగొట్టినటు మురాదునవలీలగ నోడింపవీలుగలిగియుండును. అట్లు వేరువేరుగ నిద్దఱనుదాకక జస్వంతసింగుగర్వోన్మత్తుఁడై యిద్దఱను జేరి యొకసారిగెలిచి శ్రమపడనేల? ఇద్దఱుగలసినను మనమవలీలగ వారిని గెలువగలము. ఇద్దఱినొక్కసారి జయించుటయె మెక్కువప్రతిష్ఠయని వీరాలాపములాడుచు సోదరులిరువురుగలిసికొనువఱకు నూరకయుండె ను. వానిగర్వమే వానిం జెరిపినది. ఈరాజపుత్రుఁడిట్లుదాసీనుఁడగుట చే నౌరంగజీబుమురాదులుగలసికొనిరి. జస్వంతసింగువద్దనున్నతురక సైనికు లౌరంగజీబువద్ద లంచములుగ్రహించియో పిరికితనముచేతనో యుభయులు గలిసినతోడనేరణరంగము విడిచిపారిపోయిరి. కానిజస్వం తసింగువద్ద నుక్కుతునుకలవంటి ముప్పదివేలరాజపుత్రి సైనికులుండు టచేత నతఁడించుకేనియుభయమందక నిశ్చలుఁడై వారిందాకనిశ్చయిం చునెను. తనసేన యల్పమైనను శత్రువుల గొప్పసేనతోఁబోరి ప్రాణ ములువిడుచుట రాజపుత్రునకు బందువుగదా! జస్వంతుఁడుమాబూన ను తనగుఱ్ఱమునెక్కి చేతబల్లెముబూని నిర్భయముగ సేనలం బురికొల్పు కొని పగతురపై గవిసెను.

ఆసంకులసమరంబున ఁ బదివేలమంది తురకలు పదునేడువందల మంది రహతూర్ధు రాజపుత్రులు మఱియు ననేకులుతక్కిన రాజపుత్రులు ప్రాణములువిడిచి సమరరంగమునలంకరించిరి. ఔరంగజేబుమురాదులు పరాజితులైవెన్నిచ్చిపారిరి. జస్వంతసింగువానిగుఱ్ఱముగాయములతో నిండిరక్తస్నానముచేసినట్లుండెను. సమరమున మిక్కిలి యలసిపోయి జస్వంతసింగుచేఁజిక్కినమృగముగజారవిడిచి యాకలిచేనులమలమాడుసింగమువిధమున నసహాయులై పారిపోవుచుండిరచక్రవర్తికొడుకులం దఱినిబట్టికొనలేక యూరకొనెను. అందుచేత నౌరంగజేబుమురాదులు పరాజితులయ్యు చెదరిపోయిన తమమూఁకలనుగ్రమ్మరగూర్చుకొని యదివఱకే మిక్కిలిపరిశ్రాంతులైన రాజపుత్రులనువెండియు దాకిరి. అత్తఱి నిలిచియున్న యెనిమిదివేలమందిరహతూరులలోనాఱువందలమంది దక్క తక్కినవారందరు వీరస్వర్గమున కధితులైరి. జస్వంతసింగు సంపూర్ణముగ బరాజితుఁడై హతశేషులగునాఱువందల రహతూరులతో రాజధానికిం బోయెను.

ఈజస్వంతసింగు మహారాజుయొక్క పట్టపుదేవి మీవారు రాజుల యాఁడుపడుచు. అందుచేతఁ బరితాపమున నగ్నిసిఖలనుబోలిన సంగుఁడు ప్రితాపుఁడు మొదలగుమహావీరుల నెత్తురామెశరీరమున బ్రవహించుచుండెను. ఆవీరపత్ని తనభర్త తురకలకోడిపోయి ప్రాణభీతిని బరతెంచి కోటలోఁ జొరబడుటకు వచ్చుచున్నాడని విని హృదయమునక్రోధరోషంబులు సందడింప "మహారాజుగారు పరాజితులై వచ్చుటకంటె రణమునుండి మరల రాకపోవుటయే ప్రతిష్ఠాకరముగ నుండునుగదా!" యనిపలికి యట్టిపిరికిపందనుగోటలోపలికి రానీయగూడదని కోటతలుపులు మూసివేయించెను. ఆమెరోషమునకు జస్వంతసింగు మిక్కిలి యక్కజపడి నేను మొదట శత్రువులను సంపూర్ణముగ గెలిచితిని. పిమ్మట దైవవశమున శత్రువులసైన్య

ములు మెండగుటచేఁ బరాజయము నొందవలసివచ్చె. ఓడినను గౌరవమును జంపుకొన లేదు. రణరంగమున నుండగలిగినంత సేపుండి పగతుర క్రోధమునకు బలియాయు గలిగినంత మం దినిచ్చి నిలువ శక్యముగానప్పుడు బయలుదేరివచ్చితినని మెన్నో తెలుఁగుల నతఁడు తన దేవితో విన్నవించుకొన్నను నామెపట్టినపట్టు విడునక "మీరు నాకుభర్తగానుండఁ దగరు. చిత్తూరుమహారాణా వారి యల్లుడింత నీచముగ నెన్నఁడు బ్రవర్తింపఁడు మీకుసహజముగ బరాక్రమము లేకున్నను శౌర్యరత్నాకరులగు మాపుట్టినింటివారితో వియ్యమందిన కారణమునసైన నెక్కుడురోషముఁ జూపవలయు. వేయేల? పగతురబాఁకువవలయు లేదా ప్రాణముఁలువిడువవలయు. ఇవి రెండేమానవంతులకు పద్ధతులుగదా?" అని క్రోధావేశమున నొక మారును, వెంటనే తనపరిచారికలంబిలిపించి ఓసీ నాభర్తగారు మృ తినొందినట్లె గావున కట్టెయలందెచ్చిచితిపేల్పుడు రాజకన్యకకుచిత మైనమార్గముననుసరించెదనని యభిమానవశమున నొకమారును, మ ఱియు నప్పుడే ముఖవిలాసమును మార్చి కెందామరరేకులవలె కను లెఱ్ఱజేసి శూలములవంటిపలుకులనాతని నొప్పించి యొకమారును, నోడలెఱుంగని దానివలె భాషింపజొచ్చెను.

శతృబాణములకంటె నెక్కువదారుణములగు పట్టపుదేవిప లుకులచేతఁ జాలనొచ్చి యెట్టకేలకామె యనుమతిబొంది జస్వంతసిం గుకోటలోఁబ్రవేసించెను. కాని యభిమానధనమగు నారాజపుత్రిక యాపిరికి మగనిమొగము జూడనని కొన్నిదినములు తలుపులు మూ సికొని తనయంతఃపురముననేయుండి వానిదర్శనమునకు బోవదయ్యె. అంతటనావార్తవిని యామెతల్లిబిడ్డవద్దకుఁబోయి భర్తపై గోపింప కుమని పలువిధముల నామెను బ్రతిమాలి "అమ్మా! నామాటవిను ము ఈయుద్ధమున గలిగినశ్రమ నివారణమైనతోడనే నీభర్తమరల

గొప్పసైన్యముం గూర్చుకొని యౌరంగజేబునుగెల్చి పోయిన తనగౌరవమును మరల సంపాదించుకొని నీమెప్పునొందఁ గలఁడు అంతేవఱకువాని కనుగ్రహించి యొసఁగిన యుపచారముచేయు" మని మందలించి భర్తృసన్నిధికిం బంచెను.

మానవతులగునిట్టిస్త్రీల భర్తలు సోదరులు మూఁడులోకము లెత్తివచ్చినను మడమదిరుగక పోరుదురన్నచో నేమియాశ్చర్యమున్నది? ఇట్టియంగనలున్నచోట పిరికిపందలకైనను బౌరుషము పుట్టునుగదా? రాణిచూపిన యీపౌరుషము పైకిదుర్వినయముగ దోఁచినను జస్వంతసింగునకు మహోపకారము చేసెను. ఔరంగజేబు మురాదులుకలసి దారానోడించి తండ్రియగు షాజహానును జరసాలలోనునిచి తమమీఁదికి మరల మహాసైన్యముతో వచ్చుచుండిన షుజానుదండించుటకై బోవుచు "వెనుకటి మాటలుదలంపక మాకు వచ్చిసాయము చేయవలయును. మీరు మేము నిప్పటినుండి పరమ మిత్రులుగనుండు"మని జస్వంతసింగునకు జాబువ్రాసిపంపిరి.

జస్వంతసింగు సరేయనియొప్పుకొని మిత్రుఁడుగానేయుండి యౌరంగజేబునకుఁ జేసినైనంత యపకారము చేయదలఁచియతనిసిబిరము బ్రవేశించిషుజాకెట్లనివర్తమానమంపెను. ఔరంగజేబు సేనముందుప్రక్కనీవుదగుల్కొందువేని వెనుకప్రక్కనేనుదాకెద. అట్లువర్తమాన మంపి జస్వంతసింగు తనమాటందప్పక నిలుపుకొనియె. ఎట్లన నౌరంగజేబు సేనలలో వెనుకభాగము దీర్ఘప్రయాణములచేత నలసియుండనీరాజపుత్రుఁడు వెనుకప్రక్కఁజేరివారివద్దనున్న సమస్తవస్తువులదోఁచుకొనియా సరకులొంటెలమీఁద వేయించియౌరంగజేబుషుజాలొకరినొకరునిర్మూలము చేసికొందురుగా నాకేమియనియాగ్రానగరమునకుబోయెను.పోయి యక్కడ సుతులచేబంధింపఁబడినషాజహానునుబంధవిముక్తుని జేసి యతఁడుతనతోఁ గలియుమని దారానుపురిగొల్పెనుగానియాదారావా

నికిందగిన ప్రత్యుత్తరమీయక యాలస్యముచేయుటచే నచ్చోటువిడిచి తనరాజధానికిఁబోయి కొల్లగొన్నసరకులతోఁ దన కోటయంతయు నింపెను.

ఈనడుమ నౌరంగజీబుతనస్థిరబుద్ధిచేతనుశాంతస్వభావముచేతను షుజానుని శ్యేషముగ జయించి తానుచక్రవర్తియై మరలజస్వంతసింగు మైత్రింగోరి వెనుకనైనదేమోయైనది. ఇఁకముందైనను నీవునాకు మిత్రుఁడవై దారాపక్షము బూనుటమానుదువేనినిన్నుగుజరాతుదేశమునకుఁ బరిపాలకునిజేసెదనని వానికిరాయబారమంపెను. అభిమానములేని యౌరంగజీబుయొక్క సందేశమును సిగ్గులేనిజస్వంతసింగువెంటనే యంగీకరించి యప్పుడే చక్రవర్తిశివాజీనడఁచుటకు మహారాష్ట్రదేశమున కంపుచున్నసైన్యములోఁ దాను రాజపుత్రవీరులకు సేనాపతియై దండునడుపుట కొప్పుకొనెను. జస్వంతసింగు మొగలాయిసేనకంతకు నధికారిగాఁడు. మొగలాయిసైన్యమునకు షేస్టాఖానుఁడుసర్వాధిపతియై యుండెను. జస్వంతసింగు మొగలాయి సేనలలోఁ జేరిశివాజీని సంహరింపఁబ్రయత్నించుటకుమారు వానిమైత్రిగోరి "నీవునునేనునుంగలసి ముందుగ షేస్టాఖానునిం గడతేర్చివేయుదము. పిమ్మటమనయుభయసైన్యములకు నేను సేనాధిపతినై యుండిన నిచ్చవచ్చినతెఱఁగున జేసెదనని వానికి వర్తమానమంపెను. కాని యతఁడుచేసిన కుట్రయంతయుఁ బయలువడెను. అప్పుడైన నౌరంగజీబువానిని దండింపక యెప్పటియట్లదయతోను గౌరవముతోను జూచుచు సమయమువచ్చినప్పుడు సైన్యాధిపత్యమునుండి జస్వంతునిదొలఁగించి రాజపుత్రులలోనెల్లవిశ్వాసపాత్రుఁడు సత్ప్రవర్తకుఁడునగు నంబరు సంస్థానాధిపతినిజయసింగుచుసేనాపతినిజేసెను. అదిమొదలుజస్వంతసింగుజన్మాంతరమువఱకుఁజక్రవర్తిమీఁద వానిపగతురతోనో బంధువులతోనో జేరి కుట్రల పన్నుచునేయుండెను. ఎన్నిసారులు కుట్రలు పన్నెనోయన్నిసా

గొప్పసైన్యముం గూర్చుకొని యౌరంగజేబును గెల్చి పోయిన తనగౌరవమును మరల సంపాదించుకొని నీమెప్పునొందఁ గలఁడు అంతేవఱకువాని ననుగ్రహించి యోపిన యుపచారము చేయు" మని మందలించి భర్తసన్నిధికిం బంచెను.

మానవతులగు నిట్టిస్త్రీల భర్తలు సోదరులు మూఁడులోకము లెత్తివచ్చినను మడమ దిరుగక పోరుదురన్నచో నేమి యాశ్చర్యమున్నది? ఇట్టి యంగనలున్నచోట పిరికిపందలకైనను బౌరుషము పుట్టును గదా? రాణి చూపిన యీపౌరుషము పైకి దుర్వినయముగ దోఁచినను జస్వంతసింగునకు మహోపకారము చేసెను. ఔరంగజేబు మురాదులు కలసి దారా నోడించి తండ్రియగు షాజహానును జరసాల లోనునిచి తమమీఁదికి మరల మహాసైన్యముతో వచ్చుచుండిన షుజాను దండించుటకై బోవుచు "వెనుకటి మాటలు దలంపక మాకు వచ్చి సాయము చేయవలయును. మీరు మేము నిప్పటినుండి పరమ మిత్రులుగనుండు" మని జస్వంతసింగునకు జాబువ్రాసి పంపిరి.

జస్వంతసింగు సరేయని యొప్పుకొని మిత్రుఁడుగానే యుండి యౌరంగజేబునకుఁ జేయనైనంత యపకారము చేయదలఁచి యతని శిబిరము బ్రవేశించి షుజాకిట్లని వర్తమానమంపెను. ఔరంగజేబు సేనను ముందుప్రక్క నీవు దగుల్కొందువేని వెనుకప్రక్క నేనుదాకెద. అట్లు వర్తమాన మంపి జస్వంతసింగు తనమాటం దప్పక నిలుపుకొనియె. ఎట్లన నౌరంగజేబు సేనలలో వెనుకభాగము దీర్ఘప్రయాణములచేత నలసియుండ నీరాజపుత్రుఁడు వెనుకప్రక్కఁ జేరి వారివద్దనున్న సమస్తవస్తువులదోఁచుకొని యాసరకులొంటెలమీఁద వేయించి యౌరంగజేబు షుజాలొకరినొకరు నిర్మూలము చేసికొందురుగా నాకేమియని యాగ్రానగరమునకు బోయెను. పోయి యక్కడ సుతులచే బంధింపఁబడిన షాజహానును బంధవిముక్తుని జేసి యతఁడు తనతోఁ గలియుమని దారానుపురిగొల్పెనుగాని యీదారా వా

నికిందగిన ప్రత్యుత్తరమీయక యాలస్యముచేయుటచే నచ్చోటువిడిచి తనరాజధానికిఁబోయి కొల్లగొన్నసరకులతోఁ దనకోటయంతయు నింపెను.

ఈనడుమ నౌరంగజీబుతనస్థిరబుద్ధిచేతనుశాంతస్వభావముచేతను షుజానుని శ్శేషముగ జయించి తానుచక్రవర్తియై మరలజస్వంతసింగు మైత్రింగోరి వెనుకనైనదేమో యైనది. ఇఁకముందైనను నీవునాకు మిత్రుఁడవై దారాషకుము బూనుటమానుదువేనినిన్నుగుజరాతుదేశమునకుఁ బరిపాలకునిజేసెదనని వానికి రాయబారమంపెను. అభిమానములేని యౌరంగజీబుయొక్క సందేశమును సిగ్గులేనిజస్వంతసింగువెంటనే యంగీకరించి యప్పుడే చక్రవర్తిశివాజీ నడఁచుటకు మహారాష్ట్రదేశమున కంపుచున్నసైన్యములోఁ దాను రాజపుత్రవీరులకు సేనాపతియై దండునడుపుట కొప్పుకొనెను. జస్వంతసింగు మొగలాయి సేనకంతకు నధికారిగాఁడు. మొగలాయిసైన్యమునకు షేష్టాఖానుఁడుసర్వాధిపతియై యుండెను. జస్వంతసింగు మొగలాయి సేనలలోఁ జేరిశివాజీని సంహరింపఁబ్రయత్నించుటకుమారు వానిమైత్రిగోరి "నీవునునేనునుంగలసి ముందుగ షేష్టాఖానునిం గడతేర్చివేయుదము. పిమ్మటమనయుభయసైన్యములకు నేను సేనాధిపతినై యుండిన నిచ్చవచ్చిన తెలఁగున జేసెదనని వానికి వర్తమానమంపెను. కాని యతఁడుచేసిన కుట్రయంతయుఁ బయలువడెను. అప్పుడైన నౌరంగజీబువానిని దండింపకయెప్పటియట్లదయతోను గౌరవముతోను జూచుచు సమయమువచ్చినప్పుడు సైన్యాధిపత్యమునుండి జస్వంతునిదొలఁగించి రాజపుత్రులలోనెల్లవిశ్వాసపాత్రుఁడు సత్ప్రవర్తకుఁడునగు నంబరు సంస్థానాధిపతినిజయసింగుచు సేనాపతినిజేసెను. అదిమొదలుజస్వంతసింగుజన్మాంతరము వఱకుఁజక్రవర్తిమీఁద వానిపగతురతోనో బంధువులతోనో జేరి కుట్రల పన్నుచునేయుండెను. ఎన్నిసారులు కుట్రలు పన్నెనోయన్నిసా

రులు నతనిపన్నుగడలు బయలుపడుచునేవచ్చెను. ఎన్నిసారులుబయ
లుపడెనో యన్నిసారులు వానినిజక్రవర్తి క్షమించుచునేవచ్చెను. చె
ఱుపుజేయుటకు జస్వంతునకెంత విసువులేకుండెనో వానిదుండగములు
సైరించుటకు జక్రవర్తికినంతియవిసువులేకుండెను. జస్వంతసింగునుదం
డింపజాలక చక్రవర్తి యూరకొనియుండలేదు. జస్వంతసింగునంతటి
చండశాసనుని నంతటిసాహసుని నంతటిపరాక్రమవంతుని వేరొకభం
గిచేసినపక్షమున రాజపుత్రప్రపంచమంతయుఁదనపైదిరుగబడునేమో
యను భయముననతఁడూరకొనెను అప్పటికిరాజపుత్రసంస్థానములన్ని
యు సంక్షోభములేక నెమ్మదిగనుండెను. జస్వంతునిమీఁదికిమొగలా
యిసేనలు వెడలి మారువారుఁజొచ్చెనా కందిరీగలతుట్టవలె రాజపు
త్రస్థానమంతయుఁగదలి భయంకరమగునని యతఁడువెఱచి యూర
కుండెను. అదియునుఁగాక గొడ్డునేలయగుమారువారుదేశమునకుఁబో
యినసేనలన్నియు నిర్మూలము లగుటయేగాని తిరిగివచ్చుటలేనందున
జక్రవర్తిజస్వంతునిపై నెప్పుడు దయయే చూపుచు వచ్చెను. మా
రువారుదేశస్థులగుకవీశ్వరులందఱు జస్వంతుఁడు మహాశూరుఁడనితమ
గ్రంథములలోవ్రాసియుండిరి. వారిపొగడ్తలకేమిగానివానిచరిత్రము
మిక్కిలి యసందర్భముగనుండెను. ఏలయనచక్రవర్తికి లోఁబడినవాఁ
డులోఁబడినట్లుండి కృతజ్ఞుఁడై విశ్వాసముగలిగి మెలగలేదు. పౌరుష
ముగలవాఁడు చేయవలసినట్లు స్వదేశస్వాతంత్ర్యమునిమిత్తము నిలిచి
పోరాడిప్రతిష్ఠనిలిపినవాఁడుకాఁడు. షాజహానుఁడు ప్రబలరోగపీడితుఁడై
మంచమెక్కినప్పుడు వానికొడుకులొకరిగొంతుకలొకరుకోయ జూచు
చుండినసమయమున జస్వంతసింగు రాజపుత్రప్రభువులందఱిం గలియ
గట్టుకొని ప్రయత్నముచేసినచో రాజస్థానమునకుస్వాతంత్ర్యము కొంత
కాలమైన నుండియుండును. కాని యప్పటిమీవారుప్రభువగు రాజసిం
గు అంబరుసంస్థాన ప్రభువగు జయసింగు మారువారు దొరయగు జ

స్వంతసింగు నెవరిమట్టుకువారే చూచుకొనిస్వలాభపరాయణులై దేశ స్వాతంత్ర్యముమాటమఱచిరి. జస్వంతసింగునొద్దతక్కినవారివద్దకంటె నొకవిశేషముగలదు. ఈతనిపేరు చక్రవర్తికీశ్వరవేరు. జస్వంతసింగు బ్రతికియుండినకాల మౌరంగజీ బొకనాడైన సుఖముగ బ్రతికి యుండలేదు.

ఈరాచసింగమునుదనవలలోబడవేసికొనుటకువీలైనప్పుడు వా నినిబాతాళలోకమునకు ద్రొక్కుటకుఁ జక్రవర్తియెన్నెన్నో విధములన యమునభయమున వానిం దనసన్నిధికిరావింపఁబ్రయత్నించెను గాని యాపులించిన ప్రేవులు లెక్కపెట్టఁగలజస్వంతసింగునమ్మియొకసారియైన జక్రవర్తిసన్నిధికి రాఁడయ్యె. కుటిలోపాయములెన్నిపన్నిననుజస్వంత సింగు లొంగలేదని తెలిసి చక్రవర్తిమైత్రియనియెఱరి వానిమెడకుఁ బోసిదేశమునుండి వానిని వెడలించి యెన్నడుతిరిగిరానిదూర దేశముల కుబంపెను. కాబూలురాజధానిగాఁగల యాపుగనిస్థానమిప్పటివలెవే రొకతురక రాజుపాలనముననుండక యాకాలమున ఢిల్లీచక్రవర్తికి లోఁబడియుండెను. ఆదేశస్థులు మిక్కిలిమోటవాండ్రు. చక్రవర్తి కొకకన్నెప్పుడు వారిమీఁదనేయుండెను.ఆదేశమందుజనులుచక్రవర్తి పైఁ బితూరిచేయవజ్రమునువజ్రముచేతనే గెలువవలయునన్నట్లు కా బూలులోనిదుర్మార్గులనుమారువారులోనున్నదుర్మార్గులచేతనే జంపింప వలయునని నిశ్చయించి జస్వంతసింగునుబొగడి నీవుపోయినఁగానియా యల్లరులడఁగవనిచెప్పి బ్రతిమాలి వానిని సేనాధిపతినిజేసిపంపెను.

ఈతఁడువెడలుటచే జక్రవర్తికి మనోభారముడిందుపడియెను. కాబూలులోనిరంతరము పితూరీలుచేయుజనులు వీనిచేతజచ్చిననుజక్ర వర్తికిమంచిదే ఆకాబూలుదుండగులచేతజస్వంతుఁడుకడతేరిననుమం చిదే. ఒకశత్రువుపోయిననుమేలెగద. జస్వంతసింగు తనయేలికవలన మహాధికారముబొంది తనకుబ్రతినిధియై రాజ్యముపాలించుటకు దన

 

జ్యేష్ఠకుమారు నియోగించి సైన్యసమేతుఁడై కాబూలునకు బోయెను. అతఁడుచన్నకొన్నిదినములకే యౌరంగజేబు జస్వాంతసింగు పెద్దకొడుకగు పృథుసింగును దనకొలువుకూటమునకు రమ్మని యాజ్ఞాపించెను. పృథుసింగుచక్రవర్తి యాన శిరసావహించి చక్రవర్తి కొలువునకుఁ బోయెను. చక్రవర్తియు వానిం దద్దయు గౌరవించె.

ఒకనాఁడు పృథుసింగు మొగలాయిదర్బారులోఁ జక్రవర్తి యెట్టయెదుట పాదములు రెండు దగ్గరజేర్చితలవంచిచేతులు జోడించి యాకొలువున నెట్లుండవలయునో యట్లునిలిచియుండచక్రవర్తి వానిని దనదాపునకు రమ్మనిచేసన్నచేసి వచ్చినపిదప జోడించియున్నయతని చేతులపై తనహస్తమువైచి "ఓయీ! రహతూరుఁడ! నీభుజము మీ తండ్రిభుజమట్లు బలిష్ఠమైనదనివిందు. ఇప్పుడేమిచేసెద" వనియడిగెను. అడుగుటయు రాజపుత్రుఁడు నిర్భయముగ నిట్లనియె.

దేవా! భగవంతుఁడు మిమ్మురక్షించుఁగాక! నరలోక చక్రవర్తి తన పాలనమునకు లోబడిన యధమునిమీఁద చేయివైచుటయే చాలు. అంతకన్న కావలసినదేమున్నది. ఆమనుష్యునికోరికలన్నియు సిద్ధించినట్లె. ఇప్పుడు నారెండుచేతులు మీరుపట్టుకొనుటచే నేను ప్రపంచమంతయు జయించినట్లు సంతసించుచున్నాఁడ.

ఈమాట లనుచున్నపుడుపృథుసింగుమొగము జేవురించుటయు మేనుపులకలెత్తుటయుఁజక్రవర్తి రెప్పవాల్పకచూచి ఇతడు రెండవఖూటన్‌సుడి యని సభవారితోఁ బలికెను. ఖూటన్ అనగా నౌరంగజేబు జస్వాంతసింగునకుఁబెట్టినపేరు. ఆపేరుదరుచుగాచక్రవర్తి జస్వాంతసింగు ప్రసంగమువచ్చినప్పుడు నిండుగర్వముగ నుపయోగించుచువచ్చుటచే ఖూటన్‌అనుమాట వినగానే సభికులుపృథుసింగున కేదోమూడినదని తలంచిరి. అంతలో నౌరంగజేబు రాజకుమారునిభాషణంబులకుసంతసించినవాఁడపోలె నటించి వానికి బహుమానమీయఁదలచి వెలలేని

పట్టుదుస్తులు తెప్పించియక్కడనే వాటిని ధరింపుమని యాజ్ఞాపించెను. అతండట్లేయావలువలు ధరించి తనయదృష్టము లెస్సగనుండెనని భావించి బసకుంజనియె. కాని దర్బారువిడచిన కొలఁదికాలముననే వానికి దారుణమైన యొకరోగము సంభవించెను. దానిచే నతఁడపరిమితముగ బాధపడివికృతరూపుఁడై కొన్నిగంటలలోనే కాలధర్మమునొందెను. ఆదుర్మరణము రాజపుత్రులందఱు నది యాగంతుకమైనరోగము కాదనియు జక్రవర్తి గౌరవించి పారితోషికముగనిచ్చిన యాదుస్తు విసముపూతగలదనియు నది ధరించుటచేతనే వానికాయకాలమరణము గలిగెననియు దలంచిరి.

ఈదుర్వార్త కాబూలులోనున్న జస్వంతసింగునకు దెలిసినప్పుడతఁడు తనపైఁ గల కసిదీర్చుకొనుటకుఁ జక్రవర్తి తనకుమారుని ఘోరముగఁ గడ తేర్చెనని యూహించెను. పృథుసింగు తనకులప్రదీపకుఁడనియుఁ దనమనోరథమనియు నమ్మి జస్వంతుఁడు వానిమీఁదనే పంచప్రాణములు బెట్టికొనియుండుటచే నీవార్తవిని యడుగంటిపోయెను. పిమ్మటనతఁ డెన్నఁడు తలయెత్తుకొని తిరుగలేదు. ఇదిజరిగిన కొన్నినాళ్ళకె యతని తక్కినకొడుకు లిద్దరు కాబూలుకొండలలోఁ దగిలిన మన్నెపుజ్వరముచేఁ బీడితులై మృతినొందిరి.

తనంత కొడుకుల మువ్వురంజంపుకొని వార్ధకమున సంతానహీనుఁడై జస్వంతసింగు దుఃఖభాజనమగు జీవయాత్ర నడుపుచుండియుఁ దనకొడుకుం జంపినవానికే మేలుజేయుచు విదేశముల నుండవలసివచ్చె. అతని నోదార్చుటకు రాణులిద్దఱుమాత్రము వానికడనుండిరి.

అందొక్కరితె మున్ను తానుపరాజయమునొందివచ్చినపుడు కోటతలుపులుమూసివేయించిన మీవారు రాజపుత్రిక. ఆమెదుఃఖితుఁడగుభర్తను శాంతవచనములచే నోదార్చునట్టి స్వభావము కలదికాదు గదా! రెండవభార్యయొక్కతె యూరడించినను వానికి యూరడిగలగ

జ్యేష్ఠకుమారు నియోగించి సైన్యసమేతుఁడై కాబూలునకు బోయెను. అతఁడుచన్న కొన్ని దినములకే యౌరంగజేబు జస్వాంతసింగు పెద్దకొడు కగు పృథుసింగును దనకొలువుకూటమునకు రమ్మని యాజ్ఞాపించెను. పృథుసింగుచక్రవర్తియాన శిరసావహించి చక్రవర్తికొలువునకుఁ బోయెను. చక్రవర్తియు వానిందద్దయు గౌరవించె.

ఒకనాఁడు పృథుసింగు మొగలాయిదర్బారులోఁ జక్రవర్తి యెట్టయెదుట పాదములు రెండు దగ్గరజేర్చితలవంచిచేతులు జోడించి యాకొలువున నెట్లుండవలయునో యట్లునిలిచియుండచక్రవర్తి వానిని దనదాపునకు రమ్మనిచేసన్న చేసి వచ్చినపిదప జోడించియున్నయతని చేతులపై తనహస్తమువైచి "ఓయీ!రహతూరుఁడ! నీభుజము మీ తండ్రిభుజమట్లు బలిష్ఠమైనదనివిందు. ఇప్పుడేమిచేసెద"వనియడిగెను. అడుగుటయు రాజపుత్రుఁడు నిర్భయముగ నిట్లనియె.

దేవా! భగవంతుఁడు మిమ్ముసంరక్షించుఁగాక! నరలోక చక్రవర్తి తన పాలనమునకు లోబడిన యధమునిమీఁద చేయివైచుటయే చాలు. అంతకన్న కావలసినదేమున్నది. ఆమనుష్యునికోరికలన్నియు సిద్ధించినట్లె. ఇప్పుడు నారెండుచేతులు మీరుపట్టుకొనుటచే నేను ప్రపంచమంతయు జయించినట్లు సంతసించుచున్నాఁడ.

ఈమాట లనుచున్నపుడుపృథుసింగుమొగము జేవురించుటయు మేనుపులకలెత్తుటయుఁజక్రవర్తిరెప్పవాల్పకచూచి ఇతఁడు రెండవఖూటన్‌సుడి యని సభవారితోఁ బలికెను. ఖూటన్ అనగా నౌరంగజేబు జస్వాంతసింగునకుఁబెట్టిన పేరు. ఆపేరుదరుచుగాచక్రవర్తి జస్వాంతసింగు ప్రసంగమువచ్చినప్పుడు నిండుగర్వముగ నుపయోగించుచువచ్చుటచే ఖూటన్‌అనుమాట వినగానే సభికులుపృథుసింగున కేదోమూడినదని తలంచిరి. అంతలో నౌరంగజేబు రాజకుమారునిభాషణంబులకుసంతసించినవాఁడపోలె నటించి వానికి బహుమానమియ్యఁదలచి వెలలేని

పట్టుదుస్తులు తెప్పించియక్కడనే వాటిని ధరింపుమని యాజ్ఞాపించెను. అతండట్లేయావలువలుధరించి తనయదృష్టములెస్సగనుండెనని భావించి బసకుంజనిమె. కాని దర్బారువిడచిన కొలఁదికాలముననే వానికి దారుణమైన యొకరోగము సంభవించెను. దానిచే నతఁడపరిమితముగబాధపడివికృతరూపుఁడై కొన్నిగంటలలోనే కాలధర్మమునొందెను. ఆదుర్మరణము రాజపుత్రులందఱు నది యాగంతుకమైనరోగము కాదనియు జక్రివర్తి గౌరవించి పారితోషికముగనిచ్చిన యాదుస్తు విసముపూతగలదనియు నది ధరించుటచేతనే వానికాయకాలమరణము గలిగెననియు దలంచిరి.

ఈదుర్వార్త కాబూలులోనున్న జస్వంతసింగునకుదెలిసినప్పుడతఁడు తనపైగల కసిదీర్చుకొనుటకుఁ జక్రివర్తి తనకుమారుని ఘోరముగఁ గడతేర్చెనని యూహించెను. పృథుసింగు తనకులప్రదీపకుఁడనియుఁ దనమనోరథమనియు నమ్మి జస్వంతుఁడు వానిమీఁదనే పంచప్రాణములు బెట్టికొనియుండుటచే నీవార్తవిని యకుగంటిపోయెను. పిమ్మటనతఁ డెన్నఁడు తలయెత్తుకొని తిరుగలేదు. ఇదిజరిగిన కొన్నినాళ్ళకె యతని తక్కినకొడుకు లిద్దరు కాబూలుకొండలలోఁ దగిలిన మన్నెపుజ్వరముచేఁ బీడితులై మృతినొందిరి.

తనంత కొడుకుల ముగ్గురఁజంపుకొని వార్ధకమున సంతానహీనుఁడై జస్వంతసింగు దుఃఖభాజనమగు జీవయాత్ర నడుపుచుండియుఁ దనకొడుకుం జంపినవానికే మేలుజేయుచు విదేశముల నుండవలసి వచ్చె. అతని నోదార్చుటకు రాణులిద్దఱుమాత్రము వానికడనుండిరి.

అందొక్కరిత మున్ను తానుపరాజయమునొందివచ్చినపుడు కోటతలుపులుమూసివేయించిన మీవారు రాజపుత్రిక. ఆమెదుఃఖితుఁడగుభర్తను శాంతవచనములచే నోదార్చునట్టి స్వభావము కలదికాదు గదా! రెండవభార్యయొక్కతె యూరడించినను వానికి యూరడిగలగ

దయ్యె. ఉత్తమరాజవంశమునంబుట్టి ప్రతాపనిధియై జగచ్చక్రవర్తి యగు ఢిల్లీచక్రవర్తి సయితము తనపేరు వినినప్పుడెల్ల గడగడవణంకు నట్లు జండశాసనుఁడై మెలంగి నలువదిరెండుసంవత్సరములుపరిపాలించి జస్వంతసింగు తుట్టతుదకు బిడ్డలులేక దిక్కుమాలి కానిదేశములలో మృతినొందెను.

వాని యిద్దరురాణులు వానినమ్మినబంట్లగు రహతూరులు చేయునదిలేక యెన్నోవందలయామడలదూరముననుండిపలుమారు మొగలాయిసేనలకు దుర్భేద్యమైన మారువారుదేశమునకుఁ బోవనిశ్చయించి ప్రయాణమైరి. జస్వంతసింగు మృతినొందినను జాడుపుర రాజకుటుంబమునకు ఢిల్లీచక్రవర్తికిని వైరమంతమొందలేదు. ఈరెండుకుటుంబములకుఁ జిరకాలము యుద్ధముజరిగెను. అది ముప్పదియేండ్లు జరుగుటచే దానికి ముప్పదియేండ్ల యుద్ధమని పేరువచ్చెను.

---

# ముప్పదియేండ్ల యుద్ధము

మారువారుసంస్థానాధిపతియగు జస్వంతసింగుపైనుదహరింపఁబడినప్రకారము కాబూలునగరములో మృతినొందినప్పుడు వానిపట్టపుదేవి మీవారురాజుల యాడుబడుచు మగనిమృతకళేబరముతో సహగమనముఁ జేయ సమకట్టెను; కానియామెయప్పటికి గర్భవతియయి యుండుటం జేసి గర్భముననున్న శిశువు మగశిశువో యాడుశిశువో తెలిసికొనువఱకు నసఁగాపురిసవమగువఱకు నట్టిపనిఁ జేయఁగూడదని

యు నొకవేళ మగశిశువేజనియించినపక్షమున నక్కుమారుఁడుతండ్రి కిఁ జగ్రవర్తి చేసిన యపకారమునకుఁ బ్రతీకారము సేయఁగలుగునని యు నందుచేత నామెతప్ప తక్కినరాజపత్నులిష్టపడినచోసహగమన ము చేయవచ్చుననియుఁజెప్పి యక్కడనుండిన రాజపుత్రులలోఁ బ్ర ధానుఁడగు కుంపావతివంశస్థుఁ డామెను వారించెను. కాఁబట్టి జస్వం తుని పట్టపుదేవి సహగమనముచేయక శత్రుమండలమధ్యమున రెండు మాసము లుండెను. ఆతని తక్కినభార్యలు మగనికళేబరముతో స హగమనము చేసిరి. ఒకభార్య తనపుట్టినింట నన్నఁగా మండూరునగర మున నున్నందున వెంటనే భర్తశవముతో నిప్పులంజొచ్చుటకు వీలు లేక మగనితలపాగ దెప్పించుకొని యాయస్త్రము గప్పుకొని చిచ్చుఁ బ్రవేశించెను.

ఆరాజుపోయిన రెండుమాసములకుఁ బట్టపుదేవియగు నావీర పత్ని యొకకుమారునిం గని వీరమాతయయ్యెను. ఆకుమారున కా మె యజితుఁడని పేరుపెట్టెను. అద్భుతచరిత్రలుగల యట్టిమానవతుల కడుపున శూరులుగాక బీరులు పుట్టరుగదా? ఆరాణికి నామెకొలువున నున్న తక్కిన రహతూరువంశరాజపుత్రులకును మాయోపాయకుశ లుఁడైన యౌరంగజీబు చక్రవర్తి యేదోపన్నుగడపన్ని మారువారు రాజవంశపు మొలకయగు నాపసిబిడ్డను నపహరించి తనకోటలోఁబెట్టు కొని మారువారును గతిలేనిదానినిగఁ జేయునని భయపడఁజొచ్చిరి. అందుచేఁ జక్రవర్తికిఁ దెలియకుండ నీవలఁబడవలయునని నిశ్చయించి తమపోకనుగూర్చి యౌరంగజీబునకు తెలియపఱచకయే వానిసెలవు గైకొనకయే యారాణి బిడ్డయుం దాను నొకపల్లకీలోఁ గూర్చుండి హతశేషులగు సైనికులు పరిజనులు తనకంగరక్షకులయి వెంట నరు గు దేర స్వనగరాభిముఖియయి బయలుదేరెను.

ఈపయనమునుం దారాణికన్నావతివంశస్థుఁడు గంగపురాధిపతి

రహాతూరులలోఁ గడుబుద్ధిశాలి శౌర్యశాలియగు దుర్గదాసనువీరుని నమ్మి తనశిశుసంరక్షణము వాని కప్పగించెను. జాతుపూరునకుఁబోవు నీప్రయాణమునం దును బిమ్మటను దుర్గదాసే యామెకు గుడిభుజముఁ నమ్మినబంటై మెలంగి స్వామిఋణము దీర్చుకొనెను.

ఆచిన్నగుంపు సింధునదీతీరముఁ జేరునప్పటికి వాహహించిన దంతయు నిజమయ్యెను. ఆనదియొడ్డుననున్న యట్టకపురమువారుచేరి రేవుదాఁటి యీవలగట్టునకు రాఁబోన చక్రవర్తి రక్షకభటులు తమ స్వామియానతిలేక వారిని పోనియ్యమని నిరోధించిరి. రహాతూరులు చక్రవర్తిసైనికులతోఁ బోరాడనుంకించిరిగాని కార్యముగాదని యూరకుండి మొగలాయిసైనికులు లేని మఱియొకరేవు రాత్రి వెదకికొని యెవ్వరెఱుగకుండ నచ్చట సింధునదిఁ దాఁటి యీవలఁబడిరి.

ఆట్టకపురియొద్దనున్న రక్షకభటులు మరునాఁడావార్తవినిచక్రవర్తికిఁ దక్షణమే యెఱిఁగింప సవారులం బంపిరి. ఔరంగజేబు త ద్వార్తవిని కార్యముచెడివచ్చెనని వేగిరపడి రాణియొద్దనున్న సేనకంటె గొప్ప సేనంగూర్చి రాజపుత్రుల నిరోధింపుమని పంపెను. పుత్రసమేత యయిన యారాణి ఢిల్లీసమీపమునకు వచ్చునప్పటికిఁ జక్రవర్తిసేన యామెభటులం గదిసి చుట్టుముట్టి ముందుకుగాని వెనుకకుగాని పోనీయమని మార్గ మరికట్టిరి. ఎట్టులయిన ఢిల్లీనగరముఁ బ్రవేశించిన చో నచ్చటనున్న రాజపుత్రులు తప్పక తనకుసహాయముచేయుదురని నమ్మి తన్నునగరముఁ బ్రవేశింపనిమ్మని మొగలాయిసైనికుల నడిగె ను. ఆమె వేఁడికోలు వారు నిరాకరించిరి. అందుచేత నామె తనరాజధానికిఁ బోవుటకుఁగాని ఢిల్లీ ప్రవేశించుటకుఁగాని వీలుగానక శత్రుసైన్యములు చుట్టుముట్టియుండ ఢిల్లీకిదూరముగా నొకచోట విడిసి యుండవలసివచ్చెను. రాజపుత్రులతో కయ్యములు కోడెతాచులతో నెయ్యములని చక్రవర్తి యెఱుఁగును. అందుచే రాజపుత్రవీరుల

ను సామదానభేదములచే వశపరచుకొన జక్రవర్తి నిశ్చయించి దుర్గదాసు మొదలగు రహతూరునాయకులను దనదర్బారునకు సగౌరవంబుగ రావించి సబహుమానంబుగ నాదరించి మచ్చికచేసి యిట్లనియె. "మీ రాజపుత్రుని నావశము చేయుదురేని మీ రేమికోరిన నదియిచ్చెద. వేయేల? మారువారు రాజ్యమే మీకందఱకుఁ బంచియిచ్చెద. కావున లాభము పోఁగొట్టుకొనక వానిని నాకప్పగింపుఁడు."

ఆపలుకులు వారందఱు మహాభిమాన పరవశులయి యైకకంఠ్యముగాఁ జక్రవర్తితో జస్వంతసింగునకు లేక లేక కలిగిన యాకుమార రత్నమును మేము విడుచువారము కాము. మా దేశమున మాకుఁ గావలసినంత సహాయసంపత్తి గలదు. కాఁబట్టి కంఠములలోఁ బ్రాణము లున్నంతవఱకు మేము మా దేశమును మా రాజపుత్రుని రక్షించెదమే గాని విడువ మని నిర్భయముగఁ జెప్పి రోషావేశమున నెఱ్ఱఁబాఱిన కన్నులతో భయంకరము లగు ముఖములతో సభాభవనము విడిచి రాణియున్న నెలవుకునం బోయిరి. ఆపరిదేశమును మునుపటికంటె నెక్కుడు జాగరూకతతోఁ గాపాడు మని చక్రవర్తి యధికబలముఁ బంపెను. మోసగానిని మోసముచేతనే జయించుట కర్తవ్య మని దుర్గాదాసు ప్రముఖులు కృతనిశ్చయులయి దాసదాసీజనములను స్వదేశములకుఁ బంపుదు మని వంకఁబెట్టి రాణికి దాసివేషము వేసి యామెను మఱికొందఱు పరిచారికలను ప్రాఁతపల్లకులలో నెక్కించి శిబిరము దాటించి మంచితనము గలయొక తురకబంటును జేరఁదీసి మిఠాయిగంపలో రాజకుమారునిం గూర్చుండఁబెట్టి వారిచేత నది యావలకుఁ బంపి కృతార్థులైరి. దేవియుఁ గుమారుఁడు నెక్కడ యని చక్రవర్తి యడిగినచోఁ జూపుటకు నొకదాసికి విలువబట్టలు గట్టఁబెట్టి నగలువెట్టి రాణివేషము వేసి కొడుకునకు రాజపుత్రవేషము వేసి యతిగౌరవముతో వారింజూచుచు నొకచోఁ దాఁచిరి. చక్రవ

ర్తిసైనికులు పోవుచున్నది దాసీజనమనుకొని లెక్కసేయక మిఠాయి గంప నెత్తుకొన్నవాఁడు తురకయగుటచే ననుమానింప నక్కఱలేదని దొరకినరాణిని రాజపుత్రుని జేతులార విడిచిపెట్టిరి. రాజపుత్రశిబిరములో జరిగెడు పరమరహస్యముల నెఱుఁగలేక యేదోకుట్ర జరుగుచున్న దని యనుమానించి యౌరంగజీబు తల్లినికుమారుని దనకు తక్షణ మప్పగింపవలసిన దని రాజపుత్రులకు వర్తమాన మంపెను. కొడుకుం దల్లియు దాఁటిపోయి రనిచెప్పినచోఁ జక్రవర్తి తోడనే సైనికుల నంపి వారింబట్టి తప్పించునేమో యనుభయమున నావృత్తాంతము వానికిఁ దెలియుట కెంతయాలస్యమైన నంతమంచి దని రాజపుత్రులు తలంచి రాణియు బిడ్డయు నింక నక్కడనున్నట్లై పాదుషా యనుకొనునట్లు "మా దేహములలో నెత్తురుచుక్క లుండగ పిల్లవానినిగాని తల్లినిగాని మే మప్పగించుట స్వప్నవార్త యని ప్రత్యుత్తరమంపిరి. ఈప్రత్యుత్తరము విని యౌరంగజీబు తనకుఁ గావలసిన యిరువురు నప్పటికి దాఁటిపోవలేదని నమ్మి శిబిరము ముట్టడించి రాజపుత్రులనందఱ సంహరించి మాతాపుత్రులం బట్టి తెమ్మని తన సైన్యమున కాజ్ఞాపించెను.

ఆవార్త విని రహతూరు లందఱు పరమానంద భరితులై దాఁటిపోవలసినవారు దాఁటిరి. ఇఁక మనము కడతేరినను భయము లే దని యుద్ధసన్నద్ధులై పితృదేవతలకు తర్పణము చేసికొని నల్లమందు మద్దతు మామూలుకంటె రెండురెట్లెక్కువగ నెక్కించి గుఱ్ఱము లెక్కి యొండొరులతో "అహాహా! మంచి యదను దొరకె. నేఁడు యుద్ధమను నదినీఁది యుద్దరికి బోవుటయో లేక నడుమమునిఁగి చచ్చుటయో జరుగవలయుఁ గాని మరల నద్దరికి రాఁగూడఁ దని చెప్పుకొనిరి. మొగలాయిసైనికు లాయుధపాణులై శిబిరమును జుట్టుముట్టుటయు జస్వంతసింగుయొక్కపుత్రికలు తక్కిన యంతఃపుర

స్త్రీలు మునుముందె ప్రాణములఁ బాసి స్వర్గలోకమును జూఱఁగొనిరి.

ఆదారుణకృత్యము నిర్వర్తింపఁబడిన పిదప మానవంతు లగు రహతూపులు ఖడ్గపాణులై శత్రువులపైఁ బడిరి. ఆనాఁడు పాఱిన రక్తప్రవాహములలో కెరటములు బయలుదేరిన వని నిశ్చయముగఁ జెప్పవచ్చును. ఈసంగరమున రసపుత్రకులమున నుద్భవించినప్రతి తెగ ప్రతిమనుష్యుఁడుఁ దనకోపినంత శౌర్యముంజూపి కొందఱు మహమ్మ దీయుల ననుసులం బాపి కీర్తి- సంపాదించెను. దుర్గదాసు పలువురు పగతుఱనుదెగటార్చి కులగౌరవమును స్వగౌరవమును నిలుపుకొనెను. చక్రవర్తి బారినుండి తప్పించుకొనిపోయిన కుమారరాజు పక్షమున నింక నెన్నియో యుద్ధములు చేయవలసి యుండునుగనుక కర్ణదాసు మొదలగుమహావీరులు కొందఱు రణరంగమును విడిచి యావలకుఁ బోవుట కిష్టము లేనివారయ్యు దూరమాలోచించి యనేకశత్రువులం జంపితిమి గదా! ఇంకరాజపుత్రరక్షణము నిమిత్తము యుద్ధరంగము విడిచినను మనకప్రతిష్ఠ యుండఁగూడ దనుకొని పగతురచేతఁ జిక్క క కృత్రిమరాజపుత్రుని వాని కృత్రిమమాతను విడిచి తప్పించుకొని పాఱిపోయిరి.

దుర్గాదాసు మొదలగు శూరశిఖామణులు రణరంగము విడిచి కొంతదూరము చని మిఠాయిగంప నెత్తుకొనిపోవుచుండిన తురకం గ లిసికొని గంపలోనున్న రాజపుత్రుని వెలికి దీసికొని పగతుర బాఱిఁ బడకుండ వానిని సురక్షిత మగు స్థలమునకుఁ జేర్చిరి. పాప మాబా లుఁ డెంతమందభాగ్యుఁడోకాని తనరాజధాని యగు జోధపురము లో నున్నను వానికి సేమము లేకపోయెను. ఔరంగజీబు చండశాస నుఁ డగుటచే వానియాయుధములు కడుదూరమున నున్న జోధపుర ము నయితము వచ్చి బాలకుని బ్రతుకు సంశయావస్థకుఁ దెచ్చెను. రాజస్థానమునందు అటువంటి చర్యలవలన తొలుతటి యుద్ధము. అదిశై

వమతస్థుల పుణ్యక్షేత్రము సందెచీఁకటివేళల నక్కడనున్న స్ఫటిక గోపురముల కాంతి దూరమునసుండి చూచువారికి సముద్రపు నురుగు వలె గానఁబడును. అచ్చటి దేవాలయములలో నతిరహస్యములయి పరమపావనము లయిన గదులు కొన్ని గలవు. దుర్గదాసు తన చిన్న రాజుయొక్క క్షేమమునుగూర్చి చాలభయపడి యాపుణ్యస్థలములలో వానిం దాఁచెను. ఆబాలకుఁడు తా నెవ్వరో తనపుట్టుక యెట్టిదియో యెఱుంగక యే మాఱుమూలలఁ బెఱుఁగుచుండెను.

ఈనడుమ నబద్ధపురాణియు నబద్ధపురాజపుత్త్రుఁడును జక్రవర్తిసన్నిధికిం గొంపోవఁబడిరి. వారింజూచినతోడనే యౌరంగజీబు రాజపుత్రులు తనకన్న బారిమి రని గ్రహించియు గ్రహింపనివాఁడువోలెనటించి రాజపుత్రులవంచనకుఁ బ్రతివంచన చేయదలంచి యాదాసినే రాణిగాను దానిబిడ్డనే రాజుగాను సమాదరించి గౌరవించుచు నందరదో మారువారురాణియుఁ గుమారుఁడు దన సంరక్షణములో నున్నారనిచెప్పుచు మారువారుపైదండెత్తిపోయిన జాడుపురము ప్రవేశించి తన యొద్దనున్న దాసీపుత్రుఁడు జస్వంతసింగు కుమారుఁడని పట్టాభిషేకము చేయించి వానిని సింహాసన మెక్కించెను. అంతతో తృప్తినొందక యతఁడు జస్వంతసింగు తమ్ముని కొడుకులలో నొకనిం జేరదీసి రాజ్యమునిమిత్తము పోరాడుమని వానిం బురికొల్పెను. ఈరెండు పన్నుగడలతోను మారువారు దేశమంతయు సంక్షోభస్థాన మయ్యెను. దాసీపుత్త్రుఁడును జస్వంతసింగుయొక్క యన్నకొడుకు నేను రాజును నేను రాజునని బయలుదేరిననురహతూరులు వారిపక్షము జేరలేదు. ఏలయన జస్వంతసింగుకన్నకొడుకెక్కడనుండెనో కర్ణదాసుతక్క తక్కినవారనేకు లెఱుంగకపోయినప్పటికి నేరహస్యస్థలముననో సుఖముగఁ గర్ణదాసు సంరక్షణలో నుండెననియు రాజ్యభారము బూనఁదగినవయస్సు వచ్చినప్పు డాబాలుఁడు

బయలు వెడలునని యునమ్మి వారు కర్ణదాసుచెప్పినట్లు నడచిరి. పైన పేర్కొనఁబడిన ప్రీతివీకులిద్దరువారి నెంతబ్రతిమాలినను బెదరించినను వారు లెక్కసేయక చెవులతో వినుటయే గాని కన్నులతో నైన్నఁడుజూచి యెఱుఁగని తమ రాజకుమారుని రాక కెదురుచూచుచు కృతజ్ఞులై యుండిరి. అప్పుడేగాదు. ఔరంగజేబు దండెత్తివచ్చి రాజధానియగు జాదుపురమును దక్కినపట్టణములను బట్టుకొన్నప్పుడున పుణ్యక్షేత్రము లబాధుచేసి దేవాలయములఁబడగొట్టి యాస్థానముల మసీదులనుగట్టించి దేశమంతయుఁగొల్లపెట్టినపుడును రహతూరులు వారి మొనగాడగుదుర్గదాసు లేశమునులోఁబడక రాజకుటుంబము పక్షము నిలిచిరి.

అజితుని తల్లియగు రాణియు తనకుమారుని నిమిత్తము మగవాంఛ్రు కవచములు దొడుగుకొని యుద్ధములలో నెంతశ్రమపడిరో యంతిపురమునుండి తాను సంతియశ్రమలంబొరయఁ జొచ్చెను. ఔరంగజేబు సయినికులు వచ్చి దేశముకొల్లఁబెట్టి నాశనము చేయుచుండుటచే దనకుమారుఁడున్న యాబూపర్వతము బాలకులకు సురక్షిత స్థానముగా నుండదని భయపడి యాయాపద గడువంబెట్టుటకు తన పుట్టినయిల్లు శరణ మనియెంచి యప్పటిచిత్తూరురాణా యగు రాజసింగును సహాయము రమ్మని పిలచెను. మీవారుకంటె మారువారె యుద్ధములలో శత్రువులధాటికాగగల దేశము. ఏలయన మారువారులోఁ జలభాగ మిసుకపట్టు యగుటచే సైనికుల కాహారము జంతువులకు మేత దొరకుట దుర్లభము. ఇంక మీవారునందన్నను భూములు సారవంతములగుటచేతను గొండలబారులు సుగమములగుటచేతను నక్కడ శత్రువుల యాగడములు మిక్కుటముగ సాగును. దేశస్థితి యిట్లున్నను దమయింటి యాడుపడుచు విపత్తులోనుండి వేడికొనుటచేనామె మొఱ్ఱఁ ద్రోసిపుచ్చరాదని రాణారాజసింగు తత్క్షణమే యామెకుందోడ్పడనియ్యకొనెను

బలమునఁగూడ రాజసింగు మిక్కిలి యధికుఁడుగాఁడు. చిక్కులు సంభవించెనా తొల్లి సంగ్రామప్రతాపుఁడు దాగినయడవులు, హారావళీపర్వతప్రాంతములు దప్ప రహతూరులకు శరణమిచ్చుటకు వానియొద్ద మరియేదియు లేదు. ఏమైననుసరే రాజసింగు వారికిఁ దోడ్పడ నిశ్చయించుకొనియె. మారువారురాణి తాను స్వదేశమును విడచివచ్చుట లేదనియుఁ దనపుత్త్రునిపక్షమునఁ బనిసేయువారికి నుత్సాహము గలిగించుచు నచ్చటనే యుండుననియుఁ జెప్పి కుమారుని మాత్రము మేవారునకంపెను. కర్ణదాసు బాలకుని దోడ్కొని మేవారుఁ బ్రవేశించి రాణాయేర్పఱచిన కెయిల్వాకోటలో బాలకునిఁ బెట్టి సంరక్షించుచుండెను.

చక్రవర్తికి మేవారుపై నలుకబుట్టుటకిది గాక మరియొక కారణముగూడ గలిగెను. మారువారుదేశములో రూపనగరమని యొకపట్టణముగలదు. అది ముఖ్యపట్టణముగ జస్వంతసింగు బంధువుఁడగు రహతూరువంశస్థుఁడు రాజపుత్త్రుఁడొకఁడు చిన్నరాజ్యమును పాలించుచుండెను. అతనికి మిక్కిలి యందకత్తియగు నొకకొమరిత గలదు. ఆబాలికను దనకిచ్చి వివాహముచేయుమని యౌరంగజీబు వానినడిగి యిచ్చినపక్షమున మానుగారికి రెండువేలగుఱ్ఱపుదళములను బహుమానముగ నిచ్చివేయుదునని యాసపెట్టెను ఆశచేతను భయముచేతను రాజు కూతు నౌరంగజీబున కియ్యఁదలంచి యామెను ఢిల్లీకిఁ బంపుటకు నంతయు సిద్ధముచేసెను. తనవంశమునకుఁ బరమశత్రుఁడగు మ్లేచ్ఛరాజునకు దండ్రి తన్నియ్యఁదలంచినాడని విని యా రాజపుత్త్రిక మనమునఁ జాలఖేదపడి యట్టివివాహము చేసికొనుట లేదనియుఁ, బెండ్లిమాని తండ్రి తన్ను రక్షించిననుసరే లేనిచో మరియొక రాజపుత్త్రుని యింటికిబంపిననుసరే కాని యీదుర్ణయముపనికి రాననిచెప్పి యేదియుం జేయుటకు వీలులేనియెడల కరకుతురకను బెండ్లియాడుటకంటె మరణమునే తాను బొంద నిశ్చయించుకొన్నట్లు నిర్భయముగాఁ బలికెను. తండ్రి యామెకుం దగిన

యుత్తరము నొసంగకపోవుటచే నాబాలిక తనదారి తాను జూచుకొనవలయునని జనకసమానుఁడు వృద్ధుఁడునగు పురోహితుని బిలిపించి తన్నా విపత్సముద్రమునుండి దరిఁజేర్పుమని ప్రార్థింప నతఁడు నరే యని రూపనగరమువిడిచి పలుకొండలెక్కి చాలయడవులు గడచి యెన్నెన్నో యేఱులుదాటి మీవారు రాజ్యము బ్రవేశించి యుదయపురముఁజొచ్చి రాణాను సందర్శించి వానిచేతికొక యుత్తరమునిచ్చెను. రాణా యాజాబును జదువుకొనెను. అందలి ముఖ్యవాక్యములివి.

"ఈహంస యాసాఘుకొంగకు భార్యయగుట. పరమపవిత్రమైన రాజకన్య పండుకోతి మొగమువంటి మొగముగల యామ్లేచ్ఛుని బాణిగ్రహణము చేసి [illegible] నవలసిన దేవా! మీరు సరక్షించినరక్షింపుఁడు. లేనిచో బ్రాణత్యాగము చేసికొందునుగాని పాణిగ్రహణము చేసికొనను."

ఈనడుమ చక్రవర్తి తనప్రియురాలిఁ దోడితెచ్చుటకు సైనికులంబంపెను. పంపుటకు తండ్రిపరియత్నించుచుండెను. కన్యనిమిత్తము బంగరుపల్లకులతో బోయులు మొగసాలలో గనిపెట్టుకొనియుండిరి. అంతలో నెక్కడనుండియో యొకరాజపుత్రులగుంపు వేచియున్నతురకబలగముపైఁబడి వేటాడజొచ్చెను. ఉదయపుర రాణాయగురాజసింగు బాలికవ్రాసిన జాబును జూచుకొని కొంతసైన్యముతో రూపనగరమునకుఁ బోయి యడ్డమువచ్చిన తురకల నరికి తొల్లి శ్రీకృష్ణుఁడు రుక్మిణీదేవిని దెచ్చినతెఱంగున కన్యారత్నమును కీర్తిసమేతముగా సంపాదించుకొని మహావైభవముతో బురముం బ్రవేశించెను. ఔరంగజేబు "రాజపుత్రులు తాముచేసిన యీసాహసమునకుఫలమనుభవింపకపోరని తలయూచి మహమ్మదీయమతస్థుఁడుకానిప్రతిమనుష్యునకు తలపన్ను విధించి తనసైన్యమును రాజస్థానముపైవేటకుక్కలవిడిచిన చందమున విడిచెను. ఈపన్ను తొల్లి దయాళుఁడగు నక్బరుమంచిదిగాదని కొట్టివేసినదే. ఔరంగజేబు మీవారునకుసమీపమునన్నున్న యజమీ

రుపట్టణములోనుండి స్వయముగానే సైన్యమునకుఁ గాలోచితములైన యాజ్ఞలను బంపుచు సేనను మూఁడుభాగములుగ విభజించి తనకుమారులగు సజాము, ముజాము, అక్బరు, అనువారల సైనాధ్యిపతులుగానియమించెను. ఆథాటి కాగలేక రాణాయు వానిబలగమునున్న సంఘఁడు పరితాపుడుచేసినట్లు హారావళి పర్వతములకుం జని యయ్యడవులలో దాగిరి. చేయునదిలేక మొగలాయీలు దేశము నాశనముచేసి వారికి భోజనపదార్థము లందనీయక ఫలవృక్షములఁ బడగొట్టి గ్రామంబులు పరశురామప్రీతిచేసి స్త్రీలను బిడ్డలను చెరబెట్టి దేశమంతయు మంగలములోఁ బెట్టి వేచినట్లు మాడ్చిరి.

తురకలుచేసిన యీదౌర్జన్యముచేత హిందువులైన ప్రతిమనుష్యుఁడు స్వదేశమునందు స్వమతమునందు స్వగౌరవమునందు బట్టుదలగలిగి పోయినంగురిక్కేను ప్రాణమేగదా యని కత్తిబట్టి రాణాకడకు బోయెను. అదివఱకే ప్రాణములకుం దెగించిన రాణాయొక్క చిన్నబలమీజనులచే గొంతవఱకు బలపడెను. అడవులలోఁ జరించు భిల్లులు మొదలగు వనచరులుగూడ తురకలం జంపవలయునని విండ్లమ్ములు బూని రాజునకు దోడుచూపిరి. కాఱుమబ్బులుభూమిమీఁదజడివానగురిసినట్లే మొగలాయీల సేనలు దేశముపైబడియెను. ఔరంగజీబైదు దినములుమాత్రమే యజమీరునందుండి పిమ్మటచిత్తూరు ముట్టడించెను. ఆకోట యనాయాసముగాపగతురచేఁ జిక్కెను. అకోటపడినప్పుడు కొండవిఱిగి క్రిందపడెననియే ప్రజలుభయపడిరి. ఎన్నికష్టములువచ్చినను రాణామాఱువాఁడు రాజపుత్రుఁడగు నజితునివిడువక సంరక్షింపఁ జొచ్చెను. చక్రవర్తి సైన్యము మితిమీరియుండుటచేనేవేళ కేమికీడు మూఁడునో యనిరాజపుత్రులాయర్భకునిఁ గుండలో దీపము బెట్టినట్లెట్టనో దాఁచిరి.

చక్రవర్తి చిత్తూరును ముట్టడించుచుండ దుర్గదాసు వానిదృ

ష్టి మరలించుటకు జాల్వారుపట్టణమును ముట్టడించెను. తురకలయెదుట నిలిచి యుద్ధముచేయుటకుజాలకపోవుటచేరాజపుత్రులసేనలు మొగలా యిసేనలకు మార్గమధ్యమున గష్టములుగల్పించుచు వారికొఱకుఁ బో వుసరకుల దోఁచుకొనుచు నొకమూలనుండియొకమూలకు మారుత్రో వలం బోవుచునుండినవిగాక పోయినవిగాక కంటిలో నలుసులవలెనుం డెను. దేశమంతయు నాశనదేవత విహరించు స్థానమయ్యెను. రాజపు త్రులు హారావళీపర్వతములలో నడుమనడుమ దిగివచ్చి మొగలుసేన లు నిమిత్తము పండించినపంటల నెత్తుకొనిపోయి కొంటలమీఁద కుప్ప లువేసికొనుచు వచ్చిరి. రాజపుత్రు లెంతకాలమునకు లోఁబడక మేర మీరిన సిలుగులఁ బెట్టుటచేఁ జక్రవర్తి విశ్రాంతి నెఱుఁగక బాధవ డఁజొచ్చెను.

అట్లుండ నొకమారు రాణాచక్రవర్తినిభ్రమపెట్టి పట్టుకొనవ లయునని యొకయుపాయము పన్నెను. చక్రవర్తి వారిని మించిన జి త్తులమారియగుటచే నావలలోఁ బడక తప్పించుకొని యుదయపురము ను బట్టుకొమ్మని యేఁబదివేలసైన్యమిచ్చితనకుమారుఁడగు నక్బరును పంపెను. ఆసైన్యమును రాజపుత్రు లెవ్వరు నడ్డగింపలేదు. ఉదయపుర ము వచ్చినప్పుడును చక్రవర్తికుమారునికంటి కొక్కమనుష్యుఁడైన కానఁబడలేదు. అంతఃపురములు పరిమదావనములు సరస్సులునిర్జనము లైయుండెను. అంతయుఁ బ్రశాంతముగ నుండెను. తనధాటికాగలేక పౌరులందఱు నగరమునువిడిచి పారిపోయిరని చక్రవర్తిపుత్రుఁ డూ హించి మరలఁ వెనుకకుఁబోయినచోఁదనతండ్రియెల్లపుఁడేదోపనిచెప్పి వేధించుచుండునని యతనిపోరు తప్పించుకొనిసుఖపడఁదలఁచియానగ రసరోవరతీరమున గుడారములు వేయించియందువిడిసిశత్రుదర్శనము లేమి నిర్భయముగా భోగపరాయణుఁడై యొడలుమరచి విహరింపఁ జొచ్చెను.

రాణాయొక్క మంత్రులలో సూక్తావతువంశవృద్ధుఁడొకఁడుం డెను. అతఁడు విపత్సమయమున రాణానుచూచి ముందు చక్రవర్తి సైన్యముకు నిర్భయముగా మన దేశముఁబవేశింపనిమ్ము? మనము వారినెదిరింపవద్దు. వచ్చినవెనుకన వ్వలివార్త నివ్వలకునివ్వలివార్త నవ్వలకు నందకుండ మనము దారులకట్టి కరవుపాలుచేసి చంపుదమని యాలోచనము చెప్పెను. ఆహితోపదేశమును బట్టియే రాణా పురజనులందఱ నుదయపురమునుండి పొమ్మని దాని నిర్జనముగఁ జేసెను. ఇట్లువచ్చిన యక్బరు సేనలను నలుమొగంబులనుండి పగతురు కనిపెట్టుచునే యుండిరి. అక్బరు సరోవరతీరమున యథేచ్ఛముగా భోగపరాయణుఁడై యుండ నొక్కనాఁడు మీవారు రాజకుమారుఁడు జయసింగను వాఁడేమూలనుండియో యాకస్మికముగా మొగలు సేనలపయిం బిడుగువడువునఁ బడియెను. ఆసమయమున మొగలాయిలలోఁ గొందఱు నమాజు చేయుచుండిరి. కొందఱు విందులారగించుచుండిరి. కొందఱు చతురంగమాడుచుండిరి. కొందఱునిద్రించుచుండిరి. దొంగిలింపబోయి బద్ధకించి నిద్దురపోయిన దొంగలాగున మొగలుసైన్యము వచ్చినపని యొకటి చేసినపని యొకటి అనేకు లానిద్దురనుండి యెన్నటికిని లేవనేలేదు.

హతశేషసైనికులతో నక్బరు తండ్రివద్దకుంబోవ పయనమయ్యెను. కాని రాణాసైనికులు దారి నరికట్టిరి. అక్కడనుండి మొగముఁ ద్రిప్పి యతఁడు కొన్ని కొండకనుమల దారిని మారువారులోఁబడి పోవలయునని యావంకకు మరలెను. కాని యక్కడ భిల్లులు మొదలగు నాటవికులు వారిమీఁద నమ్ములు రాళ్ళు విజ్జిమ్మి వెనుకకుం దరిమిరి. ఆభిల్లుల బారి తప్పించుకొని యతఁడు మరల వెనుకకు మరలఁగా నచ్చట జయసింగు కనిపెట్టుకొనియుండి సేనంబటాపంచలు చేసెను. మొగలుసేనలకు కత్తిచేయుచున్న యీనాశమునకుఁదోడు

కరవుగూడ తనపనిచేయ నారంభించెను. ఆరెంటిచేత తురకలు నిశ్శే షముగ వధింపఁబడియే పోవుదురు. కాని యంతలో రాజపుత్రుల యౌదార్యము దయాస్వభావము దశాభేదము గలిగించెను. అక్బరు సంధికివేడి యుద్ధము నంతతో తుదముట్టింతునని వాగ్దానముచేసి జయసింగును బార్థింపకొటియ్యమెఱుఁగని యారాచబిడ్డ వానివా క్యములు సత్యములుగావగచి యాఘనములుదించిదైన వెళ్ళుటనక యాతురకదళమును జిత్తూరునకు బారిపోవనిచ్చెను.

ఔరంగజేబున కనేకభార్యలు గరు. అందు కకేషియన్ జా తిస్త్రీయొకతె యుండెను. ఉదయాపురీ యామెపేరు. చక్రవర్తియొ క్కయీదండయాత్రలో నాతని ప్రియభార్యయగు నుదయాపురీ దై వవశమున రాణాచేతఁ జిక్కెను. రాణా యామెను మిక్కిలి గౌరవ ముతో నాదరించి కొంతపరివారమునిచ్చినగౌరవముగాభర్తవద్దకు బం సి తనచేసిన యుపకారమునకు బత్యుత్తరముగా గోవులను వధింపవద్ద ని వేడుకొనుచు సందేశమంపెను. చక్రవర్తి యీమాటలు చెవిని బెట్టనేలేదు. చక్రవర్తికి మితిమీరిన సేనలుండినను కావలసినన్ని సంచారములుండినను రాజపుత్రులు క్రమముగా నిలిచి యుద్ధముచే యని వారగుటచే వారిని నిశ్శేయముగ జయింపలేకపోయెను. విశే షించి పలుమారు జయము రాజపుత్రులకే గలుగుచుండెను. ఒకసా రిచక్రవర్తి యేనుగులు జండాలు రాణాచేతఁజిక్కెను. వేరొకసారి వానికుమారుఁడగు నక్బరుచు సమగ్రముగా జయించెను. ఈవిజయ ము సూక్ష్మబుద్ధిగల యొక రాజపుత్రవీరుని యుపాయముచేత లభిం చినది. ఆవీరుఁడు మొగలాయిలయెంటెల నైదువందలఁ బట్టుకొని వాటిమొగములకు కాగడాలుగట్టి వెలిగించి రాత్రి యాతురకసేవల మీఁదికి తోలెను. తురకలావైచిత్ర్యమును జూచి భయపడి పారిపో యిరి. యుద్ధమొంతకాలమువరకు ముగియకుండుట దుర్గదాసుమనసులో

నొకయుపాయము పన్నెను. ఔరంగజేబు వానిసోదరులు మున్ను తండ్రిపై గత్తిగట్టి యాముసలివానిని రాజ్యభ్రష్టుని జేసినట్లె యిప్పుడు యుద్ధముచేయుచున్న యీచక్రవర్తికుమారులు మువ్వురు తండ్రిమీఁద తిరుగఁబడినచో బ్రతుకుగదా యని యోచించి తండ్రి కొడుకులకు భేదములు గల్పింప నతఁడు సమకట్టెను. అతని సంకల్పమున కనుకూలముగ రాజపుత్రుల శౌర్యమునకు వారు తనయెడల జూపిన నెనరునకుఁ జాలసంతసించి యక్బరునువానియెడ ననురాగము గలిగియుండెను. ఈయనురాగమునకుఁ దోడుగ నక్బరు దెంపులేని యాయుద్ధముతో విసుగుజెంది తండ్రిపై మిక్కిలి యనిష్టముగలుగ విధిలేక పోరుచుండెను.

ఇట్లుండఁ గొన్నినాళ్ళకు తనకుమారుఁడగు నక్బరుహిందూస్థాన చక్రవర్తి-యను బిరుదుపూని స్వతంత్రుఁడై డెబ్బదివేల సైన్యముతో తనమీఁదికి దండెత్తి వచ్చుచున్నాడని యౌరంగజేబునకు వార్తదెలిసెను. రాజపుత్రప్రేరణమున నక్బ రట్లుచేసినమాట నిజమే. అప్పుడు చక్రవర్తి యజమీరులో నుండెను. అతనివద్ద దేహసంరక్షణార్థ మొకవేయి సైనికులకంటె నెక్కువలేరు. తక్కినకుమారులిద్దరు చాలదూరముననుండిరి. సైన్యబలము లేకపోవుటచే నతఁడు బుద్ధిబలమేప్రయోగించి మనోధైర్యమును నించుకేనియు బీరువోవనీయక యాయాపదను దప్పించుకొనియెను. తనకుమారుని రాజపుత్రులనుబడఁదోయుట కతఁడు గట్టియుపాయములనల యొకటిపన్నెను. ఆవలయిది అతఁడు తన వేగులవాండ్రలో నొకనింబిలిచి వానిచేతికొకయుత్తరమిచ్చి యిది దుర్గాదాసు డేరాలోఁ బడవేయమని చెప్పెను. ఆయుత్తరమును జూచుకొనఁగా జక్రవర్తియు గొడుకు మనసులోనొకటేయనియు మహమ్మదీయసైనికుల విశ్వాసమును బరీక్షించుటకును రాజపుత్రులంబట్టియప్పగించుటకును గొడుకునుతండ్రియుఁ

గలసి యాపన్నుగడపన్నిరనియు దుర్గదాసునకుఁ దోఁచెను. ఈసంగతులు వెల్లడియైనతోడనే తురకసైనికులక్బరునువిడిచి చక్రవర్తిం జేరిరి. రాజపుత్రులు విడిచిపోయిరి. పాపమక్బరు దుర్గదాసుసమేతుఁడై మూఁడువేలసైనికులుకొలువ ప్రాణభీతిం బారవలసివచ్చెను.

అక్బరుమనసులో నెవరికిద్రోహము తలంపలేదనియు నిష్కారణముగా జనకుఁడు పన్నిన పన్నుగడచేతనీయిక్కట్లు సంభవించినవనియును రాజపుత్రులు మఱునాఁడు తెలిసికొనిరి. తెలిసికొనిననేమి? కార్యముచేదాటెను. ఇంతలోఁ జక్రవర్తియొక్క తక్కినకొడుకులిద్దరు తండ్రినిగలిసికొనిరి. కాఁబట్టి యక్బరుచేయఁదగిన దేదియులేకపోయెను. రాజపుత్రులు తమకొండలలో నతనిందాఁగుమని యభయమిచ్చిరి. కాని యతఁడు సాధ్యమైనంతవేగముగ క్రూరుఁడగు తండ్రిబారినుండి తప్పించుకొని యావలబడవలయునని సమకట్టి దుర్గాదాసు మొదలగు నైదువందవీరులు వెంటరా రాజస్థానము నిర్గమించెను. ఇంతలోఁ జక్రవర్తికొడుకుం దరుముచురాఁగా నతనికడనున్న రాజపుత్రులు కొడుకుదారి వానికిఁ జూపక తప్పుత్రోవ దొక్కిరి.

ఇట్లు తనకుమారుఁడు తప్పించుకొనిపోయెనని చక్రవర్తివిని మిక్కిలికోపించెను. తనయుని పలాయనములో మారువారు రహతూరులు సహాయులైరని తెలిసి యౌరంగజేబుమరల మారువారు దేశముపైఁబడెను. దండయాత్రకుఁదోడుగ విషూచిజాడ్యము మారువారునం బ్రబలి పగతురకత్తులపాతఁ బడకుండ మిగిలినవారిని దనపొట్టంబెట్టుకొనెను. ఎన్నికష్టములు వచ్చినను రహతూరులుమాత్రము లోఁబడలేదు. ఈనడుమజస్వంతసింగుకుమారుఁడగునజితుఁడుదినదినాభివృద్ధికొందుచుండెను. రహతూరులనేకులు వానియునికి వినుటయేగాని విగ్రహమెన్నఁడు జూచియెఱుఁగమి ప్రభువుంజూడఁగోరి "మాయేలికం జూడకపోవుటచే నన్నమునీళ్ళును నోటికి రుచించుటలేదు కావునతప్పక

చూడవలయు"నని ప్రార్థించిరి. అప్పుడు దుర్గాదాసు బాలకునిఁదెచ్చి రహతూరలకు జూపెను. అప్పటికి బాదాపుగనతనికి యుక్తవయసు వచ్చుటచే రహతూరు లాకుమారునకు నేనుఁగులు గుఱ్ఱములు ముత్యములు రత్నములు కానుకలిచ్చి మొగమున రాజలాంఛనమగు టీకా నువేసియేలికగానంగీకరించిరి. యుద్ధమప్పటికిముగియనందున రహతూరులు మరల సన్నద్ధులైరి. కుమారరాజు కయ్యముల నారితేరని వాఁడయ్యె తన జన్మవంశములకుఁ బ్రతిష్ఠ గలుగునట్లు పోరాడెను ఇంతలో గలహము మిక్కిలి సందడిగనున్నపుడె మీవారు ప్రభువగురాజసింగు మృతినొందుటయుఁ దొల్లి యక్బరును దయాళువై విడిచిన జయసింగు మీవారు గద్దెనెక్కుటయు సంభవించెను. జయసింగు యుద్ధమున సింహమై మోడినశత్రువులకుఁ గృపాళువై శ్లాఘ్యుఁడయ్యెను. ఆతని దయామయస్వభావమే కడకు వానికమితోపకారము చేసెను. చక్రవర్తి దక్షిణహిందూదేశములోఁ గొన్నియల్లరుల నడచుటకుఁ బోవదలఁచి రాజస్థానమును బీడించుటకు, గాలముచాలక జయసింగుతో సంధి జేసికొనియెను. కాని యాసంధి చిరకాలము నిలువలేదు. తక్కిన రాజపుత్ర సంస్థానములన్నియు మొగలాయిల దాడిచేనెన్నరాని సిలుగులఁబడుచుండ మీవారుప్రభువు తన్నుగానట్లు కులుకుచునూరకుండఁగలఁడా? అందుచేతనతఁడు తనబంధువులకుఁదోడ్పడెను. ఈసంధిచెడిపోవుటకుఁతప్పువారిపై వీరు వీరిపై వారు మోపిరి. చక్రవర్తి ద్రోహము జేసెనని జయసింగుపలికెను. జయసింగునీతిమాలిసంధి తప్పెనని చక్రవర్తి యనెను.

ఔరంగజేబు చిరకాలము బ్రతుకుటచే ననేక రాజపుత్రప్రభువుల మరణముఁజూచెను. ఈయుద్ధమిట్లుండగానే బాహుశాలియగు జయసింగులోకాంతరగతుఁడయ్యెను. వానికుమారుఁడగు రెండవయమ్రా మీవారు సింహాసన మెక్కెను. అతఁడు సింహాసనమెక్కిన యేఁడుసంవత్సర

ములకు రాజస్థానమంతయు మహానందసముద్రమున నోలలాడు నౌరంగజీబు చక్రవర్తి మృతినొందినవార్త తెలిసెను. ఔరంగజీబు క్రీస్తుశకము 1707 సం॥ మార్చినెలలో చనిపోయెను.

ఈనులవిందగునావార్త వినియజితుఁడుగుఱ్ఱమెక్కి జాడుపురము బోయి మొగలాయిలం దఱిమిసింహాసన మెక్కి తనతండ్రితాతలదర్బారులో గొలువుదీర్చెను. ఎదిరించిన తురకలలోఁ గొందఱనరకి కొందఱి జెరఁబెట్టి కొందఱఁ దఱిమికొట్టి వారుకసిఁదీర్చుకొనిరి. తురకలు రాజపుత్రులబారికోడి పిక్కబలముకొలఁదిపరుగెత్తుచుతురకవేషములదీసివేసి బైరాగులవాలకములుదాల్చిహరిగోవిందాసీతారామాయనిపలుకుచు బగటిపూటలబిచ్చమెత్తుకొనుచు రాత్రులు పోఁగలిగినంత దూరముపోవుచు వీలైనంతవరకుఁ బ్రాణరక్షణముచేసికొనిరి. తురకలగురువులగు ముల్లాలు జపమాల త్రిప్పునపుడు మహమ్మదుపేరుమాని రామనామము స్మరించిరి. మంగళ్లను బిలిపించి సొమ్మిచ్చి గడ్డములను గొరిగించుకొనిరి. రాజపుత్రులకు గడ్డములు లేకపోవుటచే తమగడ్డములఁ జూచి తమ్ముతురకలుగ వారు గుర్తింతురని భయపడి యట్లుచేసిరి

ఔరంగజీబు ననంతరము వానికుమారుఁడు బహదూరుషా డిల్లీచక్రవర్తి యయ్యెను. అతనికి నౌరంగజీబునకున్న దార్ఢ్యము లేనందున నదివఱకే చక్రవర్తిపడనికష్టము లతఁడుపడవలసివచ్చె. రాజపుత్రులు మహారాష్ట్రులు సిక్కులు వానితండ్రివలనఁ గష్టములు పడిపడి యాతని కాలమున రేగి రాజ్యమును ముక్కముక్కలుగఁ జీల్పనారంభించిరి. మొగలాయివీరులు సౌఖ్యములుమరిగిబంగరుపల్లకులలోఁ గూర్చుండియుద్ధములకుఁ బోవనలవడి తొలుదొల్తబేబరుతోహిందూస్థానమునకు వచ్చిన తమపూర్వులనెందుంబోలక పౌరుషహీనులైరి. బహదూరుషాకాలగతులెఱిఁగి యున్నచిక్కులకుఁదోడు రాజపుత్రులకుఁగోపము తెప్పించిన చో మరిన్ని బాములుబడవలసివచ్చునని తలఁచి యాకాలమునవారను

భవించెడుసకలస్వాతంత్ర్యములనువారికిచ్చి రాజస్థానముపై తనకుఁగల యధికార మొకవిధముగా వదలుకొనెను. రాజస్థానములో మూడుము ఖ్యసంస్థానములుండెను. అవి యంబరు మీవారు మారువారులు. అంబరుప్రభువగు జయసింగు మీవారుప్రభువగు రెండవయమరామా ర్వారునాయకుఁడగు నజితుఁడు ముగ్గురొకచోటఁజేరి ఢిల్లీతో నేవిధమైన సంబంధము లేకుండఁ జేసికొనవలయునని యొట్టుపెట్టుకొని యొడంబడిక జేసికొనిరి. ఆ యొడంబడిక మరింత కట్టుదిట్టముగ నుండుటకుఁ దక్కిన యిద్దరు ప్రభువులు మీవారు ఆడుపడుచులను వివాహముచేసికొని వారిసంతతులకే రాజ్యమిచ్చుట కొడంబడిరి.

ఈవిధముగా రాజపుత్రులకు మొగలాయీలకునాశనకారణమైన ముప్పదియేండ్లయుద్ధముముగిసెను. ఔరంగజీబుతనముత్తాతయగునక్బరువలె రాజపుత్రుల నాదరించి వారితోడిసంబంధబాంధవ్యములు నిలుపుకొన్నచో మొగలాయి రాజ్యము మహారాష్ట్రులచేఁజిక్కి విపద్దశనొందకుండ యీ రాజపుత్రులు సంరక్షించియుందురుగదా! ఔరంగజీబు రాజపుత్రసహాయము లేమికుడిభుజముఁ గోల్పోయి మహారాష్ట్రులతో బోరవలసివచ్చెనని చెప్పవచ్చును. రాజపుత్రులు ఢిల్లీనుండివిడిపోవుట మొగలాయిలకే గాకయీ రాజపుత్రులకునునష్టమాపాదించెను. వీరు పురువిడిపోవుటచేమహారాష్ట్రులుప్రబలివీరిరువురఁ జెరియొకసారినడంచిరి. మీవారు రాజుల యాడుపడుచులను తక్కిన రెండుసంస్థాన ప్రభువులు పెండ్లియాడుటచే రాజపుత్రులలో రాజపుత్రులకే గద్దెమెక్కెడు విషయమున బలుమారుకుటుంబ కలహములు గలిగెను. ఆవివాదములు చక్కఁబెట్టు నెపమున మహారాష్ట్రులువచ్చి వారిరాజ్యము నాక్రమించుచువచ్చిరి.

అజితుఁడు మారువారు చిరకాలముబరిపాలించెను. అతనిపాలనమన్నివిధముల మెచ్చఁదగియుండెను; కానియొక్కవిషయమున నిందా

స్పదమైయుండెను. ఆనాటిరాజపుత్రులపంక్తిలో దుర్గాదాసుజనులకు మిక్కిలియిష్టుఁడు. ఔరంగజేబుచక్రవర్తి యావజ్జీవ మిద్దరిశత్రువులం గూర్చి బెంగగొనియుండెను. ఒకఁడు మహారాష్ట్రుఁడగుశివాజీ; రెండవ వాఁడు రాజపుత్రుఁడగుదుర్గదాసు. ఆచక్రవర్తికివీరి పేరులీశ్వరవేరులు ఆతఁడాయిద్దఱుపగతురచిత్తరువులు వ్రాయుమని యొక చిత్రకారున కాజ్ఞాపించెనఁట. ఆచిత్రకారుఁడును వల్లెయని మంచముమీఁదఁబవ్వళిం చినస్థితిలో శివాజీచిత్తరువువ్రాసి, గుఱ్ఱమెక్కి తీరికలేమి దానిమీఁద నేయుండి యుద్ధములో రొట్టెఁదినుచున్న స్థితిలో దుర్గాదాసు చిత్తరు వువ్రాసి చక్రవర్తికిసమర్పించెను. ఆరెండుపటములు దగ్గఱఁబెట్టుకొని యాముసలిపాదుషాగుండెబాదుకొని యాపాడుశివాజీనెట్లుకైనబట్టుకొ ని గెలువగలనుగాని యీరాచకుక్క దుర్గాదాసునుమాత్ర మీజన్మ మున పట్టుకొనగలనని ధైర్యము లేదుగదా యని పలుకుచుండునఁట.

ఆదుర్గాదాసేగదాయజితుని కాబూలునుండి సేమముగదెచ్చి జీవితమంతయుధారవోసిపెంచివిలువిద్యనేర్పి రాజ్యమప్పగించిసంరక్షిం చెను. అట్లు తండ్రికంటెనెక్కుడైన యాదుర్గదాసున కజితుఁడు మహా ద్రోహము చేసెను. ఇందుకే యారాజుచరిత్రము నింద్యాస్పదమైనది. కొండెములు వినియో, యోర్వలేమికిలోఁబడియో యెందుచేతనో నజి తుడువృద్ధుఁడగుదుర్గదాసును ధనమెల్లదోఁచుకొనిసర్వభ్రష్టునిజేసి దే శమునుండి వెడలఁగొట్టెను. చరమదశలో దుఃఖభాజనుఁడైన యా మహావీరునకుమీవారు రాజగు రెండవయుమరి శరణమిచ్చి యుదయ సాగరము చెంతనొక మేడఁగట్టించియందుంచిదినమునకైదువందలరూ పాయలు బత్తెమిచ్చిపోషించిగౌరవించెను. ఒకమారు బహదూరుషా దుర్గదాసును బట్టితనకప్పగింపవలసినదని మీవారురాణాకు జాబువ్రా సెనఁట. కాని ధీరోదాత్తపురుషుఁడగు రాణా యట్టిదుర్ణయమున కొడంబడుట లేదని ప్రత్యుత్తరమిచ్చెను.

అజితుఁడు చాలకాలమునేలి యేలినపిదప 1730 సం॥న నొకనా రాటి రాత్రిబూంది రాజుల యాడుపడుచగు నొకభార్యమందిరమునఁ బవ్వళించియుండగా నాదంపతులకు జన్మించినకొడుకులేయిద్దరు రెండుజాములవేళ మందిరముఁజొచ్చి తండ్రినివధించిరి. స్వహస్తములతోఁ దండ్రి నిజంపినవాఁడు రెండవకొడుకు. జ్యేష్ఠుఁడు తానుగద్దె నెక్కవలయునని దగ్గరనుండి తమ్మునిచేతఁ దండ్రిని చంపించెను. అదురాత్ముని నామధేయము అభీసింగు. ఈదుష్కార్యముజరిగినది మొదలుకొని మారువారు సంస్థానమున కభ్యుదయము లేదని జనులుతలంచుచున్నారు.

---

# రా ణా సం గ్రా ము ని క థ.

సంగ్రాముఁడు క్రీ. శ. 1716 వ సంవత్సరమున మీవారుసింహాసనమెక్కెను. పూర్వపు రాజుల శౌర్యమునఁ జూపిన యుదయపూరు రాజులలో నితఁడే కడపటివాఁడు. అతఁడు దృఢమనస్కుఁడనియు న్యాయపరిదాత యనియు నాడంబరము లేనివాఁడనియుఁ దెలుపుటకనేక కథలుగలవు. అతనికాలములోఁ బ్రజలు మహారాష్ట్రులవలన మొగలాయిలవల్ల బాధలు లేక చాలసుఖపడిరి.

అతఁడు కడుబాలుఁడయియున్నయపుడె తండ్రిమృతినొందుటచే దల్లి బాల్యకాలమున రాజ్యపాలనముఁ జేసెను. యుక్తవయస్కుఁడయినపిదప నతఁడు రాజ్యభారమును బూని తల్లిపెత్తనమేమియు లేకుండ బాలించెను. ఒకమారు వానితల్లి యనవసరముగ దనకుసంబంధములేని

వ్యవహారములలో జోక్యము కలుగఁజేసికొనఁగ నతఁడామెకు నెంతో చమత్కారముగ బుద్ధిజెప్పెను. సంగ్రాముఁడు సర్వకాలసర్వావస్థల యందు మిక్కుటమగు మాతృభక్తింజూపి యామెయడుగులఁ గన్నుల నద్దుకొని విధేయుఁడయి యుండుటఁజేసి కొడుకు తనపలుకులు వినకపోవునాయని తలంచి యామె యడుగరానికోరికల నడిగెను.

దేరియావదు పేరుగల యొకచిన్నసంస్థానముగలదు. ఆసంస్థాన ప్రభువుసంగ్రామునకురక్తస్పర్శగలచుట్టము. అతఁడుదుర్నయుఁడయి యుండ వానిసంస్థానమును సంగ్రాముఁడు తనయధీనము చేసికొనెను. రాణా చిన్నవాఁడయ్యు యుక్తాయుక్తము లెఱిఁగి పౌర్వాపర్యములువిమర్శించి ప్రతికార్యము సేయుటఁజేసి సామంతరాజు లెవ్వరు దేరియావదు ప్రభువుపక్షమున రాణాను బ్రతిమాలరైరి. అట్లు రెండుసంవత్సరము లాప్రభువు రాణావారి దర్బారునకు దూరుఁడయి నానాబాధలు పడిపడి యెట్టకేల కేదోవిధమున రాజానుగ్రహము బడయ నిశ్చయించుకొనెను. సంగ్రాముని తల్లియొద్ద నూడిగములుసేయు పనికత్తియల లోఁ గొందఱి నాపరిభు వెఱుఁగును. అందుచే వారిం గలిసికొని యతఁడు వెలలేని నగలు వారికి బహుమానముగ నిచ్చెదనని వాగ్దానముసేసి రాణావారి తల్లితోఁ దనసంగతి మనవిచేయుమని చెప్పి యామె కొకయర్జీయును రెండులక్షలరూపాయలు కానుకగ నిచ్చునట్లొక పత్రికను వ్రాసి వారిచే నామెకుబంపెను. రాణాసంగ్రాముఁడు పూటపూట భోజనమునకుఁ బోవకముందు తల్లియున్న యంతఃపురమునకుఁ బోయి యామెకుఁ బాదాభివందన మొనరించి పిమ్మట నారగించుటకుఁ బోవుచుండును. ఒకనాఁడు సాయంకాలము రాణా యెప్పటియట్లు తల్లియడుగులకు మ్రొక్కి భోజనమునకు వెడలఁదలఁచుచుండఁ దల్లి కొడుకు నొకకోరిక కోరెను. "కుమారా! దేరియావదు ప్రభువు నీచేత దగినట్లు దండింపఁబడెను. ఇప్పుడతఁడు పశ్చా

త్తాపము నొందుచున్నాడు. కిమ్మర వానిసంస్థానము వానికిచ్చి నీ యనుగ్రహమునకుఁ బాత్రుని చేయఁగూడదా" యని యడిగి యామె తనకాప్రభువు వానిపక్షమున చెప్పినందున కిచ్చె నన్న రెండులక్షల రూపాయిల మాటకూడ దాఁచక చెప్పి యెట్లయిన వాని ననుగ్రహింపుమని బ్రతిమాలెను. ఆకోరిక విని రాణా విసుగుకొనక లేశము సందేహింపక యట్లె చేయుదునని చెప్పెను. రాణా యేకార్యమును జేయదలఁచుకొన్నను వాగ్దానముచేసినపిదప నొకవారము గడపి దానిని వ్రాసి చర్యఁజరిగించుట మీవారులో వాడుకగ నుండెను. రాణా నాఁడు తొల్లింటివాడుకలు విడిచి తాను తల్లిసమక్షముననుండి యావలకుఁ బోవకమునుపే దేరియావదుప్రభువును రాజ్యప్రతిష్ఠితునిఁ జేసినట్లు శాసనము వ్రాయుమని చెప్పి రెండులక్షలరూపాయలు మాత్రము వానియొద్ద లంచము పుచ్చుకొనవద్దని యామెను బ్రతిమాలి వినయముతో మరల నమస్కరించి భోజనమునకు జనియె.

రాజమాత తన తెలివికి మిక్కిలి సంతసించుచు కొడుకుం బొగడుచుండెను. కాని మరునాఁడు సంగ్రాముఁ డెప్పటియట్ల తల్లికివందనము సేయుటకు రాఁడయ్యె. అట్లుసేయుటకుఁ గారణ మేమని తల్లి వర్తమానమంప నెప్పటికంటె నొకగడియముందు భోజనముచేసెనని యామెకుఁ దెలిపెను. పోనీ సాయంకాలము వచ్చునని యామె వేచియుండ నప్పుడును రాలేదు.ఆమెబిడ్డనురమ్మని ప్రేమాస్పదముగ మరల సందేశమంపెను. రాణా మునుపటికంటె వినయముగఁ బ్రత్యుత్తర మంపెను. కాని తానుమాత్రము మాతృదర్శనమునకుఁ బోవఁడయ్యె.

అంతట రాజమాత తనతప్పుఁ దెలిసికొని దుఃఖితయయి మూడుతరములనుండి మీవారునకు మంత్రిగానుండి రాణాలకు హితోపదేశము జేయుచున్న ముఖ్యమంత్రిసలహా నడుగవలయునని వానిఁ దనకడకు రమ్మనియానతిచ్చెను. బుద్ధిశాలియగు నామహామంత్రి

"రాజ్యాంగవిషయములను రాణావారితోఁదక్క నుఱియెవ్వరితో నేను మాటలాడఁగూడదని నాకు రాణావారు శాసించిరి. కావున నేను రాఁజాల" నని యామెకు సవినయముగ వర్తమానమంపెను. ఈప్రయత్నము విఫలమగుటయు నామె తనకు శక్యమయిన యత్నములన్నియుఁ జేసె. ఎన్నిచేసినను గొడుకుదర్శనము గాదయ్యె. అప్పుడు కోపము హెచ్చజొచ్చెను. పనికత్తెలెదుట నిలువఁబడుటకు వీలులేకపోయె. తుదకామె యన్నముదినుట మానుకొని యెవరికిఁగానఁబడక విలపింపఁ జొచ్చెను. అప్పటికయినఁగుమారుఁడు లక్ష్యము సేయఁడయ్యె. ఎట్టకేల కామె దేశము విడిచి గంగాయాత్రకుఁ బోదునని కొడుకునకుఁ జెప్పిపుచ్చెను. వెంటనే కుమారుఁడు తల్లి ప్రయాణమున రవంతయు కష్టపడకుండునట్లు కావలసినన్ని సదుపాయములు జేసి వలయు పరివారమిచ్చి కోరినధనమిచ్చి వెళ్ళుమని వర్తమానమంపెను. ప్రయాణసమయమునఁ బల్లకియంతఃపురమునొద్ద సిద్ధముగానుండునప్పుడయినఁ దన్ను సాగనంపుటకు గడసారి తనకొడుకు తనయొద్దకు వచ్చునని యామె యూహించియుండెను. గడుసరియయిన యామెకొడుకు సందేశములతోనె వెళ్ళఁబుచ్చెనుగాని యప్పుడయిన తల్లికంటికగుపడడయ్యె. అన్నివిధముల నిరాశఁజెంది సిగ్గుపడి యారాజమాత చల్లని గంగానదిజలములయిన నార్పలేనిహృదయసంతాపముతోఁ బల్లకినెక్కి పయనమయి పోయెను.

పోవుచు నామెమార్గమధ్యమున నంబరుపట్టణమున నొకపూట విడియ నాదేశపురాజగు జయసింగు భక్తిపెంపున నామెదర్శనము జేయవచ్చెను. అంబరురాజు మీవారురాజు బావమఱఁదు లగుటచే జయసింగు బాంధవ్యముచేతను భక్తిచేతను రాజమాతంగనుఁగొని తాను క్రొత్తగా కట్టిన జయపుర మనుమహానగరమును జూచిపొమ్మని యామెను బ్రతిమాలి యామెకు [illegible] యుపచార

ములుచేసి యెంతకు నామె సమ్మతింపకపోవుటచే నామె యెక్కినపల్ల కిదండె తనభుజముపై బెట్టుకొని కొండొకమోసి తనభక్తిఁజూపెను. ఈయుపచారమునకు రాజమాత మిక్కిలి సంతసించి జయసింగు తనయింటిగుట్టు వెళ్ళబోసికొనవలసినంత యాప్తుఁడుగాకున్నను తన మొర వినువారు మఱెవ్వరు లేమి యాతనితోఁ దనహృదయతాప మెఱింగించెను. అతఁడును విని యామె దుస్థితినిఁగూర్చి విచారించి కొడుకునకు నామెకు మధ్యవర్తియయియుండి పొత్తుసేయుటకుఁ బూనుకొనియె.

రాజమాత సరేయని తీర్థయాత్రి కెల్ల సేవించి మరల వచ్చు నప్పు డంబరుపట్టణమునకు రాఁగా జయసింగు తనమాట నిలుపుకొను టకు నామెతో నుదయపురమునకుఁ బోవఁ దలఁచి తగుపరివారము తో బయలుదేరెను. తల్లి జయసింగును వెంటఁబెట్టుకొని వచ్చుట విని సంగ్రాముఁడు వారియుద్దేశ మెఱిఁగి గృహచ్ఛిద్రముల విషయమున నొకరిచేతఁ జెప్పించుకొనఁ దగునాయని సపరివారముగ పురము వెడలి తల్లికెదురుగఁ బోయెను. పోయి జయసింగు విడిసియున్న తావునకుఁ బోక తల్లి యున్న నెలవునకుఁ బోయి తనరాక నామెకెఱిఁగించి దర్శ నముచేసి వెనుకటియట్ల ఁవనసలువడసి యామె నభ్యంతర మందిరము నకుఁ దోడుకొనివచ్చెను. ఆమె నింట విడియించినపిదప వెండియు నతఁడు బయలుదేరి జయసింగువద్దకుఁజని వానిని సగౌరవముగఁ బురి కిం దోడితెచ్చెను. అనాఁటితోఁ గొడుకునకుఁ దల్లికి మనస్పర్థ లంత రించెను. గృహచ్ఛిద్రములు వచ్చినప్పుడు జనులు తమయింటిగుట్టు పరు లెఱుఁగకుండ కార్యములు చక్కఁజేసికొనుట కడులెస్స యని యతఁడు పలుమారు ప్రజల కుపదేశించుచుండును.

ఆతనిపాలనమునమీావారుసంస్థానము క్రమక్రమముగక్షీణదశ నొందుచున్న మొగలాయిరాజ్యముతోఁ గయ్యముకుఁ గాలుద్రువ్వక

యుదాసీనముగా నుండెను. ఇట్లనియతఁ డెవ్వరితోడ యుద్ధములు చే యలేదని మనము తలంపరాదు. అతఁడు పదునెనిమిది యుద్ధములు చేసెను. అన్నియు స్వదేశసంరక్షణము నిమిత్తమే చేసెను. తనసాటి రాజులగు మారువారుప్రభువగు నబతుఁడు, అందరరాజగు జయసింగు మొగలాయిల దౌర్బల్యముకనిపెట్టి యదేసందని క్రొత్తనేలలు కొన్ని కలుపుకొనుటకుఁ బ్రయత్నించుచుండఁగా సంగ్రాముఁడు పర రాజ్యములు గలుపుకొనుటమాట దేవుఁడెఱుఁగు. తనరాజ్యములో నున్న ప్రజలు కుడువఁగూడు కట్టబట్ట గలిగి సుఖించిన నంతేచాలునని యావజ్జీవము ప్రజాసౌఖ్యము నిమిత్తమే పాటుపడెను.

ఒకనాఁడతఁ డప్పుడే భోజనమునకుఁ గూర్చుండెను. సకలపదార్థములు బంగరుపళ్ళెరములలో వడ్డింపఁబడి సిద్ధముగ నుండెను. అప్పు డొకపజరినుఁడు పరుగుపరుగున వగర్చుకొనుచు వచ్చి "స్వామీ మాళపదేశమునుండి కొందఱు తురకబంట్లు మనగ్రామములోఁ గొన్నిటి పైఁబడి దోఁచుకొని పరశురామప్రీతిఁ జేసి స్త్రీల పురుషులపశువుల జెరఁ బట్టుకొని పోవుచున్నారు" అని విన్నవించెను. అప్పలుకులు చెవులంబడుటయు సంగ్రాముఁడు సిద్ధాన్న మొకకబళమయిన భుజింపక దిగ్గున లేచి రణభేరి మ్రోయించి దుర్భేద్యమగుతనకవచముఁదెమ్మని సేవకుల కాజ్ఞాపించెను. రణదుందుభులమ్రోఁత వినబడినతోడనేకవచధరులయి మహాశూరులయిన రాజపుత్రులు వందలకొలంది రాజమందిరద్వారములకడ నిలిచి మేముపోవలసినతావెద్దిఒక్కపరుగునఁబోయెదము. సెలవిండని యడుగఁజొచ్చిరి. పోవలసినతావుమాళవదేశమనియు వైరియానవాబనియు వినినతోడనే యాజోదులు "స్వామీ! గడ్డిపోఁచవంటిమాళవేంద్రునిమీఁదికి దేవరవారు స్వయముగఁ రాఁదగదు. మేము మీనమ్మినబంట్లము. మమ్ముఁబంపుఁ డొక్కనిముసమున గెలిచివచ్చెద" మని వీరాలాపపూర్వకముగా వేడుకొనిరి. ఆవేఁడికోలు విని రాజు వారిపోకకు

సమ్మతించితాను బలవంతముమీఁద రాజధానిలో నుండనియ్యకొనెను
ఆజోదులు వెడలిన కొంతసేపటికిరోగముచే నవయవపాటనము
దప్పిన బడుగుమేనిపురుషుఁడొకఁడు రాజదర్శనమునకు వచ్చి తక్కిన
జోదుల నంపినట్ల తన్నుఁగూడఁబగతురమీఁది కంపుమని ప్రార్థించెను.
అతఁడుకనోరు దేశపుపరిభువగు సామంతరాజు. రాణావారి రణదుందుభి
మ్రోసినప్పు డతఁడు జ్వరపీడితుఁడయి కదలి రాఁజాలకపోవుటచేసంత
యాలస్యముగ రావలసి వచ్చెను. దేశాభిమానము రాజభక్తి వానిహృ
దయమున మిక్కుటముగ నుండుటచే నతఁడు కడురోగపీడితుఁడయ్యు
సమరమునకుఁబోవసమకట్టి రాణావారియుత్తరు వేమనియడిగెను. రాణా
వానింజూచి దయఁదలఁచి "నీవింటికిఁబోయి పండుకొని మందుఁదినుమ
ని నాయుత్తరు" వని చెప్పెను. ఆమాట లాశూరుని కపథ్యము లగుట
చే నతఁడు రాజుమాట పెడచెవింబెట్టి మరల నింటికిబోవ గుఱ్ఱమెక్కి
బయలుదేరి వెనుకటిసేన మాళవసేనతో గలియునప్పటి కాతావు జేరి
రణమొనరించెను. తురకసేనలో జచ్చినవా రెక్కువ బ్రతికినవారు త
క్కువ. మీవారు రాజసామంతులుసంపూర్ణవిజయము నొంది మెర
సిరి కాని కనోరు రాజకుటుంబమునకు మాత్రమాదినము దుర్దినము.
ఏలయన రోగపీడితుడగు నారాజు వీరస్వర్గమధిష్టించెను సింహకిశోర
మువంటి వానినందనుఁడు తీవ్రమయినగాయము నొంది బాధపడెను.

ప్రతిదినము దర్బారు ముగిసినతోడనే కొలువవచ్చిన సామంత
రాజులకు దప్పక తాంబూలము లిచ్చుటయు నందు మిక్కలి గౌరవ
నేయులయి సంస్థానమున కుపకారము జేసిన మహావీరులకు రాణావారు
స్వయముగనే వానిని యిచ్చుటయుఁ జిరకాలమునుండి మేదివా
ణమున మరియాదగ నుండెను. కనోరుపరిభువుల కుటుంబ మదివఱకు
రాణావారి స్వహస్తమునుండి తాంబూల మందుకొను గౌరవమునెన్న
డు పొందలేదు. ఈయుద్ధ మయినపిదప సంగ్రామసుఁ డాకుటుంబమున

కట్టిగౌరవము గలిగించి యాచిన్నికుమారునకు తాంబూల మిచ్చెను. అదిచూచి తక్కినరాజులీసుజెందక కనోరుప్రభువురోగపీడితుఁడయ్యు నొడలు దాచుకొనక చూపినశౌర్యమునకు వానికొడుకు గాయముల చే బడినబాములకు నీగౌరవ ముచితమే యని తలచి సంతసించిరి.

సామంతులకు సంగ్రాముని యం దెంతగౌరవము గలదో సామంతులమీద సంగ్రామునకు నంతప్రేమగలదు ఒకసారి చందావతు వంశపుభువయిన సలుంబ్రాయనుశూరుఁడు రాణాచేతనియుక్తుఁడయిమాళవదేశమునకు సైన్యముం దోడ్కొనిపోయి యచ్చట పగతురం జయించి విజయభేరీభాంకరణములతో మరల నుదయపురమునకు వచ్చి ముందుగా రాణావారిదర్శనము సేయకయే స్వకుటుంబమును జూచుటకింటికిబోయెను ఇది సందుగ జేసికొని సలుంబ్రాపయి కిట్టనివాండ్రు కొందఱు రాణాయొద్దకుబోయి యిట్లని కొండెములు చెప్పిరి "స్వామీ సలుంబ్రాను మీరు నమ్మఁగూడదు. ఎల్లప్పుడతనిమీద నొకకన్ను వేసియే యుండవలయును అతడు ఢిల్లీచక్రవర్తితోనో లేక మనయితర శత్రువులతోనో తప్పక కుట్రచేయుచుండవలయును కానిచో నేల మునుముందు మీదర్శనము చేయకుండ నాలుబిడ్డలంజూడఁదలచును? పెండ్లాము బిడ్డలెక్కడయిన బారిపోదురా? మీరు వేయిచెప్పుడి నూరుచెప్పుడి ఇతడుమీమీదతిరుగుబాటు చేయుటకయి తానువచ్చినప్పటికి స్వపక్షమువారి నింటనుండుమని వారిఁగలిసికొనుటకు బోయి యుండును."

అనిపలికిన కొండెగాని వాక్యములు సంగ్రాముఁ డెప్పటిశాంతముతో గొనముట్ట విని చిరునవ్వు నవ్వి "నాసామంతులెవ్వరునన్ను బగతురకప్పగింపరు. సలుంబ్రాకుగలరాజభక్తిని మనము వేర పరీక్షింపనక్కరలేదు. కాని నీవంటివాని యనుమానముదీర్చుటకయి నే నిప్పుడ దర్బారునకు రమ్మని వానికి వర్తమాన మంపెదచూడు"

మని వెంటనే తన్నిమిత్తము సేవకుల నంపెను ఈనడుమ సలుంబ్రా తన సైన్యమును విడఁగొట్టి సైనికుల గృహములకంపితనస్థానమున కరిగి యంతిపురిజొచ్చి తనరాక కెదురుచూచుచుండిన భార్యలను బిడ్డలను బంధువులను పరిజనులను జూచుటకయి లోనడుగిడుచుండ నంతలో నొకసేవకుడు వచ్చి యొకయుత్తరము చేతికిచ్చి రాణావారు మిమ్మున్నవారి నున్నట్టుగ రమ్మని యానతిచ్చినారని చెప్పెను. పాపము సలుంబ్రాి తిన్నగా లోని కరుగనయిన లేదు. బిడ్డలముద్దాడలేదు. భార్యలఁ బలుకరింపలేదు. సేవకులవందనము నందుకొనలేదు అయినను రాజశాసనము జూచినతోడనే దానిం గన్నులనద్దుకొని గుఱ్ఱముదెప్పించుకొని దానినెక్కి రాజదర్శనముకయి యుదయపురము నకుఁబోయెను.

అప్పుడే యుద్ధముచేసి యింటిపయి మనసుబార స్వకుటుంబమును జూడవచ్చిన వీరుని నిలువనీయక మరల రాణా గొంపోయినందునకు పురజనులు నంతఃపురజనులుగూడ విచారించిరి. ఆవీరుఁడుదయపురమువచ్చునప్పటికి వానివిడిదికయి యేర్పఱచిన గృహములో వంటలులేవు సేవకులు లేరు. ఆతఁడాశ్చర్యపడి యట్లుండుటకు గారణమేమని వితర్కించుచుండ నంతలో రాజసేవకులు మందలు మందలుగ వచ్చిరి కొందఱు గుఱ్ఱములకు దాణాపెట్టిరి కొందఱు పాన్పులమర్చిరి కొందఱు పలు పిండివంటలతో నిండిన వంటకములు రాజుగారివంటలోనుండి తెచ్చి సలుంబ్రాికు బరిజనులకు నారగింప బెట్టిరి మరునాడుదయమున సలుంబ్రాి రాణాదర్శనము చేయ నతఁడు వానిని మునుపటికంటె నెక్కువగౌరవమున నాదరించెను.

రాజదర్శన మయినపిదప సలుంబ్రాి సెలవువడసి మరల నింటికి బోవునపుడు రాణా వానిసాటివారి కందరకు నిచ్చునగలు గుఱ్ఱములు మొదలగునవి బహుమాన మిచ్చుటయెగాక కొన్నిభూములు

గూడ వానికి దానమియ్యదలచెను సలుంబ్రా తనకెన్నడులేని భూ దానమిచ్చుటకు గారణ మేమని యడిగి రానాచేత గారణముల నెఱిగి యిట్లని పలికెను. "అయ్యా! ఈభూములు కష్టార్జితములు గావు కాన నాకక్కరలేదు బుఱ్ఱపోయినను నేనిల్లు కదలగూడని యసమయమున నన్ను మీరు పిలుపించితిరి. అయినను మీశాసనము తలదాల్చి నేనువ చ్చితిని. ఇంతమాత్రమునకు నేనుభూములు బహుమానము బడయు టకు దగను. దేవరవారు నిజముగానీసేవకునిననుగ్రహింప దలతురేని కోరుకొనుటకు నాకు సెలవొసంగుదురేని యొకకోరిక కోరెద నాకు మాన్యములువద్దు అగ్రహారములువద్దు. రానావారికివండిన వంటలోనొం డిపదార్థములనుభుజించుటరాజపుత్రులకుమిక్కిలిగౌరవముగావున దేవ రవారికముందు నన్నుగాని నావంశస్థులనుగాని రాజకార్యములమీద నుదయపురము నకుబిలుపించునపుడెల్ల మాకు వేరువంటకముల జేయింపక మీయింట మీనిమిత్తమువండినవంటకములనే యాదినము పంపినట్లె పంపినన్ను గౌరవించి యనుగ్రహింపవలయునని ప్రార్థించుచున్నాడ

ఈకోరిక సంగ్రాముఁడు నిర్విచారముగ వానికొసగెను. చం దావతుల కామర్యాద మొన్న మొన్నటివఱకు జరిగెను రానా తన సౌఖ్యములకైన లెక్కసేయక తనకుం బరమాప్తులగు చందావతుల కు దనమాట బోటుపోకుండ నెల్లవస్తువులశ్రద్ధతోనొసగుచుండెను తన పూర్వులు పలుమారుధనముచాలక యిక్కట్టులుపడుట పెద్దలవలనవి ని సంగ్రాముఁడువ్యయముఁదగ్గించవలయునని చాలప్రయత్నించికొన్ని యేర్పాటులఁ జేసెను. సంస్థానమునందుఁగలపరిత్రిగ్రామమువల్ల రావలసి నసొమ్మెంతయని యేర్పాటుచేసికొని యాసొమ్మునసూలుచేసిపంపుట కొకయధికారి నేర్పరచి యొక్కొకగ్రామపుశిస్తునొక్కొకకర్చుకిరింద నుపయోగించుచువచ్చెను. అనఁగా నొకయూరిమీద వచ్చినశిస్తు తన భోజనమునిమిత్తమును వేరొకగ్రామమునుండిశిస్తు నానాలనిమిత్తము

వేరొక్కపల్లెళిస్తు బట్టలనిమిత్తమునుపయోగించెను. భోజనమునకుఁజా లనిపక్షమున కర్చుతగ్గించుకొనునేగానిమఱియొక గ్రామపుళిస్తునందుకు విని యోగింపఁడు. ఒకసారి మరచియోయశ్రిద్ధచేతనో సంగ్రాముఁడు తనగ్రామములలో నొకదాని నొకనికి దానమిచ్చెను.ఇచ్చినపిదపనొక నాఁడు రాణా భోజనమునద్దఁగూర్చుండి పెరుగన్నము కలుపుకొని చిర కాలమునుండి పెరుగులో చక్కెరగలుపుకొని తినుట కలవాటుపడుట చే నదియేలవేయలేదని వంటవాని నడుగ నతఁడు వినయముతోనిట్ల నియె "దేవా! పంచదారనిమిత్తమేర్పడినగ్రామముమీరెవరికో దాన మిచ్చిరఁట. అందుచేత మీకు చక్కెరలేదని మంత్రిగారు మీతో మనవిచేయుమన్నారు" ఆపలుకులువిని రానా "నిజమే యతని లోప ములేదని చక్కెర లేకయే భుజించి పోయెను.

సామంతరాజు లందఱిలోసంగ్రాముఁడుకోఁటేరియోసంస్థానప్ర భువుమీద నెంతయు ననురాగము గలిగియుండెను. రాణాయొద్దనతని చనువులు మెండగుటచే నతఁడొకసారి దర్శనముచేసి యిట్లనియె "స్వా మీ! మనపూర్వులుధరించినపైప్రాతఫక్కిగాదుస్తులుధరించుచున్నా రు అవి యందముగను లేవు చాలుటయునులేదు. ఆమాదిరి మార్చి పొడవు నిడివియుగల నంగీలుదొడిగికొనిన శీఘ్రియు సౌఖ్యముఁ జేకూరు ను. ముందుగా మీరుక్రొత్తమాదిరి దుస్తులుతొడుగుదురేని మేమం దరము మీమార్గము ననుసరింతుము కావుననట్లు సేయవలయు"నని వేడుకొనుటయు రానా వానిపలుకులు శ్రిద్ధగ నాలకించి యట్లేచే యుదు పొమ్మని యానతిచ్చె. రానా చేసినవాగ్దానము వినియానాడు మొదలు మీవారుదర్బారులలోనిసామంతులుతక్కినదర్బారులలోని సామంతులపైె పలువన్నెలదుస్తులు దాల్చి కులుకవచ్చుననినమ్మియిం టికిబోయిరి. పోయిన కొంతసేపటికి రానాకడనుండి యొకదూత వ చ్చి "అయ్యా! మీగ్రామములు రెంటిని రానావారు కలుపుకొని"రని

చెప్పిపోయెను. రానాయట్టిపని చేయుటకుఁ దనయొనరించిన నేరమేమ యి యుండునాయని యాసామంతుఁడు తలపగులునట్లెంతవిచారించిన నువానికిఁ బొడఁగట్టకయ్యె కారణములేక రానా పిచ్చకోపముతో ని ట్టిపనులు చేయువాఁడు కాడని గ్రహించి తత్క్షణమే ప్రయాణమయి యతఁడు కారణమును దెలిసికొనుటకు రానా వారిసన్నిధికిబోయి "మ హాప్రభూ! మీకింత యనుగ్రహము తప్పుటకు నేనేమి నేరముచేసితిని సెలవిండని బ్రతిమాలెను అప్పుడతనికి రానా యిట్లనియె. "ఓయీ నేర మేమియుఁ జేయలేదు నీగ్రామములు మేము గలుపుకొనుటకు గారణమిది నేను నాలెక్కలుశోధించి చూచుకొనగా నాకు వచ్చెడు ప్రతిరూపాయియు నేదో కర్చునిమిత్తమేర్పాటుచేయబడియున్నదని యు ధనమేమియు నిలువలేదనియు దేలినది నీవు చెప్పినదుస్తులకు ధ నము చాలవ్యయమగును అవి కుట్టించుట మానుకొందమన్న నాకుం బరమాప్తుఁడవయిన నీవు చిన్నబుచ్చుకొందువు నిన్ను చిన్నబుచ్చుట కిష్టము లేదు అప్పుచేసి దుస్తులు కుట్టించుకొనుట కిష్టములేదు కావున క్రొత్తగా కుట్టించు దుస్తులనిమిత్తము మాకు దగులుకర్చుల కొఱకు మీగ్రామములు గలుపుకొన దలంచితి" కోటేరియోప్రభు వు రానా వాక్యములు నాలకించి నిష్కారముగ గౌరవితో తలగోకికొం టినని విచారించి "దర్బారుదుస్తులు మార్చనక్కరలేదు మహాప్రభూ" యని యేలికను వేడుకొని యెన్నడటువంటి సలహాలు చెప్ప కూడదని నోటికి బుద్ధిచెప్పుకొని రాజుచేత ననుగ్రహింపబడి యింటికిబోయెను

సంగ్రాముఁడు క్రీ శ 1734 వ సంవత్సరమున మృతినొందెను అనంతరము మీవారు సింహాసనమును దుర్బలు లధిష్ఠించుటచే నది తొల్లింటిగౌరవము నిలుపుకొనలేక మహారాష్ట్రులదండయాత్రల పాలయి క్రమక్రమముగ క్షీణదశకు వచ్చెను.

# అజితుని కొడుకుల కథ



మారువారు దేశపరిభువగు నజితునిగురించియొకకథగలదు. అతడు ఛోహాణవంశజాతియగు నొక రాజకన్యను వివాహమాడదలచి పయనమైపోవుచుండ మార్గమధ్యమున వానికి రెండుసింగములగపడియెనట అందొకటి నిదురించుచుండెనట రెండవదిమేల్కొని యుండెనట ఆశకునఫలమేమని యారాజు తనజ్యోతిష్కునడుగగా నతడిట్లనిచెప్పెనట "రాజా! నీవువివాహముకాబోవు కాంతవలన నీకిరువురు కొడుకులు పుట్టుదురుఅందొకడు మహాబాహుశాలియగు. రెండవవాడు నిదురపోతు పలికిమాలినవాడునగు ఇదియే శకునఫలము" ఆసిద్ధాంతియన్నట్లె యజితునికిద్దరు కొడుకులుపుట్టిరి పెద్దవానిపేరభయసింగు రెండవవాని నామము భక్తసింగు ఈకనిష్ఠుడే తండ్రినిగడతేర్చినపాపకర్ముడు అజితుని ఘోరమరణమును విని జనులు హాహాకారములు చేసి యెంతో దుఃఖించిరి ఈదారుణము పాలై నందుకేగాక యజితుని కొఱకుజనులు విచారింపవలసిన మేలుగుణములతనియందుకొన్నియున్నవి అజితుడు బలాఢ్యుడు కావున తనకును తండ్రికిని బరమశతృవై మహాపకారముల జేసిన యౌరంగజేబు మృతినొందినతోడనే వానికొడుకులను బలుచిక్కులుపెట్టి కొంత దేశమువారియొద్దనుండి సంగ్రహించెను పిన్న నాడుతన్నుసంరక్షించిన దుర్గదాసువిషయమునకృతఘ్నుడయ్యెనను కళంకముతప్ప వానియందు మఱేలోపములేదు.అజితుని పట్టపుదేవులు సహగమనము చేయదలంచిరి ఆపని చేయవలదని ఛోహాణ రాజపుత్రికను బలువురు వేడిరి ఆమెయే తండ్రింజంపిన భక్తసింగుతల్లి ఎంతవేడిన నామె తనపని మానక యిట్లనియె నేను భర్తపక్కను నిదురించుచుండ నిద్రలోబొడువబడినయాయన దేహ

మునుండి పరివహించు కొన్నిన్నెత్తురులు నన్ను మేల్కొలిపెను కన్నతం డ్రియనక పక్కను బవ్వళించినతల్లిని నన్నైన జూడక మాముద్దుల బిడ్డఁడు భర్తృఁడే యీయతిఘోరముచేసెను అనుచుండ భక్ష్మఁడుచిన్న జాబొకటివ్రాసి "నేనొక్కఁడనచంపలేదుతండ్రింజంపుమని మాయన్న నన్నుంబురికొల్పె అతనిస్వహస్తముతో వ్రాసినయుత్తర మిదిగోచూ డుఁడని గుంపుగూడిన సామంతులమీఁద పారవైచెను ఆయుత్తరమును జూపినపిదప నారాణి "యీకొడుకు నమ్మికొనియా నన్ను బ్రతుకమ నుచున్నారు చాలుచాలు నాకొడుకుల యింటనుంటకంటె సీమంట పాలగుటయే నాకెక్కువసుఖ" మని పలికి సహగమనముచేసెను.

తండ్రింజంపించి గద్దెయెక్కినాఁడను మాట మరచితిమా యభ యసింగు మారువాడబ్రభువులలో నగ్రగణ్యుఁడని చెప్పవచ్చును అ తఁడు కదలక కదలక యొకసారి విజృంభించిలేచెనో శూరులను దలత న్నిన శూరుఁడై మెరయువాఁడు ఆకాలమున రాజస్థానమునందంతట వానింబోలిన విలుకాఁడు పోటుమానిసి మఱియొకఁడు లేఁడు ఆకారణము న నతనికి మిక్కిలి గర్వముకలదు ఈగర్వముచేతనేయతఁడొకసారియొ కగొప్పప్రమాదమును జేసెను. ఈతఁడు తనకుమార్తెను అంబరురాజు కచ్వావంశస్థుడనగు జయసింగునకిచ్చి వివాహముచేసెను ఈకచ్వావం శస్థులు తక్కిన రాజపుత్రులవలె యుద్ధమునందంతపండిమగలుగారు అందుముఖ్యముగా జయసింగు యుద్ధపరాఙ్ముఖుఁడై కత్తులమీఁదకం టె చదరంగపు బెత్తులమీఁద నెక్కువ యాసక్తిగలిగి కాలముపుచ్చు చుండును అందుచే తభయసింగు డిల్లీచక్రవర్తి సభలోనైననుసరే తనయల్లునిపరిహాసముచేయుచువచ్చె ఒకనాడుచక్రవర్తియు గొం దఱు సామంతులు నల్లుదుగూర్చుండ నభయసింగుపరిహాసార్థకముగా జయసింగుతో మీయుమ్మోరుబు కచ్వావులందఱు అధికచ్వాగ్రాదుకస్వా

కస్స్వా యనఁగా గడ్డి. గడ్డి పోఁచ లెట్టిపోటులఁబొడుచునో మీకత్తులు నట్టిపోటులే పొడుచును." అనెను.

ఈమెగతాళిమాటలు విని జయసింగు మనమునం గ్రోధముఁ బూని యదనువచ్చినప్పుడుమామగారిపైఁ బగదీర్పఁగొనఁదలంచెను. జయసింగు యుద్ధములలో గొప్పజోదుకాకపోయినను బగతురనెట్లో కడతేర్చి తనకార్యము చేసికొనుటలోఁ గడుదిట్టరి. కాఁబట్టి మామ పైఁగల యక్కసుఁదీర్పఁగొనుట కతఁడు చక్రవర్తికొలువులోనున్న నొకయుద్యోగస్థునితోఁ గుట్రలుపన్ని యదను వెదకుచుండెను. అటు లుండ నొకనాఁడు చక్రవర్తి కొలువులో మంత్రులు సామంతులు మొదలగువారనేకులుండజయసింగునభయసింగునక్కడకువచ్చిరి.జయ సింగుతోఁ గలసి కుట్రలుపన్నిన యుద్యోగస్థుఁ డభయసింగుయొక్క సాముసేర్పులు బంటుతనము మొదలగునవి మితిమీరినట్లు మె చ్చుకొనుచుఁ జక్రవర్తి చెవులకు వినఁబడునట్లు పొగడ నారంభించెను.

ఆపలుకులువిని చక్రవర్తియభయసింగు వంకఁజూచి "అవును నీసేర్పునుగుఱించి నేనును బలుమాఱు వినియున్నాఁడ" నని హెచ్చ రింప నభయసింగు "చిత్తము. దానికిందగు సమయము వచ్చినపుడు నాప్రజ్ఞ కనఁబడు" నని యుత్తరము చెప్పెను. అనవుడు జయసింగు నిమిత్రుఁడగు నుద్యోగస్థుఁడు చక్రవర్తితో "నితఁ డొక్కయేటున దున్నపోతుమెడఁ దెగవేయఁగలఁడట. ఏలినవారెప్పుడైన నిది విన్నా రా" యని. యడుగఁ జక్రవర్తి "యోహో! యట్లయిన నాచిత్రముఁ జూడవలసినదే. సత్వరమే యొకదున్నపోతుం దెప్పింపు" డని యాన తిచ్చెను. తోడనే యొక కాఱుదున్నపోతును సేవకులుదెచ్చి యెట్ట యెదుట నిలిపిరి. అది రాకమునుపె యభయసింగు ఖడ్గమునుదూసి మెఱపుఁ దీఁగెలాగునఁ ద్రిప్పుచు నట్టహాసము జేయుచుండ మంత్రిసా మంతప్రభృతులు చక్రవర్తియు వాని భుజాదర్పముఁజూడ నెంతయు

నబలాటపడిరి. నడగొండవంటి యాకాతెనమును సేవకులు గొనితేర గానింజూచిన తోడనె దుర్నిరీక్ష్యమయిన యభయసింగు మోము వెలవెలఁబోయెను.

ఆమెనుఁబోతు సామాన్యపు ఎనుబోతు కాదు. జయసింగు వానిమిత్రుఁడు గలసియోచించి మిక్కిలి పొగరెక్కిన దున్నందెప్పించి యది తెగబలిసిపోవునటుకు మొలలోతు గడ్డిలో మేఁపిరి. చక్రవర్తి సమ్ముఖమున కది వచ్చునప్పటికి దానిమెడ పరిపంచమునం దేబలాఢ్యుఁడైన నెంతపదునకత్తితోనైన తానొక్కయేటుతోఁ గాదుగదా పదియేటుల నయిన దెగనేయుటకు వీలులేనంత దిట్టముగ బలిసి యుండెను. అందుచేఁ దప్పక మామకుఁ బరాభవము జరుగునని జయసింగు నిశ్చయించుకొని యుండెను. అభయసింగు దానినొక్కసారి తేరిపారఁజూచి చక్రవర్తితో "నేనొకసారి నాగదిలోనికిఁ బోవుటకు సెలవీయ వేఁడెద"నని యడుగనతఁడు దానికంగీకరించెను. అభయసింగు గదిలోనికింజని నల్లమందు ముద్దఁదీసి సాధారణముగా తానుపుచ్చుకొనుమోతాదుకన్న రెండురెట్లెక్కువపుచ్చుకొని కన్నులు జ్యోతులవలె నెఱ్ఱఁబడ నుగ్రమూర్తియై యీవలకు వచ్చి చేరియున్న సభికులనందఱవంక నొకసారి కలియఁజూచి దానికంతకుఁ గారకుఁడు తనయల్లుఁడే యని గ్రహించి అప్పవాల్పకాతని నొకనిముసముచూచి పిమ్మట చక్రవర్తివంకఁ దనదృష్టులు నిగుడ్చెను. జయసింగు మామ జూచినచూపులలోగీడు శంకించి చక్రవర్తి కిట్లనియె. "దేవా! రాజపుత్రు లవమానము పడినప్పుడు మీదు మిక్కిలి నల్లమందు మద్దతు పుచ్చుకొన్నపుడు పిచ్చివారలయి యెదుట నెంతవారున్నను లెక్కసేయక పరాభవకారణులగువారలపైఁబడుదురు. కావున మీరిటనుండి తొలఁగిపొండు" అట్లుజయసింగు మాట్లాడుచుండఁగనే యభయసింగు పట్టాకత్తి రెండుచేతులంబట్టి గిఱగిఱఁద్రిప్పుకొనుచు జంతు

వునుడా సెను. సభాసదుల కన్నులు చీఁకట్లు గ్రమ్మెను. పిడుగువంటిచ
ప్పుడు చెవులకు వినఁబడియె. కొన్నిన్నిత్తురులు నేలఁగారె. సభాసదులు
కన్నులుదెరచిచూచునప్పటికి దున్నపోతు తల నేలఁబడియుండె. ఆదె
బ్బచే నలసి యభయసింగును జంతువు ప్రక్కను నేలం బడియుండె.
అందఱు బహువిధంబుల నభయసింగుదోర్బలముఁ గొనియాడిరి. జ
యసింగును వానిమిత్రుఁడు తమ యక్కసుఁదీర లేదని లోలోన సిగ్గు
పడవలసివచ్చె. కాని యీదారుణకర్మమును చూచినపిదపఁ జక్రవర్తి
జన్మమధ్యమున నెన్నఁడు వేడుకనిమిత్తము దున్నపోతుం జంపునని
వాని నడుగఁడయ్యె.

అభయసింగు దేశ మిరువదేండ్లు పరిపాలించెను. ఆకాలము
లో నిరంతరమును వానికిఁ దమ్ముఁడు దుఃఖకారణుఁడయ్యెను. భక్తుఁ
డు బలము సాహసముగల యోధుఁ డగుటచే సోదరులకు విధేయుఁడై
నెమ్మదిగఁగాలముఁ బుచ్చఁడయ్యె. అభయసింగు మీవారు ప్రభువైన
తోడనే తమ్మునకు నాగూరుసంస్థాన మిచ్చెను. ఆసంస్థాన మనుభవిం
చుచు సంతుష్టుఁడై యుండక భక్తసింగు తనయందుఁ దనయన్నకు
నమ్మిక లేదనియు నట్లగుటచే దనకతఁ డెప్పుడైన నపకారము చేయవ
చ్చుననియు లేనిపోని యనుమానములు తెచ్చిపెట్టుకొని యన్నగారి
కేవైన నిబ్బందులు గలుగ జేసినపక్షమునఁ దనజోలికతఁడు రాఁడని
నిశ్చయించి యిక్కడిమాటలక్కడ నక్కడిమాటలిక్కడ చెప్పి చు
ట్టుపట్ల రాజులతో సోదరునకు గలహము గలిగించెను. ఇట్టికలహము
వానిప్రయత్నముచేతనొకసారి యంబరపతిభువునకు నభయసింగునకు
సంభవించెను. ఆభయసింగు దండెత్తిపోయి జయసింగునగరములలో
నొకటియగు బికనీరు ముట్టడించెను. జయసింగానగరమును విడిపింపఁ
బోయి సంపూర్ణముగ నోడిపోయెను. ఈగెలుపువలన జననష్టమేగాని
యభయసింగునకుఁ గలిగినలాభము లేదు. జయసింగు . పరాజయము

నొందినను బినమాను గారగుభక్తునియొక్క దేవతార్చనపు పెట్టెను మెల్లగా సంగ్రహించుకొని తనయూరుతీసికొనిపోయి యందులో నున్న దేవునకుఁ దన దేవతార్చన పెట్టెలోనున్న యమ్మవారిని వివాహముచేసి తన్నిమిత్తముగ గొప్పయుత్సవముచేసి యనంతర మావిగ్రహమును మరల భక్తునకుఁ బంపివేసెను. కావలయునని కలహము దెచ్చినందుకు భక్తునకే పరాభవము జరిగినదని యందఱుసంతసించిరి. అభయసింగు తనయల్లునితో వచ్చిననిష్కారణకలహమునకువిచారించి, యెట్టకేలకు మీవారు రాజుల పేరిరణమున సంధిగావించుకొనియె.

ఈయుద్ధము ముగిసిన కొంతకాలమునకే మరల తనతమ్ముఁడైనవరితోఁ గ్రొత్తకలహముఁ దేకమునుపే యభయసింగుమృతినొందుటయు వానికొడుకగు రామసింగు సింహాసన మెక్కుటయు సంభవించెను. ఈకుమారునకుఁ బినతండ్రివలనఁజిక్కులు మొదట పట్టాభిషేకమునాఁడే కానఁబడియెను. పట్టాభిషేకమప్పుడు రహతూరుల రాజబంధువులలోఁ బ్రధానపురుషుఁడగుటచే భక్తుఁడువచ్చికానుకలుకట్నములుసమర్పించియున్నకుమారునకు మొగమునటీకాస్వయముగ వేయవలసినది. అట్టిమర్యాద లతిక్రమించి భక్తుఁడాసమయమున స్వయముగ రాక తనకానుకలు తనవిన్నపములు క్రొత్తరానాకు సమర్పించుటకు ముసలిదగు తనదాదినంపెను. రాజపుత్రులు తమ్ముఁబెంచినదాదులను మిక్కిలిగౌరవముతో యావజ్జీవము రక్షింతురు. కొందఱు రాజపుత్రులు రాజకీయవ్యవహారములలోను గృహకృత్యములలోను తమదాదుల మాటలు కడుగుబాటక వర్తింతురు. ఎంతగౌరవమైన నంతఃపురములలోఁ జరుగదగినదేగాని సభలలోనికివారు రాఁజనదు. పినతండ్రికిబదులుగావచ్చిన యాముసలిదానినిఁ జూచినతోడనే క్రొత్తరాజగు రామసింగునకు మహాగ్రహము పొడమటచే నతఁడిట్లనియె.

"ఛీ! ఛీ! నీవుమరల నిన్నుఁబంపినరాజువద్దకుఁ బొమ్ము. పట్టాభిషేకపు సమయమున నామొగమున టీకావేయుటకు తానస్వయముగ రాక తొక్కువలెనన్న తొంబదియేండ్ల తొత్తును బంపునా? నేను కోతి ననుకొనినాఁడా యేమి. మీరాజుపంపిన కానుకలు కట్నములు నాకక్కరలేదు. అతఁడు మాయెడఁ జేసిన యపరాధమునకు మేము మునుపతని భరణమునిమిత్తమిచ్చిన నాగూరు సంస్థానమునం దర్ధభాగము గ్రహింతుమని చెప్పుము."

ఇట్లు పరాభవము పడినదాది నాగూరునకుఁబోయి తనపెంపుడు బిడ్డయగు భక్తసింగుతో రామసింగన్నమాటలం దొకటియు మరచిపోక పూసగ్రుచ్చినట్లు చెప్పెను. ఆపలుకులువిని భక్తసింగు కోపముచేమిడిసిపడక శాంతుఁడై "యర్ధరాజ్యమెందుకు. కావలసినపక్షమున నాగూరు సంస్థానమంతయు మీకు నేసర్పించెద" నని మరల నొకరాయబారిని రామసింగునొద్దకుఁ బుత్తెంచెను.

రామసింగు గద్దె యెక్కినది మొదలు గర్వితనమునం బెచ్చుపెరిగి తనదండ్రి కాలోచనలు చెప్పు మంత్రులయు వృద్ధులయు హితోపదేశములు వినక నిరాకరించుటయే గాక మీదుమిక్కిలి యాలోచనలు చెప్పునప్పుడు వారిని వెక్కిరింపఁ జొచ్చెను. హృదయమును హృదయముతోఁబాటు నోరును మంచివి గాకపోవుటచే నతనికి స్వల్పకాలములోనే రాజబంధువులగు రహతూరులలో సగముకంటె నెక్కువమంది శత్రువులైరి. రహతూరు దొరలలో నగ్రగణ్యుఁడగు కుసీరామనువానికి మొగమున ముడుతలు మెండుగా నుండుటచే రామసింగు వానికి గొండమురచ్చని పేరు పెట్టెను. చంపావతి కులాగ్రణియు దనతండ్రికి మంత్రియు నగు కుసూలుసింగు పొట్టిగ లావుగ నుండువాఁడు. రామసింగు వానికి బొంతకుక్క యని పేరుపెట్టెను.

రహతూరులతో పరిహాసమాడుట పాముతో జెరలాటలాడుట

రానా తన్ను బలుమాఱులు వెక్కిరించినప్పుడు కుసూలుసింగు చెప్పుడు వచ్చిన మోటయుత్తరములను బట్టి వానిస్వభావమును రానా తెలుసుకొనవలసినదే కాని మందుఁడగుటచే రానా తెలుసుకొనలేకపోయెను. ఒకనాఁడు రానా వెనుకటియట్లపరిహాసమాడ కుసూలు వాని కిట్లనియె. "అవును నేను కుక్కనే కాని యీకుక్క సింగము నెదురించుకుక్క" పాపము రానా రామసింగు మదోన్మత్తుఁడై వానిమాటల యర్థము గ్రహింపలేకపోయెను. మఱియొకనాఁడు చంపావతికులస్థుఁడగు కుసూలుసింగుతో గలిసి రానా పువులతోఁట లోఁగూర్చుచుండి యొక చెట్టునుఁ జూచి యీవృక్షము పేరేమని యడిగెను. "ఇది చంపకము. మీసేనకు నే నెట్టిశిఖామణినో యీతోఁట కిదియట్టి శిఖామణి" యనియుత్తర మిచ్చెను. చంపావతి కులస్థునిపై రానాకు మిక్కిలి కోపముండుటచే పత డదిపట్టలేక తక్షణమే దీనిని పడగొట్టి నిర్మూలము చేయుఁడు. మా పనాపులో చంపకమను పేరుగల దేదియు నుండఁగూడ దని యావృక్షమును నాశము చేసెను.

అదిమొదలు కుసూలుఁడు రానాదర్శనమునకుఁ బోవుట మానెను. అట్లుండ రామసింగు తనపట్టాభిషేక సమయమున బినతండ్రి యగు భక్తుఁడు తనకుఁ గావించిన యవమానమునకు బగదీర్చుకొనుటకయి వానిపై దండువెడల నిశ్చయించెను. దేశమునకు బరమశత్రువు లగు విదేశస్థు లనేకు లుండగ వారినందఱ విడచి రానా పినతండ్రిమీఁద యుద్ధమునకుఁ బోవుట స్వకులక్షయహేతు వని కుసూలు సింగు విచారించి యట్టిపని చేయవద్దని రానాకు హితోపదేశము చేయుటకు మనసులో నిష్టము లేకయే యొకసారికోటలోనికి వచ్చెను. అతఁడు సభలోఁగూర్చున్నతోడనే రానా వానిం జూచి వెక్కిరించి పరిహాసపువచనము లాడి "నీపిశాచరూపము నేను జూడలేను కావున

మీరు శ్రీమపడి మాకు తరచుగా దర్శనమీయ నక్కఱలేదు" అని చెప్పెను. ఆపలుకు చెవులఁబడినతోడనే తోఁకఁద్రొక్కిన త్రాచువలె చివాలున పీఠమునుండి లేచి ఖడ్గము నొరలోనుండి యూడఁబెఱికి ఝుళిపించి "యీ ఖడ్గమును త్రిప్పినంతసులువుగా మారువారు దేశము నంతను ద్రిప్పివేయఁగల రహతూరు రాచవాని నవమానించితివి జాగ్రత్త" యని మరియేమియుం బలుకక సభామందిరము విడిచి యావలకుఁ బోయెను.

అసోపుసంస్థానప్రభు వగు కునీరా మనువాఁడు రానా చేష్టలు రోసి లేచి పోబోవుచుండ రానావానిం జూచి "ఓముసలికోతీ! వెళ్ళకురా" యని పరిహాసముగా బలికెను. "కోతి గంతులు వేయుట యారంభించి నప్పుడు మీ రానందింపవచ్చు" నని ప్రత్యుత్తరము చెప్పి యతఁడు గొలువును విడిచిపోయెను. సభ విడిచి యాయభిమానధను లిద్దఱుఁ గలిసి కొంచెమునే పాలోచించి యాదినము మొదలు రానాతో తమ కేవిధమైన సంబంధము నుండకూడదనియు భక్తసింగునే రానాగా జేయవలయు ననియు నిశ్చయించుకొని నాగూరు కోటకు సైన్యసమేతులై పోయిరి. ఆయిరువురతో వారివంటిప్రధాన పురుషుఁడే చేరి నాగూరునకుఁబోయెను. అతఁడు మారువారురాజుల యాస్థానకవీశ్వరుఁడు.

కుసూలుసింగు కునీరామసింగుమారువారు దేశపు సరిహద్దులు దాఁటి నాగూరునకు వచ్చుచున్నారనివిని భక్తసింగుపదోగొప్పకారము లేక మారువారురాజ్యమును మోయు స్తంభములవంటి సూరులిద్దఱు నొక్కమాఱు తనదెసకు రారనినమ్మి వారికి సగౌరవముగ నెదురు సన్నాహము జేయుటకు గుఱ్ఱమెక్కి బయలుదేరెను. అతఁడు వచ్చునప్పటికి వారిద్దఱు నిదురించుచుండిరి. సేవకులు తమ యజమానుల నిద్దురనుండి లేపుదు మని ప్రయత్నించినను వద్దనిచెప్పి భక్తుఁడు కు

సూలుసింగుడేరాలోనికిఁ బోయి యాతని పఱుపుమీఁదఁ గూర్చుం డి యతఁడు తనయంతట తాను లేచువఱకు గనిపెట్టుకొనియుండెను.

తనగుడారములో గొంచెము సందడి జరుగుటచే గుసూలుఁడు మేలుకాంచి కనులు దెఱువకయే హుక్కా దెమ్మని తన సేవకున కా జ్ఞాపించెను. సేవకుఁడు ప్రత్యుత్తర మేమియు నియ్యక కను తెఱచిన తోడనే యజమానుని సాజ్ఞచే భక్తసింగునకుఁ జూపెను. చూపుటయుద క్షణమ కుసూలుఁడు నిశ్చేష్టుఁడయి మాఱుమా టేదియు నాడలేక భక్తసింగును దనయజమానునిగ నంగీకరింపవలసివచ్చెను. రాజపుత్రు లకోపము తాటియాకుల మంటవంటిది. దురాగ్రహావశులైన రాజ పుత్రులు నిద్రానంతరము భోజనానంతరము దమకాగ్రహముదెప్పిం చినవారి ననుగ్రహించుట గలదు. కుసూలుఁడు సుఖనిద్రఁజెంది కల తదేఱనమనసుతో మేలుకాంచుటచే దనరాజు చేసిన తప్పులు మరచి వానిని క్షమింపవలయు నన్నను భక్తసింగు మిక్కిలి వినయముతో గూర్చుండుటచే నతనికి వీలులేకపోయెను. మొగమోటముచే నతఁ డు భక్తసింగునకు విధేయుఁడు కావలసివచ్చె. అందుచేనతఁడు పాన్పు మీఁదనుండిలేచి భక్తునకు నమస్కరించి ఇదిగో నాశిరస్సు. ఇదియి ప్పటినుండియు మీది" యని పలికెను.

పాపము భక్తసింగు వారువచ్చిన దేచాలునని ముందుగా నం గీకరింపలేదు. తనయన్న కొడుకు బాల్యముచే నవివేకహీనుఁడై య ట్లు ప్రవర్తించియుండవచ్చుననియు నిష్టమైనచో రానాకువారికి దా ను సంధిఁజేయుదు ననియు నందుకు సమ్మతింపవలయుననియు వారి ననేకవిధముల బ్రతిమాలెను. ఆరహాతూరు శూరులిద్దఱు గార్యము మిగిలిపోవుటచే స ధి పొసఁగదని స్పష్టముగ జెప్పిరి. ఆకపీశ్వరుఁడు మరల నెన్నఁడు మారువారునకుబోవనని ప్రమాణము చేసెను. దృ ఢనిశ్చలులైన [illegible] వారిస్నేహముచేసి భ

క్తుఁడు మారువారులో బ్రిధానపురుషు లగు నాముప్వురను తనస్వాధీ
నము జేసుకొనెను.

తన సేనలోఁ బ్రిధానపురుషులు ముగ్గురుదాయాదిలోఁ జేరినా
రని విని రామసింగు కుపితుఁడయి జహాలూరుకోటఁ దన యధీనము
చేయ వలసిన దని భక్తునకు వర్తమాన మంపెను. భక్తుఁడు వాని
వలె కోపావిష్టుఁడుగాక వినయసంపత్తిగలిగి నాకునాయేలినవానితో
యుద్ధముసేయుట కిష్టములేదు. మీరువచ్చిపుచ్చుకొనినపక్షమున జ
హాలూరుకోట నిచ్చుట కేయాటంకములే" దనిప్రత్యుత్తరమిచ్చెను.
ఆమాటల సరకుసేయక రామసింగు భక్తుని వానియనుచరులను నా
శనముచేయ సంకల్పించుటచే జహాలూరుకోట యిచ్చెద నన్నను
నాగూరుపై దండు విడిసెను. మారువారుదేశ మంతయు నంతఃకల
హములతోడ నట్లుడికిన ట్లుడక జొచ్చెను. ఉభయసైన్యములకు గొ
న్ని చిన్నచిన్నపోరాటములు జరిగినఁ మీఁదట మేర్తా యనుగ్రామ స
మీపమున నొక గొప్పయుద్ధము జరిగెను. రామసింగు కుసూలును
గుసీరాముని బరిభవించినట్లే యనేకరాజపుత్రవీరుల నవమానించుట
చే పలువురుసూరులు వానిని విడచి భక్తసింగుతోఁ జేరిరి. అందుచే
భక్తునిసేన గొప్పదిగ నుండెను. అయినను రామసింగు దేశమేలుచు
న్నరాజగుటచే వానిపక్షమునగూడ ననేకులు చేరిరి. వాక్పారుష్య
ములేక కొంచెము గౌరవమే పెద్దలయెడ నతఁడు చూపినయెడ నతని
సేనయే విస్తారముగ నుండియుండును. అతని స్వయంకృతాపరాధము
ననే సేన స్వల్పమగుటయు నాఁడు పరాభవ మగుటయు సంభవించె
ను. రామసింగు యుద్ధమునకు వచ్చునప్పుడు తన భార్యలలోనొక్క
తెను వెంటఁబెట్టుకొని వచ్చెను. ఆమెభూజదేశపురాజు కూఁతురు.
భర్తకెంతో యుపయోగకారిణి యై యుండెను. ఆమె తుపాకిలో
మందు దట్టించుటయు సరిగా గురిచూచి తుపాకిప్రేల్చుటయు నే

ర్చెను. ఆసేనలోనామెనుబోలుశూరు లరుదుగ నుండిరి. అదియును గాకయామె జ్యోతిశ్శాస్త్ర వేత్త. స్వప్న ఫలములుశకునఫలములులెస్సగ నెఱుఁగును. అవియన్నియునటుండ నామెపుట్టినింటినుండి మెఱియలవం టిమైదువేలసైనికులనరణముదెచ్చిరాజునకిచ్చెను. యుద్ధముప్రారంభ మగునాఁడు రామసింగు డేరామీఁద నొక మాలకాకి వాలి కూయఁ జొచ్చెను. అకూఁతవినగానే తమకు దారుణపరాజయము వినాశనము తప్పక కలుగుననియు నట్టిప్రళయము నాదుశ్శకునము సూచించుచు న్నదనియు నమ్మి సైనికు లుత్సాహముచు విడిచి మొగములు వ్రేల వేసికొనియుండిరి. ఆమాలకాకి కావుకావుమని రెండుసారులుకూసి మూడవసారి కూయఁబోవునప్పటికి నేమూలనుండియో తుపాకిదెబ్బ వినఁబడెను. సైనికు లదరిపడి యిదియేమని చూచునప్పటికిఁ కాకికు నపక్షి చచ్చి నేలఁబడియుండెను. అదిజూచినతోడనే సైనికులమొగ ములు మరలవికాసవంతము లయ్యెను. రామసింగుమహారాణామా త్రము పట్టరాని బిట్టలుకచేఁ బండ్లు పటపటగొరుకుచు "నీవల నేనుం డగ సాహసించి నాడేరామీఁద తుపాకి పేల్చినవా రెవ్వరు! ఆదురా త్ములెవ్వరో తక్షణమె కనుగొనిరండని యాజ్ఞాపించెను. అనవుడు కొందఱు లోలోన గొణగుకొనిరి. కొందరు కళవళముపడిరి.కొందఱు సందేహించి యిట్టటుఁదిరుగజొచ్చిరి. ఎట్టకేలకందఱిలో ధైర్యవంతుఁ డొకఁడు తెగించి రాణావద్దకుబోయి యాతుపాకి రాణిగారుపేల్చి నారని చెప్పెను. తనభార్యయే యాపనిచేసినదని వినినతోడనే రాణా కోపోన్మత్తుఁడై నోటికిరాని తిట్లుతిట్టి "తక్షణమేయామెనారాజ్యము ను విడిచివచ్చినదారినే పుట్టినింటికిఁ బోవచ్చునని చెప్పు" మని వర్త మానమంపెను.

ఆవర్తమానము విని యాదేవి భయకంపితయై తననేరముసై రింపుమని ప్రార్థనపూర్వకముగ వర్తమానమంపెను. ఆతఁడామె ప్రా

ర్థనము నిరాకరించుటచే నొకసారి దర్శనమిమ్మని యాదేవి వేడెను.ఎం
తో విశ్వప్రయత్నముమీఁద నతఁడామెకుఁ గడసారి దర్శన మిచ్చెను.
అపుడామె భర్తపాదముల పైఁబడి "ఇంతమాత్రమున దేవరవారికింత
కోపముగలుగునని యరుగక యీయుద్ధమునభయమున సైనికులు
వెలవెలఁ బోవుటచే మీకు జయమును సేమమును గోరి యట్లు చేసితి.
కావున నీతప్పుగాసి నన్ను రక్షింపవలయు". నని బ్రతిమాలెను.ఆమె వే
డికోలు బూడిదఁబోసిన పన్నీరయ్యె. భార్యనుజూచి రామసింగు "నానో
టిమాటకు తిరుగులేదు. ఇక్కడనుండి నీవు వెళ్ళవలసినదని నేనంటిని.
నామాట చెల్లితీరవలయును. నీవిటనుండి వెళ్ళితీరవలయు" నని యెం
తో కఠినముగఁ జెప్పెను. తాబట్టిన కుందేటి మూడేకాళ్ళని వాదిం
చుచున్న యామోటరాజుతో వాదించిన కార్యములేదని యాదేవి
"సరే! నన్నువిడుచుట మీరాజ్యలక్ష్మిని విడుచుటయె. ఇదిగో నేఁబో
చున్నా" నని రాజసముఖమును విడిచి తండ్రి తనకరణముగ నిచ్చిన
యైదువేల సైన్యమును వెంటబెట్టుకొని యావలకుఁ బోయెను.

అనంతరము యుద్ధము రెండుదినములయ్యెను గెలు పెవ్వరికిని
సరిగ జేకూరదయ్యె. జోదులు చేతులుచేతులుఁగలయునట్లొండొరులం
జంపువఱకు హోరాహోరీగాఁ బోరఁజొచ్చిరి. ఆ రెన్నాళ్ళయుద్ధము
తో మారువారు దేశమంతయు శూరజనశూన్యమయ్యెను. అన్న
తమ్ముఁడుమీఁద తమ్ముఁడన్నమీఁద గత్తికట్టి యొండొరులరక్తముపరి
వహింపఁ జేసిరి. కొన్ని రహతూరువంశములు నిర్వంశములయ్యెను.
సమరములయందు గడితేరిన చంపావతి కుంపావతి వంశస్థులగుముసలి
దొరలు మొదలుకొని బాలుఁడగు మెహతిప్రభువువఱకుగల రాజపు
త్రులంద ఱాదినమున మృతినొందిరి. ఈమెహత్రిప్రభువప్పు డేవివాహ
ము జేసికొనెను. వివాహసంబంధమైన కాళ్ళపారాణి యానవాళ్ళయి
న పోకమునుపే పసపుబట్టలు విడువకమునుపే యుత్తజందెములు తీయ

కమునుపే హస్తకంకణములు విప్పకమునుపే భార్యను గలిసికొనకుము నుపే మహారాణా రామసింగు వర్తమానమంపుటచేనాబాలుఁడు దేశా నురాగము భార్యానురాగముకంటె నెక్కువగ నెంచి యొకదినమైన నామెతో సుఖింపకయే యుద్ధమునకుఁబోయి యచ్చటమృతినొందెను. పాప మాతనిభార్య వివాహవేషమును దీసివేసి వైధవ్యవేషమును దాల్చి మగనిశరీరము యుద్ధభూమిలో నుండిపోవుటచే సహగమనము చేయుటకు వీలులేక యాతని తలపాగ తెప్పించుకొని ధరించి చిచ్చు నకి మృతినొందెను.

ఈయుద్ధము జరుగుచుండిన స్థలమునకుసమీపముననొకకోనేటి గట్టుననొకమఠముండెను. ఆమఠములో మహాత్ములగుసన్యాసులనేకులు వసియించుచుండిరి. ఉభయసైన్యములజేరి యొండొరులమీఁద ఫిరంగి గుండ్లు విసరుకొనుచున్నప్పుడు సన్యాసులు తమకవి తగులునేమోయని ప్రాణభీతినిమఠమువిడిచి పరుగెత్తిరి. ఫిరంగిగుండ్లు వడగండ్లవలెవానిస మీపమున బడుచున్నను లెక్కసేయ యాసన్యాసుల గురువుమాత్ర ము నిర్భయముగ నిశ్చలముగ నామఠములోఁగూర్చుండెను. ఆతనిస్థితి విని యుభయసైన్యాధిపతులు. సురక్షితమగు వేరొక్కస్థానమునకుఁబొ మ్మని వేడుకొనుచు వానికి వర్తమానమంపిరి. అయ్యిరువురప్రార్థనలు గూడ నాముసలిసన్యాసిచెవినిఁబెట్టకయిట్లని ప్రత్యుత్తరమంపె. "నా కు ఫిరంగిదెబ్బవలన చావలసినయోగమున్న పక్షమున నెక్కడికిఁబో యిన నాకదితగలక తప్పదు. నేనుచావకతప్పదు. అట్లుగాకభగవంతుం డింకగొంతకాలము బ్రతికింపదలచినపక్షమున నిచ్చటనున్నను నాకొక గుండుదెబ్బయైన తగలదు. కావున నేనిచ్చటనుండికదలను. అంతగా నా కపాయముసంభవించునని మీరుభయపడుదురేని మీరెండు సేనలు దూ రముగఁబోయి యుద్ధము జరుపుడు" ... జరుగుచుండెను.

అందుచేత నప్పటికి రెండు సేనలు యుద్ధముమానిమరునాఁడు వేరొకచోటికిఁబోయి కయ్యమారంభించిరి.

రెండవనాటియుద్ధమున రామసింగుసంపూర్ణముగ నోడిపోయి మేర్తాయను పట్టణమునకుఁ బారిపోయెను. కాని యాపట్టణమువానికి శరణమీయఁగలపాటి సామర్థ్యము గలదికాదు.పట్టణమతివిశాలమగుటచేతను కోటగోడలు సరిలేకపోవుటచేతను వానికక్కడనుండుట చాలకష్టమయ్యెను.అదియునుపరమనిర్భాగ్యుఁడగుతమరానా నిమిత్తము రణరంగమున మృతినొందిన శూరులుగాక దక్కిన రాజపుత్రులందఱు భక్తునియెడ మిక్కిలి పక్షపాతముగలిగి యుండిరి.ఈస్థితిగతులు చూచి రామసింగు రెండుజాములరాత్రివేళఁ గొందరనుచరులనువెంటఁబెట్టుకొని మేర్తాపట్టణము విడిచి పారిపోయెను. ఈపనికిమాలిన పనికిఁదోడుగ జయప్పసింధ్యాయను మహారాష్ట్రప్రభువుతో సంధిచేసికొని వాని రక్షణమును జొచ్చెను.

ఈనడుమభక్తుడు విజయమునంది తిన్నగామారువారురాజధానియగు జాదుపురమునకుబోయి యచ్చటనెల్ల రహతూరులచేననుజ్ఞాతుడయి పితృియమగు సింహాసన మెక్కెను. పిమ్మట స్వల్పకాలముననే రామసింగు ప్రేరణమున మహారాష్ట్రసేనతో సింధ్యామారువారుపై దండెత్తెను. అప్పుడు స్వదేశసంరక్షనార్థము రాజపుత్రులనేకులు భక్తునికొలువులో సైనికులుగజేరిరి. భక్తునిసేన గొప్పదగుటచే నేదైన లాభమున్నపుడె కాని పోరుసేయని మహారాష్ట్రులు పోరాటమువలన గలుగులాభములకంటె నష్టమెక్కుడగునని చల్లచల్లగ జారిరి.

భక్తుఁడు సద్గుణాఢ్యుడైయదివఱకేలినరాజులనందఱినిమరపించిచక్కగఁ బరిపాలించెను. శూరుడు మహాబలశాలియున్నతచిత్తుఁడు గంభీరాకారుఁడు మహాదాత ఖడ్గమెత్తి శత్రువులనేయునప్పుడుకలమెత్తి పద్దెములు వ్రాయునప్పుడు సమానచాతుర్యముగలవాఁడు నైలోక

వద్యంబుగ రాజ్యముం బరిపాలించినభక్తునిఁజూచిప్రజలుసంతోషించి యింతమంచివాఁడు నిజముగ తండ్రిం జంపియుండునాయని సందేహించిరి. బంధువులగు రహతూరులుసయితముభక్తునితల్లి మరణకాలమందు పితృవధచేసిన భక్తునిఁగూర్చి పలికిన శాపవచనములుగూడమరచి యొకవేళ మహాపతివ్రతయగు నామెశాపము తగులునేనియికముందెవ్వరికో తగులునుగాని భక్తునకుఁ గాదనుకొనిరి.

మహారాష్ట్రులు రాజస్థానముమీఁద దండెత్తుచుండుటచే భక్తుఁడు వారిని బారఁదోలఁదలఁచితనసంస్థానమునకునంబరుసంస్థానమునకు నడుమనున్న యజమీరునకుఁబోయి మహాశూరులగు కచవాహులను శూరులను వెంటఁబెట్టుకొని మహారాష్ట్రులను దరిమివేయుటలో దనకు సహాయము చేయవలసినదని యంబరురాజగు నీశ్వరసింగునకువర్తమానమంపెను. ఈశ్వరసింగుస్థితి ముందుకువెళ్లిన గోయి వెనుకకువెళ్ళిన నూయి యనునట్లుండెను. ఈశ్వరసింగు కూఁతురును రామసింగు పెండ్లియాడెను. అదియునుగాక రామసింగు రాజ్యభ్రష్టుఁడై భక్తునిమీఁదికి మహారాష్ట్రులను బురికొల్పి తీసికొనివచ్చెను. మరియు మహారాష్ట్రులు మిక్కిలి చండశాసనులు అందుచే నీశ్వరసింగు మహారాష్ట్రులతోనేఁ గలసియుండవలయునని తలంచెను. కాని భక్తుఁడు పొరుగువాఁడగుటచేతను తనకన్న బలవంతుఁడగుటచేతను తననమ్మినస్నేహితులగు కచ్వాహులుసయితము రహతూరులమీఁద పనికిరాకపోవుటచేతను భక్తునితో విరోధపడినచో తనకుక్షేమములేదని యేమిచేయుటకుం దోఁచక యీశ్వరసింగు భార్యనాలోచనచెప్పుమని యడిగెను. ఆమె యజితసింగుయొక్క మనుమరాలు. భక్తునకు మేనగోడలు అయినను భక్తునియందు ద్వేషముఁబూనినదగుటచేత వానినెట్లైన గడతేర్చెదనని యామె ప్రతినఁబూనెను.

అనంతరము కొంతకాలమునకు భక్తుఁడు సైన్యసమేతుఁడై యం

బరుమీవారు మార్వాడురాజ్యముల సరిహద్దులో నుండగ నంబగు రాణియగు మేనగోడలు వానింజూడవచ్చెను ఆమెరాకచేత భక్తుఁడు పరమానందభరితుడై సర్వవిధముల నాదరించెను. ఆమె మేనమామ ను జూచి తనభర్త విధేయుడనిచెప్పి యనేకాభరణములు విలువగల బట్టలు బహుమానమిచ్చెను. భక్తుడా పారితోషికముల నంగీకరించి యావస్త్రముల ధరించెను. మేనగోడలు బహుమానమిచ్చి వెళ్లిపో యిన కొంతసేపటికి భక్తుని శిబిరమునందు "మహారాజు చనిపోవుచు న్నాడు చనిపోవుచున్నా"డని గొప్పకళవళముపుట్టి యెల్లవారినిదుఃఖ సముద్రములో ముంచెను.

మొదట వైద్యులాలక్షణములనుబట్టి యది జ్వరమనుకొనిచికి త్సచేసిరి. కాని పిదప రాజపుత్రస్త్రీలు బట్టలకు విషముపూసిమనుష్యు లను జంపునేర్పుసం గడుజాణలగుటచే నది జ్ఞప్తికిరానెల్లవారు నదివిష ప్రయోగమే యని గ్రహించిరి. భక్తుఁడునూత్రము తక్కినవారివలె భయపడక నెప్పటియట్ల ధైర్యముగనుండి మందులిమ్మని వైద్యునడి గెను. వైద్యుడగు సుజా యారోగమునకు మందులేదనిచెప్ప భక్తుడు "ఏమయ్యా! నావద్ద మాన్యములు గొప్పజీతములు పుచ్చుకొని యను భవించుటయేనా మీపని. సమయమువచ్చినప్పుడు మందు లీయలేక పోయినచో మీపాండిత్య మెందుకు? కాల్పనా" యని యడిగెను.

అడిగినను వైద్యుం డేమియుంబలుక్కక యూరకుండెను. మఱి యొకరాజయినపక్షమున నప్పుడే వానిబుఱ్ఱ తీయించును. భక్తుడు యోగ్యుఁడగుటచే నట్లుచేయలేదు కాని నిష్ఠురోక్తులు పలికెను. వైద్యుం డాపలుకులువిని యెట్టకేలకుతనసామర్థ్యముఁ జూపఁదలఁచియొక గొయ్యిత్రవ్వించి దానినిండ నీరుపోయించి రాజుచూచుచుండ నొక వేరుముక్క యానీటిలో పారవేసెను వేసినతోడనే యానీరు గడ్డగాఁ బేరుకొనెను ఎల్లవారి కదిజూపి యావైద్యుడు "ఇది నాప్రజ్ఞ నామం

దుల పరిభావము" మనుష్యయత్నమునకు లోఁబడినచో నేచికిత్సనైన జేయగలను. ఇది మనుష్యయత్నమునకు మించినది.

జీవితాశ యించుకయు లేదని విని భక్తుడు మనోధైర్యమును విడువక మంత్రిసామంతుల నందఱ బిలిపించి బాలుఁడగు తన కుమారుని బిజీయనువానిని వారికప్పగించి వానిపక్షముండు నందఱిచేతప్రమాణములు చేయించెను. అవసానకాలము సమీపించుటచే బిదప బ్రాహ్మణులు వానికి బ్రాయశ్చిత్తాదికర్మలుచేయించి షోడశమహాదానముల బడసిరి. అనంతరము భక్తుఁడు మరణోన్ముఖుఁడై తల్లిశాపముం దలచి వెనుక దానుచేసిన పితృద్రోహముచే తన ఎముకలు మారువారు దేశమున నుండనీయవద్దని చెప్పి మృతినొందెను పోయినచోటనే వానిని దహనముచేసి యొకసమాధిగట్టిరి. అది మొన్న మొన్నటివఱకు నుండెను భక్తునిమరణముచేత వానికుమారుఁడగుబిజీసింగు పెదతండ్రియగు రామసింగురాజ్యమునకై కలహింప జొచ్చిరి. బిజీసింగు పిన్నవాఁడగుటచే మహారాష్ట్రులు మారువారును లోఁబరుచుకొనుటకదేసందని మేర్తాపట్టణమును ముట్టడించిరి బిజీసింగుసైన్యసమేతుఁడై యక్కడకు బోయెను.

అంతట మూడుదినములు ఘోరయుద్ధమయ్యెను ఉభయసైన్యములు చాలనష్టపడెను మహారాష్ట్రులు కొండలలోను జెట్లచాటునదాగి చాటుపోరున కలవడినవారగుటచే బయలుమీఁద జరిగిన యాయుద్ధమున వారికంతగానుత్సాహము కలుగలేదు బిజీసింగు సైనికులుపారబాటుపడి రామసింగు సైనికులనుకొని తమసేనలో మొరియలవంటి వారిని తుత్తునియలుగ నరికిరి దైవికమైన యీనష్టము రాజపుత్రసేనకు గలిగినను మహారాష్ట్రులు పారిపోవుటకేనిశ్చయించిరి అదికనిపెట్టి జయము తనకు తప్పకచేకూరినదని బిజీసింగు సంతసించి తనగుడారములో రహస్యముగ సైన్యముల మధ్యమ చేయుచుండెను. అట్టిసమయము

న నద్భుతముగ బలముల యదృష్టములు మారిపోయెను. ఆపదలోను న్నప్పుడు రాజపుత్రులు కుటిలోపాయములఁబన్ని తరచుగ జయము చేకొనుట ప్రసిద్ధమేగదా! రామసింగుపక్షముననున్న యొక సేనాపతి సేవకునొక్కనిఁబిలిచి బిజీసింగు సేనాపతులలో నొకనివద్ద నొకమాటచెప్పుమని పంపెను ఆసేవకుఁడువచ్చి దండముపెట్టి బిజీసింగు సేనలో మనుష్యునివలెనటించి "స్వామీ మనమింకనేలయుద్ధము సేయవలయును. మన మహారాజుగారగు బిజీసింగుగారు ఫిరంగిదెబ్బతిని చనిపోయినారు. ఈమాట మీరెఱుంగరు కాబోలు"నని చెప్పెను.

అతఁడదినమ్మి యుద్ధముమానెను. ఆవార్త యడవిచిచ్చువలె నంతటవ్యాపించుటయు ఎండువేసగియెండకు మంచువలె రాజపుత్రసేనయంతయు గరిగిపోయెను. ఇదినిజమా యబద్ధమాయని యెవ్వరు నరయరైరి. బిజీసింగును జూడరైరి. మహాశూరులగు కృష్ణనగరు మహారాజు బికనీరుమహారాజు మొదలగు రహతూరులందఱు తిరిగిచూడక ప్రాణములమీఁది ప్రీతిచే బరుగెత్తిరి. కొందఱు రామసింగు దయను సంపాదింప బ్రయత్నించిరి.

ఫిరంగులన్నియు మహారాష్ట్రులస్వాధీనమయ్యెను. సాయంకాలమగునప్పటికి యుద్ధభూమి నిర్జనమగుటయు బిజీసింగు సంపూర్ణముగఁ బరాజితుఁడై రహీన్‌సంస్థానప్రభువగు లాలసింగొక్కఁడు దనకు సహాయుఁడై వెంటరా బ్రాణము దక్కించుకొనుటకు నాగూరునకు పారిపోవఁగడగెను. ఆచీఁకటిరాత్రికతిపయపరిచారకులతో నతఁడొట్టెటోనెట్టుకొనిపోవుచుండ గుఱ్ఱములలసి సరిగానడువవయ్యె. అనుచరులుగాయములచే బీడితులై బరువులగు కవచములు మోయలేక సకలావస్థలు బడజొచ్చిరి. అట్లుకొంతదవ్వరగినపిదప నాచిమ్మచీకటిలో తాము దారితప్పినట్లు రాజునకుఁబొడగట్టెను. పోడకట్టుటయు నతఁడులాలుసింగును బిలిచి వెనుకకు దిరుగుమని చెప్పెను. లాలుసింగు మొదట సందే

హించి కొంచెముగొణుగుకొని యెట్టకేలకు దానివలనభయము లేదని
ధైర్యముచెప్పి యిట్లనెను" మనము మరియొకదారినివచ్చుచున్న మా
టనిజమేకాని యిది నాగూరునకుమిక్కిలిదూరమున లేదు మనమిప్పుడు
మాయూరికి సమీపముగ నున్నారము ఏలాగోయింత దగ్గరకు రానే
వచ్చితిమి గనుక నన్నొకసారి మాగ్రామము బోనిండు. నేనునాయా
లుబిడ్డలను జూచి తిరిగివచ్చెద."

అని పలుకుటయు బిజీసింగునిర్విణ్ణుఁడై లాలుసింగు దారిదప్పిం
చవలయుననియే తప్పించినాడనినమ్మియైదుగురు సేవకులతో నాయర్ధరా
త్రమున నాగూరునకుబోవ రెండవదారిపట్టెను. ఆత్మలాభపరాయణు
డగు లాలసింగు తనునమ్మినరాజునేకాకినిఁజేసి తనయూరుఁజేరెను. బిజీ
సింగు రహీర్ పట్టణము దారివిడిచి నాగూరుమార్గ మనుసరించి రే
యంతయు గుఱ్ఱములుతీసికొనిపోగలిగినంత మేర పోయిరి. నాగూరు
రెండామడ దూరముననుండగ వానిగుఱ్ఱముపడిచచ్చిపోయెను. వెంట
నే యతఁడొక పరిచారకుని గుఱ్ఱమెక్కి మిట్టమధ్యాహ్నమయిననుసూ
ర్యుఁడు తనకిరణములచేత నిప్పులజెరగుచున్నను ఫలాహారముచేయుట
కైన నీరుఁద్రావుటకైన గుఱ్ఱముదిగకపయినముచేసెను. ఆగుఱ్ఱములు
మనుష్యుల నొకవిధముగా మోయగలిగినను వారికవచములనుమాత్ర
ము మోయజాలక బాధపడఁజొచ్చెను వారు మఱిమూడుమైళ్ళదూర
మందున్న దేశవాలుగ్రామము జొచ్చునప్పటికి గుఱ్ఱములడుగుతీసి య
డుగుపెట్టలేక కుంటివమ్యెను అందుచేత నాయారుగురుమనుష్యులు
గుఱ్ఱములవిడిచి తామువిడిపోయి యెవరిదారినివారుతోచినచోటులకుఁ
బోయి తమతమ యదృష్టముల ప్రకారము బ్రతుకవలయునని నిశ్చ
యించుకొనిరి.

బిజీసింగు కవచమును రాజచిహ్నములను దూరముగఁ బార
వైచి పేదవానివేషము వేసికొని దేశవాలుగ్రామముచుట్టు నిట్టటుది

రుగుచుండ రెండెడ్లబండి వాఁడొకఁడు కనబడెను. అతఁడువానితో సం భాషణలకుఁజొచ్చి "రేపుదయములోపున నన్ను నాగూరునకు దీ సికొనిపోగలవా!" యని యడిగెను. అక్కడికి నాగూరెనిమిది క్రో సుల దూరముండుటచేతను రాత్రియంతయు బండితోలవలసి యుం డుటచేతను బండివాఁడు కొంచెమనుమానించెను. రాజు తనయాత్రి ముచేత నెటులైనఁ దన్నుఁ దీసికొనిపొమ్మనియడిగి యైదురూపాయ ల నిచ్చెదనని యాసపెట్టెను. బండివాఁడు బలవంతముమీఁద నెట్టె టో యంగీకరించి "నాకు క్రొత్తరాజగు రామసింగుగారి ముద్రియు న్న రూపాయలే యివ్వవలయుగాని బిజీసింగుముద్రియున్న పాఁతరూ పాయ లక్కరలే" దని చెప్పెను. సరేయని యారాణాబండియెక్కి బండివాని ప్రక్కనుగూర్చుండి రెండవరాత్రి పయనమారంభించెను. ఎడ్లెంతవేగముగఁ బోవుచున్నను వానితొందరనుబట్టి యవిమెల్లగా పారికుచున్నట్లు బిజీసింగునకుఁ దోఁచుటచే నతఁడు త్వరగా నాగూ రుఁ జేరవలయునని ఛోయి ఛోయియని యెడ్లను త్వరపెట్టసాగెను. అందుచే బండివాఁడు మిక్కిలికోపించి బిజీసింగును బలుమారు కసరి "నీవెవ్వఁడవు నాగొడ్లనుబ్రతుకనియ్యవా యేమి? ఈయెద్దులను దో లుటకన్న యుద్ధములోనికిఁబోయి బిజీసింగుగారి పక్షముననుండి పగ వాండ్లను దోలరాదా? నీవైఖరిఁజూడ నిన్ను వెనుకనుండి యెవ్వరో త రుముకొని వచ్చుచున్నట్లుఁ దోఁచుచున్నది. నీవెంత గొంతుక బ్రద్ద లుచేసికొని యఱచినను సరే. చచ్చినా నేనింతకంటె నెక్కువవడిగా తోలను. యిష్టమున్నయెడలఁ గూర్చుండుము లేదా దిగినడువు"మని కఠినముగఁ బలికెను.

ఆపలుకు విని రాజు"అవస్థాపూజతేరామ"అనుమాట జ్ఞప్తికిఁ దెచ్చుకొని కాలానుసారముగ నడువతఁదప్పదని తలవంచుకొని మాట లాడక గూర్చుండెను. అక్కడికి నాగూరు క్రోసెడు దూరముండెను

అంతలో బల్లున తెల్లవారె, తెల్లవారినది మొదలుకొని బండివాఁడు వానిమొగమువంక పరికింపట్టి పలుమాఱులు చూడఁజొచ్చెను. చూచి చూచి యుద్ధములో నలిగి రెండుదినముల నిరంతరప్రయాణముచే డస్సి తొంట్రుపాటుతో మాఱువేసము వేసికొని సర్వవిధములచేత తేజోహీనుఁడై యున్నను బండిలోఁగూర్చున్నవాఁడు తనరాజని గుర్తెఱింగియా బండివాఁడు బండిమీఁదనుంచి దిగ్గున క్రిందికురికి రేనికాళ్ళమీఁదబడి నన్నుక్షమియింపుమని పరిపరివిధములఁ బ్రార్థించి "నేనేలినవారితో సమానముగా కూర్చుండి సామాన్యునితో మాటలాడినట్లు దేవరవారితో మాటలాడితిని. సన్నేమిచేసినను బాపమున్నదా" యనివిచారించెను

అతని దైన్యమును జూచి జాలినొంది మనకిప్పుడు మరియాదలతోఁబనిలేదు. నిన్ను నేను క్షమియించితిని భయములేదు. బండెక్కి తోలు"మని యానతిచ్చెను; ఇచ్చినను వాఁడు ధైర్యములేక "స్వామీ నేనంత చనువునకుఁ దగను నేనేమి యేలినవారితో సమముగాఁగూర్చుండి బండితోలుటేమి? నడచుచు దోలెద"నని పలుక రాజువానిం బలవంతపెట్టి బండి యెక్కించెను వాఁడు బండియెక్కి తనవద్దనున్న బిరుసుపిండి రొట్టెలు పెరుగు మొదలగు పదార్థములు రాజునకుఁ బెట్టి యాకటఁదీర్చి ఛోయిఛోయియని యెడ్లను తానేత్వరపెట్టి సత్వరముగబండి నాగూరునకుఁ జేర్చెను.

గ్రామము జేరి బిజీసింగు బండివాని కైదుపాయలిచ్చి తనకు రాజ్యము ప్రాప్తించినప్పుడు మాన్యములిచ్చెదనని వాగ్దానముచేసి వానినంపెను పిమ్మట కొన్నినాళ్ళకు బండివానికి భూములుకూడనీయఁబడెను బిజీసింగునకుఁ దోవలోనిచ్చినరొట్టెలువంటి రొట్టెలు పెరుగు వంటి పెరుగుప్రతిసంవత్సరముబండివానివద్దనుంచియు వానివంశస్థులవద్ద నుంచియుఁ బుచ్చుగునుచు బిజీసంతతివారా మర్యాదలం జరిపిరి. అవినేటికిని బండివానివంశజులకు జరుగుచున్నవి.

మహారాష్ట్రులతో జరిగిన యుద్ధమునందు హతశేషులగు రాజపుత్రులువచ్చి నానాఁటికి నాగూరులో బిజీసింగును కలసికొనిరి అంతట శత్రువులు నాగూరుకోట ముట్టడింప రాజపుత్రులాఱుమాసములు కోటఁగాపాడుకొనిరి ఈనడుమ మారువారులోనున్న కోటలు పట్టణములు క్రమక్రమముగ మహారాష్ట్రుల సహాయము నొందిన రామసింగుచేతిలోఁ బడఁజొచ్చెను అందుచే బిజీసింగు బైటనుండి తనకుఁదగిన సహాయమువచ్చినంగాని తన సేమము లేదని గ్రహించెను. నాగూరుకోటలో నతనితో నైదువందల లొట్టిపిట్టలుండెను బిజీసింగుతన్ను ముట్టడించుచున్న మహారాష్ట్రులేమరిపాటున నుండ నొక్కనాఁడు చక్కని యుపాయముపన్ని యొక్కొక్క లొట్టిపిట్టమీఁద నిద్దఱురహుతూరులనుగూర్చుండఁబెట్టి కోటవెలువడి శత్రువులపై బడి నురుమాడి యెనిమిదిజాములలోపుగనే తనచిన్నసైన్యములతో బికనీరుపట్టణము జేరెను.

బికనీరుప్రభువు బిజీసింగు పక్షముననుండి కొంతసేపు పోరాడి తనయేలిక మృతినొందినాఁడన్న యపవార్తవిని ముందుగా పారిపోయెను రాజ్యభ్రష్టుడైన బిజీసింగునకు మరల సహాయముచేయుట కిష్టములేక యతఁడు వానిని నిరసించెను అట్లు దుగ్ధమనోరథుఁడయ్యు బిజీసింగు ధైర్యమును విడువక మరలనొకదినము ప్రయాణముచేసి జయపురమునకుఁజని తనతండ్రినిజంపిన యీశ్వరసింగును సహాయమడిగెను తనకుమిత్రుఁడై తనపక్షమునఁ బోరాడిన బికనీరురాజుకంటె స్రాతపగతుఁడైన యీశ్వరసింగే మంచివాఁడయ్యెనని యతనికి దోఁచెను ఆరాజు సన్మానపూర్వకముగా బిజీసింగును గోటలో బ్రవేశపెట్టుటయే గాక కొలదికాలముననే స్వయముగా వానిదర్శనముచేయుటకుఁబోయి వానినిమిక్కిలి గౌరవించి ప్రేమతో నాలింగనముచేసికొని వానితోసమానముగా బ్రక్కనుగూర్చుండి కుశలప్రశ్నము లడిగెను.

అక్కడకు బిజీసింగుతోఁగూడ నొకరహుతూరు సూరుఁడువచ్చె

ను అతనిపేరు జోవానుసింగు అతఁడు బీజీకి నమ్మినబంటై యతనిప్రాణ
మునకుఁ దనప్రాణమడ్డమువేసి కంటికి రెప్పయట్లు తోడై యెల్లప్పుడు
వానికుడిప్రక్కనేయుండును. ఆదినమునమాత్ర మతఁడెందుచేతనో తన
యజమానుని కుడిప్రక్కనుండక ప్రక్కను గూర్చున్న యీశ్వరసిం
గు నంగరకాల కొంగులమీఁద గూర్చుండెను అట్లు చేయుటకుఁ గా
రణమేమాయని బిజీసింగును యోచించుచుండెను అతనింజూచి యీ
శ్వరసింగు మిక్కిలి యక్కజపడి "ఏమోయీ! నీవీదినమున మీరాజు
వెనుకప్రక్కను గూర్చుండుటకుఁ గారణమేమి" యనియడిగెను "ఈ
వేళ నట్లుచేయవలసి వచ్చిన" దని జోవానుసింగు ప్రత్యుత్తరముచెప్పి
తనరాజువంక తిరిగి "తక్షణమే లెండు లేచియావలకుఁ బొండు పోవలేని
మరణమో చెరసాలయో తప్ప" దని బిగ్గరగ హితోపదేశము చేసెను
బిజీసింగు కచ్ఛవాహుల దుస్స్వభావ మెఱిగినవాఁడగుటచే తనబంటు
చెప్పినమాటదప్పక తక్షణమే యటనుండిపోయెను. ఈశ్వరసింగు బిజీ
సింగును సాగనంపుటకు లేవఁబ్రయత్నించెను కాని లేవలేకపోయెను.
ఏలయన జోవానుసింగు వానియంగరకాలకొంగులమీఁదఁ గూర్చుండి
కదలకపోవుటయేగాక విశేషించితనకైజారువానిమెడకు సూటిగబెట్టి
హెచ్చుతగ్గు వచ్చినచోఁ బొడువనిశ్చయించుకొని దాటిపోవుచున్న
తనరాజుతో మీరులొట్టియ నెక్కగానేనాకు వర్తమాన మంపుడని
కేకవేసి చెప్పెను ఈశ్వరసింగు చుట్టములగు కచ్ఛవాహాదొరలు తెల్ల
బోయిచూచుచుండిరి. తనరాజులొట్టియనెక్కువరకు జోవానుడదేవిధముగ
నుండి కచ్ఛవాహులనందఱ గడగడ వడంకునట్లుజేసి చెక్కుచెదరక
లేచి యీశ్వరసింగునకు సలాముచేసి తనకు సెలవిమ్మని యడిగెను.
ఈశ్వరసింగు తన మనోరథము భగ్నమైనదనియు జోవాను తన్ను ప
రాభవించెననియు సిగ్గుపడి మరల సలాముచేసి పంపెను అంతట రహ
తూరులందఱు నొంటెలనెక్కి సాగిపోయిరి అప్పుడీశ్వరసింగు తన స

రదారుల "చూచితిరా వానివిశ్వాసము రాజభక్తి యెట్లున్నదో అట్టి సూరులుండగ నారాజు నెవఁడుగెలువగలఁడని పలుకుచు లోనికిఁబో యెను జోవానుసింగు పై విధముచేయుటకుఁ గారణమిది జోవానుసింగు మామగా రీశ్వరసింగు సేనాపతులలో నొకఁడు. ఈశ్వరసింగు బిడీశింగు లకు ద్రోహముదలచినాడని తనమామవలనవిని జోవానుఁ డావిధము నఁజేసెను బిజేసింగు మరల బయసమై నాగూరునకు బోయి యానా యాసముగఁ గోటలోఁ బ్రవేశించెను.

అనంతరమతఁడు తనజీవితకాలములో తనకు రాజ్యప్రాప్తి కలుగునను నాసవిడిచియుండ నాఱుమాసములు గడచినతరువాత నొకనాఁడు వానియొద్ద కొకరాజపుత్రుఁడు నొకమహమ్మదీయుఁడు వచ్చి జోహారుచేసి నిలచి "స్వామీ! మాకుటుంబములను మీరుపో షించుటకుఁ వాగ్దానముచేయుదు రేని మీపరమశత్రువు నొక్కనిని మేము గడ తేర్పగలము. అతఁడు కడ తేరినపిదప నంతయుఁ జక్కబడు నని పలికిరి. బిజేసింగునకుఁ బరమశత్రువులిరువురు మహారాష్ట్ర సేనా పతియగుజయప్పసింధ్యాయొకఁడు; పెదతండ్రియగురామసింగొకఁడు; ఈయిద్దరిలో నెవరుగడ జేరినను వానికి మంచిదే కాబట్టి యతఁడు వారుచేసిన ప్రతిజ్ఞనంగీకరించెను.

ఒకనాఁడు జయప్పసింధ్యా దంతధావనముచేసికొనుచు డేరా గుమ్మమువద్ద గూర్చుండ సైనికులకు సరకులమ్ము వర్తకులిద్దఱు లెక్కల పుస్తకములు ముందువేసికొని నీదితప్పు తీదితప్పని బట్టుగఁ గలహించితమతగవుదీర్చుమనిజయప్పను వేడుకొందమనియొకరియాడు వాండ్రనొకరు బూతులుతిట్టుచు చేతులుబారలు జాపుకొనుచు నొం డొరులవెక్కిరించుకొనుచుమీఁదమీఁదికిఁబోవుచు గ్రమక్రమముగా జయప్ప సమీపమునకుఁ బోయిరి. అప్పు డాకస్మికముగా సమీ పమున రెండు కత్తులు తళతళమెరసెను. మెరసినతోడనే "ఇది

నాగూరుపోటు" "ఇది జాడుపూరుపో" టని పలుకుచు నిరువురు రెండుకత్తుల జయప్పను రెండుపోటులు పొడచిరి. జయప్పయు వెంటనే పీనుఁగయై డేరాగుమ్మమువద్దపడెను. పడుటయు శిబిరములో గొప్ప కళవళముపుట్టెను. ఆతొట్రుపాటులో జయప్ప సైనికులు తమయేలికనుఁజంపిన యిరువురలో దురకందుత్తునియలుగ నరికిరి. రెండవవాఁడగు రాజపుత్రుఁడు సైనికులచాటునఁబడి చల్లచల్లగనాపలకు దాటి నాగూగునకుఁబోయి శుభవార్త బిజేసింగునకు విన్నవించెను.

రాజపుత్రుఁడు మహమ్మదీయుఁడు బిజేసింగుతో చేసిన ప్రతిజ్ఞ నెరవేర్చుకొనిరి. మహారాష్ట్రులదివఱకే యుద్ధములుచేసిచేసి విసికియుండుటచేతను నాయకుఁడు సంహరింపబడుటచేతను సంధికొప్పుకొనిరి. బిజేసింగు కొంతకప్పము నజమీరుదేశము మహారాష్ట్రులకిచ్చి సంధిచేసికొని తానుమారువారునకు రాజయ్యెను. లంచగొండులగు నామహారాష్ట్రులు రామసింగుపక్షము విడిచి బిజేసింగును రాజునుచేసి స్వదేశమునకుఁ బోయిరి. రామసింగురాజ్యము సంపాదించుట కిరువదిరెండు యుద్ధములుచేసి జయము నందలేక క్రీ॥ శ 1773 సంవత్సరమునందు రాజస్థానమందలి జయపురమున మృతినొందెను. బిజేసింగు సింహాసనమెక్కి యెడతెగని యుద్ధములు చేసిచేసి ముప్పదియొక్క సంవత్సరములు మారువారుదేశమును పాలించి 5794 వ సంవత్సరమున గాలధర్మము నొందెను.

---

# కృష్ణకుమారి.

పదునెనిమిదవ శతాబ్దాంతమందుహిందూదేశమంతయుమిక్కి లిదురవస్థలోనుండెను. ఔరంగజేబు మృతినొందినతోడనే వానిసంతతి మొగలాయీలుదుర్బలులై స్త్రీలోలులై మద్యపానమత్తులై రాజ్యము మంత్రులచేతి కప్పగించి దేశమునకు దమకునాశనమునుదెచ్చుకొనిరి వారి దౌర్బల్యముంగనిపెట్టి మహారాష్ట్రులుమఱింతవిజృంభించి ఢిల్లీరాజ్యము నందలి భాగముల నూడబెఱికి పంచుకొని దేశమున కెంతయు క్షోభగలి గింపఁజొచ్చిరి ఒకప్రక్కను సీకులుతలయెత్తి రాజ్యమును స్థాపింపఁజొచ్చి రి. మరియొకప్రక్క నింగ్లీషువారు ఫ్రెంచివారు దేశాక్రమణమారం భించిరి. దక్షిణమునుండి మహారాష్ట్రులు నిర్నిద్రప్రతాపులై దేశమును మంగలములోఁ బెట్టివేచినట్లు తపింపజేసిరి నవాబులు రాజులు తమలో తామైకమత్యములేక కయ్యములకుఁ గాలుద్రువ్వుచు కారణములేకయే పోరుచు దేశమును రక్తభూయిష్టము జేసిరి. దేశమందు వ్యాధులు కాటకములు మెండయ్యెను. స్థిరముగా నొకరాజొకదేశమును గొంత కాలము పరిపాలించుననుమాట నిశ్చయములేదు ఈయాపదలకుదోడు పారసీకమునుండియు కాబూలునుండియు మహమ్మదీయులు దండువె డలి దేశములం గొల్లగొని స్త్రీలంజెరబెట్టి యెల్లయెడల నాశనదేవతను నెలకొలిపిరి. ఆకాలమున హిందూదేశమంతలో రాజస్థాన మనుభవిం చిన కష్టములెవ్వరనుభవింపలేదు రాజపుత్రులు తొంటివలె దమకుల గౌరవమును దేశగౌరవమును నిలుపుటకుఁ బాటుపడక యంతఃకలహ ములు పెంచుకొని పోరుచుఁ దమసహాయార్థము మహారాష్ట్రులనుబిల చుచు వారిచే నెడతెగని బాధలంబడజొచ్చిరి. అందు ముఖ్యముగ మీవారు సంస్థానము పడినపాటు చెప్పనలవిగాదు.

పదునెనిమిదవ శతాబ్దాంతమందుభీమసింగనునతఁడురమారమి యెనిమి దేండ్ల ప్రాయమున మీవారు సింహాసనమెక్కెను. ఇతనికియుక్త వయస్సువచ్చువఱకు వానితల్లి రాజ్యపాలనమును జేయుటకైపూని వయ సువచ్చిన వెనుకఁగూడ వానికి రాజ్యమీయక తానేయధికారము చెల్లిం పఁజొచ్చెను. అతఁడపరియోజకులలో మొదటివాడు. మిక్కిలిదుర్బలుడు వానికిజగన్మోహనకారియగుకృష్ణకుమారియను కూతురుగలదు. ఆబా లికయే సంస్థానమునకు వచ్చిన మహాపత్తు మహాద్భుతముగా నివారిం చెను ఆభీమసింగు మీవారు నలువదిసంవత్సరములు పాలించెను. అం తకాలము రాజ్యముదురవస్థలోనే యుండెను. తల్లియధికారమెట్టటో యతఁడు వదలించుకొని యీవలఁబడ మంత్రిలువానిని మోసపుచ్చి తమయధీనము జేసికొనిరి. దేశము వెలుపల మహారాష్ట్రులు మహమ్మదీ యులు కాఱుచిచ్చులట్లు జనులనుబాధింపుచుండిరి దేశములోపల రెం డురాజపుత్రకుటుంబములు మంత్రిత్వమువహించి రాజుపేర నధికార ముచేయుటకుఁ దమలో తాము కలహించిరి. వీరుచందావతులు సూక్తా వతులు పూర్వమువీరిరువురు యుద్ధములో నొండొరులనుమించి పౌరు షముజూప బ్రయత్నింపుచువచ్చిరి కాని యిప్పుడు బుద్ధిలేనిరాణాను బుట్టలోబెట్టి దేశమేలుటకు గలహించిరి మొట్టమొదట చందావతు వంశస్థులే గెలుపుఁగైకొనిరి కాని వారుగర్వితులై యెవరిని సరకుగొనక యందఱవమానించుచుండ రాజమాత కలహించి యధికారముగైకొ మ్మని సూక్తావతులం బురికొల్పెను అదిమొదలు మీవారుదేశము పడినపాట్లు కుక్కలునక్కలుసయితము బడియుండవు ఆసంగతులు నిద్దురలో జ్ఞప్తికివచ్చినను భయముపుట్టకపోదు.

చందావతుల నాయకుడు సూక్తావతులనాయకుని నిష్కారణము గా నధర్మముగఁ జంపి వాని క్రొన్నెత్తురుతో దడిసిన చేతులతోనే రాణావద్దకుఁబోయి బీరముబుకొట్టెనుఅందుచేత నారెండు తెగలవారు

విధివిరామములులేక పోరుసల్పుచు నొండొరులమగవారింజంపుచు గెల్చినవారు దేశమున నధికారులమని బయలుదేరి కప్పములిమ్మని ప్రజలం బీడించుచు రాక్షసకృత్యములుచేయసాగిరి. ఈయంతఃకలహమును సహింపలేక దుర్బలుడగు రాణాభీమసింగు విధిలేక తనకు సాయము చేయుమని సింధ్యానుకోరెను. ఈకోరుట కాఅవితో దలఁగోకికొనుట యేయయ్యెను. మహారాష్ట్రులు మిడుతలదండువలెవచ్చిపడి రాణాకు సహాయముచేయుదుమని వంకబెట్టి యకార్యములనెల్ల జేయజొచ్చిరి చందావతులలో నొకడు సింధ్యావల్ల లంచముగ్రహించి చిత్తూరుపట్టణము వానియధీనముచేసెను. అదిస్వాధీనముచేసికొని సింధ్యాగార్యాంతరములమీాద పునహానగరమునకు బోయెను పోవునప్పుడు దుష్టశీలుడగు సంబాజీయనుమంత్రిని రాజస్థానవ్యవహారములు చక్కబెట్టుటకై నియమించెను వాడెనిమిదేండ్లు మీావారున నధికారము చేసెను వాడెంతదుర్నీతిపరుడైనను రానాపట్ల మంచివాడై మొండివాండ్రనేకుల నడచి వారియధీనములో నుండినరానాకప్పగించెను అంతలో నతనికి మఱియొకగొప్పయుద్యోగము కాగా నతనికన్న నధమాధములు కొందఱుమీావారునందధికారముచేయుటకు వచ్చిరి వారువచ్చి వెనుక ప్రజలనుభవించినదుఃఖము నెవఁడనుభవింపఁగలడు ?

అంతలో సింధ్యామృతినొందెనుఅతనివారసులుతమలోదాము కలహించి రాజపుత్రుల బంధముల నెక్కువజేసిరి. ఆవారసులలో నెట్టకేల కెవఁడోయొకఁడు సింధ్యా యయ్యెను. అతఁడు మీావారు సంస్థానము తనకు సామంతసంస్థానమని యెంచి తనసేన గొంత నక్కడ నిలువజేసి వానిఖర్చులు రానా నిచ్చుకొమ్మనెను. ఎడనెడ సింధ్యాకు మఱియొక మహారాష్ట్రప్రభువగు హోల్కారునకు వివాదములు యుద్ధములు సంభవించెను. ఆయుద్ధములలో హోల్కారు గెల్చినప్పుడు హోల్కారు సింధ్యా గెల్చినప్పుడు సింధ్యా మీావారు

నకువచ్చి తామే యధిపతులమని లక్షలకొలఁది ధనము కప్పమిమ్మని రానాను బీడించుచువచ్చిరి. రానాచేఁ జిక్కిన ధనమంతయు నిచ్చి మహారాష్ట్రుల యాశ యెంతకుఁ దీరకపోవుటచే నెట్టకేలకు నంతః పురస్త్రీల నగలను వారి విలువగల వస్త్రములను సయితమిమ్మి యాదురాత్ముల ధనదాహము తీర్పవలసివచ్చెను.

దేశ మాస్థితిలోనుండ రానాభీమసింగుకూఁతురగుకృష్ణకుమారి యుక్తవయస్కురాలయ్యెను. ఆమెకప్పటికి పదునైదవయేఁడు. ఆము ఖలావణ్యము, ఆశరీరకాంతి,ఆయంగసౌష్ఠవము, ఆపలుకులమార్దవము వానినన్నిఁటిమించినయామంచితనమువర్ణించుటకు గాళిదాసునివంటి కవులుగావలయునుగాని తదితరులుచాలరు. మూర్తీభవించిన చక్కఁ దనమువలెను గలియుగమునకువచ్చిన జగన్మోహనావతారమువలెను కృష్ణకుమారి ముద్దులు మూటగట్టుచుండెను. ఆబాలికసోయగమునా నాటి రాజులందఱు విని యామెను దేవిగాబడయుట యెట్లనియువ్వి ళ్ళూరుచుండిరి. అందుమొదటివాడు సింధ్యా. అతఁడు తనకామె ని మ్మని భీమసింగునకు సందేశమంపెను. కూఁతును సింధ్యాకిచ్చిన పక్షు మున రానాకు మిక్కిలి లాభమైయుండును. రానా యెంతచెడిపోయి దుస్థితిలోనున్నను స్వలాభ మావిషయములో జూచుకొనక కులగౌర వమునెంచి కుమార్తెను సింధ్యాకియ్యననెను. అనంతర మంబరుసంస్థా నపరిభువగు జగత్సింగుబాలికనిమ్మని యుదయపురమునకుఁ దూతనం పెను. అంబరురాజులు కులగౌరవమున మీవారురానాలకు నొకవన్నె దీసిపోదురు. ఏలయన మొగలాయీలకుఁ దమకూఁతులనిచ్చి పెండ్లి చేసిన మొట్టమొదటి రాజపుత్రులువీరే. వంశముమాట యటుంచి వ రునిగుణములు చూచినపక్షమున నవియుఁ దృప్తికరములుగావు. జగ త్సింగు కుటిలుఁడు భోగపరాయణుఁడు దుర్వ్యసనాసక్తుఁడునని వాని కదివరకే యప్రతిష్ఠ సంభవించెను. అట్టియవస్థలో బుత్రికకుఁ దగిన

భర్తను వెదకువాఁడై భీమసింగు మిక్కిలి పరితాపము నొందఁజొచ్చెను. ఇట్లు మూఁడునాలుగేండ్లు వివాహముగాక కృష్ణకుమారి నిలిచెనా వయసుముదిరినదని యెంత యధముఁడు నామెం జేకొనఁడు. ఎఱిఁగి యెఱిఁగి కులహీనులకుఁ గుణహీనులకు నీయబుద్ధి పొడముచుఁగదా!

ఎన్నివిధముల యోచించినను దొరకినవారిలో జగత్సింగుసంబంధమే మంచిదని తలంచి భీమసింగు వానికూఁతను గౌరవించి సబహుమానముగాఁ బంపెను. పిదప జగత్సింగును ప్రధానముచేసికొని రమ్మని యమూల్యాభరణములు వస్త్రములు నిచ్చి మంత్రిపురోహితుల నుదయపురమునకంపెను. ఆపరిధానమైనకొన్నినాళ్ళకు జగత్సింగుకన్న బలవంతుఁడు గుణములలో వానికన్న నధముఁడునగు మఱియొకవరుఁడు కృష్ణకుమారినిమ్మని యడిగెను అతఁడు మారువారుసంస్థానపరిభువగు మానసింగు. అన్న చనిపోవుటచే మానసింగుస్వల్పకాలముకిందటనే రాణాయయ్యెను. ఈతఁడు కన్యనడుగుటలో నొకక్రొత్తపుంతఁద్రొక్కెను. కృష్ణకుమారి యదివఱకే మృతినొందిన మానసింగుసోదరునకు వాగ్దత్తముచేయఁబడెనఁట. అందుచేత మానసింగు భీమసింగున కిట్లువర్తమానమంపెను. "మీరు మీకన్యకను మాయన్నకు వాగ్దానము చేసిరి. ఆతఁడు వివాహముకాకముందే మృతినొందెను. మీవాగ్దానము మారువారురాణాకుఁగాని ప్రత్యేకము మాయన్నకుగాదు. నేనిప్పుడు మారువారురాణాగ నైతిని. కనుక మాయన్నగారి తక్కినయాస్తినాకు రావలయును."

ఈవాదమునకుఁదోడుగ నతఁడుసింధ్యాతోడుగూడ సంపాదించెను. సింధ్యాకుజగత్సింగునకు వైరముండుటచేసింధ్యావీనిపక్షమే యవలంబించి జగత్సింగుతో సంబంధబాంధవ్యము మానుకొని కూఁతును మానసింగున కిచ్చి పెండ్లిసేయుమని రాణా భీమసింగునాజ్ఞాపించెను. కులగౌరవము నిలుపుటకై భీమసింగదివఱకే యొకసారి సింధ్యా

కోరిక నిరాకరించుటచే నిప్పుడు నట్లే వానియాజ్ఞను తిరస్కరించెను. అట్లు చేయుటచే వానికాపదమూడెను. సింధ్యా తనయాజ్ఞాతిరస్కారము గావించిన రాణాను దండింపఁదలఁచి తనపిరంగు లుదయపురముమీఁద బారుపెట్టి పట్టణము భస్మీపటలముచేయుటకు సన్నద్ధుఁడై యుండెను. అదిచూచి రాణా భయపడి సింధ్యాచెప్పిన చొప్పున చేయుట కొప్పుకొనెను. జగత్సింగు సాహసుఁడౌటచే మారువారు రాజ్యమునకు మానసింగుగాక మఱియొక వారసుఁ డున్నవాఁడని విని వానిని లేవఁదీసి తాను వానిపక్షముఁబూని మానసింగును సింహాసనభ్రష్టునిఁ జేయఁదలఁచెను. మారువారుసేనలో సగము మొదటనే యావారసుని పక్షము జేరెను. అటులంబకు మారువారు సంస్థానములు పరస్పర వినాశనమునకై ప్రయత్నించి యుద్ధములు చేయఁజొచ్చెను. మానసింగు పరాజయమునొంది సిగ్గుపడి కత్తితోఁ బొడుచుకొని చనిపోవలయునని సమకట్టెను. కాని యాతనిమిత్రులలో నొకఁడు వాని నాసాహసమునుండి తప్పించెను. ఈజయముగలిగినతోడనే జగత్సింగు మానసింగును దరిమి చంపి యుదయపురమునకుఁ బోయి కృష్ణకుమారిని వివాహమాడి తనరాజధానియగు జయపురమునకుఁ దీసికొనిపోయినచో నెంతయు బాగుగ నుండియుండును కాని యెందుచేతనో జగత్సిం గట్లుచేయక యూరకొనుటచే మానసింగు తనరాజధానియగు జాడుపురమునకుఁ బాఱిపోయి కోటలో దూరి బలపరచుకొని దృఢస్థితి గలవాఁ డయ్యెను.

జగత్సింగు కొందఱు రాజపుత్రులను సహాయము గైకొని జాడుపూరుకోటం జుట్టుముట్టి మాఱు ముట్టడించెను. క్రమక్రమముగా జగత్సింగు సేనలో నాహారపదార్థములుఁ దక్కువగుటయుఁ బరస్పరకలహములు జనించుటయును మొదలగు నరిష్టములు కలిగెను. ఈకలహములచేత జాడుపూరుకోట యొకవేళ స్వాధీనమైనను మాన

సింగును వారు పట్టుకొనలేనంత దురవస్థకు వచ్చిరి. మానసింగు కోటలోనుండి చెక్కుచెదరక పగతురను నిరాకరింపఁ జొచ్చె ముట్టడించు సైనికు లొండొరులం జెఱుపఁదలంచుచుండుటచే వారికి జయముగలుగుట యరిదియని వెల్లడియయ్యెను. అంతలో జగత్సింగుతల్లి మారువారుసైన్య మొకటి తమసైన్యములోఁ గొంతభాగమును దుత్తునియలుగా ఖండించి రాజధానియగు జయపురముమీఁదికి వచ్చుచుండెనని కొడుకునకు వర్తమాన మంపెను. జగత్సింగు విషాదమగ్నుఁడై మానసింగునొద్ద బట్టుకొన్న నలువది పిరంగులను స్వసైన్యములోఁ జాలభాగమును దనరాజధానికిఁ బంపఁదలఁచెను. అదివఱకు మానసింగుతోఁ గలహించి జగత్సింగు పక్షమువచ్చిన మారువారు రాజపుత్రులు జగత్సింగుచేసినపనికిఁ గోపించి తమరతనితోఁ జేసికొన్న యొడంబడికను సరకుసేయక తమరాజుమీఁదగల క్రోధమును మఱచిపోయి తక్షణమే మానసింగుతోఁజేరి జగత్సింగు భటులపైఁబడి తమ పిరంగులు తాము పుచ్చుకొనిరి.

మారువారు రాజపుత్రులు తన్నుత్యజించినతోడనే జగత్సింగు పిచ్చివాఁడై యెద్దియుందోఁచక తన్ను సురక్షితముగఁ బారిపోనిమ్మని మహారాష్ట్రసేనాపతికి లంచమిచ్చి తనపట్టపుటేనుఁగును సయితము యుద్ధభూమిలో విడిచి ప్రాణము లఱచేతఁబెట్టుకొని రాజధానికి బలాయితుఁడయ్యెను. ఎట్లైన నతఁడు సురక్షితముగ నిల్లుచేరెను. ఈబ్రతికియుండుట యపకీర్తినిమిత్తమేయయ్యె నతఁడు ప్రాణముదక్కించుకొనెను గాని వానిసైనికు లనేకులు మార్గమధ్యమునంబడి చచ్చిరి. వారియెముకలు చాలకాలమునఱకు జయపురముదారిలో పోగులు పోగులుగఁబడి చూపరులకు భయము గొలుపుచు వచ్చెను.

ఈవిధముగ బరరాజులతో సంభవించిన యుద్ధమున మానసింగు విజయమునొంది యంతశ్శత్రువగు తనజ్ఞాతిని నిర్మూలింప

ప్రయత్నించెను. ఈకార్యమున నతనికి సింధ్యా సేనాపతియగు నమీరు ఖానను మ్లేచ్ఛుఁడు చాలసహాయము చేసెను. ఆతురక వానిజ్ఞాతి కడకుఁబోయి మానసింగుపక్షము తాను మానినట్లు వానికి సహాయము జేయఁబూనినట్లు దియ్యనిమాటలుజెప్పి వానిపక్షముననున్న గొప్ప సరదారులను తన శిబిరమునకు సంధిమాటలనిమిత్తము రమ్మని పిలిచెను. ఆసరదారులు వానిమాటలు సత్యములుగావగచి వానిగుడారమునకు వచ్చి యతఁడు చేయించిన మేజువాణి చిత్తగించుచుండిరి. అంతలో నమీరుఖాను డేరావిడిచి యానలకుఁబోయెను. వెంటనే గుడారము గుభాలున వారినెత్తినిగూలిపడెను. అందఱు ప్రాణావశిష్టులై గిజగిజ తన్నుకొనుచుండ మహారాష్ట్రసైనికులు వారితలలు నఱకి వెలుపలనున్న వారిసేవకులను దుపాకులతోఁగొట్టి చంపిరి.

ఇత్తెఱంగున మానసింగు శత్రుసంహారము గావించి తన దేశము నిష్కంటకముగఁ జేసికొని కృష్ణకుమారిని వివాహమాడ నిశ్చయించుకొనెను. అప్పుడు సింధ్యా "నీకూఁతును మానసింగునకిచ్చి వివాహముచేసినను సరే లేక యన్యులపాలుగాకుండ నామెను జంపినను సరే"యని భీమసింగుతోఁ జెప్పుమని యమీరుఖాను నుదయపురమున కంపెను. కృష్ణకుమారిం దనకిమ్మని వెనుక సింధ్యా భీమసింగు వేడినప్పు డతఁడు నిరాకరించినందున నాఁటిపగ దీర్చుకొనవలయునని సింధ్యా యిట్లుచేసెను. పాపము భీమసింగు కడుపు తీపిచే నట్టిపని యన్యాయమని దారుణమని యెన్నివిధములనో మొఱపెట్టుకొనెను. కాని ప్రయోజనము లేదయ్యె. పిమ్మట నతఁడు తననమ్మిన మంత్రియగు నజితసింగునుబిలిచి యాలోచనచెప్పుమనియె. దురాశాపాతకుఁడు దుస్వభావుఁడు దుర్నీతిపరుఁడునగు నజితసింగు లంచగొండియై యమీరుఖానునొద్దనుండి కొంతధనము స్వీకరించి యీక్రింది విధమున దురాలోచనము చెప్పెను. "మీవారురాజ్యరక్షణనిమి

_త్తము కృష్ణకుమారి చచ్చితీరవలయు. మీరు జగత్సింగునకు గూఁతు నిత్తురేని మానసింగు సింధ్యాప్రముఖులతో దేశమును భస్మీపటలము చేయును. మానసింగున కిత్తురేని బలగర్వితుఁడగు జగత్సింగు దండు వెడలి మీవారు నెత్తుకువరదలుచేయును. కన్యక నెవ్వారి కియ్యక యుం తఃపురమున దాఁచుదురేని సింధ్యా మరాటిమూకలతోఁ గోటచుట్టు ముట్టి పురుషులనెల్లఁ గత్తికి బలియిచ్చి యాఁడువారిని నింతింతయన రాని పరాభవము పాలుసేయును. మన మెటులైనను మనయాఁడువారి గౌరవము గాపాడవలయుఁగదా. కాఁబట్టి రాజ్యముగోల్పోయియ నేకు లిడుమలఁ బడుటకంటె రాజ్యరక్షణనిమిత్త మొక్కతె మృతినొం దుట చాలమంచిది."

అని మంత్రి చెప్పిన సహేతుకమైన యుపదేశమును వినిదుఃఖ ముచేత మతిచెడియున్న రానా యదిలెస్సగానున్నదని యొప్పుకొనెను. కృష్ణకుమారిగతియు నిశ్చయముచేయఁబడెను. కాని యాబాలికను జంపుట చంపింపుమని యుపదేశముచేసినంత సులభముకాదు. రాజక న్యను రాజబంధువులే వధింపవలయును. పరపురుషు లామెం దేటైనఁ జూడరాదుగదా! రాజబంధువులలో రాతిగుండె గలయట్టిపురుషుఁడు దొరకవలయు. చూచిచూచి యాజగన్మోహనవిగ్రహమును చేతులా ర నెవ్వఁడు జంపగలఁడు? ఎట్టకేలకు రానా తనబంధువులలో నొకనిం బిలిచి యాపనిచేయుమని వేఁడెను. ఆతఁడాపలుకులు విని గడగడ వడంకి నిర్విణ్ణహృదయుఁడై "నేనీ ఘోరకృత్యమును జేయఁజాల. ఇంతకంటె నన్ను నామరూపములులేకుండ జంపివేయుఁడని ప్రత్యు _త్తరమిచ్చెను. పిమ్మట రానా తన సవతితమ్మునిబిలిచి యాకృత్యము నిర్వహింపుమనియె. అతఁడును సాహసికుఁడై సరేయని ఖడ్గపాణియై గంభీరముగ నంతఃపురము బ్రవేశించి నిష్కళంకమగు మనస్సుతో దేదీప్యమానప్రభలతో వెలయుచున్న యాలోకైకసుందరిని జూచి

చంపుటకుఁ జేతులురాక కత్తి నేలబారవైచి యేడ్చుచు నామెపాద ములపయింబడి తనవచ్చినపని జెప్పి యామెదగ్గఱ నిలువలేక మరల రానాయొద్దకుఁ బోయెను.

మహాపాతకహేతువై హృదయనిర్భేదకమగు నీఘోరకృత్యము నంతఃపురవాసులెవ్వరుఁ జేయజాలకపోవుటచే రానా రాతిగుండె గలవాని నెవనినైన బయటనుండి పిలుపింపవలయునని తలంచుచుండ నంతఃపురమునందుండు నాడువాండ్రు కొంద ఱాకార్యము జేయుట కొప్పుకొనిరి. దానికి రానాయును సమ్మతింప నాయాడువాండ్రును దారుణములగు కొన్నివిషములను గలిపి యొకగిన్నెలో వేసి సిద్ధము జేసిరి.

ఆబాలికతల్లి తనముద్దులకూఁతునకు జరుగుచున్న మహాపదఁ వమును గన్నులారఁ జూచి యంతఃపురము ప్రతిధ్వనులిచ్చునట్లుదాపున నున్నవారిహృదయములుభిన్నములగునట్లువిలపించుచుండఁ జెలిమికత్తె లుకంటికి నేలకు నేకధారగ నేడ్చుచుండఁ గృష్ణకుమారిమహాధైర్యముతో ముఖము వైవర్ణ్యమునొందకుండభయములేశములేకుండ నంగ ముచలింపకుండ పానకముఁద్రావినట్లా విసమునుద్రావి తల్లిం జూచి "అమ్మా! యేలయేడ్చెదవు. మరణమన్న నాకుభయములేదు. నేను నీకూఁతురను గానా? రాజపుత్రికలు దుఃఖింపఁదగునా! రాచబిడ్డకుసాధారణముగ బలవన్మరణమే కలుగుచుండునుగదా! నన్నింతకాలముబ్ర తుకనిచ్చినందుకే నాతండ్రికినేను గృతజ్ఞురాలనైయున్నా"నని జ్ఞానగర్భితములగు మాటలచేత నూరడించెను. ఆమెశరీరత్వమునుబట్టియో పాళ్ళుసరిగా పడకపోవుటచేతనో యావిసమామెను జంపలేదట. అందుచేతమూడుసారులామెకు విసముకలిపి యివ్వవలసివచ్చెను. ఎట్టకేలకు వారు మఱియొకవిషము తేనెతో గలిపి యిచ్చిరి. ఆమెయది చేతబట్టుకొని చిఱునవ్వునవ్వుచు "సిదిమైననాయంతముజూడకపోవునా" యని

తొలిఁగి నిర్మలముగాఁ గన్నులుమూసినిదురవోయెను. ఆనిదురయే యా మెకుఁ బెద్దనిద్దురయయ్యె.

మంత్రియగు సజితసింగు సంతోషముతో నీవార్త యమీరు ఖానునకుఁ జెప్పగా నతఁడును దారుణమగు నాకృత్యమునకువగచి కాఁ బోలు "ఇదియా రాజపుత్రశౌర్య"మని వానింబరిహసించెను. ఈను వార్త రాజస్థానమంతట వ్యాపించినపుడు ప్రజలందఱు హాహాకార ములు జేసి యతిఘోరమనిరి. ఆవార్తవినినప్పుడేగాక తరువాత ననే కసంవత్సరములకుగూడ రాజబంధువులు లోకులుకృష్ణకుమారిమాట జ్ఞప్తికివచ్చినప్పుడు గోలుగోలున నేడ్చుచువచ్చిరి. మందభాగ్యుఁడగు రాణాదుర్మంత్రి సమేతుఁడై నిశ్చేష్టుఁడైకొలువుకూటమున గూర్చుం డియంతఃపురమున జరిగిన దారుణ వృత్తాంతమును వినియెను. తనకు గూఁతురుతోడిదే లోకమని యామెతల్లి మరల నన్నముముట్టక నీరు ద్రావక స్వల్పకాలముననే కృష్ణకుమారిం గలుసుకొనెను. రాణా జీవ చ్ఛవమై దారపుత్రులం గోలుపోయి కూఁతుంజంపించిన దురాత్ములతో గలసి బ్రతుకవలసివచ్చె రాణిమరణమును కూడ విని విలపించు చున్న రాణావద్దకు సుక్తావతుల నాయకుఁడగు సంగ్రాముఁడనువాడు వచ్చి రాజునకెప్పటి మరియాదలు సేయక నిర్లక్ష్యముతో రాజసింహా సనముకడకుఁబోయితలవంచినమస్కారమైన జేయకయీవిధంబునబలి కెను. "హాసిటికిపంద! రాజవంశమునకు శాశ్వతమైనయప్రతిష్ఠఁదెచ్చితివి ఈవఱకెన్నఁడు మనకులమునకు కళంకమురాలేదు. పాతకుఁడవగు నీక తమున గొప్ప మచ్చగలిగినది. ఈమచ్చయెన్నటికి మాయదు. బప్పరా వులవంశమింక నాశనమగును. దేవతలుమనమీదమహాగ్రహముచిత్తులై యున్నవారు. ఇంక మనకు జయములేదు" అని గజగజవడం కుచున్న యారాణానువిడిచి మహాపాపాత్ముఁడగు మంత్రినుద్దేశిం చిదురాత్మా! నీవు రాజపుత్రకులమునతప్పఁబుట్టితివిరా! నీతలగొట్టఁచీ! నీబ్రతి

తుకెందుకురా! నీవంశమునిర్మూలమగుగాక నీపేరునశించుగాక ఏమంత యాపదవచ్చెనని యింతపని జేయించితివిరా? తురకలు మనకోటగుమ్మముకడకువచ్చి ముట్టడించిరా? శత్రువుఁడంతఃపురముబ్రవేశించెనా! మనపెద్దలీవిధముగానే గౌరవముకాపాడుకొనిరా! పూర్వముచిత్తూరుముట్టడించిన పగతురను మనపూర్వులిట్లేచేసిరా! ఛీఛీ మీరురాజపుత్రులుగారు. రాజపుత్రుడైనవాడు ఖడ్గపాణియైరణరంగమున జావవలయు నంతఃపురస్త్రీలగ్నిహోత్రమునంబడి మ్రగ్గవలయు అట్లుగాక దేశము నెమ్మదిగనున్నప్పుడెవఁడోయొక యపాత్రుఁడుచెప్పినాఁడనినోరెఱుంగని పసిబాలికను నిష్కారణముగ జంపింతువా! శూరులమైరణమునమనముమ్మృతినొందినచో దైవానుగ్రహమున మనవంశములుండును. ఇంక మనవంశములుండవు"

అనిసింహనాదముతోఁ దూలనాడి యవ్వలకుఁబోయెను. రాణా గాని వానిమంత్రులుగాని యాశూరశిఖామణి కెదురుమాటాడఁజాలక పిల్లులవలెనొదిగియుండిరి. కాలక్రమమున వానిమాటలక్షరాలజరిగెను. ఈదారుణకృత్యముజరిగిన కొన్నివారములకే మంత్రికొడుకు లిద్దఱు భార్యయు నాకస్మికముగ మృతినొందిరి. లోకు లజితునికాకులుబొడిచినట్లు జొడిచి నిందించుటచే లోకాపవాదము బడనోపక యతఁడు బైరాగివేషము వేసుకుని పాపపరిహారమునకుఁ బోవుదునను వంక బెట్టి యొకపుణ్యక్షేత్రమునుండి మఱియొకపుణ్యక్షేత్రమునకుఁ బోవుచుఁ దిరుగులాడఁజొచ్చెను. కొన్నినాళ్ళట్లు తిరిగి మరల దేశమునకు వచ్చి తన యెప్పటి కుట్రలు ప్రారంభించినతోడనే రాణా వానిని దేశమునుండి సాగదోలెను. రాణాకితరసంపత్తి యేదియులేకపోయినను పుత్రసంపత్తి మెండుగగలదు. ఈయనకు తొంబదియైదుగురు బిడ్డలుండిరఁట. అందులో నాతని కన్నులముందరనే తొంబదియిద్దఱు కడతేరిరఁట. ఆమిగిలినమువ్వురిలో నిద్దఱు కూఁతులు నొకకొడుకు

నుండిరి. అక్కడ మానసింగు గతియునట్లే యుండెను. అమీరుఖాను వానిని నానాబాధలుపెట్టి వానిముఖ్యమిత్రుల నిద్దఱజంపి మన స్థిమితము లేకుండఁ జేసెను. మరాటిమూకలువచ్చి దేశమును దోఁచుకొనజొచ్చెను. ఈసిలుగులు బడలేక మానసింగు రాజ్యము కొడుకునకప్పగించి తానన్ని వ్యవహారములు మానుకొని సుఖముగ గూర్చుండెను. అతని కుమారుఁడు స్వల్పకాలమే రాజ్యమేలి యవమానకరమగు మరణమొందెను. మానసింగునకు మతిపోయెను. పందొమ్మిదవశతాబ్దప్రారంభమున నింగ్లీషువారు మారువారును వశపరచుకొని రాణాకు సహాయము జేసిరి. మానసింగు వారిసహాయము వడసి తన పూర్వపు శత్రువులనందఱ బరిమార్చి దేశస్థులందఱకు విరోధియై దేశమును బాధుజేసెను. జగత్సింగుచరిత్ర వర్ణించుటకు సయితము సిగ్గగునట్లుండెను. కర్పూరసారమను పేరుగల యొకతురకపడఁతి నుంచుకొని రాజ్యము జంగములు చిల్లరదుకాణదారులు మొదలగు నీచులకప్పగించి దానిపొత్తులుమరిగి యదేస్వర్గము మోక్షమని దానిని రాణిఁ జేసి నాణెములమీఁద దానిపేరు ముద్రింపించి లోకమునే మరచి వర్తించెను. ఎట్టకేలకు సరదారులందఱు వానిచేష్టలకు విసిగి వాని యుంపుడుకత్తెను బట్టుకొని చెరలోఁబెట్టిరి. అనంతర మాకులట వార్ధకముచేత మృతినొందెనో లేక సరదారులే వెనుక తమకదిగావించిన యవమానములం గలంచి కడతేర్చిరో తెలియదుగాని యది మొదలామెచరిత్ర మడుగంటినది. జగత్సింగు పదునేను సంవత్సరములేకవిధముగా దుష్పరిపాలనము జేసి పరలోకగతుఁడయ్యెను. అతఁడు పోయిన చాలసంవత్సరములకు వానిభార్యలలో నొకతె యొక కొడుకును గనెను. ఆతని జన్మమునుగూర్చి రాజబంధువులు చాలశంకించిరి. కృష్ణకుమారి జనకుఁడు నామెను వరింపఁదలఁచిన రాజకుమారులు తుదకీ విధంబునైరి.

# నూటతొంబది గుణములుగల జయసింగు

మీవారు బూందీసంస్థానముల కుత్తరమునను మారువారు బికనీరుసంస్థానములకు బడమటను జయపురసంస్థానము గలదు. దీనినే కొండ అంబరుసంస్థానమనియుఁ గొందఱు ధూనేథారుసంస్థానమనియు జెప్పుదురు. ఆసంస్థానమేలు రాజపుత్రులు కచ్ఛవాహులు. ఈశబ్దమునకు వారిభాషలోఁ దాబేలని యర్థము. వారు బాహుబలమందుఁ దక్కిన రాజపుత్రులకుఁ దీసిపోవుటచే స్వబంధువులకు వారియెడ గౌరవ మించుక తక్కువ.

పూర్వ మంబరు రాజగు భగవానుదాసుతురకలనిసందేహింపక ఢిల్లీ మొగలాయీచక్రవర్తులకు దన గూతుఁ నిచ్చి వివాహము జేసెను. తురకలతో వియ్యమందిన రాజ పుత్రులలో నితఁడే మొదటి వాఁడు అతని దత్తపుత్రుఁడు మానసింగు భగవానుదాసునసంతరమున సింహాసనమెక్కెను. అక్బరు పరిపాలనముం దితనిపేరు తఱుచుగ వచ్చుచుండును. ఇతఁ డక్బరుచక్రవర్తికి నమ్మినబంటై సోదరుని మీఁద దిరుగఁబడి ధ్వజమెత్తిన యక్బరుతమ్ములలో నొకనినిజయించుట దిరుగబడిన పటానులను లొంగదీయుట మారువారుప్రభువగు ప్రతాపసింగుతో నక్బరుపక్షము జేరి పలుమారు పోరాడుట మొదలగునుపకారములఁ జేసి, బంగాళము, బేహారు, దక్షిణదేశము, కాబూలు మొదలగుదేశములకు నక్బరుచేతఁ బ్రతినిధిగా నియమింపఁబడి తన యేలికకుఁ జాల నమ్మికగలుగునట్లు బాలించెను. ఇవ్విధంబున తన యనుగ్రహము సంపాదించిన మానసింగు నధికారముజూచి యోర్వ లేక యక్బరొకమారు వానిం గడతేర్పఁదలఁచి మిఠాయిలో విషము గలిపించెననియు నది మానసింగున కిప్పించుటకు బదులుగా బొర

పాటున దానే తిని మృతినొందెననియు నొకకట్టుకథ గలదుగాని యది నమ్ముటకు వీలులేదు.

1615 వ సంవత్సరమున మానసింగు మృతినొందెను. ఇతనికాలమున నంబరుసంస్థాన మనేకయాపదలు గడచి స్థిరమయ్యెను. అతని యనంతరమున రాజ్యమునకువచ్చిన యిరువురురాజులు మిక్కిలిపరి యోజకులై ఢిల్లీదర్బారులోఁ దమకుగల గౌరవము పోగొట్టుకొని మారువారు రాజుల పాలు జేసిరి. అందుచే స్వబంధులగు కచ్ఛవాహులు వారిపై నలిగిరి. అప్పుడు జహంగీరు ఢిల్లీచక్రవర్తిగనుండెను. అతని భార్యలలో నొక్కతె బికనీరుప్రభువుల యాఁడుపడుచు. ఆమెపేరు జోదుభాయి. ఒకనాఁడు చక్రవర్తి జోదుభాయింగూడి మేడమీఁద నిలిచియుండ మానసింగుయొక్క మనుమఁడు జయసింగనువాఁడుక్రింద నడచిపోవుచుండెనట జోదుభాయి వానిని మగనికి జూపి యంబరు రాజ్యము వానికిమ్మని బ్రతిమాలెను. జహంగీరు పట్టపుదేవిమాట దిరస్కరింపలేక సరేయని "ఓ యంబరురాజా నీకు రాజ్యమిచ్చితి రాజ్యప్రాప్తికిఁ గారణమైన యీజోదుభాయికి జోహారు (సలాము) సేయు" మని వానిని బలుకరించెను. రాజపుత్రపురుషుఁడు ప్రాణముపోయిననుసరే స్త్రీకి సలాము జేయఁగూడదని యొకయాచారము గలదు. తలపనితలంపుగాఁ దనకుగొప్పరాజ్యము చేబడినందుకు జయసింగు మిక్కిలి సంతసించుచుండియు దన కులాచారవిరుద్ధముగ నామెకు నమస్కరించుట కిష్టపడఁడయ్యె. అంతియగాక యతని మతమున జోదుభాయి స్వచ్ఛమగురాజపుత్రవంశమున బుట్టి గోహంతకు డగుతురకను బెండ్లియాడుటచే బాత్రిగా వందనమున కర్హురాలుగాదు ఈరెండుకారణములను లోఁదలంచిన చక్రవర్తికి సలాముచేసి ధైర్యగాంభీర్యములతో "స్వామీ మీయంతఃపురముననున్న యేస్త్రీకైనను నమస్కరించెదను; కాని బుట్టినపోయినను జోదుభాయికిమాత్రము

సలాము చేయ" నని పలికెను. రాజపుత్రుల యాచారముల చక్కఁగా నెఱిఁగినదగుటచే జోదుభాయి వాని పైనలుగక గొప్పరాజ్యము ప్రాప్తించినను స్వకులధర్మమువిడిచిపెట్టని బంధువుఁడు తనకొక్కఁడైనను న్నాఁడని పైపెచ్చు లోలోపల సంతసించి వానిమాటలకుఁజిరునవ్వు నవ్వి "పోనీ నాకు సలాముచేయకపోయిననుస రేనీకంబరురాజ్యమిచ్చి తిని పుచ్చుకొమ్మని మేడమీఁదనుండి మెల్లగఁ బలికెను.

అట్లు సింహాసనమెక్కి జయసింగుతన్నేర్పరచినవారికి సంతోషకరముగా బాలించి చక్రవర్తికిననేకోపచారములుచేసి యంబరుసంస్థానమేలినప్రభువులలోనగ్రగణ్యుఁడనిపించుకొనెను. అతఁడౌరంగజేబునకుఁ జేసినయుపకారము లనేకములుగలవు. అతనికి బరమశత్రువై హృదయశల్యమటులుండిన శివాజీయును మహారాష్ట్రప్రభువును జయసింగు పట్టి యప్పగించెను. ఔరంగజేబు తనయధీనమందున్న శివాజీని జంప బ్రయత్నించుచున్నట్లువినిశివాజీనిబారిపొమ్మనిదానికిందగినవీలుగలుగఁజేసెను. ఇతనికి మీర్జారాజాయనిచక్రవర్తిబిరుదిచ్చెను. ఇతఁడు తనరాజధానియగు నంబరుపట్టణము మునుపటికంటెనెంతోయందముగానుండునట్లుచేయదలంచియొకసరోవరముత్రవ్వించి దానిచుట్టుపూవుదోటలు వేయించి తనపూర్వికుఁడు కట్టనారంభించిన యంతఃపురమును ముగించి యొకగొప్పకొలువుకూటమును గట్టించెను. దీని కేదివానుఖానాయని పేరు. దీనిలో నెఱ్ఱరాళ్ళస్తంభములు గట్టబడియున్నవి ప్రతి స్తంభముమీఁద మనోహరములగు విగ్రహములుచెక్కబడియున్నవి. అనేకు లిప్పటికి నానగరమునకుఁబోయియాకొలువుకూటముఁజూచి సంతసించుచుందురు. ఆకొలువుకూటము జహంగీరుకాలములోనే ముగిసెను. ఈజయసింగు ముగ్గురు చక్రవర్తులకాలములోనుండెను. అందుచే ముగ్వురసంబంధములైన కథలువచ్చుచుండును. ఆకొలువుకూటము ముగిసినతోడనే జహంగీరువద్దకుగొందఱుపోయి జయసింగుగొప్పదివా

గుణముల జయసింగు రాజ్యమునకు వచ్చునప్పటికి బొత్తిగ పేరులేక యుండెను.

ప్రస్తుత మంబరు సంస్థానమునకు రాజధానియై జయపురము నుగట్టించిన మహావీరుఁ డీనూటతొమ్మిది గుణములుగల జయసింగే ఆనగరముయొక్క యందమును జూచినవారందఱు స్వర్గములో నొక భాగమేమోయని తలంపకమానరు. ఆపురమధ్యమున గులాబిరంగు గాలిమేడయనన్యసామాన్యమగునట్లు జగదద్భుతముగగట్టించిన శిల్ప శాస్త్రవేత్తయితఁడే. ఒకశత్రువుమీఁద నింకొక శత్రువునుంబురికొల్పి యిరువురగతులు జాగ్రత్తగాఁ గనిపెట్టి వారియుచ్చనీచదశలవల్ల తాను లాభము నొందుచున్నట్లె జ్యోతిశ్శాల నొకదానిని నిర్మించి యనేకయంత్రములు తెప్పించి యాకాశముమీఁద సంచరించు గ్రహముల మార్గములంగనిపెట్టుచు నిరంతర మంకెలంగుణించుచు మహానందము నొందుచుండును. జ్యోతిశ్శాస్త్రమం దీయనకుఁగల పాండిత్యము ప్రీతి యింతింతయని చెప్పనలవిగాదు. ఆసంస్థానమునకుఁ బూర్వరాజధానియగు నంబరుపట్టణమునువిడిచి తనపేర జయపురమను పట్టణము గ్రొత్తగా గట్టుకొని యందుఁగాపురముండునతఁడు పూర్వ రాజధానిమీఁదఁ యభిమానమువిడువకయక్కడ పూలతోటలో స్ఫటికశిలామందిరము గట్టించి గోడలలోనడుమనడుమ నిలువుటద్దములు వేయించి మొదట జయసింగు చేసిన యలంకారమునకు వన్నె దెచ్చెను.

ఈజయసింగు పయినచెప్పిన విష్ణుసింగుయొక్క కుమారుడు. ఈవిష్ణుసింగున కిద్దఱు భార్యలుండిరి. అందొక భార్యకుమారుఁడు విజయసింగు ఒకరాజున కిరువురు భార్యలున్నపుడు వారికిఁ గుమారులున్నప్పుడు సాధారణముగ రాజాంతఃపురముల నాశిశువులకు క్షేమముండుట యరిది. బహుభార్యలున్న రాజుల యంతఃపురములలో రాజపుత్రులకు బాహ్యశత్రుబాధలకంటె నంతశ్శత్రుబాధలే యధి

కముగ నుండును. అందుచేత విజయసింగు తల్లి సింహాసనమును గూర్చి యెప్పుడో యొకప్పుడు వివాదములు రాకమానవనియు వచ్చినప్పుడు తనకుమారునకు సేమముండదనియు గ్రహించి తనకుమారుని పుట్టి నింటికంపెను. కాలక్రమమున విష్ణుసింగు మృతినొంద దగ్గరనున్న జయసింగే సింహాసన మెక్కెను. జయసింగు గద్దెయెక్కిన కొన్నినాళ్ళకు విజయసింగు వానియొద్ద కొకరాయబారి నంపి వానిచేత నిట్లు సందేశమంపెను. "మనమిద్దర మొకతండ్రి కుమారులమగుటచే వాని యాస్తి నాకుంగూడ రాదగినుగదా. అందుచేత నాభరణము నిమిత్తము బుస్వాపరగణా నాకిమ్ము" ఆసందేశము విని జయసింగు చిరకాలమునుండి తనసోదరుని వార్త తెలియకపోవుటచే వానికోరిక సంతోషముతోం దీర్చదలంచెను. కాని యంతలో పిడుగువంటి వార్త వానికి దెలియవచ్చెను. ఢిల్లీదర్బారులోనున్న ప్రియమిత్రు డొకడు నీరక్తస్పర్శగల బంధువుం డొకడు నిన్ను రాజ్యభ్రష్టునిం జేయదలంచుచున్నాడు. కావున మిక్కిలి జాగరూకతతో నుండుమని వర్తమానమంపెను. విజయసింగు వినయముతో జయసింగునకు సందేశము లంపుచు గుటిలుండై ఢిల్లీ ప్రవేశించియంబరు సంస్థాన పరిభుత్వమును సంపాదించుటకుబ్రయత్నించుచుండెను. వానితల్లి యంతఃపురములో నుండియే కుమారునిం బురికొల్పుసందేశములంపుచు దగుసహాయము చేయుచుండెను. విజయసింగుతల్లి పంపిన వెలలేని నగలు కానుకలిచ్చి కమారుద్దీనుఖానుయొక్క యనుగ్రహము సంపాదించెను. ఈకమారుద్దీనునకు జక్రవర్తివద్దమిక్కిలి చనువుండెను. తనసోదరుని రాజ్యభ్రష్టుని జేసినపక్షమున గావలసినంతధనము నైదు వేలగుఱ్ఱము లిచ్చునట్లు వాగ్దానము చేసెను. కమారుద్దీను దానికొప్పుకొని చక్రవర్తి యంగీకారమును గూడ బడసి వలసినదస్తావేజులు పట్టాలు వ్రాయించి సైన్యమును సిద్ధముచేసెను. ఆవార్త జయసింగు విని

మంత్రియాలోచన మడిగెను. అతఁడు చక్కఁగా విచారించి "మన శాస్త్రములలో శత్రుసాధనమునకు సామదానభేదదండములనియెడు నాలు గుపాయములున్నవి. ఇందులో నేదోయొకటి మనము బ్రయోగింపవలయు. దండము మనము సేయలేము సామము వ్యర్థము. దానమువారు గ్రహింపరు, గావున భేదోపాయమే యుత్తమమయినది. "వజ్రంవజ్రే సభిద్యతే" యన్నట్లు మోసగాడు మోసముచేత పడిపోవు"నని రాజునకు విన్నవించెను. జయసింగు యుద్ధమునందు మంచిపేరు సంపాదించలేదు. రాజనీతిలోనో యుగంధర చాణుక్యులవంటి నయసాలి. అందుచే జయసింగు మహావీరులగు పంజ్రాలు తెగల రాజపుత్రులను బిలిపించెను. వారిలో నగ్రగణ్యుఁడు మోహనసింగు అతఁడు కూషూసంస్థానపరిభువు. సాధావతుల తెగలోనివాఁడు జయసింగు, మోహనసింగుప్రముఖులగు వీరులతో నిట్లనియె. చూచితిరా నాయవస్థ యెంతవఱకు వచ్చినదో మీరు నన్ను గద్దెయెక్కించిరి నాసోదరుఁడువిజయసింగు బూస్వాతాలూకా పుచ్చుకొని సంతుష్టుఁడగుటకునంగీకరింపకమారుద్దీనుఖాను బలవంతముగవానికి నాసంస్థానమిప్పించెదనని బురికొల్పుచున్నాడు. చేయవలసిన పని చేయుఁడు."

ఆపలుకులు విని యమ్మహావీరులు జయసింగునకుఁ గావలసిన సహాయము చేయుదుమని యైకకంఠ్యముగఁ బలికి "నీకార్యభారమంతయు మామీదవదలుము. ఈయపాయము మేము తప్పించెదము బుస్వాసంస్థాన మెప్పటికయిన విజయసింగున కీయవలయుసుమా" యని కార్యాలోచనము పేరుగ నుపదేశించిరి. వారియుపదేశము విని "బుస్వాసంస్థానము మీరెప్పుడిమ్మన్న నప్పుడు మాసోదరున కిచ్చెదను. అది విజయసింగుదే, మీకనుమానమెందుకు. ఇదిగో పట్టానిప్పుడే వ్రాయుచున్నా"నని వ్రాసి ఘోరప్రమాణము జేసి కొలువుచాలించెను. ఆవీరులు స్వగృహమునకుఁబోయి కర్తవ్యము విచారించుచుండిరి.

ఆ రాజపుత్రులంతయుఁ దమలో తామాలోచించుకొని విజయసింగునద్ద కొక రాయబారి నంపిరి. "నీవివాదము పరిష్కరించుకొనుటకు మావద్దకురమ్మని బుస్వాతాలూకా నీకిప్పించెదము. జయసింగు నీకదియిచ్చునట్లు వాగ్దానముచేసె నతఁడు మాటతిరుగఁడు" కాని విజయసింగుగూడ కచ్ఛవాహవంశజుఁడే గావున సోదరునిమాట నెంతవఱకు నమ్మవచ్చునో యెఱుఁగును అందుచేత నతఁడు "నాకపాయములేకుండునట్లు తగినయేర్పాటులు మీరు చేయనిపక్షమున నేను మాసోదరుని నమ్మి జయపురములో నడుగుపెట్టను అట్టువైపుచూడ" ననివారికి బ్రత్యుత్తరమంపెను రాజపుత్రవీరులు బండెఱ్ఱింగురు భయముపడవలసిన యవసరము లేదనియుఁ దమమాటమీఁదనచ్చిన తమకుటుంబములు పండెఱ్ఱింగు వానికంగరక్షగా నుండుననియు జయసింగు చేయరానిపని యేదైనఁ జేయునేని వానిని రాజ్యహీనునిజేసి విజయసింగునే సింహాసనమెక్కింపఁ బ్రయత్నము జరుగుననియు మరల సందేశమంపిరి. విజయసింగు వారిమాటమీఁద సంబరుసంస్థానమునకుఁ బోయి బుస్వాతాలూకా గ్రహింపఁదలఁచి పోవుటకు సెలవిమ్మని కమారుద్దీనును కోరెను కాని వానికంత యిష్టముగ లేకపోయెను ఎందుచేతనన కచ్ఛవాహులు తమలాభమును జూచుకొని స్వకార్యసిద్ధికొఱకు వాగ్దానములుచేసి కార్యాంతరమందు విసర్జింతురని యాతురకమంత్రి యెఱుఁగును ఎట్లెగియు విజయసింగు పోవనిశ్చయించుటచేతను పండెఱ్ఱిందుగురు రాజపుత్రుల సహాయమున నొకవేళ సంబరురాజ్యమే తన మిత్రునకు వచ్చిన రావచ్చుననియు లోనెంచి కమారుద్దీను విజయసింగు పోక కనుమతించి యాఱువేల గుఱ్ఱపుదళమును దర్బారులోనున్న యిద్దరు సామంతులను వానికి సాయమిచ్చి పంపెను ఆయిద్దరిలో మునుపు జయసింగునకు రహస్యముగ వర్తమానమంపిన మిత్రుఁడొకఁడుండెను కమారుద్దీను వానిసంగతి నెఱుగడు.

ఈనడుమ జయసింగు తమ్మునిమీఁద నెక్కడలేనియనురాగమును బూనివానిరాక నెంతో ప్రేమతో నెదురుచూచుచుండెను అతఁడంబరుపట్టణములోనే మొదట విజయసింగును గలసికొనఁదలచెను కాని సోదరుఁడొప్పుకొనకపోవుటచే నచ్చోటుమాని కూమూగ్రామమున గలసుకొనఁ దలచెను ఈయూరు నాథావతుల ప్రభువగు మోహనసింగునకు రాజధాని ఎందుచేతనో జయసింగు కూమూగ్రామమున గలసికొనుట కిష్టపడక మరల సంగనేరుగ్రామమున గలసుకొనఁగోరి సోదరునక్కడకు రమ్మనియెను ఆయూరు జయపురమునకు నైరుతిభాగమున మూఁడుమైళ్ళదూరములో నున్నది విజయసింగక్కడకు సపరివారముగ వచ్చియుండెను.

జయసింగు సంగనేరునకు బోవుటకు బ్రయాణసన్నాహముచేసికొని దర్బారులో గూర్చుండ వానిమంత్రిప్రవేశించి యిట్లనియె "మీసోదరులిద్దరు పాతపగ లడంచుకొని సంధిచేసికొని మిత్రులై యుండగా మీయమ్మగారు కన్నులపండువుగామిమ్ముంజూడ దలఁచుచున్నారు మీసెలవైనచో నామెగూడ సంగనేరు వత్తునని మీతో జెప్పుమన్నారు" అనిమంత్రివిన్నవింప జయసింగుమహారాజు మిక్కిలివినయముతో "నామిత్రులుపంద్రెండుగురయిష్టముకానినాయిష్టముగాదనిచెప్పెను అనవుడు నాపండ్రెండుగురు పెద్దది కన్నులపండువుగా జూచునప్పుడు మనకాటంకమేమున్నదని యందుకొప్పుకొనిరి అప్పుడు రాజమాత పల్లకిబయలుదేరెను ఆపల్లకివెంట మూఁడువందలగవిసెనబండ్లు బయలుదేరెను మార్గమధ్యమున వేనవేలుజనులు గుంపులుగూడి "యాపల్లకిలో రాజుగారితల్లి యున్నది ఈబండ్లలోనివారు దాసదాసీజనంబు" లని చెప్పుకొనుచు విస్మయముతోఁ జూచిరి వారివెనుక జయసింగు వానిమంత్రిలు రాజపుత్రిలు పండ్రెండుగురు తక్కిన పరిచారకులుబయలుదేరి వెళ్ళిరి సంగనేరు జేరినబిదప జయసింగు మొగమున చిరు

నవ్వుదోప సోదరునత్యంత ప్రేమతో గాఢాలింగనము చేసికొని యా
నందబాష్పములు విడిచెను అచటజేరినవారందఱు వానిభ్రాతృవాత్స
ల్యమునకు వీనిసౌజన్యతకుఁజాలసంతసించిరి ఆసమయమున జయసిం
గుసోదరునితో నిట్లనియె "తమ్ముఁడా బూస్వాతాలూకానీకు పుత్రి
పౌత్రిపారంపర్యమనుభవించుట కిచ్చుచున్నాను ఇదిగోపట్టా నీవింత
తో దృప్తినొందక రాజ్యము నాతోసమానముగా బంచుకొనదలఁతు
వా. నాకదియు నిష్టమే లేదా నీవేయంబరుసంస్థానప్రభువుగాదలంతు
వా యదియునుమేలే నేనే బుస్వాతాలూకాపుచ్చుకొని నీకుపట్టముగ
ట్టిపోదును మనకిరువురకుమాత్రమువైరముద్దు" అనిపలికిన జయసింగు
పలుకులు వినినతోడనే విజయసింగు సోదరునకుఁదనపైఁగల ప్రేమను
దలంచి తనకంతప్రేమలేనందుకు సిగ్గుపడి నోరెత్తలేక "నాకు బుస్వా
తాలూకా చాలును మఱియేమియు నక్కరలేదని ప్రత్యుత్తరము
చెప్పెను.

అట్లు చిరకాల దర్శనములచేత మహానందభరితులైనసోదరులం
జూచి యాసభికులు సంతుష్టులై వారింబ్రశంసించుచుండ నంతలో జ
యసింగుమంత్రి యక్కడకువచ్చి "అమ్మగారుమీయిరువురంజూచుట
కు మిక్కిలి వేడుకపడుచున్నారు మీరిరువురా మెకడకునత్తురా? ఆమెనే
యిక్కడకు రమ్మనెదరా" యని యడిగెను జయసింగు సభవారివం
కజూచి "మీయిష్టమెట్లో యట్లుచేయుఁడు మమ్మక్కడకుబొమ్మన్న
చో బోదుము. లేదా మీరావలకు బోయినపక్షమున నామె నిటకే
రప్పింతు"మని పలికెను. సభవారు రాజమాత నక్కడకు రప్పింపఁ
గూడదనియు వీరే యామెకడకుఁబోవు టుచితమనియు నైకకంఠ్య
ముగ పలుక సరేయని జయసింగు విజయసింగును జేయిపట్టుకొని స్త్రీ
లున్న బసకుఁ దోడ్కొనిపోయెను. ఆబస ప్రవేశించినతోడనే జయ
సింగు తనమొలలోని కత్తినూడఁబెఱికి "ఛీ! మాతృదర్శనమునకుఁ

బోవునప్పుడు ఖడ్గమెందు" కని ద్వారపాలకుని జేతికిచ్చెను జయసింగు దీసినప్పుడు తానుఖడ్గము దీయకపోవుట మంచిదికాదని విజయసింగు గూడ తనకత్తినావలబారవేసి డేరాలలోని కరిగెను. వెంటనే గుమ్మ కముకడ కాచియున్నమంత్రి ద్వారముబంధించెను విజయసింగు లోని కరిగినతోడనే వానికడకెవ్వరోవచ్చి రెండుచేతులు మెడకుఁజుట్టి యా లింగనము చేసికొనిరి ఆహస్తములు తల్లిహస్తములుగావు ఇనుపగడి యలవంటి మోటచేతులు ఆకౌఁగిలింతనుండి విజయసింగు తప్పించుకొ నుటకు గిజగిజ తన్నుకొనియెను వానిపట్టు విడిపించుకొనలేదు. కేక లువేసి తనవారిని బిలుచుటకు నోరురాలేదు పల్లకిలోఁగూర్చుండి వ చ్చినరాజమాత భట్టిసంస్థానప్రభువేకాని రాజమాతగాదు అతఁడేనుఁ గవంటివాఁడు వానిముందర విజయసింగు చేయునదిలేక పిల్లివలెనుండ వాఁడతనిని గాలుసేతులుఁగట్టి తనపల్లకిలో బడవైచి తానందుగూ ర్చుండి పల్లకి యంబరుపట్టణమునకుఁ బట్టించెను వానివెనుక నెప్పటి యట్లు గవిసెనబండ్లు మూఁడువందలు బయలుదేరెను మార్గమధ్యమున వారింజూడవచ్చిన జనులు మొదటిపల్లకి రాజమాతదనియుఁ దక్కిన బండ్లు దాసదాసీజనంబులవనియుఁ దలంచిరేకాని యామొదటిపల్లకి లో కాలుసేతులు బంధింపఁబడిన విజయసింగును బట్టుకొని భట్టియా రాజుండెననియు మూఁడువందల బండ్లలో నినుపకవచములు దొడిగి కొనిన మహావీరపురుషు లుండిరనియు నెఱుంగకపోయిరి.

జయసింగు వాఱందరంబరుపట్టణముఁ జేరువఱకు నాగుడారము లోనేయుండి విజయసింగు నిర్బాధకముగ నంబరుపట్టముజేరి యచ్చ ట కైదీయైయున్నవాడని విని యాడేరావిడిచి కొంచెఅంగరక్షకులతో గలసి తనసభికులయొద్దకు వచ్చెను. అతఁడొక్కఁడేవచ్చుటజూచి యా సభికులు తెల్లబోయి యొకరిమొగము లొకరుజూచుకొనియెట్టకేలకు విజయసింగెక్కడనున్నాడని యడిగిరి. ఆమాటలువిని జయసింగు విజ

యసింగా! నాకడుపులో నున్నాఁడు మేమిరువురమువిష్ణుసింగు కుమా రులము. అందునేను జ్యేష్ఠుఁడను గావున నాకుమీరు రాజ్యమిచ్చిరి. వానిని రాజుజేయఁదలంతురేని నన్నుఁ ముందు జంపియటుమీఁద జే యుఁ డని వాఁకిప్రత్యుత్తరమిచ్చియంతతోఁబోకవారేమనుకుందురో యని సందేహించి మరల నిట్లనియె "నేను మీక్షేమముకొఱకే యి ట్టిద్రోహము జేసితిని చూచితిరా విజయసింగు మొగలాయిసేనదెచ్చి యెదురొమ్ముమీఁదకుంపటిలాగు మనదేశములో నిలిపినాఁడు అతఁడా సేనను మనమీఁదికి నడపెనా మీరందరు జావవలసియుండును." ఆప లుకులు విని యాపంద్రెండుగురు రాజపుత్రులుతక్క నసభికులుని శ్చేష్టు లై నిష్కారణముగా తమమాటలునమ్మివిజయసింగుదురవస్థపాలయ్యె నని విచారించి రాజుస్థితి మిక్కిలియుచ్చదశలోనుండుటచేవాని నేమను టకదిసమయముగాదని మారువల్కక తొలంగిపోయిరి. అనంతరము జయసింగు చేయవలసినపని యింకొకటుండెను. అదియేదియనసోదరు నకు సాయముచేయవచ్చిన మొగలాయిసేనను వచ్చినదారినే పంపుట

ఆ మొగలాయి సేనల కధిపతి విజయసింగువార్త దెలియక య తఁ డెక్కడనున్నవాఁడని జయసింగు నడిగెను. "ఆసంగతి నీకెందుకు మీఁడ్జేరాలు విప్పుకొని తక్షణమిచ్చుటనుండినడుపుడు. లేనిచో గుఱ్ఱము లను హరించి బుద్ధిచెప్పి పంపించెద" ననివానిప్రశ్నకుజయసింగుబదు లుచెప్పెను. మొగలాయీసేన యామాటలువిని విజయసింగుకర్మము విజయసింగున దని తమమూఁటముల్లెలుగట్టుకొని బయనమై పోయెను. విజయసింగుగతి యేమయ్యెనో యెవరికిం దెలియదు జయసింగును గు రించి జనులుచెప్పుకొను నూటతొమ్మిది కథలలో నిదియొకకథ.

ఇవ్విధంబున రాజ్యంబున సుస్థిరుఁడై యదివఱకు రాజపుత్రసం స్థానములలో మిక్కిలి తక్కువదశలోనున్నయంబరుసంస్థానమునుజాల వృద్ధిపఱచుటకు సంకల్పించెను. ఇంతకుపూర్వము దాని వైశాల్యముత

కు_వగనుండెను. మొగలాయీలుదానిపడమటిభాగమునుజాలవఱకు కలుపుకొనిరి. అంతకుమున్నుబంపరురాజునకు గప్పముగట్టుచు లోబడిన సిఖావతువంశస్తుడగు నొకరాజు స్వతంత్రుడయ్యెను అంబరులోనున్న పండ్రెండుగురు చిన్నసంస్థానాధిపతులుతక్కినరాజపుత్రులవలె ప్రతిష్టలుగాంచక పేరులేకుండిరి. మీవారురానావద్దసామంతుడై సేనాధిపత్యముచేయు సలుంబ్రాయనునతడే యంబర రాజుకంటె గొప్పవాడై యుండె ఇంకతక్కిన రానాలు గొప్పవారని వేరెజెప్పనేల పైసంగతులన్నియు జక్కగా గ్రహించి జయసింగు చల్లగా తన రాజ్యము వృద్ధిచేసికొనుట కారంభించెను. అతడు గుండెలుతీసినబంటు నీతికి నతనికి వేయియామడ దూరము అతనికి దనజాతి రాజపుత్రుడన్న యభిమానములేదు. అన్యజాతివాడు నన్యమతమువాడు నగుతురకమీద ద్వేషము లేదు. అనవసర గుగునపు డిద్దరియందు సమాన ద్వేషమే. ఇరుగుపొరుగురాజులెంత యాపదలో నున్ననుసరే యతడు తనలాభము జూచుకొని యాసమయములో వారివద్ద నేదో గొంతయాస్తి సంగ్రహించును. ఔరంగజేబుతో రాజస్థానప్రభువులుచేసినముప్పదియేండ్లయుద్ధములో జయసింగుచెక్కుచదరకయెవరిపక్షము పోక యిరవురితో నెయ్యములు సలుపుచు నొకనిమీదనొకనినెక్కించుచు తానభివృద్ధి నొందెను.

నీతిమంతులగువారు చేయనొల్లని యకార్యములను జేసిసాధారణముగా లోకమున దుర్నీతిపరులందఱు వృద్ధిలోనున్నట్లె యతడును వృద్ధినొందెను. అందుచేత నంబరుసంస్థానము రాజస్థానమందలి దేశములలో మిక్కిలి ప్రసిద్ధికెక్కె. ఆకాలములో దాని రానాయందరి రానాలందఱునంగీకరించియుండె. వెనుకటి ముప్పదియేండ్ల యుద్ధములలో నతడు పన్నినకుటిలు చేసినద్రోహములు తక్కిన సంస్థానచరిత్రలతో సంభవించియుండును గనుక నిచట వానిని చెప్పనక్కఱలేదు.

ఇరుగుపొరుగుసంస్థానములతో నతని కెట్టి సంబంధములుగలవో తెలియజేయుట కతఁడు దియోతిస్థానము నెట్లుపుచ్చుకొనెనో చెప్పినంజాలు. అంబరు సరిహద్దులలో దియోతియను చిన్న సంస్థానము గలదు. అది స్వతంత్రరాజ్యము. అది చిరకాలమునుండి బిహ్నాజర్ వంశస్థుల పాలనముక్రింద నుండెను. దానికి రాజధానిరాజూరు ఈకుటుంబమువారు కచ్ఛవాహాకుటుంబమువారు నొకజాతివారేయైన నుదియోతీవారు తాముపెద్ద కుటుంబమువారమనియుకచ్ఛవాహులవలెతమ కూతులను దురకల కిచ్చి పెండ్లిచేయలేదనియునీరెండుకారణములచేత దాము గొప్పవారమనియు గర్వించుచుండిరి. కచ్ఛవాహులో.డిల్లీచక్రవర్తులతో వియ్యమందినవారమనియు దమకంటె గొప్పవారు లేరనియు విఱ్ఱవీగుచుండిరి. అందుచేత గాలక్రమమున నారెండు తెగలవారికి రవరవలు పుట్టెను.

అప్పటిదియోతిప్రభువు డిల్లీచక్రవర్తులకు గొలువుసేయుటకుఁ గొంతపరివారముతో డిల్లీకిఁ జనియుండెను. అతఁడు తనులేనికాలము నదారపుత్రసంరక్షణమునకు రాజ్యసంరక్షణమునకు దన తమ్ముని నియోగించి చనెను. ఆతమ్ముఁడు మిక్కిలి వేఁటలతమకముగలవాఁడుఅతఁడొక నాఁడడవిపందిని వేటాడదలచి పయనమై భోజనముపెట్టుటయాలస్యమైనందున సేవకులమీఁద మండిపడజొచ్చెను. వానివదినె నిష్కారణమగు వానికోపమును జూచి "ఇంతలో నేయింతతొందరయెదుకు. ఈతొందర మనశత్రువుడగు జయసింగును బొడుచుటలో నుండినబాగుండు"నని మరదినెగతాళిచేసెను. ఆపలుకులు వినిదురహంకారముగలయారాజపుత్రుఁడు "సరే జయసింగునుబొడిచియే నీయింటనేనన్నముతినియెదనంతవఱకిక్కడ విస్తరివేసి భుజింప" నని తక్షణమే భోజనశాలవిడిచిపదిమంది రౌతులందోడ్కొనికోటతలుపులందీయించి రాజూరు విడిచి యంబరుమార్గమును బట్టి పోయెను.

అట్లుపోయి యాసాహసుఁడంబరుపట్టణము జేకోటవెలుపల బసచేసి యుండెను. ఆయుధములతోను గుఱ్ఱములతోను వచ్చినయా క్రొత్తవాఁడెవఁడో యెఱుంగక పురజనులువచ్చి చూచిపోవుచుండిరి. అతఁడు మొదట నచ్చట కొన్నిదినములుండఁదలఁచి పనిముగియకపో వుటచే గొన్నివారములుండి యప్పటికిఁ గార్యముగామికొన్ని నెలలుం డెను. భోజనపదార్థములు తరిగిపోవుటచే నతఁడు తనతోవచ్చిన పరిజ నులనునొక్కనినొక్కనినేయింటికిపంపి క్రిమక్రిమముగానన్నిగుఱ్ఱము లనమ్ముకొని తినెను. అప్పటికి వానిమనోరథము సఫలము కాకపో వుటచే నతడాస్థానము విడువకకనిపెట్టుకొని యుండెను. పిదప నా పంతగొండి యొక్కొక్కప్పుడు భోజనమునకొక్కొక్కయాయుధము చొప్పునతనబల్లెము తక్కతక్కినవన్నియు నమ్ముకొనితినెను. అప్పటి కి వానిపని తీరకపోవుటయు నతడచ్చోటు బాయకపొట్టనిండమి గుం టలుపట్టిన కన్నులతో శుష్కించిన యవయవములతో నాకలిగొన్న పులివలె గూర్చుండెను. ఎట్టకేలకుతినుట కేమియులేక మూడుదినము లుపవాసముచేసి నాల్గవనాఁడు తలపాగ రెండుముక్కలుచేసియందొక ముక్క యమ్మియన్నము దెచ్చుకొనితిని కార్యసాఫల్యమునిమిత్తము నిరీక్షించుచుండెను. ఆదినమున జయసింగుచుట్టుగవిసెనలువేసిన పల్ల కినెక్కి కార్యాంతరముమీద నెక్కడికో బోవుచు మార్గవశమున నీచలపాడియున్న వైపునకువచ్చెను. వెంటనే యాపంతగొండియీటె ను వానిపై విసరెను. అదిదైవవశమున జయసింగునకుఁ దగులక తెర చింపుకొని పల్లకిలో నొకమూలబడెను. అదిచూచి రాజభటులు మ హాకుపితులై తక్షణమే యాదురాత్ముని తుత్తునియలుగా దునిమెదమ నివానిపైఁ బడబోవ జయసింగు మహారాజు వారిని వారించి చంపనీ యక వానిఁబట్టుకొని యుంచి తాను తిరిగివచ్చిన పిదప తన కప్పగిం పుమని యాజ్ఞాపించెను.

జయసింగు తిరిగి రాజధానికివచ్చియాసాహసునితనసమక్షము నకు రావించి నీవెవ్వఁడవు? ఏల యిట్లు చేసితివనియడుగనతఁడిట్లనియె. "నేను దిమోతీప్రభు సోదరుఁడను నావదినగారు నన్నుదూలనాడుట చేరోషావేశమున నేనీ పని చేసితిని నన్ను నీవు చంపినను సరే విడిచినను సరే. నేను చిరకాలము నానావస్థలుబడి నీప్రాణములు గొనుటకు నిరీక్షించియుంటిని. మూడుదినముల యుపవాసముచేఁ జేతిలోసత్తువలేక పోబట్టియీయాయాసె యిట్లునిరర్థకమయినది. కానిచో దానిపని నదిచెసియే యుండును" జయసింగు రాజనీతిసారము జూచినవాఁడగుటచే వెంటనే శిరచ్ఛేదము జేయింపక వానికాలుసేతుల కట్టువిడిపించి వానికిఁ దొడిగికొనుటకు విలువదుస్తులనిచ్చి గౌరవించి మంచిగుఱ్ఱమెక్కించి యేఁబదిమంది సైనికుల వెంటనిచ్చి మరల రాజూరునకు వానిని బంపెను. ఆరాజకుమారుఁడు రాజూరునకుబోయి తన కావించిన సాహసము నెఱిఁగింప వానివదినె తద్దయు విచారించి మఱఁదికిట్లనియె "అయ్యయో! యెంతపనిచేసితివి. జయసింగు చిరకాలమునుండి మనతో గిల్లికయ్యము తెచ్చుకొనవలెనని జూచుచున్నాఁడు. త్రాఁచుబామును ద్రొక్కివచ్చితివి. అది పగబట్టి మనలఁజంపకపోదు. ఇంక మనము రాజూరు సంస్థానమునకు నీళ్ళువదలుకొనవలయును. జయసింగు మన మీఁదికి రాకమానఁడు."

అని యామె పలికినతోడనే మంత్రులు సేనాపతులు యుద్ధసన్నద్ధులై రాణితప్ప తక్కినస్త్రీలను బిడ్డలను తమరాజున్న తావునకుఁ బంపి కోటలుబలపరచి జయసింగు రాకంబ్రతీక్షించుచుండిరి. వారిరాజప్పటికి స్వదేశముజేరక గంగాతీరమున నొకగ్రామముననుండెను. ఆ రాజకుమారుని బంపిన మూడవనాఁడు జయసింగు తనమంత్రి సామంతులం బిలిచి "దిమోతీరాజు సోదరుఁడు నాప్రాణములు దీయఁదలఁచెను. కావున మనమింక వారిమీఁదికి దండెత్తిపోవలయును. ఇష్టము

లేనివారు తమతమ యభిప్రాయములఁ జెప్పవచ్చునని యాజ్ఞాపించు టయు వారందఱు రాజునకు జడిసి యెదురాడరైరి. అందులో కనూా సంస్థానప్రభువగు మోహనసింగు మాత్రము తనకిష్టములేదని స్పష్ట ముగఁజెప్పెను. ఏలయన దియోతీరాజుభార్య వానిచెల్లెలు.ఆమెయా డిన కఠినోక్తుల మూలముననే మఱఁదివచ్చి యాపని జేసెను.అదియును గాక దియోతీసంస్థానముతోఁయుద్ధమువలదనుట కీక్రిందికారణముగూడ చెప్పెను. "దియోతీప్రభువు ఢిల్లీచక్రవర్తికి మిక్కిలి యిష్టుఁడు. ఆ ప్రభువిప్పుడు స్వసైన్యముతోఁ జక్రవర్తి కొలువునే చేయుచున్నాఁడు దియోతీమీఁద మనముదండెత్తినవార్త చక్రవర్తి వినునేని యతఁ డు మనమీఁద కక్షసాధింపవచ్చు. అపుడు మనము పశ్చాత్తాత మొం దినను గార్యములేదు"

అతనిమాటలు సహేతుకములుగ నుండుటచే మొదట నోరె త్తకయూరకున్న సభికులందఱు మోహనసింగుమాటలు బాగున్నవి యుద్ధమువలదని యేకగ్రీవముగఁ బలికిరి. జయసింగు మహాకుపితుఁడై కొలువుచాలించెను. అప్పుడూరకుండి జయసిం గొకనెల గడచినపిదప మరలఁ దనసభికులను బిలిపించి యుద్ధసన్నద్ధులుగమ్మని చెప్పెను. సభికులందఱు నిష్టములేక వాని మాటల కుత్తర మీయరైరి అప్పుడు ఫతీసింగను పేరుగల యొకచిన్న జమీందారుఁడు మిక్కిలి పేరుప్రతిష్ఠలు లేనివాఁడు నూటయేబది సైనికులకంటె నెక్కువలేని వాఁడులేచి తాను సైన్యమును నడపించి యుద్ధమునకు బోవుదునని చె ప్పెను. జయసింగు వాని కైదువేల గుఱ్ఱపుసేన నిచ్చి దండయాత్ర నడుపుమని పంపెను. ఈయుద్ధము రాజునకుఁ దప్ప మఱియెవ్వారి కిష్ట ములేదు.

దియోతీరాజు సోదరుఁడు పరమమూర్ఖుఁడగుటచే బంధువుల యింట పెండ్లికై రాజూరు విడిచి యెటకోపోయెను. అతఁడా వివాహ

మహోత్సవములో మహానందభరితుఁడై యుండ వానికడ కిరువురు రాయబారులు పోయి "యంబరుసేనాపతియగు ఫతీసింగు వచ్చినాఁడు మీకునమస్కారములు చెప్పుమనినాఁ"డని విన్నవించిరి. ఆరాయబారుల సందేశమువిని యాధూర్తుండు సేయుట కెద్దియుందోపమి యాయిరువురుదూతలంబట్టి చంపించెను. ఆవార్తవిని ఫతీసింగు వానిని వానిసహకారులను దరిమి తరిమి కొట్టిచంపెను.

అనంతరము ఫతీసింగు రాజూరుకోటం బట్టు కొనియె. రాణి యాత్మహత్యఁ జేసికొని కులగౌరవము నిలుపుకొనియెను. అంబరురాజ సైనికులు రాజూరు సైనికులం జంపి చచ్చినవారి తలలు తెగనఱికి చేరుమాళ్లలో వానినిమూటగట్టిస్వదేశమునకుబోయిరి జయసింగుతనపై వెనుక బల్లెమువిసిరిన రాజూరు రాజసోదరుని తలదెమ్మని యడిగి దానింజూచిసంతుష్టుఁడయ్యెను. కానివృద్ధుఁడగు మోహనసింగుజ్ఞానహీనుఁడగు నాధూర్త వీరుని శిరస్సుఁ జూచి "వీనిమోటతనమునంగాదె పండువంటి సంసారముభగ్నమయ్యెను. రాజ్యములస్వాతంత్ర్యముపోయెను. మాచెల్లెలు దారుణమరణమొందె" ననికొలఁకులనుండి కన్నీళ్ళు దొరగవిచారించెను. జయసింగు మోహనసింగు విలాపము చూచిమహాకుపితుఁడై "ఓయీ! నీవు రాజద్రోహివి.నీమొగము చూడరాదు. నీమూలముననే నాపగదీర్చుకొనుట కొకనెలతడవైనది. ఆదురాత్ముఁడు నాఁమీదబల్లెమువిసరినప్పుడునీకుదుఃఖము లేదుకానియిప్పుడెక్కడలేని దుఃఖము వచ్చుచున్నది" అని తూలనాడి యంతతో నిలువకవానిరాజ్యమును బుచ్చుకొని తన్ను సింహాసన మెక్కించి మహోపకారము చేసిన యావృద్ధుని దేశమునుండి వెడలనడచెను. మోహనసింగు దేశమును విడిచి యుదయపురమునకుఁ బోయి మీవారురాణాయనుగ్రహమునకుఁబాత్రుఁడై యుండెను. దియోతీరాజు గంగాతీరమందలి యానషిహతేయనుగ్రామమునందుండగా పగతురబారినుండి తప్పించుకొని

పోయినస్త్రీలవలన బాలకులవలన రాజూరునకు బ్రాపించినదురవస్థవిని స్వసంస్థానమునకెన్నఁడు రాక యతఁడక్కడనేయుండిపోయెను. చక్రవ ర్తి వానికది యేమఖాసాగానిచ్చెను. అతనివంశస్థులామఖాసానను భవిం చుచు నూరేండ్లక్రిందటివఱకునక్కడనుండిరి. మందభాగ్యుఁడగునా రాజు దూరదేశముననుండుటచేత స్వలోపమువలనగాక ధూర్తుఁడగు సో దరుని మోటతనమున రాజ్యమునుగోల్పోయి విదేశములపాలయ్యెను. ఈవిధముగా జయసింగు పరరాజ్యముల నాక్రమించుకొని యంబరు సంస్థానమును మిక్కిలిబలపఱచెను. వ్యవహారములో నతఁడు బొత్తిగ నీతియు నియమము లేక వర్తించినను మొత్తముమీఁద నతఁడువివేకము గలిగి స్వలాభమునెఱిఁగి పనిచేసి రాజ్యమునువృద్ధిచేసెను. పూర్వరా జధానియగు నంబరుపట్టణమును క్రొత్త రాజధానియగుజయపురమును గలిపివేసెను. ఆతనిగొప్పమందిరములన్నియు నొక జైనునిచేతనిర్మింపఁ బడెను. శిల్పశాస్త్రాదులలోఁ బ్రవీణులగువారి నందఱను తురకలు హిందువులను భేదము లేకుండ నతఁడాదరించినను జైనులయందుబక్షపా తముమెండు. ఆకాలమునందుజ్యోతిశ్శాస్త్రమందతనికి సమానుఁడెవఁ డు లేఁడు. ఆశాస్త్రమందంతప్రజ్ఞయున్నందు కతఁడుమహారాజై పుట్టక సామాన్యపండితుఁడై యేబీదకుటుంబములోనైనఁబుట్టి నిరంతరము గ్రహచారములనెన్నుకొనుచుగాలముశాస్త్రచర్చలయందేపుచ్చినపక్ష మున నంతకంటె నెక్కువకీర్తి సంపాదించియుండునని యనేకులుతలం చిరి. ఆశాస్త్రమందితఁడేడుసంవత్సరములుకృషిచేసినేర్చుకొనువారికిసుల భమగునట్లు రెండుగణితమానములనేర్పరచెను. అంతతోతృప్తిబొంద క జయసింగు పోర్చుగలు దేశమందు గొప్పజ్యోతిశ్శాస్త్రవేత్తలు లున్నా రనివిని యాదేశపురాజైన యిమాన్యుయలుగారివద్దకు రాయబారుల నంపి యక్కడవ్యవహారములలోనున్న గణితమానములఁదెప్పించుకొనె ను. అవివచ్చినపిదప తనగణితములను వారిగణితములతోఁబోల్చిచూ

చి మనగణితములే హెచ్చుతగ్గులులేక సరిగనుండెననియు పోర్చుగలు వారివి సరిగలేవనియుఁ జెప్పెను. వారివి సరిగనుండకపోవుటకుఁ గారణము తెల్లవారి నక్షత్రదర్శనయంత్రములలోనున్న లోపమేయని చెప్పెను. ఆతనిసాధనయంత్రములుమిక్కిలియద్భుతములైనవి. వానిసహాయమున నతఁడు మిక్కిలి గొప్పసంగతులంగనిపెట్టెను. యూరపుఖండవాసుల యంత్రములు మంచివికావని యతఁడభిప్రాయపడినను వారివద్దనేర్చుకొనవలసిన విద్యలుమాత్రి మతఁడలక్ష్యముచేయలేదు. యూక్లిడ్డువ్రాసిన రేఖాగణితశాస్త్రము మఱికొన్నిగణితసిద్ధాంతములు సంస్కృతములోనికి వానియాజ్ఞచేతనే భాషాంతరీకరింపబడెను విద్యావినోదియగుటచే నతఁడుకష్టపడి యెన్నోగ్రంథములఁ జేర్చియొకభాండాగారమేర్పరచెను. అతని యనంతరము రాజ్యమునకు వచ్చినవారిలోనొకమూర్ఖుఁడు పుస్తకముల యుపయోగమెఱుఁగక వానినితనయిచ్చవచ్చినట్లుపంచిపెట్టెను. జయసింగు మంచిచట్టములనేర్పరచి జనులనున్యాయముగఁ బరిపాలించెను. జనులవిషయమున నతఁడు మిక్కిలి యోగ్యుఁడే. తన రాజ్యమున ననేకపరిదేశములయందతఁడు బాటసారులనిమిత్తముసత్రములు కట్టించెను. ఆకాలమున రాజపుత్రులు తమకుఁబుట్టినకూఁతులకుఁ దగినసంబంధములు తేఁజాలకయు వచ్చినయల్లురకులక్షలకొలఁదికట్నములుపెట్టఁజాలకయునాడుపిల్లలనుజన్మించినతోడనేజంపించుచుండెడివారు. ఈదుచారము నిర్మూలించుటకు వివాహవ్యయములఁ దగ్గించుటకు జయసింగు కొన్నిచట్టముల నేర్పరచెను. అతఁడుతఱచుగ త్రాగెడివాడుకగలవాఁడు. ఒక్కొక్కప్పుడుమితిమీరిత్రాఁగుచుండును. రాజపుత్రుని దేహతత్వమెక్కువ నిషానుభరింపగలదియగుటచే నతఁడెంతత్రాగినను నొడలెఱుంగకపోక దేశమునుపాడుజేయక యంబరుసంస్థానమును నలువదినాలుగేండ్లు పరిపాలించెను. ఇరుగుపొరుగురాజులతో నెట్టికలహములు ప్రాప్తించినను జయము జయసింగునదే. అతనిటక్క

రితనముం గనిపెట్టి ఢిల్లీచక్రవర్తి వానికి శివేయి యని బిరుదమిచ్చె
ను. ఈశబ్దమున కర్థ మొకటిపావు. అనఁగా జయసింగు తక్కినతనకా
లపు రాజులకంటె నొకపావుఘనుఁడని చక్రవర్తియభిప్రాయము. అ
తనిసంతతివారిప్పటికి శివేయియను బిరుదము నిలుపుకొనియున్నారు.
జయసింగు తనజీవితకాలమున రెండుసారులు మాత్రమేయొకరికిఁజంక
వలసివచ్చె. ఆజంకు రెండుసార్లు నాడుదానికే.

జయసింగు తోఁబుట్టువు బూందీసంస్థాన ప్రభువగుభూతసింగును
వివాహమాడెను. ఆప్రభువున కామెవలన సంతానము గలుగలేదు.
ఈకారణమున నామె మిక్కిలి చింతించుచుండెను. ఆచింతకుఁదోడుగ
నామెసవతియగు మీావారురాజుల యాఁడుపడుచునకు ముద్దులుమూట
గట్టు కొడుకులిద్దఱు పుట్టిరి. దైవికమైనయీపరాభవము సహింపలేక
యామె మగఁడు రాజధానివిడిచి మఱియొకరాజుతో యుద్ధముచేయు
టకుఁ బోయియుండగా గర్భవతియైనట్లు నటించెను. నటించిభూతసిం
గు వచ్చునప్పటికిఁ జిన్నికుమారు నొకనినొడిలోఁబెట్టుకొనికొలఁదికాల
ముక్రిందటనే వానింగనినట్లు దెలియఁజెప్పెను. బూందీప్రభువు పుత్రి
జననమునకు సంతసింపక యాబిడ్డఁడు తనకుం దనభార్యకుఁగూడపుట్ట
లేదని నిశ్చయించుకొని యప్పుడేమియు ననగూడదని యూరకుండెను.
ఆదినములలోనే జయసింగు తనబావను జూచుటకు బూందీపట్టణము
నకుఁబోయెను. అప్పుడు బూందీరాజు తనభార్యచేసిన మోస మామె
యెదుటనే యామెయన్నతోఁ జెప్పెను.

జయసింగు మహాగ్రహమునొంది దానినిజమరయుటకు సోదరి
నదల్చి ప్రశ్నము లడుగఁజొచ్చెను. ఆమెయుఁ దనపన్నుగడయంతయు
బయటకువచ్చునను భయమున వానిప్రశ్నములకుడికి సోదరునినోటికి
వచ్చినట్లు దిట్టి రాక్షసివలె మీాదబడి మొలదట్టి పట్టుకొని కైజారు
తోఁ బొడువ యత్నించెను. అప్పుడు జయసింగు గడగడలాడి యేమి

యుఁ జేయలేక యాఁడుదానికంటె నధముఁడై ప్రాణములఁదక్కించు కొని యావలకుఁ బాఱిపోయెను.

అతనికి జరిగిన రెండవపరాభవము వానిభార్యలలోనొకతెవలన. ఆమె కోటాసంస్థాన ప్రభువుల యాఁడుపడుచు. ఆమెపుట్టినింటివారు చంద్రవంశజులు. ఆమెవారియౌన్నత్యమువారియాచారవ్యవహారము లునడుపుకొనుచువచ్చెను. ఆమె చిన్ననాఁటనుండియుమిక్కిలి పొడవు వెడల్పుడట్టముగలచీరలుకట్టుట కలవాటుపడి యత్తవారియింటికివచ్చి నపుడునయిత మవియేగట్టుచు వచ్చెను. జయసింగుయొక్క తక్కిన యంతఃపుర స్త్రీలు భార్యలు ఢిల్లీజనానా స్త్రీలు కట్టెడి విధము నొడలు కనఁబడెడు సన్నని దువ్వలువలు గట్టుచుండిరి. తోడియువిదలెన్నిసారులుదన్నెగతాళిచేసిదెప్పినను మగడెన్నిసారులు సన్నదువ్వలువలు గట్టుమని ప్రేరణము జేసినను కోటాప్రభువుల యాఁడుపడుచువినుపించు కొనక యెప్పటియట్లె ముతుకబట్టలు కట్టెను. ఒకనాఁడా దేవితోగూడిజయసింగుమహారాజు తనయంతిపురమున నేకాంతమున నుండి తక్కిన యంతఃపురాంగనలు చీనిచీనాంబరములు గట్టుచుండ నీవీవిధంబునవిలువలేని మోటబట్టలు గట్టెదవేల" యని యామెనుబరిహాసము జేసెను. మగడెంత యెగతాళిచేసినను మహాపతివ్రతయగుటచే నామెయేమియు ననక తలవంచుకొనియుండెను. ఆమె మెత్తదనము గనిపెట్టి జయసింగుచేత నొకకత్తెరను బుచ్చుకొని నేలజిమ్ముకొనునట్లు వ్రేలాడుచున్న యామెకుచ్చెళ్ళను గత్తిరించెదనని లేచెను. అప్పుడా దేవియానిన పులినడువున మహాక్రోధపరవశయై గుబాలున పాన్పుమీదను నుండి యుటికి ఖడ్గముచేతఁబట్టుకొనిభయంకరాకారయైమగనినొకప్రక్కకుద్రోసివేసి యిట్లనియె. "జాగ్రత! హారవంశమునందు బుట్టిన యాఁడుపడుచు లిట్టిపరిహాసమును, సహింపరు. మోటహాస్యములు చేయవలదు. సతీపతులలో నొకరియం దొకరికి గౌరవమున్నప్పుడె సౌ

ఖ్యము మరియాదయు నుండును. ఈసారి యిటువంటి హాస్యము చేసి చూడుము. అంబరు రాజు కర్తైరబూని చేయుపనికంటె కోటాపరిభవుల మూడుపడుచు ఖడ్గముబూని యెక్కువపని చేయఁగలదని లోకమునకు వెల్లడించెను.

ఆమె క్రోధావేశమును జూచిరాజు భయపడి వినయముతో నన్ను క్షమింపుమని యెన్నియో బ్రతిమాలెను గాని యామె శాంతము నొందక హారసంశస్థులటుమీఁద నెన్నఁడు కచ్ఛవాహులతో సంబంధములు జేయఁగూడదనియు జేసినచో మరియాద యెఱుఁగని కచ్ఛవాహులిల్లి భార్యల నవమానింతురనియు శాసించెను.

శివేయి జయసింగు 1748 వ సంవత్సరమున మృతినొందెను. అతనితో వానిభార్యలు ముగ్గురు సహగమనముచేసి లోకాంతరమునొందిరి. అతని యనంతరమున దుర్బలులు దుర్నీతిపరులు దుస్స్వభావులు గద్దెయెక్కి జయసింగు తెచ్చిన యున్నతస్థితినుండి యంబరురాజ్యమును మిక్కిలి యధమస్థితికిఁ దెచ్చిరి. అందు ముఖ్యుడగు జగత్సింగు గూడ భోగపరాయణుఁడే. కృష్ణకుమారినివివాహమాడుటకుబ్రయత్నించిన యాతఁడు ఈతఁడు. జయసింగు సంపాదించిన ధనమంతయు వెచ్చబెట్టెను. జయసింగు సొగసగు కొలువుకూటము గట్టించి వాని స్తంభములమీఁదను సరంబీలమీఁదను వెండిరేకులతికించెను.ఆమందిర ప్రవేశము చేయునప్పు డతఁడు సూర్యున కొకగుఱ్ఱమును బలియిచ్చెను జగత్సింగు గతిలేక యామందిరమందలి వెండినంతను దీవించివేసెను మూర్ఖుఁడగు నాజగత్సింగు తురకభోగముదాని నుంచుకొని జయసింగు చేర్చిన గ్రంథభాండారమునందు సగము పుస్తకము లామెకిచ్చెను దానిబంధువులు వ్రాతపుస్తకములు చేతఁ బట్టుకొనియిల్లిల్లు దిరిగి వాని నమ్ముకొని జీవించిరి. ఈవిధముగ జయసింగు మాయోపాయముల చేత సంపాదించిన రాజ్యము వానివారసులు మిక్కిలి తక్కువకాలములోనే నిజస్థితికి దెచ్చిరి.

# హారవంశస్థులకథలు.



రాజస్థానమధ్యమున నొకమెట్టనేల గలదు. దాని పేరు పతాపు రాజశాసనముం దిరస్కరించినవారు దొంగలు మొదలగువారి కా భూమి చాలాకాలము శరణ్యమై యుండెను అది మీవారు రాణాలకు లోబడియుండెనని చెప్పుకొనుటయేగాని యలాయుద్దీను చిత్తూరుకో టముట్టడించి పాడుచేసినదిమొద లామెట్టనేల యన్యాక్రాంతమే య య్యెను కొండకొనలమీదగొండలమొదళ్ళయొద్దనడవులనడుమనిప్పటికి నీమెట్టనేలలోఁ బాడుపడినకోట లనేకములు మనకుఁ గనబడుచుండును వానింబట్టి పూర్వమామెట్టనేలగూడ కొంతకాలము వైభమనుభవిం చినదనియు దాని రాజులు సుప్రసిద్ధులై ప్రతాపనిధులై వెలిగిరనియు గాలగతివల్ల నిట్టియవస్థ వచ్చెననియు జూచువారికందరకుఁ దోచకపో దు. ఇందొక్కొక్కకోటకు నొక్కొక్కచిత్రకథగలదు. ఆమెట్టనేలలో బడమటివైపున బూర్వము బుమోడాయనునొకపట్టణ ముండెను. దాని రాజిరువదినాలుగు కోటలకధిపతియై యుండెను. ఇప్పుడాపురము పాడువడియున్నది. ప్రస్తుతస్థితినిఁబట్టి కోటయొక్క మొదటిప్రాకా రమును రెండవప్రాకారమును, మూడు దేవాలయములు నొక కొలువు కూటమును జూచువా రానవాలుపట్టి స్థలనిర్దేశము జేయవచ్చును. ఆ కోటక్రింద నొకరాతి గుట్టమీద హారవంశస్థుల కులదేవతవిగ్రహము న్నది. దాని యాకారము భయంకరమై మిక్కిలి పెద్దదిగ నున్నది.

బుమోడాగ్రామము పదునాలుగవ శతాబ్ద ప్రారంభమున నొక హారవంశస్థునిచేఁ గట్టఁబడెను. హారవంశస్థులు చోహాణవంశము లోఁజేరినవారే. చోహాణవంశస్థులు పేరెన్నికగన్న ముప్పదియారు రాజపుత్ర కుటుంబములలోఁ జేరినవారు. హారవంశస్థులుఁగూడ మగ

టిమికిఁ బ్రసిద్ధికెక్కిరి. ధైర్యమునందు బుద్ధికుశలతయందు రాజభక్తి యందు సాహసమునందు హారవంశస్థులకు సమానులెవ్వరు లేరని చెప్పవచ్చును. వేయేల రాజపుత్రులలోనున్న సారమంతయు హార వంశమైపుట్టెనని కొందఱనుకొనిరి. అందుఁబుట్టిన యాడుపడుచులు సయితము పౌరుషంబునకు మెప్పువడసిరి. ఇంతయెందుకు రాజపుత్రి కుటుంబములలో నెక్కడైనను సరే పూర్వము సాహసముగల యాడుదియుండిన నామె హారవంశస్థుల యాడుపడుచేయని గ్రహింప వలయును.

మొట్టమొదట బుమోజా కట్టి యేలినరాజు పండ్రెండుగురు కొడుకుల తండ్రియై యంత్యకాలమున రాజ్యసంరక్షణము సేయుమని వారిని నియోగించి చనిపోయెను. ఆకొడుకులలో నొకఁడగు రావు దేవు పతారు దేశమునకుఁ బ్రభువై తనచాకచక్యముచేతను మగఁటిమిచే తను సరుగుపొరుగువారికి భయంకరుఁడై యుండెను. అతనికీర్తి ఢిల్లీనగరమువఱకు వ్యాపింప ఢిల్లీచక్రవర్తి మీావారును బాడుచేసి నను దనకు పక్కలోబల్లెమట్లు మఱియొకసంస్థానము బయలుదేరెనని విని యోర్వలేక వానిం జెఱుపదలఁచి యారాజును ఢిల్లీకిరమ్మని సబ హుమానముగ బిలిచెను ఢిల్లీకిఁ బోయినచోఁ బ్రాణములతో మరల నింటికివచ్చుట యరిదియని యెఱింగియు నతఁడు చక్రవర్తి దర్శన మునకుఁ బోయెను. పోవునప్పుడు తనకొడుకునకు రాజ్యమప్పగించి తక్కినచుట్టములనెల్ల నతఁడు తనవెంటం గొనిపోయెను.

రావుదేవునియొద్ద మిక్కిలి యక్కజమగు గుఱ్ఱమొకటి యుం డెను. అట్టిది చక్రవర్తివద్దనైన లేదు. దానితండ్రి మీావారు రాణా వద్దనుండిన గుఱ్ఱము తల్లిపతారుమెట్టలోబుట్టినదే. ఆగుఱ్ఱమొక మా త్రిపు ఊరున డెక్కతడిగొనకుండ దాఁటగలదఁట. అట్టిగుఱ్ఱమును వెంటఁబెట్టుకొని రావుదేవు ఢిల్లీకిఁ బోవ చక్రవర్తి చూచినతోడనే

దానిని తన కిమ్మని యడిగెను. చక్రవర్తి వేడుకొన్నను బెదిరించి నను రావుదేవుఁడు గుఱ్ఱము నియ్యఁడయ్యెను. అందుచేత జక్రవర్తి తనపిలుపువలన దనయింటి కతిథియై వచ్చిన యారాజశిఖామణిని జంపింపఁదలచెను. రావుదేవుడీసంగతి నెట్లో జాడకట్టి తనతోవచ్చిన బంధువులను రహస్యముగ నొక్కరొక్కరుగ స్వదేశమునకు బంపి తానొక్కఁడుమాత్రము మిగిలియుండెను.

ఒకనాఁడు చక్రవర్తి యొకమేడమీద గూర్చుండియుండ నొకశూరుఁడు సర్వాయుధములు దాల్చి గుఱ్ఱమెక్కి సవారుచేయు చుండెను. అతఁడు రావుదేవుడే, అతఁడు గుఱ్ఱమెక్కి పోవుచు మేడ మీఁదనున్న చక్రవర్తివంక దిరిగి "అయ్యా! నాకిదే సెలవు, మీకు మాకు నింకసంబంధములేదు. రాజపుత్రు నడుగగూడనికోరికలు మూడున్నవి. మొదటిది కత్తి. రెండవది భార్య మూడవది గుఱ్ఱ" మని యెలుగెత్తి చెప్పి వెడలిపోయెను. అతనిగుఱ్ఱము తరటు చేసిన తోడనే వాయువేగ మనోవేగములం బరుగెత్తి క్షణములో దృష్టిప థము నతిక్రమించెను. చక్రవర్తి మహాకుపితుఁడై వానిం దరిమి పట్టి తెమ్మని ఢిల్లీలోనున్న మంచి పారసీక హయముల నెక్కించి గొప్పసరదారుల నంపెను. కాని వానిం గలసికొన నెవరితరము!

అట్లు ఢిల్లీవిడిచి రావుదేవుఁడు స్వదేశమువచ్చి బుమోడాపట్ట ణము చేరునప్పటికి వానికుమారుఁడు యుద్ధసన్నాహముమీదనే యుండెను. అతనినట్లు జాగ్రత్తగా నుండుమని రావుదేవుడు తాను గంగానదీతీరమునకు బోయి యిప్పుడు బూందీనగరమున్న ప్రదేశ ముల దిరుగులాడఁజొచ్చెను. అప్పుడా దేశమందలి జనులందఱు చండ శాసనుఁడగు నొక బందిపోటుదొంగ బారిపడి నిద్రాహారములు లేక బాధపడుచుండిరి. ఆదొంగపేరు రామగంగఁడు. వాఁడు రామఘురు గ్రామమున గట్టి కోటగట్టుకొని యప్పుడప్పుడు దోపుడుచేయుటకు

జుట్టుపరిక్కల గ్రామములపైఁ బడుచుండును. రెండుమాసముల కొక్క సారి పున్నమనాఁటిరాత్రి రావుగంగఁడు దండువెడలి తనకీయవలసిన కప్పమునొకసంచిలోఁబోసి యీయనిగ్రామస్థులను జిత్రవధలు జేయును. రావుదేవుఁడీ దారుణకథలువిని యాదొంగసేయు దుండగములకు రోసి వాని దండింపదలచి ముందునెలదొంగలఁజేసు వచ్చినప్పుడు కప్పమీయవలదని గ్రామస్థుల కుపదేశముచేసెను.

రావుగంగడును బున్ననినాఁడెప్పటియట్ల నిర్భయముగఁగత్తి నోరలోవేసికొని ప్రజలుకప్పము దెచ్చి యందింతు రనుకొని గ్రామములకుఁ బోయెను. కాని కప్పమురాదయ్యెను. అప్పుడువాఁడు మహాకోపమున మండిపడుచు నెదుటనున్న జనులజూచి యెవఁడురా నాయెదుట నిలుచువాఁడని కఠినముగఁబలికెను. "నేనురా" యని ఖడ్గపాణియై రావుదేవుఁడు వానియెదుటనిలిచెను. అప్పుడిరువురకు నద్భుతమగు ద్వంద్వయుద్ధముజరిగెను. గంభీరాకారమందు ధైర్యమందు వారొండొరులకుఁ దీసిపోవరైరి, రావుదేవునకు విజయలక్ష్మివంటి గుఱ్ఱముండిన రావుగంగనికిగూడ దానికిఁదీసిపోవని గుఱ్ఱమేయుండెను. వానిగుఱ్ఱముకూడ తనయజమానుని బలుమారుపదవ్రములనుండి తప్పించి మహోపకారము జేసెను. కొంతయుద్ధ మగునప్పటికి గంగడు మిక్కిలియలసి తనకు బరాజయమేయగునని నిశ్చయించి గుఱ్ఱమెక్కి పరుగెత్తసాగెను. రావుదేవుఁడు తనగుఱ్ఱమెక్కిదొంగను వెంటనంటి తరుమజొచ్చెను. దొంగయు దూరపుకొండలలోనున్న రామఘురుగ్రామముదెస పారిపోయి చంబలు నదీతీరముననున్న గుట్టలపై కెక్కెను అప్పుడు రావుదేవుడు "హా! అవ్వల నదియున్నది. వీఁడిక నెందుబోగలఁడు, నాచేజిక్కెనా"డని సంతసించుచు వానిదగ్గరకు వచ్చునప్పటికి గంగఁడు మహాసాహసమున కొండకొనమీఁదనుండి గుఱ్ఱముమీఁదనున్నపాళమున గుభాలుసకిరింది ప్రవాహమునం దుమికెను. అదిచూ

చిరావుదేవుడు తనచేత చచ్చుటకంటె శత్రువుడు గంగలోదిగి చచ్చు టమంచిదని భావించి యట్లు దుమికెననుకొని తాను గుఱ్ఱముమీద నెక్కి కొండకొనను నిలిచి పడినవాని గతియేమయ్యెనోయని చూచు చుండెను. అంత నొకగడియలో వానికి మహాశ్చర్యమగునట్లు రావు గంగడు చావలేదు సరికదా చెక్కుచెదరక గుఱ్ఱమెక్కియవ్వలయొడ్డు చేరెను. చేరుటయురావు దేవుడు మహాద్భుతము మహానందము నొంది నహ్వా రాజపుత్రుడా వహ్వా! నీపేరెవ్వరని యడిగెను "నాపేరు రావుగంగడు కాని నీపేరెవ్వరని యొడలు దుడుచుకొనుచు నతఁడు బదులుచెప్పెను.

"నాపేరు రావుదేవుఁడు. ఇకమీద మనమిద్దరము వైరము మానిమిత్రులమగుదము. ఈనదిలో మనయిరువుర దేశములకు సరి హద్దగుగాక" యని హారవంశస్థుఁడు ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్లు రావు దేవుఁడు రావుగంగనికిమొదట పరిచితుఁడై పిదప మిత్రుడయ్యెను. అది మొదలు రావుగంగడు వానిదొంగలగుంపులు దేశములు దోచు టమానిరి. రావుదేవుడు బూందీయను పట్టణమును గట్టి యదితనకు ముఖ్యపట్టణముగ రాజ్యమేలెను.

అతనికుమారుడు బుమోఢాపట్టణము చాలకాలమేలిమృతి నొంద వానికొడుకు రావుదేవుని మనుమడునైన యాలూహారుడుసిం హాసనమెక్కెను వానినిగూర్చి యనేకచిత్రకథలు గలవు, రాజపుత్రు లందరివలె యతడును శౌర్యనిధియు గాంభీర్యనిధియు నయ్యెను, అత నినోటనుండియేదియైన మాటవచ్చెనా మరితిరుగుటలేదు. ఎంతబహు మానమిచ్చిననుసరే ప్రాణభయమువచ్చిననుసరే యతడన్నమాట దాటి మెలుగడు. ఒకనాడతడు వేటనుండి మరలివచ్చుచుండ నొక చారణుడు (స్తోత్రపాఠకుడు) వానికగపడిదీవించెను, చారణు డాశీర్వ దించినప్పుడు రాజపుత్రుడేదైన తత్క్షణమువానికిచ్చుట యాచారమ

గుటచే నేమిగావలయునని యాలూహరుడు వానినడిగెను, ఆచారణుడు రాజుగారిపాగ కావలయునని యడిగెను. ఆలూహరుడు తలపాగ మాత్రమడగవద్దనియు దానికిబదులు కోరినసగలుగాని మాన్యము లుగాని ధనముగాని యిచ్చెదననియు మిక్కిలిబ్రతిమాలినను చారణు డందుకొప్పుకొనడయ్యె. ఎట్టకేల కాలూహరుడు దాని నిచ్చుటలేదని పలుక చారణుడు వానిని శపింతునని బెదరించెను. ఆలూహరుడు సహజముగ నతిధైర్యశాలియయ్యు శాపమునకు భయపడి తలపాగ వానికిచ్చెను, అదితన తలబెట్టుకొని యాచారణుడరిగెను.

అనంతరమా యాలుహరుఁడొకనాడుబు మోడాపట్టణమునఁగొలువుదీర్చియుండ వినయముతోనొకమనుష్యుఁడువానివద్దకువచ్చినిలిచెను. ఆతఁడు వెనుకటిచారుణుడే. అతడు ప్రయాణముచేత నలసి పైబట్ట జారుచుండ వెనుకటి రాజిచ్చినతలపాగ చంకబెట్టుకొనిమారువారు రావును నిందించుచు రాజునకెదుటనిలిచి యిట్లనియె "నాడునేను దేవరవారి తలపాగదీసికొని సెలవుపుచ్చుకొని మారువారు రాజధానియగు మండూరునకు బోయి కొలువుకూటముం జేరినాతలమీదనున్న పాగను కుడిచేతితోఁబట్టుకొని యెడమచేతితో నామారువారురాజునకు సలాముచేసితిని. అట్లుతలపాగతీయుటకు నెడమచేతసలాముచేయుటకుఁగారణమేమని యతఁడు నన్నడుగనేనిట్లంటి "ఇదియాలూహరునితలపాగ ఆరాజుపాగ మఱియొకనికి వంగినమస్కరింపదు" స్వామీ! యపుడేమి చెప్పుదు నాపలుకులువిని యారాజు బిట్టలుకతో నాచేతనున్న పాగ తన కాలితోదన్ని కొలువునుండి నన్ను వెడలనడిపించెను. నేనును దేవరవారికది విన్నవించుటకు రోజుచువచ్చితిని. వానిమీఁదమీరు తప్పక కసిదీర్చుకొనవలయు"

ఆపలుకులువిని యాలూహరుఁడు చారణునిశ్లాఘింపక "నేనునీకుఁ గావలసినన్ని గోవులు నగలునిచ్చెదనని యెంతబ్రతిమాలిననువిన

క మోటుపట్టుపట్టి యీతలపాగపట్టుకొనిపోయి దానితో కయ్యము దెచ్చితివి. ఈకుడ్డపీలిక నిమిత్తమిప్పుడు నేను వానితో యుద్ధమునకుఁబోవుదునా?" యని వానిం జీవాట్లుపెట్టి యవ్వలకంపెను. పంపినను వానిమనస్సులో మాత్రిమా పరాభవము రవులుచునేయుండెను. అందుచేత నతఁడు తనచేతిక్రిందనున్న మైనువందల రాజపుత్రవీరులను సత్వరము బిలిపించి వారియాలోచనము నడుగనా రేకగ్రీవముగనిట్లనిరి. "మామవాని రాజునకొకమాట బుద్ధిచెప్పవలయును. బుద్ధిచెప్పుటకుఁబోవుచున్నమనము మరల బ్రతికిరాకపోయినపోవుదుముగాక" యని వారు రాజుం బురికొల్పి సాధారణముగ యుద్ధమునకు బోవునప్పుడుచేయు ఘోరప్రమాణములుచేసి గృహములకుజని యాలుబిడ్డలయొద్ద కడసారిసెలవు పుచ్చుకొని కొండకోటదిగి యమ్మవారివిగ్రహముపక్కనుండి నడచి మామవారునకుచంను వెడలిరి.ఆదినమునవారితో బయలుదేరనిమగవాడుకోటలో నొక్కఁడే యుండెను. అతఁడాలూహారుని యన్నకొడుకు బాలుఁడు. వానింగూడ తీసికొనిపోయిన తనవంశము నాశనమగునను భయమున నాలూహరుఁడు వాని నేడుపాత్రికాయములమధ్యనున్న యొక గదిలో దాఁచెను.

ఆలూహారుఁడు చండశాసనుఁ డగుటచే జరిగినపరాభవమునకు బ్రతిక్రియ నేయక మానఁడని మామవారు రాజుతో గొందఱు ముందుగజెప్పిరి. అతఁడదినమ్మకయలక్ష్యముచేసి "ఏమీ! ఒకచిన్న జమీందారుఁడు నావంటి మహారాజు మీఁదదండెత్తగలఁడా? ఎత్తినిమ్మతనినే నడుగులుపెట్టినభూములన్నియు బ్రాహ్మణులకు దానమిచ్చెద" ననిబీరములుబలికెను. కొంతకాలము జరుగ నొకనాఁడా రాజు నిద్రించుచుండ నర్ధరాత్రిమున గొప్పచప్పుడువిని యతఁడులేచెను. ఆచప్పుడురణభేరులమ్రోతతోను యుద్ధములలోనూదుకొమ్ముల నాదముతోను గలసి వినఁబడెను. అదివిని యతఁడుకోపముతో "యెవఁడురా! మండూరుకోట

గుమ్మముచెద్ద నింతధ్వనిసేయ సాహసించినవాఁడని యడుగ "బు మోఁడాపరిభువగు నాలూహరుఁడు స్వామీ"యని యెవఁడో ప్రత్యుత్తరమిచ్చెను.

ఆలూహరుఁడు వానిమూఁకలు గుఱ్ఱపువర్తకుల వేసములు వేసికొని సందడిసేయక పట్టణముజొచ్చి వెనుక తలపాగకుజరిగిన పరాభవమునకు బగవస్తితోఁదీర్చుకొనుటకు గ్రామమునెత్తుకువరదలుజేయుటకు నిశ్చయించుకొని వచ్చిరి. మారువారు రాజుగూడ తాననురాజపుత్రుఁడే యగుటఁ దగినట్లుబరివర్తించెను. "శతృసైనికులు తొక్కిననభూములన్నియుబ్రాహ్మణులకుదానమిచ్చెదనంటినియిప్పుడిచ్చెదవా యని తల్లిమారువారు రాజుందెప్పెను వానిసైనికులు బెబ్బులులట్లు బగతురపై నెప్పుడుపడుదుమోయని తొందరపడుచుండిరి శత్రువులగు హారవంశస్థులుయుద్ధమునకు రా రమ్మని పిలుచుచుండిరి. అవియన్నియుఁ జూచియుమారువారురాజుతనకెక్కుడబలమున్నందులకుబౌరుషవంతులగు నందటిహారవంశజుల నొక్కసారి చంపుటమంచిదికాదనితలంచి శతృవుల సైనికుల నైదువందలతోఁ బోరుటకుఁ తనసైనికుల నైదువందలమంది నేర్పరచెను. ఆయాలోచనముబాగున్నదనియాలూహరుఁ డొప్పుకొనెను. వీరపరిశివీరు లొకస్థలమందుజేరిరి. నయనోత్సవముగ దానిఁజూచుటకు వేనవేలుజనులు చుట్టుమూగిరి. ఉభయపక్షములవీరులు యుద్ధసన్నద్ధులైయుండిరి. అప్పుడుదూరపుపరియాణమున నలసిన యొకగుఱ్ఱపురౌతువానినడుమనిలిచెను. అంతరాయములేనిపయనము సేయుటచే గుఱ్ఱమునురుగులుగ్రక్కుచు డొక్క లెగరవేయఁ జొచ్చెను. రౌతుచూడ మిక్కిలి బాలుఁడు అటు లారౌతు కొంచెమిట్టటుచూచి మారువారురాజుకడకుబోయి యుద్ధమునకుమొట్టమొదట హారవంశస్థులపక్షమున దానువచ్చుటకంగీకరింపుమని వానిం బ్రార్థించెను, మారువారుజనులువీడెవ్వఁడెక్కడనుండివచ్చెననివిస్మితులగుచుండ

వీరులు నిశ్చేష్టులైరి. ఆలూహారుఁడు వంశనాశనమగునను భయము న నేడు పారికారములగదిలోఁబెట్టితాళము వేసిదాఁచినగుజ్జీవాఁడితఁడే ఆలూహారుఁడు మొదట మాటలాడలేనంత నిశ్చేష్టుఁడై యెట్టకేలకు స్మృతిదెచ్చుకొని బాలుంజూచి "ఓమూర్ఖ! యోదుర్వినయసంపన్న హారవంశమునకు మూలకమైన లేకుండ జేయుటకువచ్చితివా?" యని కోపముతో నడుగ నాబాలుఁడు "లేకపోయిన లేకపోవుగాక" ఆపదసమయమున మీకక్కరకురానప్పుడు నేబ్రతికిన బ్రయోజనమే" మని ప్రత్యుత్తరమిచ్చెను.

ఆకుమారుఁడు నిర్భయముగ యుద్ధమున కున్ముఖుడగుట జూచి స్వాసైనికులు వానికి దేవీప్రసాదముకలిగెనని తలంచిరి. అది నిక్కమే యట యెట్లన నాఁడు వానిం దాచినట్లు పినతండ్రి తన్నేడుపరికారముల నడుమగదిలో పెట్టి తాళము వేసియుద్ధమునకురానీయకుండు కాబాలుడు మహాభిమానవశుఁడై కోపముచేత నోడలెఱుంగక లోలోపలనెంతయు మఱుగుచుండ గొంతసేపటికి తలుపు గడియలు విడిపోయెనట. తలుపులు తమయంతట నవియే తెరువబడెనట. ఒక్కక్షణములో భవానిమాత ప్రత్యక్షమై వానికన్నులయెదుట నిలిచెనట. నిలిచి బాలుంజూచి "వత్సా నీహృదయతాపము నేనెఱిగిజాలినొందివచ్చితిని ఈ యాయుధము నీవుపుచ్చుకొని యుద్ధమునకుబోయివిజయుడవై నీవంశమునకు బ్రతిష్ఠ తెమ్మని యామె పలికెనట.

ఆబాలునియుత్సాహముఁజూచి వానితో బోరుసల్పుటకు మారువారురాజపక్షమునుండిపోరాటములలో నారి తేఱినయొక మహాయోధుసిద్ధమైనిలిచి మొదటిదెబ్బతన్నుగొట్టుమని బాలునింబురికొల్పెనుకాని యాబాలుడు పెద్దలయందుచాలగౌరవము గలవాడగుటచే "మీరే మొదటిదెబ్బకొట్టుడని సగౌరవముగబలికి యెంతసేపటికామేటిజోదు యుద్ధము మొదలువెట్టకపోవుటచేవిసికి తానేమొదలుపెట్టదలచిఖడ్గము

బూని యొక్క యేటునేయ నామహాయోధు రెండుతునకలై నేలబడి యె. అనంతర మాబాలునిమారువారులో బేరుగన్న మేటిమగలండ్రు రోసంబునందాకి యొకటివాతుబోయినగతి కేపోయిరి ఆకుమారుని నిరంకుశ వీరవిహారముజూచి వానిపక్షమువారందఱు "దేవివానిననుగ్రహించి మేనునిమిరిదుర్జయునిగా జేసినప్పుడు వాని యెట్టయెదుట నెవడు నిలువనోపు"నని యొండొరులతో జెప్పుకొనిరి అట్లుకొంతసేపు విజృంభించి యెదుటబడినవీరులనందఱు దనకటుకుకత్తి కెఱచేసి శ్రాంతుడై యాబాలకుడు మరియొక మహావీరునిచేత మెడమీద దారుణమగు దెబ్బతిని మృతినొందెను.

దేవీప్రసాదముగాంచిన యతడు మృతినొందుటకు గారణమిది ఆదేవి కృపారసనిష్యందములగు తనహస్తములతో వానిమేనునిమిరినిమిరినభాగమెల్ల వజ్రశరీరముజేసి మెడమీద జేయివేయ మఱచెనట. అది కారణముగ రాజపుత్రుడు శత్రునిహతుడయ్యె. ఉత్తమోత్తముడగు నారాజపుత్రుకొన్నెత్తురులజూచి హారవంశస్థులు రోషాయత్తచిత్తులై శత్రువులకుత్తుకలు గోయనుంకించిరిగానిమారువారు రాజతల్లిదేశము నెత్తురువరదలగుననుభయమున కొడుకుంబిలిచి యాపోరాటము మానిపింపదలచి యిట్లనియె. "ఇట్టి మహావీరవంశమునిష్కారణముగ నాశనముకాగూడదు. తలపాగకుజరిగిన యవమానమునకు దగినట్లు కసిదీర్చుకొనుటయైనది. మనయాడుపిల్లలలో నొక తెనాలూహారుకిచ్చి పెండ్లిచేయుదము ఇప్పుడు పోయిన బాలుని వెలితి కనబడకుండ నామెవలన వీరసంతతి కలుగ గలదు."

రాజమాతపలుకుల కందఱుసంతసించియట్లుచేయుమనిరి. మారువారు రాజుతత్క్షణము తనకూతు నాలూహారునకిచ్చి వివాహముచేసెను. అతడు వధూసమేతుడై బుమోడాకుబోయెను. వారిరువురకుబెద్దలుతలంచినట్లు గుమారుడుదయింపలేదు. కానియొకకూతురుదయిం

చె. ఆలూహారుఁడు తనకు పుత్రసంతానము లేకున్నను గూఁతువలన నైనవీరరసావతారులగుదౌహిత్రులుగలిగి వంశమునకుఁ బ్రతిష్ఠాకారులు గావచ్చునని తలంచి యుక్తవయస్సు వచ్చినతోడనే యాబాలికకు వరుని వెదకి పెండ్లిచేయ నిశ్చయించి యావివాహమునకు నిష్టదేవతయగు దేవిని రమ్మని స్వయముగ నాయాలయమునకుఁబోయిపిలిచెను.

అంతట వివాహముహూర్తము సమీపింప నంతయు సిద్ధమయ్యె. రాజబంధుగులందఱు సమావేశమైరి. ఆశుభకార్యమునందు గడుపునిండ కూడుదొరకునని పుట్టెడాసతోబిచ్చగాండ్రువందలకొలఁది సభాభవనసమీపమున నిలిచియుండిరి. ఆవచ్చిన నిరుపేదలలో నొకముసలియవ్వ యుండెను. ఆమెమొగము ముడుతలువాఱెను. తలముగ్గుబుట్టవలె నఱసెను. ఆయవ్వ దట్టముగ మూఁగినజనుల నొత్తిగించుకొనికొంచెము ముందుకుఁబోయి"నాకాలూహారునితో మాటలాడవలసిన పనియున్నది. కావున వానిం బిలువుమని ద్వారపాలకునితోఁ జెప్పెను. వాఁడును దానిం బరిహాసముజేయుచు నీకు రాజుగారితో మాటలాడవలసిన పనియున్నదా?ఓసీ! అవకతవకముండ చాలుజాలు నీపాటికి వతలకుఁబొమ్మ్. రాజుగారికి నీతో మాటలాడుటకంటె నెక్కువయవసరపుఁబనులు లేవనుకుంటివా? నీమాటలుచాలించి ముసిలికంపుకొట్టకుండ దూరముగ బొమ్మని కసరి కొట్టెను.అయ్యో!ఆతఁడేవచ్చిస్వయముగ నన్నుఁబిలిచినాడయా!"యని యామునసలి మరల మెలుగెత్తి పలికెను. పలికినను ద్వారపాలు రానీను దరిఁజేరనీక తరిమిరి.

ఆయవ్వ ద్వారపాలురు తన్నుఁదరుముచుండఁగిక్కురుమనకుండ నావలకుఁబోయి యాలూహారుఁడు స్వయముగా దననిలయమునకుఁబోయి వివాహమునకు రమ్మని పిలిచివచ్చినప్పు డావివాహమున నానాహానము విసర్జనములేకుండ ద్వారపాలకులచేత గెంటించినందుకుగోపోద్దీపితయై వానిని శపించి యంతర్ధానమునొందెను. అదిమొదలామెమె

వ్వరికిం గనఁబడ లేదు. ఆవచ్చినముదుసలియవ్వయే యాలూహారుని యిలువేల్పగు దేవి. ఆమెయిచ్చిన శాపవశమున నాలూహారుఁడుస్వల్ప కాలములోనే లోకాంతరగతుఁ డయ్యెనఁట.

అతఁడు మృతినొందినను వానివంశస్థులశౌర్యము వానితోనంత మొందక తరువాతకూడ నప్పుడప్పుడు బ్రికటిత మయ్యెను. ఈహారవంశస్థులకుఁబర్వతద్వారసంరక్షకులనియొకబిరుదునామముఁగలదు.ఆలూహారుఁడు పోయినకొంత కాలమునకు గోమానుసిం గనునొక హారవంశస్థుఁడు పర్వతద్వారసంరక్షకుఁడుగనుండెను. అతఁడుద్వారసంరక్షకుఁడు గనున్న పర్యంతముమాళవసంస్థానమునకుఁగోటాసంస్థానమునకునడుమ హారవంశస్థుల దేశమునకుదక్షిణముగనుండెను. పర్వతద్వారసంరక్షకుఁడగుగోమానుసింగు మహావీరుఁడైన కోటసంస్థానప్రిభువునకు లోఁబడి యుండెను. గోమానుసింగు తనప్రిభువునెడల భక్తిశ్రిద్ధలు కలిగి తనపని నిర్వహించుచున్నను మచ్చరముచేత నెవ్వరోదురాత్ములు వానిమీదప్రభువుతోఁగొండెములు చెప్పిరి. ఆకొండెములు విని యజమానుఁడగు కోటసంస్థానప్రభువుగోమానుసింగునుబిలిపించివానియుద్యోగము నధికారము ధనము భూములు మొదలగు సర్వస్వము నూడదీసికొని దేశమునుండి వెడలనడచెను. ధనము నధికారము బోయినందుకుగోమానుసింగు మిక్కిలివిచారింపలేదు గాని తనసంశస్థులకందఱకుఁ జిరకాలమునుండి జరుగుచున్నపర్వతద్వారరక్షకత్వముదీసివేసినందుకుమిక్కిలి చింతించి పోవుటకుఁబయలుదేరి కొంతదూరమరుగమార్గమధ్యమునఁదనమీఁద ప్రిభువుతో. గొండెములు చెప్పినదురాత్ముడు పల్లకినెక్కి కొంతపరివారము వెంటరాఁ బెద్దగాగడాలు వేయించుకొని తీవితోఁబోవుచుండగఁజూచెను. చూచి కోపముబట్టజాలక కాగడావాని నేలంగూల్చి పల్లకీలోనున్న యామనుష్యునిఁదనయీటెతోఁబొడిచిపరివారము చెల్లాచెదరుగ జేసి కొంతవఱకు, సంతుష్టుఁడైగోమానుసింగు తిన్నఁగా

తననివాసస్థలమునకుఁ బోయి పరివారమునుజేరఁదీసుకొని కోటాప్రభువు తన కితరద్రోహమేదియుఁ జేయుటకుఁ వీలులేకుండునట్లు తత్క్షణమే మీవారు రానావద్దకుఁ బోయి వాని శరణుజొచ్చెను.

ఆరానా వానియందుఁ దయాళువై పోషణమునిమిత్తమువాని కొకచిన్న సంస్థానమునిచ్చి యాదరించెను. గోమానుసింగు తనదుఃఖమునుమఱచి కొంతకాల మతనియొద్ద నుండెను. అటులుండ నంబరుసంస్థానప్రభువు కోటసంస్థానప్రభువుమీఁద దండువిడిసిముఖ్యపట్టణమును ముట్టడించుచున్నాడని మీవారులో నొకవార్త-దయలుదేరెను.ఆవార్త-వినినతోడనే గోమానసింగు పూర్వసంబంధమును జ్ఞప్తికిఁదెచ్చుకొని పూర్వవైరమునుఁ దక్షణమె మఱచి తనపూర్వయజమానుఁడగు కోటాప్రభువునకు సహాయముఁ జేయనిశ్చయించుకొని మీవారు రానావద్ద సెలవుపుచ్చుకొని కొంతపరివారము జేర్చి రాత్రియనకపగలనక నిరంతరప్రయాణములుచేసియతికష్టముమీఁదకోటపట్టణసామీప్యమునకుఁ జేరెను.అంతముకుమును పేయంబరురాజసైనికులుకోటాపట్టణమునుసలుదెసలం జుట్టిముట్టిపోతుటీగ యైనంజొరఁబడుటకు వీలులేనట్లుకాచియుండిరి. కావున నితరులకుఁగనఁబడకుండ గోమానుసింగుకోటాపట్టణముబ్రవేశించుటకు వీలులేక బహిరంగముగానే బోవలయుననిశ్చయించుకొనితనరణభేరీవేయించి నిర్భయముగ స్వసైన్యముఁ దీసుకొనియంబరురాజ సైన్యమధ్యమునుండి యారాజుగుడారము కెదుటనుండి బోవసాగెను. అంబరురాజదిచూచి "యెవఁడురా నాకువినంబడునట్లు రణభేరీ వేయించుకొని నాయెదుటనుండి బోవసాహసించినవాఁ" డని యడిగెను.

ఆపలుకులకు గోమానసింగే యిట్లుత్తరము చెప్పెను. "ఎవఁడా గోమానసింగు కోటాప్రభువునకు సహాయముచేయుటకు మీవారునుండి వచ్చుచున్నాఁడు"ఆమాటవిని యంబరురాజు "ఏమీ! గోమాను

సింగా! అతఁడేనిజముగ వచ్చినపక్షమున వాని నాకడకు గొని తెండు. అతఁడు మున్నొకసారి చేత నేయాయుధమును ధరింపక పెద్దపులినిజం పెనని మాతండ్రి చిన్ననాఁట నాకుంజెప్పుచువచ్చెను. ఆమవీహారునొక్కసారి కన్నులారజూడవలయునని యున్నది. తీసికొనిరండని సేవకులకాజ్ఞాపించెను. సేవకులు గోమానుసింగునుదమప్రభువునొద్దకు రమ్మనియడుగ నతఁడొక్కఁడు పోవుటకిష్టము లేకపరివారసమేతుఁడైయంబరురాజెదుటకుఁబోయెను. ఆరాజు గోమానుసింగును సగౌరవముగనాదరించి కోటాపతిభువునకుసహాయముచేయవలదనియుఁదమపక్షముననిలువవలసినదనియు వానిబలువిధముల బ్రార్థించి తనపక్షమున నున్న యెడల జాలధనమిచ్చెదనని వాగ్దానము జేసి మరియునిట్లనియె. "కోటాపతిభువు నిన్ను మున్నొకసారి పరాభవించెను. నిన్నింతయవమానము పాలుచేసిన ప్రభువునకు నీవెదురుతిఁరిగినచో నందుతప్పేమియు లేదు. అదియునుగాక పట్టణము నాకులోబడకతప్పదు. అది యెఱిఁగియెఱిఁగియేలనీవుమృతినొందసాహసించెదవు. ఈతమలపాకులచుట్టనమలునంతసేపటిలో కోటాపట్టణము నాచేతఁ బడునుచూడు నాదెబ్బ" ఆరాజుపలుకులు చెవులంబడుటయు గోమానుసింగు మహాకుపితుఁడై కనులెఱ్ఱజేసి "ఇరువదివేలమంది హారవంశస్థులనెత్తురులు ప్రవహింపకుండనీవు కోటాపట్టణము పట్టుకొనలేవు. నీలంచములు నాకక్కరలేదు. ఇదిగోసలాము. పోయివచ్చెద"నని చివాలున లేచిపోయెను.

అంబరురాజుకూడ మిక్కిలిసరసుఁడగుటచేఁ దనయధీనములో నున్నను వానినిప్పుడేమియు ననక గోమానుసింగు దనసైన్యమధ్యము నుండి కోటాపతిభువునొద్దకుబోవనిచ్చెను. గోమానసింగువానివద్దనుండి తిన్నగావచ్చి కోటాపట్టణముపక్క బారుచున్ననది కావలియొడ్డున నిలిచి "పర్వతద్వారసంరక్షకులము. నావకావలయును పంపుము పంపు" డని కేకలు వేసెను. కోటాప్రభువుతనకోటలోఁగూర్చుండియాకేకలువిని

మెవరో వారిని దెమ్మని నావ పంపెను. అదియెక్కి యేరుదాటిగోమా నుసింగు పరిభువుసన్నిధిజేరి నమస్కరించి నిలిచెను. ఆపరిభువుమున్ను తనచేత నవమానింపఁబడి ధన మపహరింపఁబడి దేశభరిష్టుఁడై యుండి యు వెనుకటి పగలు మఱచి మరల దనకు సాయముచేయవచ్చినయా యున్నతచిత్తునిజూచి లజ్జయునానందముసంభరిమముదోపదెల్లబోయి చూచి కౌగలించుకొనెను. వెనుకతానుచేసినయపరాధములు క్షమింప మనుటకుగాని క్షమింపమనికోరుటకుగానియపుడుచేసిన సాయమునకు జాలసేపు కొనియాడుటకుగాని కోటాపరిభువునకు వ్యవధిలేకపోయెను. ఏలయన వారిరువురు మాటలాడుటకు మొదలుపెట్టినతోడనేపగతురు పిరంగులతో కోటగోడ బగులగొట్టజొచ్చినారనివర్తమానములువచ్చె ను. అది విని గోమానుసింగు మాటలు కట్టిపెట్టి పరిభువునకుగడపటిస లాముచేసి తనపరివారముచు వెంటబెట్టుకొని యుద్ధమునకుజొరబడెను. చొరబడి కంఠమునప్రాణమున్నంతసేపు శతృవులు కోటగోడవద్దకు రాకుండ నాతఁడుతరిమెను. ఎట్టకేలకు పగతురసంఖ్యయత్యధికమగు టచే నాతఁడు చేయునదిలేక తనబలగముతో మరణమొంది కీర్తి శేషుఁడయ్యెను.

హారవంశస్థుల యపరితిహతపరితాపము పైకథలనుండి తెలిసి కొనవచ్చును. వీరు తక్కినరాజపుతురిలవలెనే మహాభిమానధనులై యశోవిశాలురై పరిసిద్ధికెక్కిరి.

—

# పతివ్రతాశాపము



ఒకనాఁడు మీవారు రానాయొక్క పరిచారకులు కాలువులో నీరు త్రోడివేయుచుండఁ జూపరకు మహాశ్చర్యముగ నాలుగు చేతులున్న విగ్రహమొకటి యందులో దొరకెను. అందొక బాహువుపై కెత్తియుండెను ఒకటి క్రిందికి చాపియుండెను. వేరొకటి ముందుకు సాగియుండెను. నాలుగవది యిట్టివిధముగ నున్నదని చెప్పుటకు వీలు లేనట్లుగ నుండెను. రానా యావిగ్రహమును జూచి తన యాస్థానమందలి విద్వాంసులను కవిత్వము జెప్పు చారణులను బిలువనంపి యాబొమ్మ మూడు చేతులు మూడు విధములుగ నుండుటకుఁ గారణమేమని యడిగెను. కాని వాని ప్రశ్నమున కెవ్వరుఁ దగిన యుత్తరమీయలేకపోయిరి. అంతట రానా మిక్కిలి కోపించి సమయమునకుఁ దగిన యుత్తరము చెప్పలేని చారణులెందుకని వారిని దేశమునుండి వెడలఁగొట్టెను.

అంతఁ గొంతకాలమున కొకనాఁడు దేశాంతరమునుండి యొక క్రొత్త చారణుఁడు వచ్చి యాబొమ్మచేతు లట్లుండుటకుఁ గారణము తనకుఁ దెలియునని జనులతోఁ జెప్పెను. రానా వాని సంగతి విని దగ్గరకు రావించి యావిగ్రహవృత్తాంతము చెప్పుమనన తఁడిట్లనియె. "పైని స్వర్గాధిపతియగు నిందుఁ డొక్కఁడే యున్నాఁడని తెలియుట కొక చేయి యెత్తియున్నది అడుగున మహానరకలోక మున్నదనియు దానికొక నాయకుడున్నాఁడనియుఁ దెలుపుట కొక చేయి క్రిందికి జాపియున్నది. ఆ స్వర్గనరకలోకములకు నడుమ భూలోకమందు సత్పురుషుఁడు మీవారు రానా యొక్కఁడే యున్నాఁడని మూడవ చేయి చూపుచున్నది" ఆ చారణుఁడు చెప్పిన యుత్తరము సహేతుకముగ నున్నదని రాజు కొలువులోని వారం దఱునిరి. రానాయు వాని నోటం జక్కెరఁ బోసి వానికిం దగిన పారితోషక

మీయఁదలచెను గాని యతఁ డెవరివలన బహుమానముఁ బడయుట లేదనిచెప్పి దానినిస్వీకరింపక యదివఱకు దేశమునుండి వెడలగొట్టిన చారణులను వెండియురప్పించి సన్మానింపవలయునని కోరెను. రానా వానికోరికప్రకారము వారినెల్లర రావించి యాదరించెను. ఈచారణుఁడును మీవారునందె కాపురముండి రాణా పెద్దకొడుకునకనగా యువ రాజునకు నాప్తమిత్రుఁడై యుండెను.

ఆయువ రాజొకనాఁడు షికారుపోయి మరలనుందిరమునకరుగుచుండ వానికంటి కొకవృద్ధబ్రాహ్మణుం డగపడెను. వాని మొగము కడుదీనముగ నుండెను. చేతిలో నొక కొబ్బరికాయయుండెను. రాజపుత్రులు వివాహవిషయములుమాటలాడబోవునప్పుడుసాధారణముగ కొబ్బరికాయఁ దీసికొనిపోవుట యాచారము. యువరాజువిప్రుఁబిలిచి "అయ్యా నీకేమి కావలయునీ మొగమిట్లుచిన్నబోయిన దేమనియడిగెను. వానికిబ్రాహ్మణుఁడిట్లనియె. "నేను బూందీనుండివచ్చుచున్నాను. హారవంశస్థుఁడైన యాసంస్థానాధిపతి లాలాజీ తనకూఁతునుమీవారు రానా కీయఁదలచి నన్నుబంపె. కాని రానావారికి లాలాజీఁకూతును వివాహమాడుట కిష్టములేదు కావున నేలవచ్చితియని సిగ్గుపడి తల వంచుకొని పోవుచున్నాను"

అప్పలుకులు విని యువరాజు జాలినొంది యిట్లనియె "నాతండ్రి వేరొకభార్యను స్వీకరింపనిష్టపడలేడుగావుననేనేమీరాజపుత్రికను వివాహమాడెదను. అట్టిసూరున కిట్టిపరాభవముజరిగినదని నాకువిచారముగ నున్నది. కాఁబట్టి సత్వరమెపోయిమీవారు రాజపుత్రికనీకు మార్తైను బాణిగ్రహణము జేసికొనితీసికొనిపోవునని మీరాజుతోవిన్నవింపుము" లాలాజీ యాయువరాజు పంపినసందేశమువిని తద్దయు సంతసించి బుమోజాకోటలో వివాహముచేయనిశ్చయించిదానికిఁగావలసిన సంబారములన్నియుందెప్పించిపెద్దప్రయత్నముచేసెనుసుముహూ

ర్ణముఁనాటికి యువరాజు ప్రియమిత్రుఁడగుచారణునిదీసికొని మహ సన్నాహముతో దరలివెళ్ళెను. అప్పు డెల్లవారు మహానందభరితులై యుండిరి. లాలాజీ తన కంతటివారితోడ వియ్యమంటగలిగెననివచ్చిన చారణులకుఁ గవీశ్వరులకు ననేకబహుమానములనిచ్చెను. ఆసమయ మునఁ బెండ్లికొడుకు స్నేహితుఁడగుచారణునకుఁగూడ మంచిబహు మానములీయదలంచి జరీజీనుగల గుఱ్ఱమును విలువగల వస్తువులను రొక్కముగల యొకసంచియు నర్పించెను. చారణుడు మొట్టమొదట బహుమానములు తానుస్వీకరింపనని ప్రతిజ్ఞ చేసి విలువయతి శయముగనుండుటచే నెట్టకేలకుఁ బరిగ్రహించెను. అంతట వివాహ మారంభమయ్యెను. వధూవరుల పాణిగ్రహణసమయముసమీపించెను. అప్పుడుపెండ్లికుమారుని మిత్రుఁడగు చారణుఁడు చచ్చె చచ్చె నని యొకఘోరవార్త రాజబంధువుల చెవులంబడెను. ఆచారణు నెవ్వరు జంపలేదు. ఎవ్వరివద్దనుండి బహుమానములు గ్రహింపనని మొదట విఱ్ఱవీగి కక్కురితిచేత నెట్టకేలకు లాలాజీవద్దనుండి బహుమానము స్వీకరించినందుకుఁ దనలోదాను సిగ్గుపడి యాచారణుఁడు పొడుచు కొని చచ్చిపోయెను. పెండ్లికొడుకు మిత్రునిమరణవార్తవినియెవరో చంపినారనుకొని పెండ్లికూఁతురు చేయివదలి పాణిగ్రహణము ముగి యకుండనే మిత్రుం జంపినవారిమీదఁ బగదీర్చుకొనుటకై కావలకుఁ బోయెను. అనంతరము మితిమీరినకవళముపుట్టెను. తనమిత్రునెవరో చంపినారనుకొని పెండ్లికొడుకు వారింజూపుమని కేకలువేయసాగెను. పెండ్లికూఁతురువారు చారణుని చావుమాటదలఁపక పెండ్లికొడుకు దమకన్య పాణిగ్రహణము ముగియకుండ లేచిపోయి తమ్ములను దమ కులమును మిక్కిలి యవమానపఱచినాడని యామగౌరవము భరింప లేక రోషావేశపరవశులైరి. ఎట్టకేలకు హారవంశస్థులుపెండ్లికొడుకును వానిచుట్టములను బుమోడాకోటలోనుండి యావలకు గెంటిరి.

అంత కొంతకాలమునకు మీవారు రాజుకొడుకుకొంత సేనం గూర్చుకొని బుమోడాకోట ముట్టడించెను. కాని యాకోటదుర్గమమై దుర్భేద్యమై యుండుటచేమీవారు యువరాజుపట్టుకొనలేక యేమిచే యఁదగునని యోచింపుచుండ నంతలో వసంతకాలమువచ్చెను. వసంతకాలమురాఁగానే రాజపుత్రులు ముందుగనొకయడవిపందిం జంపిగౌరికి బలియీయవలయునని యొకపూర్వాచారముగలదు. ఆయాచారప్రకారము హారవంశస్థులు వసంతమునబుమోడాకోటవిడిచియడవిపందివేటకై వనములందిరుగుచుండ మీవారుయునరాజు సేనాసమేతుడై యాకస్మికముగ వారిపయింబడియెను. అప్పుడు సంకులయుద్ధమయ్యె ఇరుతెగలవారు పిరుదియ్యకపోయిరి. యుద్ధముముగిసినపిదపనిరుతెగలవారు స్వసైన్యములు జూచుకొనఁగా నుభయసేనాపతులు చచ్చినట్లు తెలిసెను. అనగా లాలాజీయును మీవారుయువరాజును మృతినొందిరి అనంతరము బుమోడాకోటలో రెండుచితులు పేర్పంబడియెను. అందొకదానిమీఁద లాలాజీభార్య భర్తశిరస్సు నొడిలోఁ బెట్టుకొని కూర్చుండెను. రెండవదానిమీఁద వివాహముగాకమునుపే విధవమైన లాలాజీకూఁతురు సహగమనము చేయఁదలఁచి కూర్చుండెను. రెండు చితుకుల నగ్ని దరికొలుపఁబడినప్పుడు కోటలోనున్న పరివారమంత యుఁగ్రొత్తపెండ్లికూతురువద్ద శలవుపుచ్చుకొని యామె యేమనునో విన౯గోరియుండ నంతలో నాబాల యిట్లనియె. "బూందిప్రభువులు మీవారు ప్రభువులు వసంతకాలమునఁ బందివేటలోనెన్నఁడు గలిసికొనవద్దు. కలిసికొందురామరణము తప్పక సిద్ధించును." అప్పలుకులు పలికి యాబాలిక యగ్నికాహుతి యయ్యెను.

అనంతరము స్వల్పకాలములోనే యామెపలికిన పలుకులఫల మగుపడెను. మీవారురాణా వెనుక మహమ్మదీయులు దండెత్తి పాడుచేసిన తనరాజ్యమును మరల జక్కఁజేసికొనఁదలఁచి మున్నుద

నకుఁ గప్పము గట్టునట్టి రాజులందఱు నురల లోఁబడియుండుడని చెప్పి బూందీపరిభువునకుఁగూడ నట్టివర్తమాన మంపెను. బూందీప్రభువులోఁబడియుండుట లేదనిచెప్పి యంతతోఁబోక రక్తవస్త్రములు దాల్చినమైదువందలసైనికుల వెంటఁబెట్టుకొని సరిహద్దులలో నేమరి పాటుననున్న మీవారురానా సైనికులపయింబడి వారిందుత్తునియలుగ నఱకెను. మీవారురానా తనప్రాణముఁ దక్కించుకొనుటయే మిక్కిలి కష్టమయ్యెను. పిమ్మట రానాకోపావేశమునం బరవశుఁడై బూందీపట్టణము పట్టుకొనువఱకునన్నము దినుటలేదని యొట్టుపెట్టుకొనెను. ప్రతిన నెరవేర్చుటకై రానా సేనలంగూర్చుకొని తనరాజధాని కఱువదిమైళ్ళ దూరముననున్న బూందీపట్టణమునకుఁబోయెను. కాని యాకోట దుర్భేద్యముగ నుండుటచేఁ గోటస్వాధీనమగులోపల రానా యాకలిచే జచ్చిపోవచ్చునని భయపడి సేనాపతులు పట్టినపట్టు విడువుమని రాజుం బ్రార్థించిరి. కాని యతఁడుచేసిన ప్రతిన నెరవేరవలయుననియె. అంతట సామంతులు రాజునకుఁ బ్రాణభయమువాటిల్లునని యోచించి రానాతోనిట్లనిరి. "చిత్తూరులో మనమొక మట్టికోటగట్టి దానికి బూందీ యనిపేరుపెట్టి యాకోటను ముట్టడించిపట్టుకొందము. నిజమైనబూందీకోటనుఁ బట్టుకొనఁజాలకున్నను మన మాత్రకొత్తబూందీకోటనైనఁ బట్టుకొని ప్రతిజ్ఞ నెరవేర్చుకొన్నవార మగుదుము." రానాకుఁ గడుపులో నాకలి హెచ్చినకొలఁది పంతము తగ్గగా మంత్రులు జెప్పిన యాలోచన మంగీకరించెను. వెంటనే చిత్తూరులో నొకమట్టికోట బయలుదేరెను. దానికి వారుబూందీయని పేరుఁబెట్టిరి. ఆకోట ముగిసినతోడనే రానా సేనాసమేతుఁడై దానిని ముట్టడించెను. కాని లోపల నెవరు లేరని వారు తలంచుచుండఁగాఁ జిత్రముగ వారిమీఁద తుపాకిగుండ్లవర్షము గురిసెను. దాని కారణ మిది. బూందీప్రభువుల బంధువుడు

హారవంశస్థుఁడునగు నొకరాజపుత్రుడు చాలకాలమునుండి మీవారు రానాగొలువుతో నుండెను. అతఁడు లేడివేటకుబోయి తిరిగి చిత్తూరు వచ్చుచు సేనాసమేతుడగు రానాను నూతనమగు మట్టికోటను జూచి యది యేమని యచటివారినడిగి రానాప్రతిన చెలించుకొనుచున్నాడనివిని తనజన్మస్థానమగు బూందీకోటకు బేరునకైన నట్టియవమానము గలుగగూడదని తనపరివారముందీసికొని మీవారురానాను దాకెను. అప్పుడు సందడికయ్య మయ్యెను. హారవంశస్థుఁడు వానిపరిచారకులు తుపాకులతోను ఖడ్గములతోను ఘోరయుద్ధము చేసి నిజమయిన బూందీపట్టణపు ముట్టడిలో నెంతపని జేయుదురో నీయబద్ధపు ముట్టడిలోగూడ నంతపనిచేసి కోట గుమ్మమువద్ద ప్రాణములు విడిచిరి. హారవంశస్థుల యభిమానమును రానాచక్కగాగుర్తెఱిగి యటుపిమ్మట వారితో నెన్నడు గలహమునకు డీకొన డయ్యె. అదిమొదలు రెండువంశములు మైత్రిగలిగియుండెను. తరువాత వారుభయులు సంబంధబాంధవ్యములు చేసికొని చాలకాలము సుఖించి పతివ్రతాశాపమును సంపూర్ణముగ మఱచియుండిరి.

రత్నుడు మీవారురానా యైయుండగా బూందీప్రభువులతో సంబంధము మఱింత దృఢమయ్యెను. ఎట్లనగా నప్పటి బూందీప్రభువగు సురాజమల్లుని తోబుట్టువగు సుజాభాయిని రానా వివాహము చేసికొనెను. రానా చెల్లెలను సురాజమలు పెండ్లియాడెను.

సురాజమల్లునియొక్క తండ్రి బలమునకు ధైర్యమునకు సాహసమునకు జాల బ్రసిద్ధికెక్కినవాడయ్యు నల్లమందు మద్దతు మితిమీరి పుచ్చుకొనువాడు. సురాజమల్లుబలధైర్యసాహసముల యందే గాక మద్దతులోగూడ నచ్చగముగ దండ్రింబోలియుండెను. సురాజమల్లు మద్దతు పుచ్చుకొనవలయునని కోరిక పుట్టినప్పుడు సమయముగాని స్థలముగాని విచారింపక దానిం బుచ్చుకొని మత్తిలి నిద్రపోవు

ను. ఒకనాడతడు రానాను జూడబోయి మద్దతువేసి రానాయొక్క దర్బారులోనే తివాసిమీఁద ననేకరాజుల సమక్షమున నిద్రపోయెను అప్పు డొకరాజపుత్రప్రభువు గుబ్బుపట్టి నిద్రించుచున్న సుజమల్లు తోఁ బరిహాసమాడఁదలఁచితనదురదృష్టము తక్కినవారి దురదృష్టము గలిసి ప్రేరేపింపనొకగడ్డిపోఁచఁబుచ్చుకొని వానిచెవిలోఁద్రిప్పి చక్కిలి గింత గలిగించెను. కొలువు లోనిరాజులు దానింజూచి నవ్వుటకైన నెడమలేనంతలో సురాజమల్లు నిద్రమేల్కొని మద్దతుచేత నయనం బులు జేగురుముద్దలట్లు మెరయుచుండ దెబ్బఁతిన్న బెబ్బులివలె హుం కరించి కత్తిఁబూని యారాజపుత్రుని శిరస్సు కొబ్బరిపుచ్చివలె నెగ రఁగొట్టెను. కూర్చున్న రాజులు నిశ్చేష్టులైరి. రాజాధిరాజయిన తనకొలువులోఁదన మెట్టయెదుట ననేకరాజులు దన్నుఁ గొల్చుసమ యమునఁ దనకన్న నన్నివిధములఁ దక్కువవాఁడగు బూందీరాజు నిద్రపోవుటయు నాదుండగము చాలక తనపరివారములో నొకనిని చంపుటయుఁజూచి రానా బూందీరాజుమీఁద మిక్కిలికోపమువహిం చెను. చంపఁబడిన యారాజపుత్రుని కుమారుఁడు రానావద్ద జేరి సమయమయినప్పుడెల్ల సమిధలువేసి యాకోపాగ్నిని బ్రజ్వరిల్ల జేయుచుండెను. అంతకుముందు సురాజమల్లు మొగమోటములేక వావియెంచక రానాకు బెండ్లిచేయ దలచిన యొకకన్య నెత్తుకొనిపో యి వివాహమాడెను. అందుచేతగూడ రానాకు వానియెడ జిరద్వే ష ముండెను. అవియన్నియు మనస్సులో బనిచేయుటచే నతడు చిత్తస్థిమితములేక సురాజమల్లు తరుచుగా తనరాజధానికివచ్చుట చె ల్లెలను జూచుటకుగాక యేదో కుట్రపన్ని తనకొంపదీయుటకే వచ్చు చున్నాడని యనుమానించి యెట్లు వానినావలకుఁ బంపనగునాయని యోచింపుచుండెను. రానాభార్యయగు సుజాభాయి శౌర్యముగల యంగన. తక్కిన రాజపుత్రస్త్రీలవలెనె నామెయునత్తవారింటి కీర్తి

కంటె పుట్టినయింటివారికీర్తి నెక్కుడుగ విస్తరింపజేయఁ దలంచుచుం డెను.

అదేవి యొకనాఁడు మగని సోదరుఁడగు సురాజమల్లునకు విందు జేయఁదలంచి వంట స్వహస్తముతోఁ జేసి వారినిద్దఱిని రావించి పసిడి పళ్ళెరములలో వడ్డించి తాను వింజామరతో విసరుచు బ్రక్కనునిలిచియుండెను. సురాజమల్లు మిక్కిలి యాఁకలిగొనియుండుటచే వండినపదార్థములు తమకముతో భక్షించెను. రానా యాఁకలిలేకయో కోపముచేతనో తిన్నఁగ దినడయ్యె. సుజాభాయి మగఁడు తనవంటకము యిట్లగౌరవించి నందుకు మనస్సులో నొచ్చుకొని పళ్ళెరములు దీసికొనిపోవునపుడు "బూందీరాజు పులివలె నారగించినాఁడు. రానా గారు చిన్నపిల్లఁడట్లు మెతుకులతో నాఁడుకొన్నారు." అని పరిహాసించెను.

ఆపలుకు రానా చెవులకు శూలములట్లు నాటినందున తనమఱఁదిమీఁద పగదీర్చుకొన నిశ్చయించి యది సమయముకాదని వానితో నెప్పటియట్లమాటలాడుచు "రాఁబోవువసంతకాలమునమనమిరువురము కలసి బూందియడవులలోబందివేఁటసల్పుద మని చెప్పిబహుమానములిచ్చి వానిని స్వదేశమునకుఁబంపెను. సురాజమల్లు బావగారిమాటలకు మిక్కిలిసంతసించిస్వనగరమునకుఁబోయెను. అంతటవసంతకాలము ప్రాపింప బూందీరాజు వేఁటవెడలి చంబల్‌నదీతీరమునందలి యడవులలోవిహరించుచుండెను. మీవారు రానాయును వేఁటకొఱకాపరిదేశమునకేపోయి మఱదింగలిసికొనెను. ఇరువురపరివారములోనున్న రాజపుత్రశూరులు వేఁటదమతమతావులయందునిలిచి మిక్కిలి విలాసముతో నుండిరి. బావమఱఁదులిద్దఱనరససల్లాపములతో గొంతప్రొద్దుగడపివేఁటసమకట్టిరి. ముఖ్యస్థానములో రానాయుబూందీప్రభువునొకరితరువాత నొకరునిలిచిపందికై యెదురుచూచుచుండిరి. రాణాసమీప

ముగ వానిదాదికుమారుఁడు, సురాజమల్లుచేఁ జంపఁబడిన రాజపుత్రుని కుమారుఁడు, జెరియొకపక్కనుండిరి. సురాజమల్లుమిక్కిలిజాగరూకుడై యేనిమిషమున నడవిపందికత్తులవంటి కోరలతో వెడలివచ్చి మెవనిమీఁదఁబడిచంపునోయని చెప్పవాల్పక వదలకచూచుచుండెను. అంతలో ఁవ్వుమనిధ్వనితో నొకబాణము సురాజమల్లువైపునకువచ్చెను. ఆధ్వని విని యతఁడు మెడత్రిప్పి వెనుకకుచూచి యాబాణము రాణావద్దనుండి వచ్చుటఁజూచి యేదోమృగముమీఁద వేయగానదిగురితప్పి తనవంకవచ్చెనేకాని యుద్దేశించివేయలేదనుకొని యాబాణమునుతన కత్తితో రెండుముక్కలుచేసి యపాయమునుదప్పించుకొని యట్టిపొరబాటు రాకుండజాగ్రత్తగానుండుమని రాణాతోఁ జెప్పుటకు రెండడుగులుపెట్టెను. అంతలో రాణాయొక్క దాదికొడుఁకు మరియొకయమ్ము వింటఁదొడిగి సురాజమల్లుపై విడిచెను. బూందీప్రభువు దానిందప్పించుకొని విస్మితుఁడై జూచుచుండ నంతలో రాణాయేమరిపాటునగుభాలునవచ్చి వానిపయింబడి కత్తితోనొక్కపోటుపొడిచెను. సురాజమల్లుని పరిచారకులుదూరముననుండుటచేతనో దగ్గఱనున్నను స్త్రీవలెరక్షణకై సహాయమడుగుట వానికిష్టము లేకుండుటచేతనో నతఁడుక్రిందపడియుఁ గేకలు వేయకగాయమునకు దనశాలువును గట్టిగఁజుట్టిరక్తముతాకుండ యాపెను. పోటుపొడిచినతోడనే పిఱికిబంటగు రాణా దనమఱఁదిచచ్చిపోయెననుకొని తిరిగిచూడక యచ్చోటువిడిచిపారిపోయెను. "నీవెంతవేగముగ బసుగెత్తినను నీప్రాణముదక్కదు, నీకును మీవారునకును ఋణముదీరినది" యని గాయములచేత బాధపడుచు నేలబడియున్న సురాజమల్లు కంఠమెత్తి కేకవేసెను. సురాజమల్లుచే జంపఁబడిన రాజపుత్రునికొడుకు రాణానుజూచి "సగముసగముగాజేసినపనివలనలాభముండదు. చేసినపని పూర్తిగాజేయు" మని యుపదేశముచేసెను. ఈయుభయులపలుకులచే రాణారోసముదెచ్చుకొని శత్రువుంగడ తేర్చుటకుమరల

బోయెను. సురాజమల్లుఁ డాజానుబాహువగుటచే వానిచేతులుతక్కిన రాజపుత్రులహస్తములకన్న పొడవుగనుండెను. ఆమాటమఱచి రానా వానింజంపుటకు సమీపమునను బోగా నేలబడియున్న బూందీరాజు మెల్లమెల్లగ నోపికదెచ్చుకొని చేతులుసాచి గుఱ్ఱముమీఁదనున్న రానా కాళ్లు పట్టుకొని క్రిందికిఁబడలాగెను. అంతట నేలఁబడినయాయిరువురుశూరులు నొకరినొకరు దొరకకుండఁ గ్రిందఁ మీఁదఁబడికొంత సేపవస్థపడ నెట్టకేలకు పృథుబలశాలుఁడగు సురాజమల్లుఁడు పగతునడుగునఁ బడవైచి మోకాలు వానిపైఁబెట్టి తన కైజారుతీసి వాని కుత్సితహృదయముపైకి వెడలివచ్చునట్లుపొడిచిలాగెను. రానాకిక్కురుమనకుండ ప్రాణమువదలెను. సురాజమల్లుఁడును వెనుకటిగాయముచేనీరసపడిమృతినొందెను. వారిబంట్లు వారివారి దేశములకుఁబోయి యజమానులదుర్మరణముల నంతఃపురస్త్రీలకుందెలిపిరి. ఆవార్త సురాజమల్లునితల్లివిని యించుకయైన వగవక కంటతడిపెట్టక వార్తదెచ్చిన వానితోనిట్లనియె "నాపుత్రుఁడు చనిపోయినాఁడుసరే పగవానింజంపకుండఁదానొక్కఁడె చచ్చినాఁడా? నిశ్చయముగ నాచనుబాలుద్రావిన వాఁడొంటిగఁబరలోకమున కెన్నఁడుఁబోఁడుగదా!" ఆసమయమున నామెమనస్సునగర్వము దుఃఖము నొకదానినొకటిమించి పైకివెడలవలయునని యత్నింపనెట్టకేలకు గర్వమేవెడలెను. ఆముసలియవ్వ గర్వముతో విజృంభించియున్న యాసమయమునఁ జిరకాలముక్రిందట శుష్కించిన యామెపయోధరములు సంతోషమున మరలనుబ్బెననియు నుబ్బినతోడనే రెండుపాలచుక్కలు నేలఁబడెననియు బడినతోడనే నేలతాపటముచేసిన రాతిపలకలు వానితాకునఁ బగిలెననియుఁ బెద్దలిప్పటికిం జెప్పుకొందురు. సుజాభాయి భర్తృమరణమువిని యదియంతయు మున్నుతాను జేసిన పరిహాస ఫలమేయని తెలిసి మగనితో సహగమనముచేసెను. ఆవిధముగానే రానా చెల్లెలు భర్తయగు సురాజమల్లునితో గలసిచితిపైఁబవ్వ

లించి మేనుఁదొరంగెను. ఈవిధముగ మఱియొకసారి వసంతకాలపువేట పతివ్రతా శాపప్రకారము ముగిసెను.

అనంతరము గొంతకాలము రెండుదేశములు నెమ్మదిగనుండెను. పదునెనిమిదవ శతాబ్దముయొక్క యంతమందు మీవారుసింహాసనము మీఁద గర్విపొగరుబోతునై నయరసీ యనునతఁడు గూర్చుండెను. బూందీరాజ్యమున నజితుఁడను నతఁడు పరిభువుగనుండెను. అరసీరాజ్యమునకు వారసుఁడగు సోదరపుత్రుని జంపి సింహాసనమెక్కినందున బ్రజలు వానిపై నిష్టములేనివారై యుండిరి. బూందీప్రభునగు నజితునకు చిన్నతనమందె తండ్రియగు బుమీడాప్రభువు రాజ్యమప్పగించి తానెక్కడికోఁపోయెను. మీవారు ప్రభువులకు బూందీప్రభువులకు బూర్వమునుండియు సరిహద్దుల కలహములుండెను. ఆపరిదేశములో బికేటా యను నొకచిన్నగ్రామముకలదు. ఆయూరుకడు చిన్నపల్లె సారములేని ఫుల్లమామిడికాయలుదప్ప నక్కడ మఱియేమియుబండమి యాయూ రెవ్వరికి లాభకారికాదు. ఆయూరిలో గొండలు బందెపోటువాండ్రుగలరు, ఆదొంగలు బూందీసంస్థానముపై బడి యూళ్ళుదోఁచి ప్రజలను బాధించుటచే బూందీరాజు తానాగ్రామమునకు హక్కువదలుకొని యా ద్రోపుడుకాండ్రయాగడములు నివారించుటకై యాగ్రామసమీపమున నొకసేన నిలిపెను. కొండెములుచెప్పిజీవించు మహానుభావులుకొందఱు రానాకడకుబోయి బూందీపరిభువు తమరాజ్యము నాక్రమించుకొనుచున్నాఁడని నేరములుచెప్పిరి. రానాయదివిని నిజమరయక బికేటా గ్రామమువద్దనుండి సేనలందీసికొనిపొమ్మని బూందీప్రభువున కాజ్ఞాపించెను. అంతట నిరుదెగలపెద్దలు కలహములు ముదిరిపోవునని భయపడి రానాకు బూందీరాజునకు సమావేశముచేసిరి, ఆకలహములో బూందీరాజు రానాయొక్క తీవిని గౌరవమునుజూచి సంతసించెను. అజితుని ప్రతాపము ధైర్యముజూచి రానా మెచ్చెను. ఈమెప్పులవలనగలిగినలాభ

మేమన బికేటాగ్రామమునుగూర్చి వివాదపడగూడదని వారుకృతనిశ్చయులై మైత్రిమెఱయ బూందీయడవులలో వసంతకాలపువేట కలసి సలుపునట్లొడంబడి తమపట్టణములకు బోయిరి. బూందీసంస్థానమునను న్న యడవులలోసందతగుట్టలని కొన్ని చిన్నకొండలుఁగలవు. అక్కడ వేటాడుటకు గావలసిన జంతువులన్నియు సనగా బెబ్బులిమొదలగు క్రూరజంతువులు జింక మొదలగు సాధుజంతువులు లభించును. అందు చేత రానాయాశపడి సందతగుట్టలలో వెనుక రెండుమూడుసారులు తమకులమువారికి ప్రాణహానికలిగినదన్నమాటమఱచి తిరిగి యాయడవులలోనే యాగుట్టలలోనేవేటాడుటకు నొప్పుకొనెను. వసంతకాలము రాగానే వారిరువురు వేటకుసన్నాహము సేయునప్పుడు పెద్దలువారిని రావించిరి, వెనుకటి బూందీప్రభువగు బోమిడారాజ్యము విడిచివిరాగియై తీర్థయాత్రలుచేయుచు తనకుమారుని వసంతమృగయాక్రీడమాట విని ప్రతివ్రతాశాపము వానికి జ్ఞప్తికిదెచ్చి వేటవద్దని వర్తమానమంపెను. కాని యజితుఁడునవ్వి యంతమాత్రమునకు భయపడి వేటమాననని చెప్పెను. అక్కడ రానాభార్య యజితునిభార్యసోదరియగుటచే వేటదోడి యల్లురకిద్దరకు నపాయము దెచ్చునని చెప్పి మానుమనిబ్రతిమాలెను, కాని రానా యామాట సరకుచేయడయ్యె.

రానాతో మీవారులోనున్న మంత్రిసామంతులందఱు వేట జూడవచ్చిరి. అప్పుడు ప్రధానమంత్రి రానాకు రావునకునొకచోట విందుచేసెను. ప్రభువులిద్దఱు తమతమపరివారములతోవచ్చి విందులారగించిరి. అంతవఱకంతయు నెమ్మదిగనే జరిగెను. భోజనానంతరమున బూందీరాజు మరునాడు వేటలో గురిసరిగనుండుటకు బెండలకడనిద్రింప దనగుడారమునకుబోయెను, పోయి నిద్రించుచుండ నర్ధరాత్రమున నతని గుడారమునకు నొకక్రొత్తపురుషుడుపోయి వానినిమేలు కొలిపెను, అతడు మీవారురానాగారి ప్రధానమంత్రియే, అర్థరాత్రమున

వచ్చి యేల నిదరిమేలుకొలుపవలసెనని బూందీప్రభువడుగ నాతఁడిట్ల నియె, "స్వామీ! యిది నాతప్పుగాదు, మా రానాగారు వెనుకటిసంధిమాటలు మఱచి బికేటా గ్రామమువద్దనుండి తక్షణమే మీసేనల దీసికొని యావలకు బోవలసినదని మీతో చెప్పుమనినారు, మిమ్ము నోట నుచ్చరింపరాని బండబూతులుదిట్టినారు." ఆపలుకులువినియజితుఁడు మిక్కిలి యక్కజపడి చూడసాగెను. అంతలియదార్థమేమన రానా నిజముగా యజితునివద్ద కట్టిరామభారమంపలేదు, రానాయొక్క పరిపాలనము కూరిరముగ నుండుటచే నది భరింపలేక యేదో కలహము పెట్టి యుద్ధములోఁ గడతేర్చినపక్షమునఁ దాముసుఖింపవచ్చునని మంత్రి సామంతులు యోచించి యాబూటకములు పలుకుమని ప్రధానమంత్రిని బూందీప్రభువు కడకంపిరి. ఆదూయువాక్యములు పలికి మంత్రితన సంకల్పము కొనసాగునని సంతసించి తననిలయమునకుఁ బోయెను. మరునాఁటి యుదయమున నిద్దరుప్రభువులు వేటలోఁగలిసికొనిరి. బూందీరాజు తనయెడ రానాకావించిన వెనుకటిద్రోహములఁ నప్పటిద్రోహములఁ దలఁచి చంబల్ నదియొడ్డున వానిం బలిప్పట్టవలయునని నిశ్చయించుకొని సమయము దొరకకనో మనోధైర్యము లేకనో వేఁటలోనేఁ జంపక యూరకుండెను. దినాంతమందు వేట ముగిసినపిదప రానా యజితునిఁ బిలిచి మందహాసముతో మాటలాడి మరునాటియుదయమున మరల కలిసికొనవలయునని చెప్పిపంపెను. అజితుఁడు సరేయని కొన్నియడుగులు నడచి మరల వెనుకకుఁబోయి మరల సందేహించి నడయాడఁజొచ్చెను. అజితునకుఁ దనమాటలయర్థము తెలియలేదేమోయని రానా విస్పష్టముగాఁ జెప్పఁదలంచి "మీరింక వెళ్ళవచ్చును రేపుదయము గలిసికొండ"మని పలికెను. మంచిదని యజితుఁడు మరలిపోయెను. పోయినట్లేపోయి యజితుఁడు చివాలున వెనుకకుఁదిరిగి యరిసీమీఁదఁబడి యీఁటెతో వానిని వానిమె

క్కినగుఱ్ఱమును దూసివెళ్ళునట్లుఁబొడిచెను. కూరుఁడగు నజితుఁడు రానాను దుదముట్టింపఁ దలఁచి మరల ఖడ్గమునెత్త మరణమునొందుచున్న రానా "ఛీ! యేమిపని జేసితివయ్యా" యనిపలికెను. రానాయొక్క మంత్రిసామంతులు సేనాపతులు మహాభయావిష్టులై సూర్యబింబధ్వజమును బట్టుకొని బూందీపరిభువుజోలికిఁబోక తిరిగిజూడక చెల్లాచెదరై పరుగెత్తిరి. శిబిరము నిర్జనమయ్యెను. రానామృతినొందెను. వానికళేబరముఁ గాఁచువారుగాని జూచువారుగాని లేరైరి. ఆ తఁడుదయమున వేటాడి తరిమిన కూరసత్వము లే వానిశరీరముభక్షింప వచ్చెను. రానా తనవెంటఁ దెచ్చిన పరివార మంతలో విశ్వాసము గలదొక్కయాఁడుది యుండెను. ఆమెవానిభార్యకాదు. అదియొక యుంపుడుకత్తె. ఉంపుడుకత్తె యయినను బతివ్రత. ఆమెపారిపోవక రానాయున్నకడకుఁ బోయి కొందఱిసేవకులంబిలిచి మహారాజును దహనముచేయుటకొకచితియైనఁ బేర్పుడని ప్రార్థింప వారియ్యకొని యొకచెట్టుక్రింద చితి పేర్చి శవమును దానిపైఁబెట్టిరి. ఆకాంత యంతట నాచితిపై నెక్కి శవము నొడిలోఁబెట్టుకొని నలుదెసల నగ్నిదరికొల్పుమని సేవకులకాజ్ఞాపించి నిప్పంటుకున్నతోడనే యిట్లనిపలికెను. "ఓ విశాలవృక్షమా! నేపలికెడుపలుకులువిని విన్నట్లు సంజ్ఞనేదైనఁ జేయుము. ఈదినమున శత్రువుఁడు పూర్వవిరోధకారణమునఁ జంపెనేని వాఁడు నిర్దోషియై సుఖించుగాక! అట్లుగాక ద్రోహబుద్ధితో నిష్కారణముగఁ జంపెనేని యాహంతకుఁడు రెండునెలలు దిరుగకుండ లోకమద్భుత మొందునట్లు దారుణమరణము నొందుగాక!" ఆవచనములామె నోటనుండి వెడలినతోడనే చెట్టునుండి యొకపెద్దకొమ్మవిరిగిపడెను. ఆయింతి తనమాటలకు వృక్షము ప్రత్యుత్తరమిచ్చెనని సంతసించి రానాపక్కబండుకొని యగ్నిలో గ్రుగ్గెను, ఇదిజరిగిన రెండునెలలకే యజితునకు దారుణమగు కుష్టవ్యాధి ప్రవేశించెను. ప్రతిదిన

ము వానిమొముకలనుండి కుళ్ళుమాంసము ముక్కలుముక్కలుగ దె గిపడుచు వచ్చెనఁట. అదిప్రవేశించిన యల్పకాలములోనే యతఁడు మృతినొందెను. అయిన ప్రభువులిద్దఱు నడవిగలిసిపోవ మీవాపుగద్దె మీఁదను బూందీగద్దెమీఁదను బాలకులిరువురెక్కిరి. ఎక్కినదిమొద లు రెండుసంస్థానములకు నాపదలు పరంపరలుగ వచ్చెనట. ఈవిధ ముగ మూడవమారు పతివ్రతాశాపము ఫలించెనని పెద్దలుచెప్పుదురు

కలియుగములోనీవిధముగస్త్రీలుశాపములిచ్చుటయునిచ్చినట్లు సరిగాజరుగుటయు నుండునాయని కొందఱకు సందియము తోచవచ్చు ను. ఆసందియము మేమీక్రిందివిధముగ నివారింపఁగలము. శాపమిచ్చి నంతమాత్రమున నట్టిశాపముతగిలి యెవ్వరుఁ జావరు. శపించినమాట మాత్రము నిజమైయుండవచ్చును. ఏలయన దుఃఖపరవశత్వముచేత మ నఃక్షోభమునొందినవారు సాధారణముగ "మాయుసురువారికిఁదగులక పోదుసుమీ! వారి వంశనాశనము కాగలదుసుమీ!" యని తరుచుగ దిట్టుచుందురు. దైవవశమునఁదిట్టిన కొన్నినాళ్ళకే యపకారముచేసిన మనుష్యుఁడు మృతినొందుటఁ సంభవించెనా శాపముతగిలియే యతఁ డు మృతినొందినాడని లోకులనకమానరు. ఈపతివ్రతాశాపము నట్టి దె. పాణిగ్రహణ మహోత్సవమైనను ముగియకమునుపే తననిముత్త మేర్పడిన వరుఁడు మృతినొందినకారణమున మహాదుఃఖ విహ్వలమై యారాజపుత్రిక విసుగున నట్లు దిట్టియుండవచ్చును. అనంతరము రెం డుతెగలవారికిగల మనస్పర్ధచేత నిరుపక్షములనున్న వీరు లొండొ రుల జంపుకొనిరి. చుట్టము లామెమాటయందు నమ్మికగలిగి యామె శాపముచేతనేయీచావులు సంభవించెనని తలంచిరి. అంతియేగాని వేడినీళ్ళచేత నిల్లుకాలుటయు మాటవలన మరణములు సంభవించుట యు లోకవిరుద్ధము. ఆశీర్వాచనముల కాయువు వృద్ధియై శాపమునలన జావులు సంభవించినయెడల లోక మీవిధముగా నుండదు.

# జసల్ మీరు రాజులకథ.

జసల్ మీరు సంస్థానము మారువారున కుత్తరమున నున్నది. ఇదియొక చిన్నసంస్థానము. రాజస్థానపు ఎడారిలో నీచిన్న దేశముమిక్కిలి సారవంతమైనది. రాజస్థానమందలి తక్కిన రాజకుటుంబముల న్నియు సూర్యవంశములని ప్రఖ్యాతిఁ గాంచుచుండ జసల్ మీరు రాజకుటుంబమువారు తాము చంద్రవంశస్థులమని చెప్పుదురు. చంద్ర వంశములో వీరు భట్టికులములోఁ జేరినవారు వారిరాజునకు రావను బిరుదుగలదు. ఈభట్టి వంశస్థులు చుట్టుప్రక్క దేశములలోఁ గాపుర ముండిన తక్షకవంశస్థులతోను వరాహవంశస్థులతోను యుద్ధములు చేయుచువచ్చిరి. తక్షకులు తక్షకుండను సర్పరాజువంశస్థులఁట. వరాహులు వరాహదేవుని వంస్థులట. ఈతక్షకులు మొట్టమొదట మీవారులో గాపురముండిరనియు వారే చిత్తూరుపట్టణము నిర్మించిరనియు జెప్పుదురు.

ఎనిమిదవ శతాబ్దమందు జసల్ మీరులో గొప్పయుద్ధములు జరిగెను. ఆకాలమున రావుటన్నోయను నతఁడా దేశమేలుచుండెను వాని శత్రువులగు వరాహులు మొగలాయిలు పటానులు మొదలగు తురకలతోఁ గలిసి వానిమీఁదికివచ్చి వానికోటను నాలుగుదినములు ముట్టడించిరి. అయిదవనాఁడు టన్నో కోటతలుపులు తెరపించి భట్టివంశ భూషణుడు శూరశిఖామణియగు తనకుమారుఁడు బిజీరావును వెంట బెట్టుకొని సేనాసమేతుఁడై శత్రువులమీఁదికి దుమికెను. పటానులు మొగలాయిలు వరాహులు రాజపుత్రుల దాడికి నిలువలేక పక్షుల వలె నానాదిక్కులకు బలాయితులైరి. రాజపుత్రులు గెలుపునగైకొనుటయేగాక శత్రువుల శిబిరమంతయు గొల్లగొనిరి. అదిమొదలు శత్రువు లెవ్వరు టన్నో జోలికి బోవవెరచిరి. అతనికోటలో విజయసేనయను

దేవతయుండెను. ఆకులదేవతయే వారినిరక్షించుచు వచ్చెనని చెప్పు
దురు. ఆదేవత రావుటన్నో భక్తికిమెచ్చి భూమిలోనుండిన సొమ్ము
పాతును వానికిఁజూపెనట అతఁడా నిక్షేపమును ద్రవ్వితీసికొని సంప
న్నుఁడై యొకకోట గట్టించి దానికి విజయనాటమని పేరుపెట్టెను.

రావు టన్నో యెనుబదివత్సరములు పరిపాలించి మృతినొంద
వానికొడుకు బీజీరావు పితురనంతరము గద్దెయెక్కెను. అతడుభూతవం
శస్థురాలగు నొకరాజకన్యను బెండ్లియాడెను ఆతని యేలుబడి చక్క
గానేయుండెను. గద్దెయెక్కినతోడనే యతఁడు పాతపగతురగు వరా
హులను బలుకయ్యములలో దరిమితరిమికొట్టి యోడించె. అతనిధాటి
సైపలేక మెట్టకేలకు వాని సంధికై ప్రార్థించిరి. బీజీరావు కుమారు
డగు దేవరాజు వరాహరాజు కుమార్తెను బెండ్లియాడినపక్షమున నుభ
యంశములు చిరకాలిధానలములను జల్లార్చుకొని శాశ్వతమైత్రినుండ
వచ్చునని వరాహులభిలషించిరి. బీజీరావు వారిప్రార్థనమునంగీకరించి
నిష్కలుషమైన మనస్సుతో గుమారుని బరివారముచు దోడ్కొని వి
వాహమునకై వరాహుల సదనమునకు బోయెనుగాని యావియ్యము
నెయ్యమగుటకుమారు కయ్యమయ్యెను బీజీరావు దేవరాజుమొదలగుభ
ట్టీవంశస్తులుండఁ దమ యాయుధములదాఁచి విందులారగించు సమ
యమున దురాత్ములగు వరాహులడవి పందులవలె వియ్యాలవారిపై
బడి మారి మసలినట్లు సంహరించిరి. బీజీరావునా డెనిమిది వందల
మంది బంధువులతోఁ గలిసి దారుణ మరణము నొందెను. అంతతోఁ
బోక వరాహులు ముస్తలఁ జెల్లగించినట్లు బగతురఁ జెల్లగింపఁదలచి
విజయనాటపు కోటకుంబోయి యాఁడుది మగవాడను భేదము లేక
ప్రాణముతోనున్న జంతువులనెల్ల ఖడ్గమున కెరజేసి భట్టీవంశము
నిర్మూలమైనదని సంతసించి స్వదేశమునకుబోయిరి. కాని బీజీరావు
కుమారుడగు దేవరాజు ప్రాణముతో నున్నదని వారెఱుంగరైరి

అతని పెండ్లినిమిత్తము భట్టీలందరు వరాహులయూరికిం బోయినప్పుడు పుట్టినసంక్షోభములో పెండ్లికుమారుడగు దేవరాజు మరణము దప్పించుకొని యొక యోగియింట దాగియుండెను. ఆబాలుడు యోగిగృహము బ్రవేశించి తనపేరు తనయూరిపేరు తిన్నగా జెప్పకమునుపే వీధితలుపు పగులగొట్టినట్లు చప్పుడు వినబడెను. భట్టివంశస్థులలో నొకబాలుడు తప్పించుకొని పోయినాడని తెలిసి వరాహులు జాడలు తీసి వాఁడు జోగియిల్లు చేరెనని గ్రహించివెంటనరిమి వానితలుపుం దట్టిరి. జోగి వరాహ ప్రభువునకు గురువుఁ పరమాప్తుఁడే కాని యెంతగురువైనను శరణుజొచ్చిన వానినిఁ బట్టి యప్పగించుట కిష్టపడడయ్యె. ఆలోచనము చేసినఁగార్యము మించునని యాజోగి చప్పుచప్పున రాచబిడ్డ మెడలోనొక జందెమువేసి తన పఙ్క్తిని విస్తరివేసి యన్నముపెట్టి కలిసి భుజించుచుండెను. అంతలో వరాహులు తలుపు తీయించుకొని లోనికిబోయి గురువును వానిప్రక్కనున్న బాలునిం జూచి వాఁడెవఁడో బ్రాహ్మణ శిష్యుడని భావించి వానిని విడిచి రాచబిడ్డను వెదకుటకు వేరొకచోటికి బోయెను.

దేవరాజు కొంతకాలము యోగిమఠమునఁ బ్రచ్ఛన్నుడై బ్రాహ్మణవేషముననుండి పౌరుషహీనమైన యావృత్తిలో నుండుట కిష్టపడక శత్రువులు తన తండ్రికోట నిశ్శేషముగా నాశనముచేసిరో లేక తల్లిగాని తక్కినచుట్టము లెవరైనగాని జీవించియుండిరో లేదో తెలిసికొనఁగోరి పరితపించుచుండెను. యోగి యెక్కడికైనఁ బోవలసివచ్చినప్పుడు దేవరాజు నొక్కని మఠములోనుంచి బోవుచుండును అట్లొకనాడు యోగి వానినేకతమ విడిచి యెక్కడికోజన దేవరాజేమియుందోచక మఠములో నిట్టటు దిరుగుచుండ నొకపాత్ర యంగిరక వాని కగపడెను. అది పైకిదీయుటయు నందుండి చిత్రమైన యొక రసముతో నిండియుండిన యొకపాత్ర క్రిందబడెను. దేవరా

జారసములో నొకబొట్టు తనఖడ్గము చివర వేసెను. వేసినతోడనే వాడిగల యాకత్తియైన మెత్తనై పదునుతప్పెను. కానియాభాగమంతయు సువర్ణమయమయ్యెను. అదిచూచి దేవరాజు మిక్కిలి యద్భుతపడి యాజోగి దిపిజుల యనుగ్రహముచేత ప్రతివస్తువును బంగారముచేయగల దివ్యౌషధము సంపాదించి సిద్ధుడైన మహాత్ముడని తెలిసికొనెను. తన ప్రాణములు రక్షించిన మహాయోగి సొమ్మపహరింపం దగునాయని గొంకుజంకులేక యారాచపట్టి ఖడ్గమును రసపాత్రను తనబట్టచాటున నిరికించి యచ్చోటు వాసి తన యమ్మవంకచుట్టములున్న భూతాపట్టణమునకు బోయెను. అక్కడకుం బోవునప్పటికి నదృష్టవశమున "తన్నోమి" గ్రామమున శత్రువుల బారిపడక బ్రతికివచ్చిన తల్లియే వానికన్నుల కగబడెను. ఆమెకొడుకు నానవాలుపట్టి కౌగిలించికొని దీవించి కొంచెముప్పు దిగదుడిచి నాయనా నీశత్రువులెల్లె కరిగి పోవుదురుగాక" యని పలికి యాయుప్పు నీటిలో వేసెను. ఆమె సోదరుడగు భూతమహారాజు సహజముగ భీరువగుటచే మేనయల్లునిరాక కిష్టపడక దానిరాకచే ననేకకష్టములు సంభవించునని భయపడెను. దేవరాజు తననివాసమునకు నొకగ్రామమిమ్మని మేనమామనడిగెను. మేనమామయెంతో కష్టముమీద నొకగ్రామమువానికిచ్చెను. ఆరాజు చుట్టము లదివిని తేనింజూచి యిట్లనిరి. "ఏమీ! మేనల్లునకు గ్రామమిచ్చితివా? అతడు పదిబల్లెములు పోగుచేసి మొనగాడై చుట్టుపక్కలనున్న జనులం దోచుకొనును, వారందఱు మన ప్రాణముల కుసురుమని మనపై తిరుగబడుదురు" మేనమామ దేవరాజు వద్దనుండి యిచ్చినగ్రామము మరలం బుచ్చుకొనెను. తోడనే దేవరాజు తలదాచుకొనుటకై యిల్లు కట్టుకొనుటకు కొంచెము చోటిమ్మని మేనమామను మిక్కిలి వినయమునం బ్రార్థించెను. ఆప్రార్థనలచేత బ్రాణముపిసుగ దేవరాజునకు మేనమామ యొక యెద్దుచర్మ

ముపట్టునంత మేర స్థలమిచ్చెను. అంత స్వల్పస్థలమందు గృహము కట్టుకొనుట యసాధ్యమగుటచే దేవరాజు కర్తవ్యమునుగూర్చి వ డలింగినడుగ నతఁ డుపాయశాలియైనందున నెద్దుచర్మము సన్న పేలికలుగఁ గోసి యొకదాని కొకటి ముడిపెట్టి చాలాభూమి నాక్రమించి యదియే యెద్దుచర్మముపట్టినంత మేరస్థల మనిచెప్పెను. మేనమామ దానికి విచారపడక సమ్మతించెను ఏలయన మేనల్లుఁడు కొలిచిపుచ్చుకొన్నస్థల మిసుక యెడారిలోనుండెను. మఱియు దేవరాజు కోటను గాని గృహమును గాని కట్టుకొనుటకు ధనహీనుఁడై యుండెను. అట్లుండి దేవరాజు కొంతతడవాలోచించి వెనుక జోగివద్దనుండి దొంగిలించిన సువర్ణరసముమాట జ్ఞప్తికిఁదెచ్చుకొని యారసము కొన్నివస్తువులపై వేయనవి బంగారువస్తువులయ్యెను. అనియమ్మి యతఁడొక గొప్ప కోటగట్టించెను.

అదివిని మేనమామ యీర్ష్యజెంది యాకోట నేలతో సమముగ మట్టముచేయుమని తనభటుల కానతిచ్చి స్వయముగ దండుతీసుకొని కోటకుబోయెను. ఆకోటగుమ్మముకడ కతఁడు పోవునప్పటికి వానిమీఁద బాణవర్షము గురియుటకుమారు కడుసన్మానము జరిగెను. భూతరాజు తోఁబుట్టువనగా దేవరాజుతల్లి తాళము చేయిబట్టుకొని కుమారునిక్షమింపుమని వర్తమానము లంపుచు గుమ్మముకడ నిలిచెను. ఆసమయమున నామెపలికిన పలుకులివి. "నిలువ నీడయైన లేనపుడు నాకొడుకునకుఁ దల దాఁచుకొనుటకు స్థలమిచ్చిన మహోపకారిమీదికి నాబిడ్డ కయ్యమునకు గాలుదువ్వడు ఈకోటయు నాకుమారుని తలయుగూడ భూతరాజువే కావున లోనికిబోయి నాకొడుకిచ్చు కానుకలందుకొనుడు." అని పలికి కొన్ని కారణముల మీద నొక్కసారి పదిమందికంటె నెక్కుడు జనమును గోటలోనికి రానియ్యకపోయెను. శత్రువులు దానికి సమ్మతించి పదుగురు చొప్పు

నగోటలో బ్రివేశింపగానే దేవరాజు వారిని మత్తునియలుగ నటికి యావల బారవేయుచువచ్చెను. అట్లు నూటయిరువది మహావీరులు మృతినొందినపిదప వారు మోసము తెలుసుకొని పలాయితులయిరి.

అది జరిగిన కొన్నాళ్ళకు దేవరాజుకడ కొకయోగివచ్చెను ఎవనిమఠమునుండి దేవరాజుమున్ను బంగారముచేయు రసము దొంగిలించెనోయాయోగియే యితడు దేవరాజు వానింజూచి భయపడెను. గాని యా యోగిమాత్రము వానిని దండించుటకురాలేదు. జసలుమీరు కోటబట్టుకొనుట దేవరాజుయొక్క సంకల్పమని యెఱిగినవాడగుటజే దానికి దోడ్పడుటకే యాయోగివచ్చెను దేవరాజు తనసువర్ణకరణి యపహరించిన దొంగయని యాజోగియెఱిగియు వానిందిట్టక నీవు నాశిష్యుడవగుదువేని నీచేసిన నేరము క్షమియింతునని పలికెను ఆమాట యన్నదే చాలునని దేవరాజందు కొడంబడియె తోడనే జోగి యారాజకుమారుని జరీబట్టలు విప్పించి కాషాయవస్త్రములు గట్టించి నిరాయుధునిచేసి యోగులు దాల్చు కమండలములిచ్చి బిచ్చమెత్తుమనియె. దేవరాజుప్రతిగృహమున కరిగి కొంతసేపు బిచ్చమెత్తినపిదప యోగి వాని ననుగ్రహించి తనకడకు రావించి వానికి రావు బిరుదముతీసి రావుల్ బిరుదమిచ్చి భిక్షాపాత్రమునిండ వెండి బంగారము పోసి మొగమున రాజచిహ్నమగు టీకావేసి నీవు రాజువగుదువని వరమిచ్చి యదిమొదలు జసల్ మీరు రాజులందఱు పట్టాభిషేకసమయమున సన్యాసి వేషముతో బిచ్చమెత్తెడు నాచారము నడపవలయునని శాసించి యంతర్ధానమునొందెనట నాడు మొదలు జసల్ మీరు రాజులుపట్టము కట్టుకొనునప్పుడు కాషాయవస్త్రములుకట్టుకొని యాయాచారమునడపుచువచ్చిరి. దేవరాజు ననంతరము మున్నూరేండ్లవరకు వాని సంతతివారు ప్రసిద్ధులుకారు పండ్రెండవ శతాబ్దమున జనూాలను నతడా సంస్థానమునకు ప్రభువయి, యొకబ్రాహ్మ

ణుని యుపదేశమున జసల్ మీరు పట్టణము గట్టెను. ఆరాజు పిదప గద్దెనెక్కిన రావులందఱు పేరుప్రతిష్ఠలేనివారు వారిలో లక్ష్మణసేను డనునత డొకడు. అతడు మందమతి పరమ మూర్ఖుడు ఆరాజొకనాఁడు రాత్రి నక్కలు కూయుచుండ విని యేల యవి యేడ్చుచున్నవని యడిగెనఁట. చలిబాధ కోర్వలేక యఱచుచున్నవని మంత్రి బదులు చెప్పెనట. అదివిని యామూర్ఖుఁడు కుట్టుపనివానిం బిలిచినక్కలకన్నిఁటికి చొక్కాలుకుట్టుమని యాజ్ఞాపించెనఁట. మంత్రులు దొరకినన్నినక్కలకు చొక్కాలుకుట్టించి తొడిగిరట. అయినను నక్కలూరకొనక మగల రాత్రులుకూయుచుండ విని రాజు దానికిఁ గారణము నక్కలకు వసియింపగృహములు లేకపోవుటయే యని తెలిసికొని మైదానములలో వానికొఱకు కొన్నియిండ్లు కట్టించెనట. ఆ యిండ్లు మొన్నమొన్నటివఱకు నుండెను. ఈరాజుకాలమున నధికారమంతయు భార్యచేతిలోనుండెను. ఆమె యమరకోట రాజుకూఁతురు. మితిమీరినయధికారము చేఁదాల్చినందు కామెకుఁ దగిన శాస్తిజరిగెను. ఆదేవిసోదరు లొకసారి జసల్ మీరునకు రాఁగా రావులు వారిని జంపించి కోటగుమ్మమునకు గట్టించెను.

ఆరాజు ననంతరము వానికొడుకు గద్దెయెక్కెను కాని యతఁడప్రయోజకుఁడగుటచే లక్ష్మణసేనుని పినతండ్రిజయత్సీయనునతఁడు రావులయ్యెను. అతని స్వభావము వేరు అతఁడుయుద్ధములలోముక్కాకల దేరినజోదు. ఆనాఁటి ధనుర్ధనులకెల్లగురువు. అతనికొడుకులుమూలరాజు రత్నసింగు ననువారు తమబిడ్డలను రాజపుత్రకుమారులను విలువిద్యయందు గడునేర్పులఁ జేసిరి. అదియే మఁందుముందువారికిగొప్పయుద్ధములలో సాయముచేసెను.

అలాయుద్దీనుసకిల్జీ రాజస్థానముమీఁద దండెత్తి చిత్తూరునాశనముచేసినకథ యీవఱకే వెలుంగుదుముకదా. జసల్ మీరుప్రభువులు

గూడ నీమహాపరిశ్రయములో బుద్ధిపూర్వకముగ లోఁబడిపోయిరి. మ ల్లానుప్రభువు చక్రవర్తియగునలాయుద్దీనునకు గట్టవలసినకప్పముపదు నైదువందల గుఱ్ఱములమీఁదను పదునైదువందల కంచరగాడిలమీఁద నువేసి పంపెను. ధనము దెచ్చుచున్న యాబిడార మొకనదియొడ్డున నుండగా జయత్సీకొడుకులుదానిమాటవినిగొప్పసైన్యముందోడ్కొని ధాన్యప్రవర్తకుల వేషములు వేసికొని యాబిడారముమీఁదబడి యా ధనముం దోఁచుకొనిరి. అది విని జయత్సీ చక్రవర్తిస్వభావమెఱిఁగిన వాఁడగుటచేఁ జాలభయపడి కోటమరమ్మతుచేయించి లోపలనున్నస్త్రీ లను బిడ్డలను సురక్షితమగు తావునకుఁబంపి యవధ్యులగువారి నిచ్చవ చ్చినచోటికి బోవనిచ్చి చుట్టుప్రక్క గ్రామములునిర్మనుష్యముగజేసి తాను కొడుకులుమనుమలు సంరక్షణకుసిద్ధమై చక్రవర్తిరాకకెదురు చూచుచుండిరి. ఆతనిచిన్నకొడుకులు కోటవెలుపల నొక చిన్న సేనం గూర్చుకొని ముందుగ జక్రవర్తిసేనలం దలబడ నుద్యుక్తులైయుండి రి. అల్లాయుద్దీను మాబూబనెడు సేనాపతిని గొప్పసైన్యమిచ్చి జసల్ మీరునకు బంపెను. ఆసైనికులినుప కవచములు దొడిగికొని క్రొక్కా ఱుమబ్బువలె భయంకరముగ నడవఁజొచ్చిరి. జయత్సీ కోటసంరక్షిం చునుపాయములుచక్కగానెఱుఁగును. ఆకోట కేఁబదియాఱు బురుజు లుండెను. రావులాబురుజులమీఁదకోఁట గాపాడునిమిత్తముమూడువే లయేడువందలమంది సైనికులనేర్పరచి మఱిరెండువేలసైనికులనుసమ యము వచ్చినప్పుడు రక్షించుటకునిలువయుంచెను. శత్రువులుకోటము ట్టడి నారంభించిరి. ఒకవాగము ముట్టడియగునప్పటికిఁ జక్రవర్తిసైన్య ములో నేడువేలమంది కడ తేరిరి. ఆముట్టడి రెండేడ్లునడచెను. ఆకాల ములో యుద్ధములు నిరంతరాయముగ జరుగుటచే నెవరుముట్టడించు వారో యెవరుముట్టడింపఁబడువారో తెలియదయ్యె. రాజపుత్రులు కోట గోడలవెనుక నెండవాన చొరనిప్రదేశములోఁ దాఁగొని సర

కుల స్వేచ్ఛగా దెప్పించుకొనుచుయుద్ధముచేసిరి. తురక సేనజయల్సీకొడుకులకు జడిసి శిబిరమువిడిచి పగతురపై రాజాలదయ్యె. అట్లున్నను రావుల్ కొడుకులు పగతురకు సరకులను రానియ్యకైరి.

దీర్ఘయుద్ధములు జరుగునప్పు డుభయపక్ష సైనికులకుఁ దరుచుగాపొద్దుపోదు. అందుకు రెండుపక్షములవారుఁదరుచుగనాటపాటలం జరుపుచుందురు. రావుల్ కొడుకులలో నొకఁడగురత్నసింగుబగతుడగు మాబూబులో నెట్లో మైత్రిపాటించెను. ఇద్దఱు చతురంగమాడుటలో నేర్పరులని యొండొరులకు దెలిసినపుడు వారిమైత్రి మఱింత యధికమయ్యెను. ప్రతిదిన మేదోకాలమేర్పరచుకొని రాజకుమారుఁడుకోటవెడలియు నబాబు శిబిరము వెడలియుఁ గలిసికొని చతురంగ మాడుచుందురు, సేవకులు చతురంగపుబల్ల నొకచెట్టుక్రింద వేయ వారిరువురుఁ గడుమైత్రితోఁ జాలసేపాడుచువచ్చిరి.

ఈకాలక్షేపము రమారమి యెనిమిదేండ్లు జరిగెను. అంతట రావుల్ జయల్సీ మృతినొంద జ్యేష్ఠకుమారుఁడు మూలరాజు గద్దెనెక్కెను, నవాబుయథాపూర్వకముగ జతురంగ మాడుటకువచ్చిరాజపుత్రుల సంతోషముచుగనిపెట్టి కారణమేమని యడిగెను; మూలరాజు పితురనంతరము సింహాసన మెక్కినందున నంతోషము గలిగెనని సేవకు లుత్తరముచెప్పిరి. అదివిని నవాబు మూలరాజు పట్టాభిషేకమునకు జాలసంతసించి మేలుగోరి చెట్టుక్రిందగూడిచతురంగమాడుటయింతటినుండి సంభవింపదనియునదియేకడసారియనియువిచారపూర్వకముగా జెప్పెను. దానికిగారణ మేమన నల్లాయుద్దీను తన సేనాపతిపగతురతో నతిమైత్రిజేసినాడని విని చతురంగ మాడవద్దని వర్తమానమంపెను. అందుచేత నవాబావిధమునజెప్పి మరునాడు యుద్ధములో మరల గలిసికొనవచ్చునని రత్నసింగును వేడుకొనెను. మరునాడు నవాబుచెప్పినట్లు మహమ్మదీయులుయుద్ధసన్నద్ధులైరి. ఆమాటముందే వినుటచే రాజపుత్రులునుగూడ దర్పోద్ధతులైరి.

అప్పుడు సంకుల సమరముజరిగెను మహమ్మదీయులలో దొమ్మిదివేలమంది మృతినొందుటచేవారిసైన్యమెట్టకేలకు పారిపోవలసివచ్చెను చక్రవర్తియీయపరాభవమును సహింపక తనసైన్యమునువెండియు బలపరచి యుద్ధముసాగించెను. కోటలోనున్నవారికి భోజనసామగ్రులు క్రమక్రమముగ క్షీణించెను లోనున్న రాజపుత్రులసంఖ్యయు నంతకంతకు దిగనాసెను. అంతట మూలరాజుమంత్రిసామంత సేనాపతిప్రముఖులను బంధువులను బిలిపించి యిట్లనియె. మనము మహాశౌర్యముతో శత్రువులపాలబడకుండ దొమ్మిదేండ్లు కోట గాపాడితిమి పదార్థము లయిపోయినవి బలముక్షీణించినది ఇప్పుడుకర్తవ్యమేమి? ఆవచనములకు రాజపుత్రులిట్లనియుత్తరముచెప్పిరి. "కర్తవ్యమేమున్నది మనకులాచారప్రకారము ముందుగా నంతఃపురస్త్రీలను బలిగార్చి పిమ్మట మనము రణరంగమునఁ బ్రాణమువిడుచుటయేగార్యము అని కృతనిశ్చయులై వారుసన్నాహముచేసికొని మరునాఁడుదయమున జూచునప్పటికిఁ జక్రవర్తి సైన్యము కానంబడలేదు అంత గొప్పసైన్యమును జిరకాలము విదేశములలో నుంచుట కిష్టములేక చక్రవర్తి కోటముట్టడి యేమైననుసరే తత్క్షణమ బయలుదేరిరమ్మని సైన్యమున కాజ్ఞాపించెను. అందుచేత మహమ్మదీయ సైన్యము గానఁబడదయ్యె. అది చూచి రాజపుత్రులుమృత్యుముఖమునుండి బయటఁబడినట్లు మహానందభరితులై పరవశులై యుండిరి. ఆయుత్సాహసమయమున వారదివఱకు చెఱపట్టినవాబు తమ్ముఁడొకఁడదియేసమయమనితప్పించుకొని పారిపోయెను. పోయి జసల్మీరుకోటలోనున్నగుట్టంతయు సోదరునితోఁ జెప్పెను. ఆగుట్టెఱిఁగిమహమ్మదీయసేనాపతి తనసైన్యమున దీసికొని తలపెట్టినపనిసంపూర్ణము జేయుటకు మరల జసల్మీరునకు వచ్చెను. ఆసైన్యముంజూచి మూలరాజు రత్నసింగుతో నిట్లనియె "నీకు స[illegible]గలన్నే[illegible]వాబునుమ్మని జెరపట్టినప్పు

డే మనము సంహరించినపక్షమున వాడువోయి యన్నతో గుట్టుమట్టెల్లం జెప్పక యుండునుగదా? మన మూరకుండుటచే నీయుపద్రవము వచ్చెను, మన మేమిచేయుదుము."

అనవుడు రత్నసిం గిట్లనియె. "ఇప్పుడొక్కటేదారియున్నది. ఆడువారంద అగ్నిప్రవేశ మగుటయు మగవారందఱు రణమున మరణమొంది వీరస్వర్గ మధిరోహించుటయుఁ గోటలోనున్న ప్రతివస్తువు నాశనము జేయుటయు" ప్రధాన పురుషులందఱు రత్నసింగుమాటలనామోదించిరి. మూలరాజును వారికందఱు కుత్సాహముగలుగునట్లిట్లనియె. "సరే మీరందఱు శౌర్యముగల వంశములందుఁ బుట్టితిరిగదా. మఱియు మీ రాజువిషయమున మీప్రాణములైన దాఁచనివారు మీకు లోకంబున నేశూరులు సాటిరారు యుద్ధమున నేర్పుగలైన మిమ్మెదిరించి బ్రతికిపోలేవు. నామానరక్షణము మీచేతిలోనున్నది. మీప్రతాపమువలనఁ జసల్ మీరు వెలయుగాక!"

అనిపలికినపిదప మూలరాజు రత్నసింగు తమతమయంతఃపురములకరిగి తమనిర్ధారణమును రాణులకెఱింగించిరి. ఆవార్తలు విని రాణులలో నొక్కతెయిట్లనియె. "మీపనిమీద మీరుండుడు. మేమీ రాత్రి పయనమై రేపుదయమున స్వర్గములోఁ బ్రీత కాపురలమైయుందుము" తక్కిన రాణులు రాజపుత్రస్త్రీలు తద్విధమున నే బలికిరి.

రత్నసింగునకు మనసులో నొక్కవిచారముండెను. అతనికిరువురుకొడుకులు గలరు, పెద్దవానిపేరు గురుసింగు రెండవవాని నామము కనూరు. అందు జ్యేష్ఠుఁడు పదిరెండేండ్లవాఁడు, తనయనంతర మాపసిబాలు రిరువు రేమగుదురోయని బెంగఁగొని రత్నసింగువారినిరక్షింపుమని నవాబునకు వర్తమానమంపెను. అతఁడువాని మాటలయందుగౌరవముంచి బాలకుల నిరువుర సంరక్షించునట్లు ప్రమాణముచేసి

వారిం దనకడకుతోడి తెచ్చుటకు నమ్మికగల యిరువురు సేవకులనంపె ను రత్నసింగు బిడ్డలంగడసారి కౌఁగిలించుకొని యాసేవకుల కప్పగిం చెను, వారును జాగరూకతతో వారిని దోడ్కొనిపోయిమాబూబున కప్పగించిరి. ఆమ్లేచ్ఛసేనాపతి యాబాలకులను జూచి పగవానిబిడ్డలని వేరుభావముజూపక మిక్కిలి యాదరించి మంచిమాటలాడి వారి శిర స్సులమీద దనచేయి పెట్టెను. మహమ్మదీయులలో శిరస్సులమీదచే యివేయుట రక్షించుటకు బ్రమాణము చేయుట అట్లు చేసి యాతు రక పిమ్మట నిరువురు బ్రాహ్మణులంబిలిపించి యాకుమారుల వారికి జూపి రాజపుత్రుల గౌరవమునకుం దగినరీతిగ వారి కన్నపానాదులు పెట్టించి విద్యాబుద్ధులు చెప్పి బాగుచేయుమని యప్పగించెను.

ఆరాత్రియే కడపటిదగుటచేఁ గోటలోనున్నవారందఱుగలసి మెలసి మెట్టటోనాల్గుజాములుగడపిరి తెల్లవారినతోడనే ప్రాతఃకాల కృత్యములు దీర్చుకొని యీశ్వరప్రార్థనలుజేసి కోటలోనున్న యిరు వదినాలుగువేలమంది స్త్రీలొక్కచోట గుంపుగూడిరి. పాలుత్రాగెడు పసిబిడ్డయుఁ దలనెరసిన వృద్ధయు వివాహముకాని కన్యయుపదుగురుబి డ్డలతల్లియు నాడచ్చటనేయుండిరి. వేయేల? ఆఁడపురు గొక్కటియైె న మిగులలేదు. కొందఱుకత్తులతోఁ బొడుచుకొని మృతినొందిరి.కొం దఱు తమదేహము లగ్నిహోత్రిన కాహుతులు జేసిరి. శతృవుని బారిజిక్కుట కొక్కయంగనయైన మిగులదయ్యె. స్త్రీలట్లగుచుండపు రుషులందఱు మేడలెక్కియుఁగోటగోడలెక్కియునాఘోరకృత్యములు జూచి తమభార్యలం గలిసికొనుసమయము తమకుఁ గూడసమీపించు చుండెనని చాలసంతోషమొంది యాయుధములుధరించియదివఱకుదా ల్చిన రక్తవస్త్రములు గట్టిపుజీనులపైఁబరచుకొని యొండొరులంగడ సారి గౌఁగిలించుకొని వివాహమునకుఁ జనినట్లు యుద్ధమునకుం జనిరి. తొమ్మిదిసంవత్సరముల ముట్టడిలోను గడతేఱక యప్పటికిమిగిలినపు

రుషులు మూడువేల యెనిమివందలు. ఈసైనికులందఱుఁ గోట తలుపులం దెఱచి యొక్కమారు శత్రువులం గలిసిరి.

అప్పుడు ఘోరయుద్ధము జరిగెను. రత్నసింగు సింగమువలె విజృంభించి నూటయిరువదిమంది యమీరులను దనకత్తికెరచేసి సమరమహాసముద్రమున మునిఁగిపోయెను. మూలరాజు తనబల్లెముతోఁ దురకల శరీరములను గుచ్చిగుచ్చి పొలియించె నాఁడు నెత్తురు వరదలై పాఱెననుట యతిశయోక్తి గాదు. మృత్యుదేవత తలవిరియఁబోసికొని విచ్చలవిడిగ విహరించెననుట కవి చాతుర్యముగాదు. యుద్ధముముగిసిన పిదప నవాబు మూలరాజురత్నసింగులకళేబరముల వెదకించి తెప్పించి కోటలోనికిఁ బంపించి తగిన గౌరవములతో దహనములు జేయించెను అనంతరము నవాబు రత్నసింగు కొడుకులను జాగరూకతతోఁగాపాడి వారు యుక్తవయస్కులైన పిదప రాజ్యభారము నప్పగింపఁదలచుచుండ నంతలో నతనికి మరణము సంభవించెను. ఆనవాబుకొడుకులుతంద్రిచేసిన ప్రతిన నెరవేర్చుట కాకుమారులను బ్రేమతోఁ బెంచిరి. వారట్లు ఢిల్లీలోఁ బెరుగుచుండ మొగలాయిాలలాయుద్దీను రాజ్యముపై దండెత్తిరి. అప్పుడు రత్నసింగు కుమారుఁడగు గురుసింగు చక్రవర్తికి మహోపకారముగావించెను. ఆయుపకారమునకుసంతసించియలాయుద్దీను కృతజ్ఞుఁడై పిత్రార్జితమగు రాజ్యమాకుమారునకుఁ బట్టము గట్టియిచ్చి మున్ను తనసేనాపతియగు మాబూబుపాడుచేసిన కోటనుమరలగట్టుకొనుటకు సెలవిచ్చెను. ఆగురుసింగు కొంతకాలమేలి పుత్రహీనుఁడై మృతినొంద రాజ్యమువానిజ్ఞాతులలోనొకనియధీనమయ్యెను.

పదునైదవ శతాబ్ద ప్రారంభమునందు జసల్ మీారుమండలము రాజులు మహాయుద్ధమునందుఁ దగిలి యనేకులు నాశనమునొందిరి. ఈ యుద్ధము వివాహముతో నారంభమై మరణముతో నంతమొందెను. జసల్ మీారుసంస్థానములోఁ బోగల్ అను పేరుగల చిన్నరాజ్యముగలదు.

దానిని రాణింగ దేవరావు పాలించుచుండెను. అతనికొడుకు సాధువను వాడు మేటివిలుకాఁడై చండశాసనుఁడను ప్రసిద్ధివడసెను. అతనిపేరు విన్న రాజస్థానమందలి మహావీరులు చండుడు మొదలయినవారునయి తము గడగడనడంకుచు వచ్చిరి. ఇతరసంస్థానములం దోప్పుడు జేయుటలో నందివేసిన చేయియని పేరువడిన హర్బశంకరుఁడు నయితము సాధువు ముందరడవిటీ ముందరదీపమని చెప్పవచ్చును. ఒకనాఁడు సాధువు స్వబలముతో నొకదండయాత్రచేసివచ్చుచుండ మధ్యమార్గమున మోహలువంశస్థులకు దొరయగు మాణిక్యరావు వానింజూచి తనకోటకుం బిలిచెను. సాధువు దూరమాలోచింపక పిలిచినతోడనే వానికోటకుం బోయి యతిథియయ్యెను. దేశమునంతను గడగడవడంకించుచున్న య మ్మహాశూరునిగన్నులారచూడవలయునని కోటలోనివారందఱుబలాటపడిరి. రాజబంధువులు సేవకులు నెపమేదో గల్పించుకొని తప్పక వానిం జూచిపోయిరి.

మాణిక్యరావు పుత్రికయగుకురందేవితక్కినవారివలెనేవానిం జూడనభిలషించి తెరలమాటునుండి పలుమారు వానిం దొంగితొంగి చూచి వానిని మోహించెను. రాత్రి భోజనానంతరమున మిక్కిలియ సరమయినపనిమీఁద మాటలాడవలసియున్నదని కురుందేవి మాణిక్యరావు నంతఃపురమునకు రమ్మని వర్తమానమంపెను. అంతయవసరమగుపని యేమియని యోచింపుచు మాణిక్యరావు పుత్రికాంతఃపురమునకుఁబోవ నాబాలిక తాను సాధువునుదప్ప మఱియొకపురుషుని వివాహమాడుట లేదని యొట్టుపెట్టుకొని సత్వరమ పెండ్లిచేయుమని తండ్రిం బ్రార్థించెను. మాణిక్యరావు కూఁతురుపలుకులువిని నమ్మతుఁడై "అమ్మా! ఈవఱకే నిన్ను మండూరి నాగూరుసంస్థానములప్రభువగు చండుని పెద్దకొడుకునకు బెండ్లిచేయఁదలచి ప్రధానము జేసితిని. ఇప్పుడు మరల నిట్లుచేయుట న్యాయమా? కావున నీపంతమువిడు" మని బ్రతి

మాలుకొనెను. ఎంతబ్రతిమాలుకొన్నను కురుం దేవి తనమూలముననె వ్వరి కేమికష్టములు వచ్చునోయని విచారింపకపట్టినపట్టువిడువదయ్యె కూఁతు రట్లుచేసినను లోకవ్యవహారవేత్తయగుసాదువావార్త విన్న ప్పుడు తనకు సాయము చేయకపోఁడనుకొని మాణిక్యరావు కురుం దేవిప్రతిజ్ఞ సాధువున కెఱింగించెను.

రాజకన్య మోహపరవశయైవివాహార్థముపురుషునివరించినప్పు డు రాజపుత్రుఁడా బాలికమాట ద్రోసిపుచ్చఁగూడదని రాజపుత్రు లలో నొకనీమము గలదు. అందుచే వృద్ధాచారము దాటగూడదని సాధు మాణిక్యరావు తన్నెంత నిరుత్సాహపరచినను బీరువోక కురుం దేవిని వివాహమాడక మాననని చెప్పెను. మాణిక్యరావు దయాళువు శాంతశీలుడునగుటచే గుమార్తెపంతమే చెల్లనిచ్చి కులాచారప్రకా రము కొబ్బరకాయ పసపుకుంకమ పోగలునకు బంపి ప్రధానము జేసి వివాహముహూర్తమేర్పరచెను. సాధువు బంధుమిత్రపరివారముతో బాణిగ్రహణ నిమిత్తము మాణిక్యరావుకోటకుబోయెను. కురుం దేవి యంతకుమున్నె రహతూరువంశస్థుడు చందునికొడుకునగు నిరంకువలు నకు వాగ్దత్తము సేయఁబడినది. ఇరంకువలుఁడు మున్నుతనకుఁ ప్రధాన ముచేయఁబడినయొకకన్యయొకద్రోహిపుడుకానియధీనమగుచుండెననివిని పెచ్చుపెరిగిన యీసున నూరకుండఁజాలక యా క్రొత్తపెండ్లికొడు కు క్రొన్నెత్తురు జూచితీరవలయునని శపథము చేసి సహాయార్థము బంధువుల ననేకుల బిలిచి దయలు దేరెను. నాలుగువేలమందిరహతూ రులు వానికి బాసటయైనిలిచిరి. కొల్లగాండ్రకు గురువగుహర్బశంకరు డుగూడతనగుంపులతో వానికిఁదోడుసూపెను. ఈసైన్యమునకుమెహ రాజను నతఁడు నాయకుఁడైనడపించెను. ఈమెహరాజు కొడుకులలో నొకనిని బూర్వము సాధువుచంపిన కతమున వారికిపురకుండిన ప్రా తపగఁ దీర్పవలయునై మూఁకలుగ బయలు దేరెను.

వివాహము సుఖముగా జరిగెను. ఆమహోత్సవానంతరమునసాధువు భార్యాసమేతుఁడై స్వదేశమునకుబోవ సమకట్ట మాణిక్యరావు కూఁతునకు నిజముగా నప్సరసలవంటి పదముగ్గురుపరిచారకులను వెండి బంగారు వస్తువులను వాహనంబులను జాల నరణమిచ్చి ప్రయాణమునిరపాయముగ నుండుటకు వెంట గొంతసైన్యముం దీసికొనిపోవుటనుంచిదని "నాయనా నీసెల వైనపక్షమున నాలుగువేల సైనికుల నీవెంటఁ బంపెద. దీని గొడంబడు" మని బ్రీతిమాలెను. మామపలుకులు విని యల్లుఁడు నవ్వి "నాతో నేడువందలమంది భట్టీలువచ్చినారు వారుండగ మఱియెవ్వరు నక్కఱలే"దని నిర్లక్ష్యముగనుత్తరమిచ్చి మామగారిప్రార్థనముమీఁద తన బావమరదులలో నొకనిని సైనికుల నేఁబదిమందిని వెంటఁగొనిపోవుటకు సమ్మతించెను.

ఆపెండ్లివారట్లు బయలుదేఱి నిరపాయముగఁ గొంత దవ్వరిగి యన్నపానాదులకు ననుకూలముగనున్న యొకదావునవిడిసియాప్రూట నట గడపఁదలఁచిరి. సాధువు బంధువులలో జయతంగుఁడను శూరుఁడొకఁడుండెను. అతఁడు సైనికుల కోలాహలము లేనిచోట సుఖముగ నిద్రింపవలయునని బసచేసిన తావునకు గొంతదూర మునగుఱ్ఱపుజీను నేల బరచుకొని కళ్ళెముభుజమునకుజుట్టబెట్టుకొని పండుకొనెను. ఆతనిగుఱ్ఱము తెల్లనికాళ్లు మొగమున తెల్లనిమచ్చ మొదలగుకళ్యానలక్షణములుగల యుత్తమజాతితురంగము. ఆహయము మేఁత మేఁయక నిద్రించుచున్న యజమానుని సంరక్షణమే ప్రధానముగ జేసికొని నలుగడలం బరికింపఁజొచ్చెను. అంతలో గుఱ్ఱముల డెక్కలచప్పుడులు వినంబడెను. వెంటనే కొంత సేన గానఁబడెను. ఆసైనికుల మొగములు మున్నుగుఱ్ఱమెప్పుడుజూడని క్రొత్తవి. అందుచే నాయశ్వము యజమానున కేదో యపాయము మూఁడనున్నదని గ్రహించి వానిం గాళ్ళతోఁద్రొక్కసాగెను. ఊరకత్రొక్కు చున్నదనుకొని జయతంగుఁడు "ధవళపాదీ! నన్ను

నిదురపోనిమ్ము తొక్కకుమని బద్ధకముతో బలికి కాళ్ళావలకుద్రో సివేసెను. త్రోసినను గుఱ్ఱముూరుకొనక మాటిమాటికి మరలద్రొక్కుటచే జయతంగు డేదోయుపాయమున్న దనుకొని తక్షణమే లేచి నలుదెసలఁ జూచెను. చూచునప్పటికి రహతూరులు వానింజుట్టుముట్టిరి.

మెహరాజు జయతంగు నదివఱ కెఱిఁగియుండుటచేనిరంకువలు నకువానింజూపించెను, ఇరంకువలుఁడు తనరహతూరుభటులలో నొకనిని బిలిచి మాలో నెవరితో నైన ద్వంధయుద్ధమునకు రమ్మని జయతంగు ని బిలువుమని పంపెను. ఆభటుఁడు వోయిద్వంధయుద్ధమునకురమ్మని బిలువ జయతంగుఁడు "వచ్చుటకు నాకుభయములేదు. కాని యిప్పుడు రాఁజాలను నానల్లమందు మద్దతయిపోయినది. మెహరాజువద్దనుండిగాని యిరంకువలుని కడనుండిగాని యొకమోతాదు నాకుదెచ్చి పెట్టియించుక సేపుమరల నిదురింపనిత్తువేనియుద్ధమునకుసిద్ధమయ్యెద"నని చెప్పెను. ఆభటుఁడోయి యప్పలుకు లెఱిఁగింప మెహరాజు కావలసిన నల్లమందు మద్దతు వానికంపెను. అది చేకొని జయంతంగుడు నసాశమంటునట్లు పీల్చి మరల గాఢముగనిదురించి మెలకువవచ్చినపిదప కలహామున కభిముఖుఁడై తనహయము నెక్కి గుఱ్ఱమున కుత్సాహకరములగు పలుకులు పలుకుచు వెడలెను.

అతఁడు కొంతదవ్వరుగునప్పటికి శత్రుబలమునుండి యొక జోదువానిమీఁదికురికెనుగుఱ్ఱముజోదుకలిసినవానిని తక్షణమేకడ తేర్చిరి నెత్తురు కంటఁబడుటయు జయతంగుడు పులివలె భయంకరుఁడై శత్రుమండలమధ్యమున దుమికెను. ఇరంకువలుడు మెహరాజుసంకులయుద్ధమున నొప్పుకొనక తమపక్షమునుండి యొకవీరుడు శత్రుపక్షమునుండి యొకవీరుడు గలిసి వేరువేరుగ యుద్ధములు సేయవలయునని యేర్పరచిరి. ఆనియమమున కొడంబడి రెండుసైన్యములు దారుణముగ బోరెను. ఇరంకువలుని బలములో నాలుగువందలమందిమృతినొందిరి. సాహువుసే

నలో రమారమి నాలుగువందలుగడ తేరిరి. అట్లుజరుగుచున్న యాకల హమును గలహకారణురాలగు కురుందేవి తెరచాటుననుండి చూచి యానందించుచుండెను. అప్పుడు సాధువుగుఱ్ఱమెక్కి శత్రుబలముంజొ రబడి ద్వంద్వయుద్ధమునకువచ్చిన యిద్దఱు మహావీరులనుజంపి తనశిబి రమునకుంబోయి భార్యమెప్పునందెను. శతురివులు వానిజయమున కో ర్వక మరల డీకొనుటయు నతను తనశరీరమునిండదగిలిన గాయములం బట్టియటమీద జయమునొందుట దుస్సాధ్యమని మరణోన్ముఖుడై రణమునకుబోవ సమకట్టెను. అప్పుడు క్రొత్తదంపతులు కడసారి దృఢాలింగనము చేసికొనిరి. కురుందేవి మూడునాళ్లు కాపురముచేసిన క్రొత్తపెండ్లికూతురయ్యు భర్తకుత్సాహము గలుగుట కిట్లనియె. "నేను మీవీరకర్మమును గనిపెట్టుచునే యుండెదను. రణముననుండి మీరు మరల రానియెడల నేనే మీకడకు సత్వరము వచ్చెదను."

సాధువు నిర్విచారముగ రణరంగమునకు బోయి ద్వంద్వయుద్ధ మున కిరంకువలుని బిలిచెను. ఆతడు తత్క్షణమే వచ్చి వాని నెదుర్కొ నెను. తళతళమనికత్తులుమెరయ నిరువురునొండొరులం దాకిరి. సాధు వు తన యెదిరి నొడిసిపట్టి యొక్కయేటున నేలంగూలనేసె. ఇరంకు వలుడు నేలగూలుచు సాధువుంబట్టుకొని తలపై నొక్కదెబ్బగొట్టెను. ఆదెబ్బతో సాధువక్కడనే మృతినొందెను. ఇరంకువలు డప్పటికిప్రా ణముతో నుండుటచే సేనకులు వానిని శిబిరమునకుం గొంపోయిరి. ఆయుభయవీరు లట్లు పరస్పరఖడ్గహతుల చెళ్ళుటగని సైనికులుయుద్ధ మును మానిరి.

కురుందేవి భర్తృమరణమును విని శోకింపక పనికత్తెలం బిలిచి ప్రాణేశ్వరునకు బడియున్నచోటనే చితి బేర్పుమని యానతిచ్చెను సే వకులు కాష్ఠములంబేర్చి చమురువోసి సాధువు కళేబరమందుబెట్టిరి. అంతట కురుందేవి చితిజేరి యొక్కఖడ్గముం దెప్పించి దానిని గుడిచేతి

తో పట్టుకొని తనయెడమచేయి తెగవేసికొని పరిచారకులం బిలిచి "ఓసీ! యీభుజము పోగల్లునకు గొంపోయి నా ప్రాణేశ్వరుని తండ్రి గారికిం జూపి మీాకోడ లిట్టిదిసుడీయని చెప్పుడని యాజ్ఞాపించి రెండ వచేతితో మగని తలయొడిలోనం బెట్టుకొని యంతలో సిలువకపరిచా రిక నొకర్తు బిలిచి "ఓసీ! నాకుడిచేయి ఖండించి దానిమీాదనున్న నా పెండ్లినాటినగలను మామఁడ్రి యాస్థానములోనున్న చారణునకిచ్చి వేయుడని యానతిచ్చెను. పరిచారికయజమానురాలు చెప్పినట్లుచేసెను. అంతట నాయింతి కాంతునితో గలిసి యగ్నిదేవున కాహుతియయ్యె.

ఇరంకువలుడు గాయములతో గొన్నినాళ్లు బాధపడి యెట్టకే లకు మృతినొందెను. వీరుల కిరువురకు సంతముగలిగినను కలహముల కంతము గలుగవయ్యె కుమారులు మృతినొందిన వార్తలువిని వారి తండ్రులు కలహమునకుడీకొనిరి. సాధువుతండ్రియగు రాణంగదేవు రావు పుత్రుని మరణవార్తవిని కోడలుబంపిన హస్తమునుజూచి శ త్రువులపై బగదీర్చుకొనవలయునని చుట్టములనెల్ల భిలిపించి మూకలం గూర్చుకొని బయలుదేరి వెనుకటియుద్ధములో బ్రధానముగబనిచేసిన హర్బాసంక్లా యనునాతని దాకెను. సంక్లాకు మిక్కిలియపాయకరమ గుగాయము తగిలెను. వానిసైనికులు మూడువందల యేబదిమందిలో నిరువదియైదుగురు మాత్రమే జీవించి పారిపోయిరి. రాణంగదేవుడు పగతురం గసిదీరజంపి దొరకినసొత్తెల్ల దోచుకొని జయప్రాప్తికిజాల సంతసించి హాయిగా మరల దనకోటకుం బోవుచుండెను. అంతలోనె క్కడనుండియో యిరంకువలుని తండ్రియు మండూరుసంస్థానప్రభువు నగు చండుడు ప్రచండకోపముతో వానికడ్డమువోయి తాకెను. అప్పు డు చాలసేపు సందడికయ్య మయ్యెను. రాణంగదేవుడు తనయును చరులం గలిసి యుద్ధభూమిం బడియె. చండుడు జయశీలుడై శత్రు సంహారము జేయ గలిగినందుకు మిక్కిలి సంతసించి మండూరునకు బోయెను.

